# ఉదయశ్రీ

# కరుణశ్రీ

Ac. No. 2163




న్యూస్టూడెంట్సు బుక్ సెంటర్
ఏలూరురోడ్ విజయవాడ-2
ఫోన్: 74677 * 62222

UDAYASRI
— KARUNASRI

NEW STUDENTS BOOK CENTRE
VIJAYAWADA-520 002

PRICE : Rs. 40-00

C-17585

| | |
|---|---|
| FIRST COMBIND EDITION : | SEPTEMBER 1979 |
| FIRST PART, FIRST EDITION | 1944 |
| FORTY EIGHTH EDITION | SEPTEMBER 1979 |
| SECOND PART, TWENTY SEVENTH EDITION | SEPTEMBER 1979 |
| THIRD PART, SEVENTH EDITION | SEPTEMBER 1979 |
| FOURTH PART, FOURTH EDITION | SEPTEMBER 1979 |
| FIFTH PART, FIRST EDITION | SEPTEMBER 1979 |

2163

PRINTED AT :
ABHINANDANA
SOMESWARA

COVER DESIGN :
BAPU

# కిరణాలు

## మొదటి భాగము



I ) I

## రెండవ భాగము (152)

## మూడవ భాగము 1964

## నాలుగవ భాగము

## ఐదవ భాగము

# సువర్ణ సౌగంధికము

ప్రగతి గీతా ప్రవక్త

## డాక్టరు నండూరి రామకృష్ణమాచార్య

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ॥

కాళిదాస మహాకవి - రఘువంశమహాకావ్యములో వ్రాసిన ప్రథమ శ్లోకము, స్థూలదృష్టికి కృత్యాది ప్రార్థనగా గోచరించవచ్చు. కాని ఈ ప్రార్థనలో ఆ మహాకవి కవితాతత్త్వకళారహస్యమును పొందుపరచినట్లు సాహితీ ప్రియంభావుకులైన సహృదయుల సూక్ష్మదృష్టికి స్వయం వ్యక్తము కాగలదు. గాంధీమహాత్ముడు - "ఆకలిగొన్నవానికి భగవంతుడు ఆహార రూపములో తప్ప సాక్షాత్కరించుటకు సాహసింపడన్నాడు; అవును! క్షుధార్తునకు ఆహారమే భగవత్స్వరూపము. సంగీత కళోపాసకుడైన త్యాగరాజునకు పరబ్రహ్మ సాక్షాత్కారము 'నాద బిందు కళా స్వరూపము'లోనే లభించినది. ఆజన్మకవికి పరమేశ్వర సాక్షాత్కారము అర్ధనారీశ్వర స్వరూపముగ అవగతమగుట సహజమే. జగదేకకవి - పార్వతీపరమేశ్వరుల అవినాభావదాంపత్యమును వాగర్థముల కలయికగనే దర్శించినాడు. వాగర్థముల అతిలోక దాంపత్యము అనిర్వచనీయము. వాగర్థములు - భాష - భావము పార్థక్యప్రతిపత్తి కలిగియున్నప్పటికి వాని సంయోగమే సాహిత్యము. ఆ విధముగ సాహిత్యము సార్థకము. కవిత్వము యుగళకళ. ఇందు భాషకా? భావమునకా? ప్రాధాన్య వివక్ష

# II

దేనికి?? కవితా రథమునకు ఇవి జోడుగుఱ్ఱములు. ఇవి ఒడుదుడుకులు లేకుండా సమగతిలో సమాన వేగముతో పరుగెత్తవలె!! గిట్టల చప్పుడులోగూడ అపశ్రుతి వినిపింపరాదు. కాని - ప్రపంచసాహిత్యమును అనుశీలించినపుడు ఈ జోడుగుఱ్ఱాల పందెపు పరుగులో సర్వదా తుల్య వేగమును సాధింపగలిగిన సాహితీసారథులు వ్రేళ్ళపై లెక్కింపదగిన వారే. కవిత ఒక కఠోర తపస్సు. అందుచేతనే 'నా నృషిః కురుతే కావ్యం' అన్నారు ఆలంకారికులు. ఏ వాఙ్మయములోనైన ఇట్టి కవితా తపస్సిద్ధులు ఎందరో ఉండరు. అద్యతనాంధ్ర కవిప్రపంచంలో కరుణశ్రీ శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు సాహితీపరబ్రహ్మసాక్షాత్కారం పొందిన తపస్సిద్ధులు.

కరుణశ్రీకి ఆంధ్రవాఙ్మయ ప్రపంచములో చిరస్మరణీయమైన స్థానమును కల్పించినది ఆయన కవితాశైలి. వాగర్థముల సాహితీ సాయుజ్యమునకు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి కవిత - తెలుగు బాసలో ఉజ్జ్వలోదాహరణము. గీర్వాణభాషలో ఆదికవిని గూర్చిన ప్రశంస మిక్కిలి అర్థవంతమైనది.

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్ ||

కావ్యనిర్మాణ కళలో మధుర భావములుండవలె. ఆ మధురభావాలను మధురాక్షరములలో నివేదింప లె। ఆ కవితాతపస్సునే నన్నయ మహాకవి "ప్రసన్న కథాకలితార్థయుక్తి"—"అక్షరరమ్యత" అని ప్రవచించినాడు. సంస్కృతములో తెలుగులో ఆదికవులు ఆరంభించిన "ప్రసన్నత" "అక్షరరమ్యత" ఉద్యమాలు శ్రీ పాపయ్యశాస్త్రిగారి కవితలో పరాకాష్ఠ నందినవి.

"కొన్ని శబ్దాలు శిరీష సుకుమారాలు; కొన్ని శబ్దాలు వజ్ర కఠోరాలు; కొన్ని శబ్దాలు తరంగాలవలె పైకిలేస్తాయి; కొన్ని శబ్దాలు

కురంగాలవలె ముందుకు దూకుతాయి; కిలకిల నవ్వే శబ్దాలు కొన్ని; తళతళమెరిసే శబ్దాలు కొన్ని; మిసమిసలాడేవి కొన్ని; గుసగుసలాడేవి మరికొన్ని" అన్నారు శ్రీ పాపయ్యశాస్త్రిగారు ఉదయశ్రీ ఒక సంపుటికి ఉపోద్ఘాతంలో. వారుచేసిన శబ్దబ్రహ్మోపాసనకు సహృదయులు సర్వదా జేజేలు పలుకక తప్పదు. వారుచేసినది కేవలం శాబ్దిక తపస్సు మాత్రమే కాదు. భావ పరతత్త్వారాధన. ఆ కఠోర కవితాతపస్సులో అంతర్భాగమే. వాగర్థ సాయుజ్యములో వీరు సాధించిన అద్వైతానుభూతి కవితాకళలోని లోతులు తడివి చూచిన వేత్తలకు అనాఘ్రాత విషయముగాదు. 'ప్రసవబాధ తెలియరాదు గొడ్రాలికి । కవి వరులకు తెలియు కవితలోతు".

శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి ప్రప్రథమ కృతి—ఉదయశ్రీ. తరువాతిది విజయశ్రీ—తదుపరి కరుణశ్రీ—మధ్యమధ్య వ్రాసిన ఖండ కృతులు చేరి ఉదయశ్రీ రెండవ భాగము అవతరించినది. అట్లే కాలాను క్రమణికలో మూడవ భాగము—నాలుగవ భాగము—ఐదవ భాగము. ఇప్పుడు ఉదయశ్రీ సమగ్రసంపుటి ఐదు నూర్ల పుటలపైబడిన ఈ బృహద్ గ్రంథమైనది. సంతోషము ఈ సమగ్రసంపుటములో ఉన్నవి బహుళముగా ఖండకృతులు. ఇందలి శీర్షికలకు సమకాలీన సమాజమునకు ఉన్న బింబ ప్రతిబింబ భావము ఉల్లేఖింపదగినది. ఉదయశ్రీ మొదటి భాగములో ప్రాక్ చారిత్రక పౌరాణిక వాతావరణము—కుంతీకుమారి—ఊర్మిళ—అనసూయ—సావిత్రి—రాధాకృష్ణ ప్రణయపారవశ్యము—కరుణశ్రీ కవితకు తొలి యుషస్సులు కల్పించినవి. ఉదయశ్రీ రెండవ భాగమునకు ప్రారంభము "గణగణ మ్రోగెరా విజయఘంటలు భారతమాత మందిరాంగణమున". ఆ విజయఘంటికానినాదములమధ్య కనిపించి విని పించినవి—"నేతాజీ ప్రతిభా ప్రతాపములు—గాంధీతాత సత్యాగ్రహ జ్యోతిర్దీప్తులు—శంఖారవమైన ఆయన పిలుపు—తెల్లవారలగుండె తల్లడిల్ల నేతాజీ ఝళిపించిన చంచచ్చంద్రహాసమ్ము — పారావారమునే దురాగ్రహముతో బంధింప నుంకించిన పాశ్చాత్య భూమింజయులు —

# IV

కుపిత సింహ కిశోరము భంగి చెంగున దూకిన భగత్‌సింగు-మిరపకాయ టపాతో ప్రభుత్వ మిల్టరీదళముల కళవళమందజేసిన అల్లూరి సీతారామ రాజు—" అవి స్వతంత్రభారత కంఠరవములె! కరుణశ్రీ కవీంద్రుని కన్నులకు పాకీపిల్లలోగూడ జగన్మాతృస్వరూపమే సాక్షాత్కరించినది.

"కుక్షిస్థంబగు క్రుళ్లెరుంగడు—కృశాంగుం డీడ్వలే కీడ్వగా

రిక్షాలో జనుచున్న పశుపు" పండుకోతివలె మొగము చిట్లించు కొనుగాక! "పాకీపిల్లగ నాదిపోసికొను నీ పాపిష్ఠిలోకంబు నీ బాకీ తీర్చుకొనంగలేదు జగదంబా! జన్మజన్మాలకున్" అని ఆమెను ఆశ్వాసించిన దయామయుడు ఈ కవి.

సమకాలీన చరిత్ర—కరుణశ్రీ కలములో స్పందించినది. 'ముంగల గానుపించి పదిమూరల దూరముపోయి అంతలో చెంగట కేగుదెంచి చెయిచిక్క విచిత్రముగా అదృశ్యమైన' బంగరులేడివోలె కనుపించినది ఆంధ్రరాష్ట్రసంసిద్ధి కవి కన్నులకు అలనాడు!

జలజల ప్రవహించు జమున నిలిచి కన్నుల నీరు నింపిన విషాద ఘడియ గాంధీ నిర్యాణము - ఆ మహాప్రస్థానము, చిత్తులమారి తెల్లదొరల గుండెలు దద్దరిల్లజేసిన ఆఫ్రికానాయకుడు "లుముంబా" మున్నగు సన్నివేశ శీర్షికలు ఉదయశ్రీ ద్వితీయ సంపుటికి ఉద్దీపన విభావములు. గాంధీ నిర్యాణవార్త విన్న కవి - హిమాలయునివేసిన ప్రశ్న—

ఏమయ్యా మిహికాచలేశ్వరుడ! నీ వెన్నాళ్ళనోయుండి ఈ
సీమాంతమ్మున నిల్చి చూతువుగదా శీర్షంబు పైకెత్తి - క్షో
ణీమధ్యమ్మున నెచ్చటేని ఎపుడేనిన్ 'బాపుజీ'వంటి ని
ష్కామ ప్రేమతపస్వి పుట్టెనె - అహింసా బ్రహ్మతేజస్వియై!

ఈ ప్రశ్నకు సముచిత సమాధానము సద్యః పరనిర్వృతి.

# V

వజ్రసంకల్పుడైన వల్లభాయి - సంగీత సామ్రాజ్యమునకు రాగమయ రాజరాజు త్యాగరాజు - నవంప నాట్యసరోవర నవజీవన వర్ధమాన నళినములైన సురభి నాటక సమాజ నటీనటులు - ఆమ్రపాలి ఆత్మార్పణము - సైనికుని ఉత్తరము - భువన విజయము - సింహేంద్ర వాహన - సాత్రాజితి చైత్రవాణి - దీపావళి - సవితాదేవి కవితాలేఖ - కాశ్మీరవీరుడు గులాంఖాదర్ - నవ్య కవితా భగీరథుడు గురజాడ అప్పారావు - వీరనారి రాణి రుద్రమ్మ - అమరజీవి అఖిలాంధ్ర బోధి సత్వుడు పొట్టి శ్రీరాములు - భువనరక్షకుడైన పుణ్యస్వరూపుని కని పెంచిన మేరీమాత - అల్లాపంపిన పిల్ల జ్యోతిర్మయి - అనుగుపుత్రుని అసహాయశూరునిగా తీర్చిదిద్దిన వీరమాత జిజియాబాయి-క్రిస్మస్ కిరణాలు-చెల్లాయిలేఖ - సంగీతలక్ష్మి కంఠ కల్హారమాల ఘంటసాల - గోమాత — ప్రతిప్రత్యూషపవనాంకురము కరుణశ్రీ కవీశ్వరుని హృదయవీణా శతసహస్ర తంత్రులను స్పందింపజేసినవే; సహృదయ సువర్ణ సౌగంధికములోని రేకులను వికసింపజేసినవే.

ఛందోబద్ధమైన సంప్రదాయ కవిత్వమునకు కాలదోషము పట్టినదని వాదించు ఆధునిక విమర్శకులు పలువురు ఉన్నారు. శ్రీ పాపయ్యశాస్త్రి గారి కవితాసౌధమునకు సహస్ర సంవత్సరాల లోతు పునాది ఉన్నమాట నిజము. అసలు కవితనే నిరసించి "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని సుదూరముగా పారిపోయి నిలుచువారి మాట అటుంచి 'విశ్వశ్రేయః కావ్యమ్' అని అంగీకరించి సాహిత్యమును సామాజిక వికాసమునకు ఉపయోగింపవలెననే జగద్ధితాకాంక్షులు - ప్రాచీన సంప్రదాయాలను, పూర్వకవిసమయాలను అధిక్షేపించుచున్నారు. ఉదాహరణగ శ్రీ పాపయ్య శాస్త్రిగారు హరికథాపితామహులు ఆదిభట్ల నారాయణదాసుగారిని గూర్చి వ్రాసిన కవితాఖండిక స్వీకరింపవచ్చు. ఆ మహానుభావుడు—

# VI

"ఆగవే రంభ! ఆ హస్త మట్టులుగాదు
త్రిప్పి పట్టుమటంచు తప్పు దిద్ది
ఏమమ్మ వాణి! యేదీ వీణ! సరిక్రొత్త
తీవలా? యని గిరాందేవి నడిగి

.... .... ....

ఏమయా క్రొత్త సంగతులేమటంచు
బ్రహ్మమానసపుత్రుని పలుకరించి -

స్వర్గమందిరములందు స్వైరవిహారము చేయుచున్నాడట, స్వర్గనరకముల ఉనికిపై నమ్మకములేని అభినవ హేతువాద సాహితీ చార్వాకులు సయితము కవితారుచి మరిగినవారుగాని, అభిరుచియున్నవారు గాని సాహితీస్వారస్యము అరయగల సహృదయులైనచో పై పద్యము చదివినపుడు తలలూపక తప్పదు. సహృదయత హేతువాదమునకు అతీతము కావచ్చునుగాని అపవాదము కాదు.

అధునాతన చరిత్రలో సగటుమనిషి గుండె కవలినపాలు కరుణశ్రీ కలము కదలి కరగి కవిత స్రవియించినది. ఆయూబ్ ఆత్మగతము - యాహ్యాసప్తకము-భుట్టో షష్ఠాష్టకము మొదలైన ఖండికలు క్షేమేంద్రుని ఔచితీనిరతికి తన గుండెలో వెన్నెల కోవెల కట్టుకొని ఆరాధించు కరుణశ్రీ కవితకు ఇతివృత్తములు ఎట్లైనవి? ఆ రాజకీయ కల్లోల కార్పణ్య కాలుష్యములు కవితావస్తువులు ఎట్లైనవి? అని విషయసూచికలోని శీర్షికలు చూచినవారు సంభ్రమాశ్చర్య చకితులు కావచ్చు. 'అసలు కవి జగదేకకుటుంబి, వసుధైక పౌరుడు-కవికి ఎందుకు పక్షపాతము? రెండు సారులు యుద్ధహోమకుండమును ప్రజ్వలింపజేయుట-భారత పాకిస్తాన్-ఉభయదేశాల ఉన్మత్తత!' అని వాదింపవచ్చు. మానవహృదయమును ఉర్రూతలూగించే శక్తి దేశభక్తికి ఉన్నది. 'రాజేయకు రణ కుంపటి! మాజీ నాజీవి గాకుమా భుట్టోజీ!' అని అతనిని కవి మందలించినప్పుడు

గాని—'మారణహోమ సాక్ష్యములు ఢాకా విశ్వవిద్యాలయ ద్వారమ్ముల్ ప్రకటించు నేటికి భవద్ భస్మాసుర క్రీడలన్' అని 'యాహ్యాస్తకము' చదివినప్పుడుగాని - "భుట్టో రంకెలు మాయటాంకులు పెకింగ్ బొంకుల్ మదిన్ నమ్మి యీ నష్టటం బడినా"నను "ఆయూబ్ ఆత్మగతము" అనుశీలించినప్పుడుగాని-పాకిస్థాన్ పాపడైనప్పటికి - తాను తలవంచుకొని లోలోపల నవ్వుకొనక తప్పదు.

సమకాలీన చరిత్రలో బంగ్లాదేశమాతకు జరిగిన బలవన్మాన భంగమునకు హృదయము స్పందించనివాడు, కన్నీరు కార్చనివాడు కవి గాదుగదా మానవమాత్రుడే కాదు.

కవిత - మొట్టమొదట కరుణార్ద్రహృదయమ్ము
కరగి కార్చు వేడి కంటినీరు।
కవిత - లోకనాటక ప్రదర్శనముతో
తోడు - క్రాంత దృష్టి - పుట్టుకవకు.

సమకాలీన చరిత్ర కరుణశ్రీ హృదయమును సదా స్పందింప జేసినది. అందుచేత ఆయన స్వీకరించిన ఇతివృత్తములు కొన్ని వివాదగ్రస్తములైనను అవి విశ్వజనీనతను గోలుపోలేవు. అవి అన్నీ ఆయన అనుభూతులు. అనుభూతిలేని రచనలు అభినయస్థాయికి దిగజారును. తథ్యము కవి అభిప్రాయాలతో సహృదయుడు సదా ఏకీభవింప నవసరము లేదు. కాని ఆ రచనలు చదివి ఆనందింపవచ్చు. అదే సహృదయత; అదే సంస్కారమునకు భారమితి. "స్రవియించు కొందరి హృదులకవనము కొందరి మెదడుల క్రాలుచు వరలున్; కవి కరుణశ్రీలోపల కవిత్వ మాపాదమస్తకము ప్రవహించున్" ఆయన స్వీకరించిన శీర్షిక ఏదైన కావచ్చు. దానిని కవితగా రూపొందించు "ప్రతిభ" ఆయనది. 'అవతరించ లేదు అనుభూతిలేకుండ; స్వచ్ఛమైన కవిత జగతియందు' శ్రీ పాపయ్య శాస్త్రిగారి ఖండకృతులన్నిటిలో చిత్తశుద్ధితో నిండిన అనుభూతి ఉన్నది. ఆ అనుభూతి ఆయన కవితలో జీవనాడివలె స్పందించి చేతి కందుచుండును.

# VIII

కరుణశ్రీ కవితానుశీలనమున మరచిపోకుండ ప్రస్తావించవలసిన అంశము ఆయన కలమునుండి స్రవించు సహజ సుకుమార మనోహర మధుర మంజుల శైలి. అసలు - ఏ భాషయందైన కవిత్వము వాగర్థముల సాయుజ్యముతోగూడిన యుగళకళ. ఇక తెలుగు కవిత యుగళకళలో అంతర్యుగళకళ. భాషా భావ సాయుజ్యముతోపాటు ఆంధ్రభాషలో తెలుగు - సంస్కృత పద సాయుజ్యము సయితము సాధింపవలసి యున్నది. సర్వస్వామ్య సంకలితముగా సంస్కృతభాషను సొంత హక్కు భుక్తము చేసికొనినది తెలుగుభాష. మరి యే యితర దేశభాషకు అట్టి అదృష్టము పట్టలేదు. ఆంధ్రభాషలో తత్సమములు, తద్భవములు దేశ్యములు, అన్యదేశ్యములుగూడ చేరియున్నవి. ఈ పరభాషా సాయుజ్యము వ్యావహారిక భాషలో నల్లేరుపై బండివలె సాగవచ్చు. కాని వ్యాకరణమునకు అది తలనొప్పి యైనది. సాహిత్యమునకు అది కత్తిమీద సాము అయినది. సంకర సమాసాలను నిషేధించి తెలుగు వ్యాకరణము తన తలనొప్పిని దించుకోగలిగినది. కవితా శిల్పమునకు ఇంక కత్తిమీద సాము తప్పలేదు. కరుణశ్రీగారి కవితా గురువుగారైన పోతన — "కొందరకు తెలుగు గుణమగు, కొందరి కిని సంస్కృతంబు గుణమగు....నే నందరి మెప్పింతు నయ్యె యెడలన్" అని సాహిత్య శపథము చేయవలసి వచ్చినది. పోతన "భాగవతమ్ము తెలిసి పలుకుట కష్టమ్ము - శూలికైన తమ్మిచూలికైన" అనగలడు. "అల వైకుంఠపురమ్ములో నగరిలో ఆమూల సౌధంబుదాపల మందార వనాంతరామృత సరః ప్రాంతేందుకాంతోపలోత్పల పర్యంక రమావినోది" అని తేటతెలుగులో ఆరంభించి సుదీర్ఘ సంస్కృత సమాసము విసర గలడు. ఈ కత్తిసాము నేర్పులో శ్రీ పాపయ్యశాస్త్రిగారు గురువును మరపించగల సిద్ధహస్తుడు. కరుణశ్రీ కలము సంస్కృతములో సుందర సువర్ణ స్వప్న పరంపరలను గని కమ్మని తేటతెలుగు నుడికారములతో కలవరించగలదు 'లీలాతాండవలోల ధూర్జటి జటాళిందోర్మిమాలా చలద్

బాలేందూజ్జ్వల నాట్యశాస్త్ర రచనా పారంగత ప్రజ్ఞ'దట భరతాచార్యుడు. 'కెంజిగురుకు చేతులు - క్రొమ్మావి కొమ్మ కమ్మని కెమ్మోవి చివుళ్లు, కత్తినే చివురాకుగుత్తిచేసినవాడు.... తెలుగు నుడికారపు వంపులు సొంపులు కరుణశ్రీ కవితలో తామర తంపరలు

కరుణశ్రీ కృతులలో తెలుగు సంస్కృత పదజాలముల సాహితీ సాయుజ్యము అర్ధనారీశ్వర సంయోగమునే తలపించును. ఉదాహరణమునకు శ్రీనివాసోదాహరణమందలి ఒక పద్యము స్వీకరించ వచ్చును—

"విరికై తుమ్మెదలీల నా హృదయ మువ్విళ్లూరు నెల్లప్పుడున్
హరికై - సత్కరుణా సుధాలహరికై - ఆనంద మందాకినీ
ఝరికై - నిత్యనివాస శేషగిరికై - సందృప్త దైత్యేభ కే

సరికై"....ఇది కరుణశ్రీ కవితాముద్రిక. రాబోయే తరాలలో తెలుగు సహృదయులు దీనిని సులువుగాగుర్తుపటగలరు. దీనికి కరుణశ్రీ కవిత్వ మంతయు ఉదాహరణ ప్రాయమే కావున 'అల మతివిస్తరేణ'.

సంస్కృత శబ్దజాలమునకే గాక - అన్యదేశ్యములకు గూడ తెలుగు మేలిముసుగు వేసి తెలుగు దుస్తులు తొడిగి సరిక్రొత్త ముస్తాబు చేసి ముచ్చటగా తెలుగు వంపుసొంపుల గుంపులో గుదిగ్రుచ్చి కలిపి వేయగల నేర్పు శ్రీ పాపయ్యశాస్త్రిగారికి అలవడినది. చీరకట్టుకొని తిరుగాడే తెల్లదొరసానివలె గాక స్థానం నరసింహారావుగారి సత్యభామ వేషంవలె - పరభాషాపదాలను తీర్చిదిద్దగల నేర్పు ఆయనది. "సెబాసుర సుబాసు - మిరసకాయటపా - గోచీపెట్టెను పెట్టలేవనుటకున్ కొల్లాట - మీలో మీరు సవాలు కొట్టుకొని - వెడలె టింగురంగా యటంచు మా టంగుటూరి - వియత్ మిఙ్ఞ బావుటాపై శాంతిపావురాలు - పొలిమేరలు దాటించే దగా ముఠాదారులు - పరదా సరదారులు - టాంకుల్ పోయె ఫిరంగు లెత్తువడె - ఫైటర్ జెట్ విమానంబులున్ డింకా కొట్టె - ఛీఛీ వెలికింబడిన తివాచీ - గతిచెడిన రిష్టువాచీ ...ఇటువంటి ప్రయోగాలు ఎబ్బెట్టుగా తోచకుండా తెలుగు తీరుతీయాలతో రంగరించి అందించే నేర్పు ఆయనది.

# X

ఆధునిక సాహిత్యమును సంప్రదాయ సస్యశ్యామలము చేసిన కవులు కరుణశ్రీవంటివారు కొందరు మరికొందరు విప్లవ ధుమధూమ మారుత శ్రీశ్రీమంతులు. ఉత్తమ కవిత ఎప్పుడూ ఒక మహాప్రస్థానమే. నవయుగ విహాయసములో వేగుచుక్కగా పేరుకెక్కిన గురజాడ అప్పారావుగారు ఆశించిన "క్రొత్తపాతల మేలికలయిక" ఉదయశ్రీ కవితాఖండికలలో సిద్ధించినది.

కవితా వైజయంతి కవి స్వకీయ సాహిత్య వేదాంత దర్శనము.

"దోసెడు పారిజాతములతో హృదయేశ్వరి మెల్ల మెల్లగా
డాసిన భంగి - మేలిమి కడాని పరాల కరాలు వచ్చి క
న్మూసిన భంగి - కన్నె నగుమోముపయిన్ నునుసిగ్గుమొగ్గ కై
సేసిన భంగి"....

కవిత వెల్లివిరియవలెనని కరుణశ్రీ ఆకాంక్ష. కవి ఆకాంక్ష ఉదయశ్రీలోని ప్రతిఖండికలో ఫలించినది

ఈ ఖండికలలో — "సీత" — ఒక చిరు సంగీతరూపకము, తెలుగువారికి వాల్మీకి రామాయణ కథ సుపరిచితమైనను కవితామాధుర్యము మాత్రము సుదూరము. వాల్మీకి రామాయణములోని ఐతిహాసిక సౌలభ్యము, సాహితీ సారళ్యము, ఉపమాన ప్రయోగ కౌశల్యము ఈ 'సీత' అనే ఖండకావ్యములోనికి కొంతమేర అవతరింపజేయగలిగినాడు కవి. 'ఆకారం దాల్చిన లోకైక శోకగీతికవలె - భగీరథుని రథంవెనుక ప్రవహించే సురనదివలె-ధర్మమునకు దయలాగున వాల్మీకి మహర్షి వెంట వైదేహి వెడలి వచ్చినది. శ్రీమద్రామాయణ మహాకావ్యము ఇక్షురస మహోదధి అయితే ఈ "సీత" ఖండకృతి పంచదార స్ఫటికమాలిక.

"ఆషాఢస్య ప్రథమదివసే"-- అనే శీర్షికకు కాళిదాస మహాకవి మేఘసందేశ కావ్యము మాతృక. మేఘసందేశమునకు విశ్వసాహితీ జగత్తులో అనువాదములుగాని, అనుకృతులుగాని వేనకువేలు వెల్లివిరిసినవి. ప్రపంచ భావసాహితీ పర్వత పంక్తులలో మేఘసందేశము గౌరీశంకర శిఖరము. మేఘసందేశ కవిత అనువాదమునకు అందునదికాదు. శ్రీ పాపయ్యశాస్త్రిగారి "ఆషాఢస్య ప్రథమదివసే" లోని ఆషాఢమేఘము మేఘసందేశమునకు అనువాదము కాదుగాని కాళిదాస కవితకు తెలుగులో

మనఃసృష్టి. ఈ "ఆషాఢ మేఘము" కాళిదాసు సంస్కృత మేఘ సందేశమునకు కరుణశ్రీ తెలుగులో వ్రాసిన కమనీయ కవితాపీఠిక.

ఉదయశ్రీ సంపూర్ణసంపుటిలో చమత్కార పూరితములైన ఖండికలు - నవరసరుచిరములైనవి - పారిస్ పతివ్రతవంటివి - కొన్ని ముక్తకాలు-సమస్యాపూరణములు చేరినవి. అవి చదువరులను ఆకర్షించుట సహజము.

అస్మద్గురువరేణ్యులు జ్ఞానపీఠ బహుమతి గ్రహీత శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని గూర్చిన కవిత - పార్వతీపరమేశ్వరుల సంభాషణ హృదయంగమ మైనది. పార్వతి అడిగినదట పరమేశ్వరుని - "స్వామీ! ఎక్కడనుండి రాక". "మా స్వామి" అను విశ్వనాథకవి పిలుపు విని అతని దగ్గరకు వెళ్ళి వచ్చినాడట పాప మా పరమేశ్వరుడు! ఆయన "మౌళిన్ శశి యేడి." అని ప్రశ్న. "దూతయయిపోయెన్ వానికేనాడో!" అనునది సమాధానము. "లేదేమి చేత త్రిశూలము"-ప్రశ్న. "మరచి పోతిన్ వాని నట్టింట"-పరమశివుని సమాధానము. విశ్వనాథవారి రచనలు మా స్వామి-శశిదూతము-త్రిశూలము జగత్ప్రసిద్ధములు ఇక పార్వతి వేసిన చివరి ప్రశ్న. "లేదేమి గంగ శిరస్సుపై" - "కలసిపోయెన్ వాని వాగ్ధోరణిన్" అని సముచిత సమాధానము వెలువడినది. కథ కంచికి వెళ్లినది.

ఇటి చమత్కారధోరణి పరాకాష్ఠ చెందినది శ్రీ పాపయ్యశాస్త్రి గారు చేసిన సమస్యాపూరణములలో. సమస్య దేహము విచిత్ర వైరుధ్యము-ఆత్మచమత్కార పరిష్కారము —

"రావణ కుంభకర్ణులకు రాముడు పుట్టె గుణాభిరాముడై"

చేవనొసంగ జాతికిని; జీవమొసంగగ బందరాతికిన్,
సేవనొసంగ కోతికిని, శిక్షనొసంగగ దుష్టనాతికిన్,
దేవమునీంద్ర శాపమును దీరిచి ముక్తిపదం బొసంగగా
రావణకుంభకర్ణులకు; - రాముడు పుట్టె గుణాభిరాముడై!

శ్రీ పాపయ్యశాస్త్రిగారి పూరణములన్నిటిలో వారి సహజశైలితోపాటు వారు స్వచ్ఛందముగా ఛందస్సునకు అదనముగా ఏర్పరచుకొను స్వీయ

నియమములు వారి కవితాముద్ర కనుపట్టినప్పుడు ఆయన "పుట్టుకవి" అనిపించును.

ఇక సింహావలోకనప్రాయముగ చెప్పవలసిన చివరి మాటలు ఉన్నవి. అయితే ఈ పకరణమున ఇవి లాంఛనప్రాయములు గావని మనవి. చిత్తశుద్ధితో హృదయపూర్వకముగ పెల్లుబికి పైకి వచ్చినవే. సత్కార్య నిర్వహణమున - కర్తతోపాటు కారయితకుగూడ పెద్దలు పుణ్యఫలభాగమును పంచిపెట్టుచున్నారు. అందుచేత ఉదయశ్రీ కృతికర్తకేగాక నా హృదయపూర్వకమైన అభినందనలు ప్రచురణకర్త శ్రీ బి. బాబ్జీగారికికూడా అందించుచున్నాను. ఇంత అందముగా ముచ్చటగా అచ్చయిన పుస్తకము ఈ మధ్యకాలములో వేరొకటి లేదేమో! ఇక 'బాపు' వేసిన బొమ్మలు ఉదయశ్రీకి - పుడమి కవ్వలి వెలుగులు వెలార్చుచున్నవి. కరుణశ్రీ కవిత్వము - బాపు చిత్రలేఖనము గంగా యమునలవలె సంగమించినవి

ఉదయశ్రీ నవనవోన్మేషదీధితులకు - ఉప్పొంగే సహృదయ హృదయ సాహితీ సరోవరాలలో తరతరాలుగా శతసహస్ర సువర్ణ సౌగంధికములు వికసించుట సహజము. నా హృదయములో వికసించిన ఈ సువర్ణ సౌగంధికము ఈ కవితా కళాప్రయోగకు నా ఉడుగర. కవిత్వము - లలితకళలు అనుభవైకవేద్యములేగాని వ్యాఖ్యాన సాపేక్షకములు గావు.

మూలమునకు అపచారము-పేత్తలకు అనుమానము-సహృదయులకు అవరోధముగా పరిణమించని వ్యాఖ్యలు అరుదు. అయిన, ఎందుకీ వ్యాఖ్యలు ?

ఆకసమ్ము గ్రమ్మి అందగించును గాని
    ఎవరి చేతికందు ఇంద్రధనువు ?
ఇంపుగొలుపు కవిత - హృదయైకవేద్యమ్ము
    వింగడింపరాదు వెంబడించి

కాని - కరుణశ్రీ కవీంద్రుని సుహృదనుశాసనము మీరరానిదైనది. ఈ తప్పు తెలిసి చేసినదే అని వినయపూర్వకమైన నా విన్నపము.

# సుప్రభాతము

ఒక సువర్ణ సుప్రభాతంలో ఉదయశ్రీ తొంగిచూచింది. లోకం అనురాగంతో ఆహ్వానించింది. ఉదయశ్రీ ఒయ్యారంగా చేతులెత్తి నమస్కరించింది; విశ్వలోకం ఆదరంతో ఆశీర్వదించింది. ఉదయశ్రీ భక్తితో కవితాపుష్పాంజలి సమర్పించింది; రసజ్ఞలోకం రక్తితో ఆసక్తితో స్వీకరించింది. ఉదయశ్రీ సిగ్గుతో చిరునవ్వులు చిందిస్తూ ముందుకు వచ్చింది; ప్రజానీకం ప్రేమతో చిట్టితల్లిని బుజ్జగించి ముద్దులతో ముంచెత్తింది.

ఒకసారి కాదు; రెండుసార్లు కాదు; అనేక పర్యాయాలు !

ఇదిగో ఇది ఉదయశ్రీ మరియొక సరిక్రొత్త ముద్రణం !

ఉదయశ్రీ ఐదుభాగాలూ ఏకత్ర సంకలన చేసి సహృదయులకు సమర్పించిన సంపూర్ణ సంపుటం ఇది. ఇంచు మించు నూటఅరవై నవ్యకావ్య ఖండికలతో నిండిన సురభిళ కవితా సుమనోంజలి ఇది

ఆర్ద్రహృదయులైన ఆంధ్రసోదరులకు ఈ ఖండకావ్య సంపుటిని ఈ విధంగా అందించే భాగ్యం ఈనాటికి లభించింది. దయామయుడైన భగవంతుని అనుగ్రహమూ, పూజ్యులైన గురుదేవుల ఆశీర్వాదమూ, రసజ్ఞులైన పాఠకుల ఆదరాభిమానాలే ఈ భాగ్యానికి కారణం.

ఇప్పటికి సరిగా ముప్పదియేడు సంవత్సరాల క్రిందటిమాట !

పందొమ్మిదివందల నలభై రెండులో నేను క్రొత్తగా ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీలో అధ్యాపకుడుగా చేరిన రోజులవి !

నా "పుష్పవిలాపము" కళాశాల పత్రికలో ప్రకటితమైనది. ఆ పద్యాలు చదివిన ప్రియమిత్రుడు ఏ.ఎస్. కృష్ణా "ఒరేయ్! నువ్వు కవిత్వం కూడా వ్రాస్తావా ? మరి నాకు చెప్పలేదేం ? నీవు వ్రాసిన పద్యాలన్నీ పుస్తకంగా అచ్చువెయ్యి ? ఇదిగో తీసుకో వెయ్యి !" అంటూ పది పచ్చ కాగితాలు చనువుగా నా చేతికందిచ్చారు.

# XIV

౧౯౪౪ లో ఉదయశ్రీ ప్రథమభాగం నవ్యసాహిత్య పరిషత్తు పక్షాన సర్వాంగసుందరంగా ఆంధ్రుల కరకమలాలను అలంకరించింది. మిత్రుని సంకల్పబలం ఎంత గొప్పదో నాలుగు సంవత్సరాలు తిరుగకుండానే "ఉదయశ్రీ" రెండవ, మూడవ, నాల్గవ, ఐదవ ముద్రణలు వెంటవెంటనే వెలువడ్డాయి. సౌజన్యనిధులైన సహృదయులు సంతోషంగా సానురాగంగా నా "ఉదయశ్రీ"ని సమాదరించారు.

పూజ్యశ్రీ మహావాది వెంకటప్పయ్యశాస్త్రిగారు పుస్తకం రాకముందునుంచే ఉదయశ్రీలోని 'కుంతీకుమారి' పద్యాలను తన మధుర మనోహర మంజుల కంఠంతో ఆలపించి శ్రోతలను ఆనందతన్మయులను జేశారు.

౧౯౪౬ లో 'ఘంటసాల' కమనీయ కంఠంలోనుంచి "అద్వైతమూర్తి" "సాంధ్యశ్రీ" అనే ఖండికలు ఆంధ్రదేశం ప్రతియింటా ప్రతిగంటా ప్రతిధ్వనించాయి. "సంజవెలుంగులో పసిమిఛాయల ఖద్దరు చీర కట్టి" "అంజనరేఖవాల్గనుల యంచులు దాట" "క్రొంజివురాకు వ్రేళుల కురుల్" సరిదిద్దుకునే ఉదయశ్రీ సుమనో మనోరంజని ఐనది. "నీవే నేనుగ నేనె నీవుగ" ఏకమై పోవమన్నాడు తెలుగు పాఠకుడు. క్రమంగా పోతన, తెలుగుతల్లి, పుష్పవిలాపము, కుంతీకుమారి, అంజలి, వైశాఖి, కరుణామయి ఇత్యాది ఖండికలు ఘంటసాల, సూరిబాబు, సుశీల, వరలక్ష్మి, దుర్గాప్రసాద్, పట్నాయక్ మొదలైన గాయకుల కలకంఠాలలోనుంచి పాటకచ్చేరీలలోనూ, గ్రామఫోను రికార్డులలోనూ, సినిమాలలోనూ వీనుల విందుగా విన్పించాయి.

"కుంతీకుమారి" మొదటిసారిగా 'ఆంధ్రపత్రిక ఉగాది సంచిక' లోను "పుష్పవిలాపము" ప్రప్రథమంగా 'భారతి'లోను ప్రకటింపబడినవి. "పోతన" "ఆంధ్రవిద్యార్థి" తొలిమాటుగా 'గృహలక్ష్మి'లో అచ్చు ఐనాయి. 'ఆంధ్రి' 'ఆంధ్రవిద్యార్థి' 'మహతి' ఇత్యాది సాహిత్య మాస పత్రికలు నా రచనలను అందంగా అందించి రసజ్ఞలోకానికి నన్నెంతో సన్నిహితం చేశాయి.

ఆంధ్ర, మద్రాసు, ఉస్మానియా, వేంకటేశ్వర, కాకతీయ, మైసూరు, ఉత్కళ విశ్వవిద్యాలయాలవారు నా కావ్యాలు పాఠ్యాలుగా స్వీకరించి నాకు మరింత ఉత్సాహం కలిగించారు.

ఇప్పుడు క్రొత్తగా వెలువడిన ఈ సంపూర్ణ సంపుటిలో ఉదయశ్రీ ఐదు భాగాలూ కలిసి ఉన్నాయి. ప్రథమభాగం ప్రథమముద్రణం 1944లో వెలువడింది. ఇప్పుడు అంటే 1979 లో 48వ ముద్రణం అందుకొన్నది. ఉదయశ్రీ రెండవభాగం ప్రథమముద్రణం 1952 లో వెలుగుచూచింది. ఇప్పుడు 27 వ ముద్రణం సంతరించుకొన్నది. పోతే ఉదయశ్రీ మూడవ భాగం ప్రథమ ముద్రణం 1961 లో వచ్చింది. ఇప్పుడు ఆరవపర్యాయం ముద్రితమయింది. ఇక ఉదయశ్రీ నాల్గవభాగం 1969 లో ప్రథమంగా ప్రకటితమై ఇప్పుడు నాల్గవ ముద్రణం పొందింది ఉదయశ్రీ ఐదవభాగం ఇదే ప్రథమంగా మీ హస్తాలను అలంకరించింది

తెలుగుదేశంలోని పౌరాణికశిరోమణులూ, హరికథక చక్రవర్తులూ ఉపన్యాసకేసరులూ, నటకాగ్రేసరులూ హృద్యమైన శైలిలో ఉదయశ్రీ పద్యాలను నిర్విరామంగా నిత్యగాంధర్వంగా శ్రోతలకు వినిపిస్తున్నారు.

''ఆలిండియా రేడియో''వారు ఆకాశవాణి రికార్డులద్వారా నా కవితలను నిరంతరం లోకానికి సుశ్రావం చేస్తున్నారు.

తమ పత్రికలలో నా కావ్యాలలోని భావరేఖలకు రూపురేఖలు చేకూర్చి కవిత్వానికి శిల్పానికి ఉండే అవినాభావసంబంధాన్ని ఋజువు చేశారు మిత్రశ్రీ ధనికొండ హనుమంతరావుగారు.

ఈ శుభసమయంలో మరికొన్ని మధుర స్మృతులు -

''చూచెదవేలనో ప్రణయసుందరి'' అని మరదలితో సరసమాడే సరిక్రొత్త బావగారూ -

''కూర్చుండ మా ఇంట కురిచీలు లేవు" అని భగవంతునిముందు చేతులు జోడించి పాడే భక్తురాలూ -

''రాధసురా ప్రభూ! నిరపరాధసురా'' అని గుండెలు కరిగిస్తూ విన్నవించుకునే కరుణామయి కల్యాణీ -

''ఉడుదారాలతో గొంతు కురి బిగించి'' అని స్త్రీలవైపు తిలకిస్తూ కరుణరసం ఒలికిస్తూ పాడుతున్న భాగవతారుగారూ -

# XVI

"అమ్మ నీచేతి తాలింపు కమ్మదనము భరతదేశాన గుమగుమ పరిమళించె" అని రాగం సాగదీస్తూ గొడ్లు మేపుకునే కాపు కుఱ్ఱవాడూ -

తీరిక సమయాల్లో చదువుకోటానికి మలారంలో ఉదయశ్రీ పుస్తకాన్ని అతి భద్రంగా దాచుకున్న గాజులదిత్తుడూ -

"సుమనోంజలి ముందుకు చాచి శైలరాణ్ణందన వంగె చెంగున ననంగుని చాపము వంగె" అని భావాభినయపురస్సరముగా ప్రవచించే పౌరాణికస్వామీ -

ఈ శుభసమయంలో నా ఎదలో మెదలుతున్నారు। వీరంతా ఇంతో అంతో ఉదయశ్రీ అభ్యుదయంలో పాల్గొన్నవారే।

ఈ విధంగా 'ఉదయశ్రీ' ఆంధ్రుల ఆదరాభిమానాలకు పాత్రమై పట్టణాలలో, పల్లెలలో, సభలలో, సమావేశాలలో, ప్రార్థనలలో, పాఠ్య గ్రంథాలలో సర్వత్ర మన్ననపొంది 'మంచి అమ్మాయి' అనిపించుకున్నది.

హృదయమెఱిగిన సుహృన్మణులు, సరససాహితీ చతుర్ముఖులు, ప్రగతి గీతా ప్రవక్తలు, డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్య 'సువర్ణ సౌగంధికము' సమకూర్చి 'ఉదయశ్రీ' శోభను ఇతోధికం చేశారు.

ఇప్పుడు ఈ విధంగా ఉదయశ్రీ సమగ్ర సంపుటిని కళాతపస్వి శ్రీ బాపుగారి గమణీయ చిత్రాలతో ఇంత ఆకర్షణీయంగా ప్రచురించటానికి ముందుకు వచ్చారు "న్యూ స్టూడెంట్సు బుక్ సెంటర్" అధినేతలు ప్రియ మిత్రులు శ్రీ బాబ్జీగారు.

ఈ సారి ఈ ముద్రణాన్ని ముద్దుగా ముచ్చటగా దిద్దితీర్చటంలోనూ సర్వాంగ సుందరంగా రూపొందించటంలోనూ సంపూర్ణమైన శ్రద్ధ వహించాడు మా చిరంజీవి డాక్టర్ మహతీశంకర్.

ఉదయశ్రీ అందచందాలకు పై విధంగా దోహదం చేసిన మహనీయులకూ అభిమానులకూ ఆత్మీయులకూ అందరికీ హృదయ పూర్వకధన్యవాదాలు సమర్పించుతున్నాను. ఈనాడు ఉదయశ్రీకి ఒక సువర్ణ సుప్రభాతంగా భావిస్తున్నాను.

— కరుణశ్రీ

# అరుణ రేఖలు

ఆనాడు నా శిథిలజీవితానికి ఒక మధుర ప్రభాతం. నా హృదయంలో ఒక ఉదయశ్రీ.

కన్నులు విప్పి చూచాను. శ్రీమతినీ చిరంజీవినీ విడిచి బరువు గుండెతో మేడమెట్లు దిగే గౌతమబుద్ధుని కారుణ్యమూర్తి కనిపించింది. ఆయన అర్ధనేత్రాంచలాల్లో నుంచి కరుణాకుమారి నా జీవితంలోకి తొంగిచూచింది.

ఆమె వదనంలో — అయోధ్యానగరం అంతఃపురాలు దాటి దండకారణ్యపర్ణకుటిలో తన జీవిత సౌభాగ్యం వెతుక్కుండే ఊర్మిళాకుమారి ఉత్కంఠ తొణుకులాడుతున్నది.

ఆమె కంఠంలో — పాషాణహృదయుల ప్రక్కల క్రింద పడి రెక్కలు వీడి, నలిగి, నశించిపోయే పూలబాల జాలి పాట మెల్ల మెల్లగా మ్రోగుతూ ఉంది.

ఆమె నిట్టూర్పులో — గంగానది గట్టుమీద నిలిచి నిర్ఘాంతపోయి ఏటి కెరటాలలో పడి ఎక్కడెక్కడికో కొట్టుకుపోయే కొడుకువైపు నిశ్చల నిరీహ నిర్నిమేష నేత్రాలతో చూచే కుంతీకుమారి గుండెల చప్పుడు దీన దీనంగా వినిపిస్తూ ఉంది.

ఆమె ఆర్ద్రనేత్రాలలో - మృత్యుదేవతవెంట ఒంటరిగా పతికోసం పరువెత్తే సతీమణి సావిత్రి ప్రణయస్వరూపం - కాదు-ప్రళయస్వరూపం ప్రతిబింబిస్తూ ఉంది.

ఆమె చల్లని చేతులలో - కరుణామయి రాధిక హృదయ విపంచి అమృతరాగాలు ఆలపించుతూ ఉంది.

ఆమె కన్నీటి కెరటాలలో - భారతమాత బాష్పధారలు ప్రవహిస్తూ ఉన్నాయి. ఆమె నిట్టూర్పులు నన్ను మానవుణ్ణి చేశాయి. ఆమె కన్నీళ్ళే నాలోని కవిత్వం. ఆమె నా కరుణామయి. నా జీవిత సహచరి. నా కల్యాణమూర్తి. నా ఆరాధ్యదేవి. నా ఆనందలహరి.

భగవంతుడు కరుణామయుడు. సృష్టి కరుణామయం. జీవితం కరుణామయం. ప్రపంచం కరుణలో పుట్టి కరుణలో పెరిగి కరుణలోనే విలీనమౌతుంది.

కరుణకూ కవికీ అవినాభావమైన సంబంధం ఉంది. కరుణ లేకపోతే కవికి వ్యక్తిత్వం లేదు. కవి లేకపోతే కరుణకు అస్తిత్వమూ లేదు.

ఈనాడు నా శిథిల జీవితానికి ఒక మధుర ప్రభాతం. నా హృదయంలో ఒక ఉదయశ్రీ.

- కరుణశ్రీ

# అంజలి

పుట్టబోయెడి బుల్లిబుజ్జాయి కోసమై
పొదుగుగిన్నెకు పాలు పోసి పోసి
కలికి వెన్నెల లూరు చలువ దోసిళ్ళతో
లతలకు మాఱాకు లతికి యతికి
పూల కంచాలలో రోలంబములకు తే
పటి భోజనము సిద్ధపఱచి పఱచి
తెలవాఱకుండ మొగ్గలలోన జొరబడి
వింత వింతల రంగు వేసి వేసి
తీరికే లేని విశ్వ సంసార మందు
అలసిపోయితి వేమొ దేవాదిదేవ!
ఒక నిమేషమ్ము కన్ను మూయుదువుగాని
రమ్ము! తెఱచితి మా కుటీరమ్ము తలుపు!

ఉదయశ్రీ

కూర్చుండ మాయింట కురిచీలు లేవు; నా
ప్రణయాంకమే సిద్ధపఱచనుంటి
పాద్యమ్ము నిడ మాకు పన్నీరు లేదు; నా
కన్నీళ్ళతో కాళ్ళు కడుగనుంటి
పూజకై మావీట పుష్పాలు లేవు; నా
ప్రేమాంజలులె సమర్పింపనుంటి
నైవేద్యమిడ మాకునారికేళము లేదు;
హృదయమే చేతికందీయనుంటి
లోటు రానీయ నున్నంతలోన నీకు;
రమ్ము! దయసేయు మాత్మపీఠమ్ముపైకి
అమృతఝరి చిందు నీ పదాంకములయందు
కోటిస్వర్గాలు మొలపించుకొనుచు తండ్రి!

లోకాల చీకట్లు పోకార్ప రవి చంద్ర
దీపాలు గగనాన త్రిప్పలేక
జగతిపై బడవచ్చు జలరాశి కెరటాలు
మామూలు మేరకు మడవలేక
పనిమాలి ప్రతిరోజు ప్రాణికోటుల గుండె
గడియారముల కీలు కదపలేక
అందాలు చింద నీలాకాశ వేదిపై
చుక్కల ముగ్గులు చెక్కలేక
ఎంత శ్రమ నొందుచుంటివో యేమొ సామి!
అడుగిడితి వెట్లొ నేడు మా గడపలోన;
గుండె కుదిలించి నీ ముందు కుప్పవోతు
అందుకోవయ్య హృదయపుష్పాంజలులను.

# ఉషస్సు

కర్కశ కరాళ కాలమేఘాల నీడ
లెగురుచున్నవి ప్రజల నెమ్మొగములందు;
క్రౌర్య కౌటిల్య గాఢాంధకార పటలి
క్రమ్ముకొన్నది దిగ్దిగంతమ్ములెల్ల.

ఈ నిస్తబ్ధిత కంతరార్థ మెదియో । ఈ కారుమేఘాలలో
ఏ నిర్భాగ్య నిరర్థ నీరస గళం బెగ్గెత్తి వాపోవునో ।
ఈ నీరంధ్ర నిశీథ గర్భకుహర మ్మేభావగంభీరతా
పౌనఃపున్యము దాచెనో। వెలయవో ప్రాభాత శోభావళుల్ ।

ఈ చీకట్లిక తెల్లవాఱవపె । లేనేలేవటయ్యా స్మిత
శ్రీ చైతన్య నవప్రభాతములు నిర్జీవప్రపంచాన । మా
ప్రాచీనాల కపోలపాళికలపై ప్రత్యూష సౌవర్ణ రే
ఖా చిత్రమ్ములు గీతు రెవ్వ రనురాగస్విన్నహస్తాలతో ।।

# ఉదయశ్రీ

సుప్రభాతము ! రాగోజ్జ్వల ప్రబోధ
మంధలోకాని కిదు జగద్బాంధవుండు
ఉదయమగుచుండె నవయుగాభ్యుదయమునకు
అరుణ కిరణాలతో కరుణార్ద్రమూర్తి.

చీకటిలో లోక మ్మిది
చీకాకై పోయె; సంస్పృశింపగవలె నీ
శ్రీకరముల, కరుణా కమ
లాకర తరుణ ప్రభాకరా ! రావోయీ !

శుద్ధోదన రాజేంద్రుని
శుద్ధాంతము చిందె శాంతి సుధల; అహింసా
సిద్ధాంత మొలుకు గౌతమ
బుద్ధుని చిరునవ్వులోన పులకీకృతమై.

# ఉత్తిష్ఠ

చిన్నికుమారు చిర్నగవు చెక్కిలిలో పులకించు రాణి క్రీ
గన్నుల నీడలన్ సుఖముగా సుమడోలల తన్మయుండవై
ఉన్నత భర్మసౌధముల నూగెడి రాజులచిన్నవాడ! నీ
కన్నులు విప్పి నల్దెసలు కన్గొనరా! యిక నిద్రచాలురా!

నిదురన్ భంగము చేసినా ననుచుగానీ, కూర్మిదేవేరి ప
య్యెద బాంధవ్యము బాపుచుంటి నని కానీ కిన్కగైకోకు! నీ
హృదయమ్మున్ హృదయేశ్వరీ హృదయమందే కాదు-సుప్తప్రజా
హృదయాబ్జమ్ముల మేలుకొల్పు 'ఉదయశ్రీ'లో ప్రపంచింపరా!

ప్రేయసి ప్రేమలోన కనిపించెడి తీయని స్వర్గ మొక్కచే
ధ్యేయము కాదు, హీను లతిదీనులు మ్లానతనుల్ దరిద్రనా
రాయణు లేడ్చుచుండిరి, తదశ్రువులన్ దుడువంగబొమ్ము నీ
ప్రేయసితోడ, నీ కట లభించును కోట్లకొలంది స్వర్గముల్!!

బుద్ధుడవై సుషుప్తుల ప్రబుద్ధుల జేయుము, శాంతి సత్య ధ
ర్మోద్ధరణార్థమై బ్రతుకు నొగ్గుము, మానవసంఘసేవయే
సిద్ధికి త్రోవ, వత్సలత చిందెడి ప్రేమ సుధాస్రవంతులన్
శుద్ధమొనర్పు ముజ్జ్వలయశోధర ! జర్జరితప్రపంచమున్ !

లెమ్మిక మేలుకొమ్ము ! కదలింపుము క్రాంతిరథమ్ము శాంతి మా
ర్గమ్మున; కాంతి పుంజము లఖండములై నవజీవన ప్రభా
తమ్ములు నింప, సర్వసమతా సుమకోమల మానవాంతరం
గమ్ముల ప్రేమసూత్రమున గట్టుము మంగళతోరణమ్ములన్ !

గుటగుటలాడ ప్రాణములు గొంతుకలో, పసికన్నుగొల్కులన్
బొటబొట రాల బాష్పకణపుంజము, బోరున నేడ్చు నల్లదే
కటికి కసాయి కెంపు చురకత్తి గనుంగొని గొఱ్ఱెపిల్ల; నం
దిట గదియింపవే ! దిగులు దీర్పవె! ముద్దుల బుజ్జగింపవే !

ఈ మహి స్వర్గఖండ మొనరింపుము ! ఘోర హలాహలమ్ము ది
వ్యామృత మాచరింపుము, "జయోస్తు" కుమార! శిరస్సుపై అహిం
సా మకుటద్యుతుల్ దశదిశల్ వెలిగింప ప్రపంచమెల్ల నీ
ప్రేమ రసైక వృష్టి గురిపింపుమురా! కరుణాకళాధరా!

# కరుణామూర్తి

ఈ ప్రగాఢ నిగూఢ మధ్యేనిశీధి
గడియ కదలించుచున్న సవ్వడి యిదేమి?
ఇప్పు డంతఃపురమ్మునం దెవరు వీరు
మూసియున్నట్టి తలుపులు దీసినారు?

తెర తొలగ ద్రోసికొని యేగుదెంచుచున్న
ముగ్ధ మోహన కారుణ్యమూర్తి యెవరు?
అందములు చిందు పున్నమ చందమామ
కళ దరుగ దేమి కాలమేఘాలలోన?

నిండు గుండెలపై వ్రాలి నిదురవోవు
ఏ హృదయదేవి పావన స్నేహమునకు
ద్రోహ మొనరించి ప్రక్కకు త్రోసిపుచ్చి
వచ్చెనో కాక—వదనవైవర్ణ్యమేమి?

ఉదయశ్రీ

నమ్మి జీవనసర్వస్వ మప్పుకొన్న
ప్రణయమయి శాశ్వతప్రేమబంధనములు
త్రెంపుకొని బైటపడు ప్రయత్నింపులేమొ—
తడబడుచు కాళ్లు గడపలు దాటవేమి?

ఒడలు తెలియక ప్రక్కపైబడి, యనంత
మోహనస్వప్నలోకాలలో హసించు
ముద్దుపాపాయి చిఱునవ్వు ముత్తియములు
దొరలుచున్నవి వాలు కందోయి తుదల!

గేహమే వీడలేకనో; గృహిణితోడి
స్నేహమే వీడలేకనో; శిశువుమీది
మోహమే వీడలేకనో; సాహసించి
దేహళిని దాట నింత సందేహపడును?

ప్రణయభాగ్యేశ్వరీ బాహుపాశమట్లు
జారిపోలేక ముందుకు సాగనీక
వెంట జీరాడుచు బిజమ్ము నంటివచ్చు
నుత్తరీయాంచలము చక్కనొత్తదేమి?

కేలుగవ సాచి ఆర్ద్రనేత్రాలతోడ
మెట్టుమెట్టుకు పాదాల జుట్టుకొనెడి
ప్రేయసీ కల్పనా ప్రతిబింబ శత స
హస్రముల గాంచి నిస్తబ్ధు డగుచు నిలుచు।

పడియు ముందుకు, వెనుకకే ప్రాకులాడు
ప్రభువు చరణాలు స్ఫటిక సోపానపంక్తి,
గాలి కెదురుగ సెలయేటి జాలులోన
పయనమగు రాజహంస దంపతుల భంగి.

ఆ మహోన్నత భర్మ హర్మ్యాలు దిగుట
ఏ మహోన్నత సౌధాల కెక్కజనుటొ।
ఈ వన విహారములు త్యజియించి చనుట
ఏ నవ విహారములు సృజియించుకొనుటొ।

లలిత లజ్జావతీ లాస్య లాలనములు
కనెడి కన్నులు సత్యనర్తనము కనెనొ।
శ్రీ చరణ మంజు మంజీర శింజితములు
వినెడి వీను లంతర్వాణి పిలుపు వినెనొ।

ఉదయశ్రీ

మినుకు మినుకున గుడిసెలో కునుకుచున్న
దీప మంపిన దీన సందేశ మేమొ।
స్వర్ణశాలలపై భ్రాంతి సడలి, జీర్ణ
పర్ణశాలల మార్గమ్ము పట్టినాడు।

ఆపుకోలేని హృదయమ్ము నదిమిపట్టి
దూరమగుచుండె ప్రభువు సంసారమునకు;
శ్రీయు-శ్రీమతియును-చిరంజీవి లేని
ఈ "మహానిష్క్రమణ" కర్థ మేమి కలదొ?

కాంతిలోనుండి కటికి చీకటులలోన
కలిసిపోవుచునున్నాడు కరుణమూర్తి;
కటికి చీకట్లలోనుండి కాంతిలోన
పతితపావనుడై బయల్పడగనేమొ॥

# కరుణాకుమారి

ఆమె భువనైకమోహిని, అమృతమయి, అ
నంత విశ్వ విహారిణి, శాంతమూర్తి,
ఆమె లోకైకపావని, ఆమెవంటి
అందములరాణి లేదు బ్రహ్మాండమందు.

ఆమె మానస కమలాకరాంతరమున
జలజమై తేలు నీ చరాచరజగత్తు;
ఆమె నిట్టూర్పులో పరమాణులట్లు
కరగి నీరౌను మేరు మందరము లెన్నొ!

ఆమె కడకంటి చూపులో అనవరతము
కాపురము సేయు దివిజ గంగాభవాని;
ఆమె చిఱునవ్వు తళుకులో అహరహమ్ము
నవ్వుకొన్నవి వంద నందనవనాలు ॥

ఉ ద య శ్రీ

బాలభానుడు పసిడి హస్తాలతోడ
పసుపు పారాణి నిడు నామె పాదములకు;
ఆ దయామయి విశ్వవిహారమందు
ప్రతి పదమ్మును "కోటిస్వర్గాలపెట్టు".

ఆర్ద్రిత—అహింస—అనసూయ ఆమె యింటి
ఆడుబిడ్డలు; నిత్యకల్యాణి ఆమె;
ఆ మహారాజ్ఞి మృదుల పాదాంతికమున
అవనతశిరస్కు డగును బ్రహ్మాంతవాడు.

ఆమె గాఢపరిష్వంగమే మదీయ
జీవితమునకు మోక్ష లక్ష్మీ ప్రసాద;
మామె యనుభూతియే శుష్కమైన నాదు
బ్రతుకు నోదార్చు మలయమారుతపువీచి.

కర్కశ కఠోర కాలచక్రాన నలిగి
చితికిపోయిన నా ముగ్ధజీవితమ్ము
నింపుకొందును అంచులనిండ, ఆమె
అడుగుదమ్ముల కమ్మపుప్పొడులతోడ.

ఉదయశ్రీ

అస్మదీయ జీవిత పరమార్థమెల్ల
ఆమె పాదాలమీదనే అంకితమ్ము;
ఆమె హృదయము హృదయాన నందుకొనక
సార్థకత లేదు నా నరజన్మమునకు.

భరతమాత ఆనందబాష్పాలలోన
నిండుజాబిల్లి పండువెన్నెలలలోన
విశ్వ మానవ కల్యాణ వేదిపైన
జరిగినది మాకు గాంధర్వపరిణయమ్ము.

అస్మదారాధ్యదేవియౌ ఆమెకొఱకె
ఆమెకొఱకె మదీయ మహాతపస్య;
బుద్ధభగవాను గారాబు పుత్రి - ఆమె
నవ్యసుకుమారి "శ్రీ కరుణాకుమారి"

# క రు ణా మ యి

నీ దరహాస చంద్రికలు నిండిన నా హృదయాంగణమ్ములో
లేదుగదా తమస్సు లవలేశము, ప్రేమసుధానిధాన ! నే
డీ దయనీయ దాసి భరియింపగలే దిక నీదు ప్రేమలో
పేదఱికమ్ము—మేను మఱపింపుము మోహన వేణుగీతికన్.

నీ యసితద్యుతుల్ కనుల నింపితి కాటుక చేసి—అల్లదే
తీయని పాటతో తలుపుతీసెను గుండెకు గున్నమావిపై
కోయిలకన్నె-నా వలపుకొండలలో కదకళ్ళనుండి వే
ఱే యమునాస్రవంతి ప్రవహించెనురా ! అనురాగవార్నిధీ !

"శ్రీయుతమూర్తియై కరుణ చిందెడి చూపులతోడ స్వామి వేం
చేయును; పాదపూజ దయసేయును మా" కను సంబరాన, ఆ
ప్యాయముగా త్వదీయ పథ మారయుచున్నవి నేడు, పూచియుం
బూయని పచ్చ పట్టుపరుపుల్ గొని శ్యామలశాద్వలీస్థలుల్.

నిద్దపు ముద్దుమోవి పయనించు భవన్మురళీరవమ్ములో
నిద్దురవోయినట్లు శయనించె సమస్తము; సద్దులేని ఈ
యద్ద మరేయి ఒంటిగ - రహస్యముగా - తపియించు గుండెపై
నద్దుకొనంగ వచ్చితి దయామయ! నీ చరణారుణాబ్జముల్!

ఏది మఱొక్కమాట హృదయేశ్వర! గుండెలు పుల్కరింపగా
ఊదగదోయి! ఊదగదవోయి! సుధామయ యుష్మదీయ వే
ణూదయ రాగడోలికల నూగుచు, విస్మృతిలో విలీనమై
పోదును నాదు క్రొవ్వలపు పువ్వుల ముగ్ధ పరీమళమ్ముతో!

నీ చిఱునవ్వుపాటలు ధ్వనించెడి మామక మానసమ్ములో
లేచెనురా! ప్రఫుల్ల మురళీ రవళీ రమణీయ భావనా
వీచి - ధృగంచలమ్ముల ద్రవించి స్రవించు మనోనురాగముల్
దాచుకొనంగలేని పసిదాననురా! విసిగింపబోకురా!

"ఇది యది" యంచు తేల్చి వచియింపగరాని విషాదమేదియో
హృది గవలించుచున్నది; దహింపగసాగె నిరాశ, శుష్కమౌ
బ్రదుకును; స్నిగ్ధ శీతల కృపారస ధారల, దుర్దినమ్మునే
సుదినముచేయరా! యదుకిశోర! కృశాంగి ననుగ్రహింపరా!

నీరసమైన నీ ప్రణయినీ హృదయ మ్మిది చల్ల చల్లగా
నీ రపగీతిలో కరగి నీరయిపోవుచునుండె, మోహనా
కార ! రవంత వచ్చి కనికారము చూపవయేని, కాల్వయై
యేరయి పొంగి పొర్లి ప్రవహింపదొ గోకుల మాకులమ్ముగన్ !

ఈ! కరుణామయీ హృదయమే ఒక ప్రేమ మహాసముద్రమై
లోకము నిండెరా! కడుపులో బడబాగ్నిని దాచి; కాంక్ష మ
డ్డాకయి తేలె; చక్కనిదొరా ! శయనింతువుగాని పొంగి వ
చ్చే కెరటాలమీద; దయసేయుము గోపకిశోరమూర్తివై.

రాధనురా ప్రభూ ! విరపరాధనురా ! అనురాగభావనా
రాధన మగ్నమానసనురా ! కనరా ! కరుణింపరా ! మనో
వీధి పదేపదే కలకవేయుచునున్నవిరా ! పురా రహో
గాథలు—ఈదలే నిక అగాధ తమోమయ కాలవాహినిన్ !!

# పారవశ్యము

అది శరద్రాత్రి, గగన సౌధాంగణమున
దేవతాస్త్రీలు దీపాలు తీర్చినారు :
సరస రాకాసుధాకర కరములందు
కలకల మటంచు నవ్వె శృంగారసరసి.

పూచె వనలక్ష్మి, పిండారబోసినట్లు
పండువెన్నెల జగమెల్ల నిండిపోయె!
యమున శీతల సురభి తోయమున దోగి
చల్లగా—మెల్లగా—వీచె పిల్లగాలి.

ఆ మహోజ్జ్వల రజని, మోహన విహార
నవనవానంద బృందావనమ్మునందు,
అమల యమునానదీ శాద్వలములమీద
లలిత బాల రసాల పల్లవ పరీత
మధుర మంజుల మాలతీ మంటపమున.

ఉదయశ్రీ

పాల ఱా తిన్నెపయి కల్పపూలతోడ
మాల గట్టుచు కూర్చున్న బాల యెవరు ?

ప్రణయ మకరంద మాధురీ భరిత ముగ్ధ
లోచనమ్ములలోని యాలోచనమ్ము
లేమొ - ప్రేమ సుధాంస శ్రీముఖ పగు
ఆ ముఖములోని యాకాంక్షలేమొ - త్రిజగ
తీ సముజ్జ్వల సౌందర్యతిలక మామె
ముద్దు చేతులలో ప్రేమ పుష్పమాల
అంద మెగవోయు ఏ కళానందమూర్తి
కంఠము నలంకరింప నుత్కంఠపడునో ?

" చిచ్చువలె చందురుడు పైకి వచ్చినాడు
పెచ్చరిలినాడు గాడుపుపిల్లవాడు:
రాడు మోహనమురళీస్వరాలవాడు ;
తప్ప కేతెంతు నని మాట తప్పినాడు !"

అంత కంతకు నిట్టూర్పు లతిశయించె
కొమరు చెమటలు చిగురు చెక్కుల జనించె
వదన మరచేతిలో నట్టె వ్రాలిపోయె
పడె కపోలమ్ముపై నొక్క బాష్పకణము.

అంతలోపల సుశ్యామలాంగు డొకడు
అల్లనల్లన పుడమిపై నడుగులిడుచు
వెనుకగా వచ్చి తన ముద్దువ్రేళ్ళతోడ
గట్టిగా మూసె నామె వాల్గన్నుదోయి

కమ్మకస్తూరితావులు గమ్ముమనియె
లలిత తులసీ పరిమళమ్ములు చెలంగె
తరుణి తన్మృదులాంగుళుల్ తడివి చూచి
"కృష్ణుడో, కృష్ణుడో" యంచు కేకవేసె.

"సరస శారద చంద్రికా స్థగిత రజిత
యామున తరంగ నౌకా విహారములకు
నన్ను రమ్మని చెప్పి బృందావనమున;
కింటిలో హాయిగా కూరుచుంటివేమి ?

ఎంత తడవయ్యె నే వచ్చి – ఎంతనుండి
వేచియుంటిని – పొదరిండ్లు పూచి – వలపు
పీచికలు లేచి – హృదయాలు దోచికొనెడి
యీ శరజ్జ్యోత్స్నలో – పులకరించి పొంగి
మ్రోతలెత్తెడి యమునానదీ తటాన.

ప్రేయసి నుపేక్షసేతువే ప్రియవయస్య !
ఇంత నిర్దయ పూనెదవే దయాళు !
ఇంతగా చిన్నబుచ్చెదవే మహాత్మ !
ఇట్లు గికురింతువే నన్ను హృదయనాథ !"

కలికి యిటు వచ్చిరాని పేరలుకతోడ
సజలనయనాల జీవితేశ్వరుని గాంచె.

సరస సంగీత శృంగార చక్రవర్తి
సకల భువనైక మోహన చారుమూర్తి
రాధికా మానస విహార రాజహంస
మందహాసమ్ము కెమ్మోవి చింద పలికె.

"ఆలసించుట కాగ్రహ మందితేని
వెలది ! విరిదండ సంకెలల్ వేయరాదా !
ముగుద ! పూబంతితో నన్ను మోదరాదా !
కలికి ! మొలనూలుతో నన్ను కట్టరాదా !

రాధికాక్రోధ మధురాధర మ్మొకింత
నవ్వెనో లేదొ! పకపక నవ్వె ప్రకృతి;
నవ్వుకొన్నది బృందావనమ్ము; యమున
నవ్వుకొన్నది; చంద్రుడు నవ్వినాడు;
విరగబడి తమ పొట్టలు విచ్చిపోవ
నవ్వినవి రాధ తలలోని పువ్వులెల్ల !!

వాలుగన్నుల బాష్పాలు జాలువార
నంత రాధిక వివశయై అంఘ్రియుగళి
వ్రాలిపోయిన ప్రియుని కెంగేల నెత్తి
చిక్కుపడిన ముంగురులను చక్కనొత్తి
చెఱగిపోయిన తిలకమ్ము సరియొనర్చి.

అవునులేవోయి! కపటమాయాప్రవీణ!
ధీరుడవు మంచి శిక్షనే కోరినావు?
నిత్య సుకుమారమైన సున్నితపు మేను
నాదు చేబంతి తాకున నలిగిపోదె?
సొక్కి సోలిన నీ మోము చూడగలనె?
చేతు లెట్లాడు నిన్ను శిక్షింప నాథ!

ఉదయశ్రీ

ఎంత నిర్దయురాలనో పంతగించి
కృష్ణ ! నీచేత నిట్లు మ్రొక్కించుకొంటి
నవ్య వనమాల కంఠాన నలిగిపోయె
చెక్కుటద్దాల తళుకొత్తె చిగురుచెమట
కొదమ కస్తూరి నుదుటిపై చెదరిపోయె
బర్హి బర్హంబు చీకాకుపడియె మౌళి

పొందనేర్తునె నిన్ను నా పూర్వజన్మ
కృత సుకృత వైభవమున దక్కితివి నాకు;
విశ్వసుందర చరణారవింద యుగళి
ముద్దుగొని చెక్కుటద్దాల నద్దుకొను అ
దృష్ట మబ్బిన దొక్క రాధికనె నేడు.
తావకీన సౌందర్య సందర్శనాను
భూతిలో పొంగి ప్రవహించిపోదునోయి !

ఎంత కారుణ్య మున్నదో యెంచగలనె
కమలలోచన ! నీ కటాక్షములలోన -
ఎంత లావణ్య మున్నదో యెంచగలనె !
ప్రేమమయ మూర్తి ! నీ ముద్దుమోములోన -

ఎంత మాధుర్య మున్నదో యెంచగలనె!
సులలిత కపోల! నీ మృదుసూక్తిలోన-
ఎంత యమృతమ్ము కలదొ భావింపగలనె!
స్వామి! తావక మందహాసమ్ములోన-

ఎంత మైకమ్ము కలదొ యూహింపగలనె!
రాధికానాథ! నీ మధురాధరమున;"

అనుచు రాధిక పారవశ్యమున మునిగి
వ్రాలె మాధవు స్నేహార్ద్రవక్షమందు.

"రాధపై ప్రేమ మధికమో మాధవునకు
మాధవునిపైన రాధ ప్రేమయె ఘనమ్మొ"
ఈ రహస్యము నెఱుగలే రెవరుగాడ
ప్రణయమయ నిత్యనూత్న దంపతులు వారు!

# విశ్వప్రేమ

ఏ ప్రేమమహిమచే నీ ధారుణీచక్ర
మిరుసు లేకుండనే తిరుగుచుండు
ఏ ప్రేమమహిమచే నెల్ల నక్షత్రాలు
నేల రాలక మింట నిలిచియుండు
ఏ ప్రేమమహిమచే పృథివిపై బడకుండ
కడలిరాయడు కాళ్ళు ముడుచుకొనును
ఏ ప్రేమమహిమచే నీరేడు భువనాల
గాలిదేవుడు సురటీలు విసరు

ఆ మహాప్రేమ - శాశ్వతమైన ప్రేమ -
అద్భుత మఖండ మవ్యక్తమైన ప్రేమ -
నిండియున్నది బ్రహ్మాండభాండ మెల్ల
ప్రేయసీ! సృష్టియంతయు ప్రేమమయము!!

# అద్వైత మూర్తి

చూచెదవేల నో ప్రణయసుందరి! కాటుక కళ్ళలోని ఆ
లోచన లేమిటో హరిణలోచని! నీ చిఱునవ్వులోని సం
కోచము లెందుకో కుసుమకోమలి! నీ మధురాధరమ్ములో
దాచుకొనంగ నేటికి సుధామయసూక్తి కళావిలాసినీ!

భావోద్యానమునందు క్రొత్తవలపుం బందిళ్ళలో కోరికల్
తీవల్ సాగెను పూలుపూచెను; రసార్ద్రీభూతచేతమ్ముతో
"నీవే నేనుగ" "నేనె నీవుగ" లతాంగీ! యేకమైపోద మీ
ప్రావృణ్ణీరదపంక్తిక్రింద పులకింపన్ పూర్వపుణ్యావళుల్!

మన దాంపత్యం సత్యమౌ ప్రణయసామ్రాజ్యమ్ములో లోతులన్
గనియెన్; సాగెను భాగ్యనౌక కవితా కాళిందిలో; నవ్య జీ
వన బృందావన దివ్యసీమ విహరింపన్ రమ్ము! నే కొల్లగొం
దును నీ కోమలబాహుబంధనములందున్ కోటి స్వర్గమ్ములన్.

# సాంధ్యశ్రీ

అంజనరేఖ వాల్గనుల యంచులు దాట, మనోజ్ఞ మల్లికా
కుంజములో సుధామధుర కోమలగీతిక లాలపించు ఓ
కంజదళాక్షి! నీ ప్రణయగానములో పులకింతునా—మనో
రంజని! పుష్పవృష్టి పయిరాల్చి నినున్ పులకింపజేతునా!

క్రొంజిగురాకు ప్రేశల కురుల్ తడియార్చుచు కూరుచున్న అ
భ్యంజన మంగళాంగి? జడ లల్లుదునా – మకరంద మాధురీ
మంజుల మామక ప్రణయ మానసభావనలే ప్రఫుల్ల పు
ష్పాంజలిచేసి నీ యడుగులందు సమర్పణచేసికొందునా!

సంజవెలుంగులో పసిడిచాయల ఖద్దరు చీరగట్టి నా
రింజకు నీళ్ళవోయు శశిరేఖవె నీవు; సుభద్రసూతినై
రంజితపాణిపల్లవము రాయుదునా – నిను మౌళి దాల్చి మృ
త్యుంజయమూర్తినై జమునితో తొడగొట్టి సవాలుచేతునా!

# వైశాఖి

కుండలమీద పిచ్చుకలు గుంపులుగూడె; నఖండ చండ మా
ర్తాండుడు చేటలన్ జెరిగె నగ్నికణమ్ములు; వెండినీ రదే
కొండలు నెత్తిపై పులుముకొన్నవి; రమ్ము శయింత మీ లతా
మండపమందు, ప్రేమమయ మానసముల్ మధురించిపోవగన్.

బుడుత డుయేలలో నిదురవోవుచునుండెను; పొట్ల పాదుపై
ఉడుత పదేపదే అఱచుచున్నది; పిట్టలు చెట్టుకొమ్మలన్
వడబడి కూరుచుండె; తలవంచెను చిట్టిగులాబి; గాడుపుల్
సుడిగొనుచుండె నో కుసుమసుందరి! మోమటు త్రిప్పబోకుమా!

ఉండుము-లేవబోకుము కృశోదరి! నీ నుదుటన్ శ్రమాంబువుల్
నిండెను: పైపయిం దుడువనీ - సుషమా సుకుమారమైన నీ
గండయుగమ్ము వాడె వడగాలికి; ఊయలలోన వచ్చి కూ
ర్చుండుము-స్వేచ్ఛమై కలసి యూగుద మాశలు మిన్నుముట్టగన్.

# ప్రాభాతి

రేగిన ముంగురుల్ నుదుట ప్రేమ సుధామధురైక భావముల్
ప్రోగులు వోయగా నిదురపోవు దయామయి! నా యెడందలో
ఆగక పొంగు స్వాప్నిక రహస్యము లెవ్వియొ నీదు గుండెలో
దాగుడుమూతలాడ సరదా పడుచున్నవి కన్నులెత్తుమా!

ఛః గిజిగానిగూడువలెనే మలయానిల రాగడోలలో
సూగుచునుండె నా తలపు లూరక; నీ కబరీభరమ్ములో
మాగిన కేతకీ సుమ సముంచిత సౌరభవీచి పైపయిఙ్
మూగి స్పృశించి నా హృదయమున్ కదలించుచునుండె ప్రేయసీ!

రాగము నందుకొన్నది తరంగిణి; బాలమరీచిమాలికిన్
స్వాగతమిచ్చె పద్మిని; హసన్ముఖమై మన దొడ్డిలోని పు
న్నాగము కుప్పవోసె సుమనస్సులు, కోవెలలో విపంచికల్
మ్రోగెను; లెమ్ము పోదము! ప్రమోదముతో మన మాతృపూజకున్

# రాట్నసుందరి

రాటము మేళవించి, అనురాగము రాగము మాతృభూమిపై
పాటయి మ్రోగ నూల్ వడకు పావన భారత భాగ్యలక్ష్మి! నీ
పాటల పాణిపద్మములు భవ్యములయ్యెను-వేలు లక్షలున్
గోటులు నూరుకోట్లు గయి కొమ్మివె ముద్దులదావ దీవనల్.

పసుపుంబూతల లేతపాదములకున్ దారాణి గీలించి! నె
న్నొసటం గుంకుమ దిద్ది, కజ్జలము కన్నుందోయి గై సేసి, క్రొం
గుసుమంబుల్ తలదాల్చి, రాట్నముకడన్ గూర్చున్న నీ మూర్తిలో
ప్రసరించెన్ జయభారతీ మధురశోభా భాగ్య సౌభాగ్యముల్!

పండెను దేవి! నా వలపు పంటలు; పింజలు పింజలైన యీ
గుండెయె యేకుగా వడకుకొంటివి; నా బ్రతుకెల్ల దారమై
కండెలుగట్టె నీదు చరఖాపయి; నే నొక చే రుమాలనై
యుండెద మెత్తగా పెదవు లొత్తుచు నీ వరహాలచేతిలో.

# మధుర స్మృతి

ఆ మనోహర మధుర సాయంతనమున
ఉపవన నికుంజ వేదిపై నుంటి నేను;
చేత సుమరజ మూని వచ్చితివి నీవు
తిలకమును నా ముఖమ్ముపై దిద్ది తీర్ప.

ఒరిగి ఒయ్యారమొలుక కూర్చుండినావు
అందములరాణివై అస్మదభిముఖముగ;
చేరె మునుముందు నీ కుడిచేయి నాదు
అలికఫలకమ్ము తిలక విన్యాసమునకు.

పులకలెత్తించె తనువెల్ల చెలి! మదీయ
చిబుక మంటి పైకెత్తు నీ చేతివేళ్లు;
రాగరస రంజిత పరాగ రచ్యమాన
[illegible] కళిక పరిమళమ్ములను జిమ్మె.

"ఏనది సమర్చ, సొగ సింక అద్దమందు
చూచుకొను" దంటి వీవు నాజూకుగాను;
"అటులనా" యంచు నటునిటు నరసి, నీదు
చెక్కుటద్దమ్ము కడమోము చేర్చినాను.

"ఎంత ముద్దుగ దిద్దితి వేది యేది !"
యనుచు నొకరెండు ముద్దుల నునిచినాను;
పకపక మటంచు నవ్వి నీ పాణితలము
అడ్డ మొనరించితివి తళుకుటద్దమునకు.

నాటి ప్రేమార్ద్ర తిలక మీనాడు విజయ
దీక్ష నిప్పించు రక్తార్ద్ర తిలకమయ్యె;
ప్రియతమా ! రమ్ము చేయెత్తి పిలుచుచుండె
అమ్మ మనలను కరుణ కంటమ్ము తోడ.

# తపోభంగము

మానస సరోవరాంతర మధుకణాలు
మోసికొనివచ్చి సేవలు చేసిపోవు
మంచుపలమీది యాదిమ మౌనిమణికి
మందమంద మందాకినీ మారుతములు.

స్వామి యర్ధ నిమీలితేక్షణములందు
ఏమి యాకాంక్షితమొ చెప్పలేము గాని
సర్వమంగళ పర్వతసార్వభౌము
పట్టి ముప్రొద్దు భక్తిమై పరిచరించు.

అమ్మునిరాజు గెల్చి విజయధ్వజ మెత్తెడి పూన్కి చెంగటన్
ద్రిమ్మరుచుండె మారుడు సతీయుతుడై సమయప్రతీక్షమై;
తుమ్మెదనారితో - చిపురుతూణముతో - విరజాజిపూల వి
ల్లమ్ములతో - శుకీపిక బలమ్ములతో - అతిలోకరూపుడై.

ఉచిత పూజోపహారము లూని గౌరి
మూడుకన్నుల మునిమౌళిముందు నిలిచె;
వినయము భయమ్ము సిగ్గు ముప్పిరిగొనంగ
పలికె కలకంఠి చిగురుచేతులు మొగిడ్చి.

"వాచవులూరు పండ్లు గొనివచ్చితి స్వాములకోస: మిచ్చుటన్
దాచుదునా ప్రభూ! మిసిమి తామరపాకులలోన; చక్కనౌ
మా చదలేటి ప్రక్క మధుమాస మనోజ్ఞ మహోదయమ్ములో
పూచెను క్రొత్తగా పొగడపూ లివి: మాలలుకూర్చి యిత్తునా!

వచ్చుచునున్న సూర్యభగవానుని చక్కిలిగింత కప్పుడే
విచ్చుచువిచ్చుచున్న అరవిందములందున పొంగి వెల్లువౌ
వెచ్చని తియ్యతేనియలు భృంగకుమారిక లంటకుండగా
తెచ్చితి దొన్నెలందు నివి దేవరవారికి ఆరగింపుకై!"

అందము చిందపోవ చెవియందలి చెందొవ జారుచుండ "పూ
లందుకొనుం" డటంచు సుమనోంజలి ముందుకు చాచి శైలరా
జ్ఞందన వంగె - చెంగున ననంగుని చాపము వంగె - వంగె బా
లేందుధరుండు కానుకలు గ్రహింపగ ఉన్నమితోర్ధ్వకాయుడై.

ఇచట శాంతమ్ము నిండార శమె చేతి
పైడి క్రొందమ్ము లందుకొన్నాడు హరుడు!
అచట పంతమ్ము నిండార అమె చేతి
వాడి కెందమ్ము లందుకొన్నాడు మరుడు.

తియ్యవిల్కాడు వింట సంధించి విడిచె
అక్షయమ్మైన సమ్మోహనాశుగమ్ము:
గౌరి కడకంటి చూపుతో కలిసిపోయి
గ్రుచ్చుకొనె నది ముక్కంటి గుండెలోన.

స్వర్ణదీ స్వర్ణ కంజ కింజల్కములకు
పసిమి దిద్దెడి గిరికన్య పాణితలము;
పట్టుకొని వీడగాలేడు భవుడు; మేను
పులకరింప క్రొవ్వలపులు తొలకరింప.

ముద్దు లొలికెడి పగడాలమోవిమీద
తళుకు చిఱునవ్వు ముత్యాలు తద్గుణింప
"స్వామి! యేమిది?" యనుచు లజ్జా వినమ్ర
ముఖి యయి యొకింత వారించె ముగుద ముని

అంత మహేశ్వరుండు హృదయమ్మును మెల్లగ నిగ్రహించి య
త్యంత తపోవిభంగమున కాగ్రహముం గొని, విఘ్నకారణ
మ్మింతకు నెద్దియంచు గనియెన్ నలుదిక్కులు - కానిపించె నా
పొంతనె పుష్పవాటికను పూవిలుకాడు సతీసమేతుడై.

ఆక్షణమ ఫాలి రూక్ష ఫాలేక్షణమున
ఉదయమందెను ప్రళయ మహోగ్రశిఖలు:
"పాహి పాహి ప్రభో! ప్రభో! పాహి" యనెడి
సురల యార్తధ్వనుల్ మింట సుళ్ళు తిరిగె

అగ్గిరవు ఫాలనేత్రంపు టగ్గిలోన
భగ్గుమన్నాడు క్షణములో ప్రసవశరుడు;
మంచుగుబ్బలి గుహలలో మారుమోగె
తేటి జవరాలి జాలి కన్నీటిపాట.

ఆ కరుణగానమే - ఆ యనంత విరహ
విశ్వసంగీతమే - పంచమస్వరాన
గాన మొనరించినది మన "కాళిదాస"
కోకిలమ్మ "వియోగినీ" కూజితముల.

# పుష్పవిలాపము

చేతులారంగ నిన్ను పూజించుకొఱకు
కోడి కూయంగనే మేలుకొంటి నేను;
గంగలో మున్గి ధౌతవల్కలము గట్టి
పూలుగొనితేర నరిగితి పుష్పవనికి.

నే నొక పూలమొక్కకడ నిల్చి చివాలున కొమ్మవంచి గో
రానెడు సంతలోన విరులన్నియు జాలిగ నోళ్ళువిప్పి "మా
ప్రాణము తీతువా" యనుచు బావురుమన్నవి - క్రుంగిపోతి - నా
మానసమం దెదో తళుకుమన్నది పుష్పవిలాప కావ్యమై.

"తల్లి యొడిలోన తలిరాకు తల్పమందు
ఆడుకొను మమ్ములను బుట్టలందు చిదిమి
అమ్ముకొందువె! మోక్షవిత్తమ్ముకొఱకు!
హృదయమే లేని నీపూజలెందుకోయి?

జడమతుల మేము; జ్ఞానవంతుడవు నీవు:
బుద్ధి యున్నది: భావసమృద్ధి గలదు:
బండబారెనటోయి నీ గుండెకాయ;
శివునకై పూయదే నాల్గు చిన్నిపూలు ?

ఆయువు గల్గు నాల్గు గడియల్ కనిపెంచిన తీవతల్లి జా
తీయత దిద్ది తీర్తుము - తదీయ కరమ్ములలోన స్వేచ్ఛమై
నూయల లూగుచున్ మురియుచుందుము - ఆయువు దీరినంతనే
హాయిగ కన్ను మూసెదము - ఆయమ చల్లని కాలివ్రేళ్ళపై.

గాలిని గౌరవింతుము సుగంధము పూసి; సమాశ్రయించు భృం
గాలకు విందు సేసెదము కమ్మని తేనెలు; మిమ్ముబోంట్ల నే
త్రాలకు హాయి గూర్తుము; స్వతంత్రుల మమ్ముల స్వార్థబుద్ధితో
తాణము త్రుంపబోవకుము ! తల్లికి బిడ్డకు వేఱుసేతువే !

ఆత్మ సుఖమ్ము కోసమయి ! అన్యుల గొంతులు కోసితెచ్చు పు
ణ్యాత్ముడ ! నీకు మోక్ష మెటు లబ్బును ! నెత్తురుచేతిపూజ వి
శ్వాత్ముడు స్వీకరించునె ? చరాచరవర్తి ప్రభుండు మా పవి
త్రాత్మల నందుకోడె: నడుమంత్రపు నీ తగులాట మేటికిన్ ?

ఉదయశ్రీ

ఊలుదారాలతో గొంతు కురి బిగించి
గుండెలోనుండి సూదులు గ్రుచ్చి కూర్చి
ముడుచుకొఁదురు ముచ్చటముడుల మమ్ము
అకట ! దయలేనివాడు మీ యాడువారు.

గుండెతడి లేక నూనెలో వండి పిండి
అత్తరులు చేసి మా పేద నెత్తురులను
కంపుదేహాలపై గుమాయింపుకొఱకు
పులుము కొందురు హంత ! మీ కొలమువారు.

అక్కట హాయిమేయు మహిషాసురు లెంచరా నాల్గుప్రక్కలన్
ప్రక్కలమీద చల్లుకొని, మా పసిమేనులు పాదుకాళ్ళతో
ద్రొక్కుచు దొర్లి - దొర్లి - మఱిరో జుదయానవె వాడి వత్తలై
చెక్కలు జారిపోన్ పరిహరింతురు మమ్ముల పెంటదిబ్బపై !

మా వెలలేని ముగ్ధ సుకుమార సుగంధ మరంద మాధురీ
జీవిత మెల్ల మీకయి త్యజించి కృశించి నశించిపోమె; మా
యౌవన మెల్ల కొల్లగొని ఆపయి చీపురుతోడ చిమ్మి మ
మ్మావల పారబోతురుగదా ! నరజాతికి నీతి యున్నదా !

బుద్ధదేవుని భూమిలో పుట్టినావు
సహజమగు ప్రేమ నీలోన చచ్చెనేమి ?
అందమును హత్యచేసెడి హంతకుండ !
మైలపడిపోయెనోయి ! నీ మనుజజన్మ.

పూజలేకున్న బాబు నీ పుణ్యమాయె !
కోయబోకుము మా పేద కుత్తుకలను;
అకట ! చేసేత మమ్ముల హత్యచేసి
బావుకొనబోవు ఆ మహాభాగ్య మేమి ?"

ఇట్లు పుష్పాలు నన్ను చీవాట్లుపెట్టి
నట్లుగాఁ - పూలు కోయ చేయాడలేదు;
ఏమి తోచక దేవర కెఱుక సేయ
వట్టి చేతులతో ఇటు వచ్చినాను.

# కుంతీ కుమారి

అది రమణీయ పుష్పవన - మావనమం దొక మేడ - మేడపై
నది యొక మూలుమూలగది - ఆ గదితల్పులు తీసి మెల్లగా
పదునయిదేండ్ల యీడుగల బాలిక - పోలిక రాచపిల్ల - జం
కొదవెడి కాళ్ళతోడ దిగుచున్నది క్రిందికి మెట్లమీదుగన్ ।

కన్నియలాగె వాలకము కన్పడుచున్నది - కాదు కాదు - ఆ
చిన్ని గులాబి లేత అరచేతులలో - పసిబిడ్డ డున్నయ
ట్లున్నది - ఏమి కావలయునోగద ఆమెకు - అచ్చుగ్రుద్దిన
ట్లున్నవి - రూపురేక - లెవరో యనరా దత డామెబిడ్డయే ।

దొరలు నానంద బాష్పాలొ - పొరలు దుఃఖ
బాష్పములొ గాని యవి గుర్తుపట్టలేము:
రాలుచున్నవి ఆమె నేత్రాలనుండి
బాలకుని ముద్దు చెక్కుటద్దాలమీద ।

పొత్తులలోని బిడ్డనికి పుట్టియుపుట్టకముందె యెవ్వరో
క్రొత్తవి వజ్రపుం గవచకుండలముల్ గయిసేసినారు। మేల్
పుత్తడి తమ్మిమొగ్గ జిగిబుగ్గల ముద్దులు మూటగట్టు నీ
నెత్తురుకందు నెత్తుకొని నెచ్చెలి యెచ్చటి కేగుచున్నదో।

గాలితాకున జలతారు మేలిముసుగు
జారె నొక్కింత - అదిగో। చిన్నారిమోము।
పోల్చుకొన్నాములే। కుంతిభోజ పుత్రి
స్నిగ్ధ సుకుమారి ఆమె కుంతీకుమారి।।

కడువేగమ్మున చెంగుచెంగున తరంగాల్ పొంగ, ఆ తోట వెం
బడి గంగానది పాఱుచున్నయది బ్రహ్మాండమ్ముగా - అల్లదే
బుడుతన్ చేతులలోన బట్టుకొని యా పూబోడియుంగూడ ని
వ్వెడకే వచ్చుచునుండె గద్గదికతో నేమేమొ వాపోవుచున్.

"ముని మంత్రమ్ము నొసంగనేల? ఇడెబో మున్ముందు మార్తాండు ర
మ్మని నే కోరగనేల। కోరితినిబో ఆతండు రానేల? వ
చ్చెనుబో కన్నియనంచు నెంచక ననున్ జేపట్టగానేల? ప
ట్టెనుబో పట్టి నొసంగనేల? అడుగంబెన్ కుంతి సౌభాగ్యముల్

ఏయెడ దాచుకొందు నిపు డీ కసిగందును! కన్నతండ్రి "చీ
చీ" యనకుండునే? పరిహసింపరె బంధువు? లాత్మగౌరవ
శ్రీ యిక దక్కునే? జనులు చేతులు చూపరె? దైవయోగమున్
ద్రోయగరాదు - ఈ శిశువుతో నొడిగట్టితి లోకనిందకున్.

"ఈ విషాదాశ్రువులతోడ నింక నెంత
కాల మీ మేను మోతు? గంగాభవాని
కలుషహారిణి - ఈ తల్లి కడుపులోన
కలిసిపోయెద నా కన్నకడుపుతోడ."

అనుచు పసివాని రొమ్ములో నదుముకొనుచు
కుంతి దిగినది నదిలోన - అంతలోన
పెట్టె కాబోలు పవన కంపిత తరంగ
మాలికా దోలికల తేలితేలి వచ్చు!

మందసము రాక గనెనేమొ - ముందు కిడిన
యడుగు వెనుకకుబెట్టి దుఃఖాశ్రుపూర్ణ
నయనములలోన ఆశాకణాలు మెఱయ
ఆ దెసకె చూచు నామె కన్నార్పకుండ.

దూరదూరాల ప్రాణబంధువు విధాన
అంతకంతకు తనకు దాపగుచునున్న
పెట్టె పొదవును తన ముద్దుపట్టి పొదవు
చూచి తలయూచు మదినేమి తోచినదియొ ?

ఆత్మహత్యయు శిశుహత్య యనక గంగ
పాలు గానున్న యీ దీనురాలిమీద
భువనబంధునకే జాలి పుట్టెనేమొ
పెట్టె నంపించి తెరువు చూపెట్టినాడు."

"ఇట్టులున్నది కాబోలు నీశ్వరేచ్ఛ"
యనుచు విభ్రాంతిమై దిక్కు లరసికొనుచు
సగము తడిసిన కోకతో మగువ, పెట్టె
దరికి జని మెల్ల మెల్లగా దరికి తెచ్చి -

ఒత్తుగా పూలగుత్తుల నెత్తు పెట్టి -
పైచెఱగు చింపి మెత్తగా ప్రక్కపఱచి -
క్రొత్తనెత్తలిరాకుల గూర్చి పేర్చి -
ఒత్తుకొనకుండ చేతితో నొత్తిచూచి -

ఉదయశ్రీ

ఎట్టకేలకు దడదడ కొట్టుకొనెడి
గుండె బిగబట్టుకొని కళ్ళనిండ జూచి -
బాష్పముల సాము తడిసిన ప్రక్కమీద
చిట్టిబాబును బజ్జుండబెట్టె తల్లి.

చిన్ని పెదవుల ముత్యాలు చిందిపడగ
కలకలమటంచు నవ్వునేగాని, కన్న
యమ్మ కష్టము - తన యదృష్టమ్ముగూడ
తెలుగ దింతయు నా యమాయికపు బిడ్డ.

చెదరు హృదయము రాయిచేసికొని పెట్టె
నలలలో త్రోయబోవును - వలపు నిలువ
లేక - చెయిరాక - సుతు కౌగిలించి వెక్కి
వెక్కి యేడ్చుచు - కన్నీరు గ్రుక్కుకొనును.

"భోగభాగ్యాలతో తులతూగుచున్న
కుంతిభోజుని గారాబు కూతురనయి
కన్న నలుసుకు ఒక పట్టెడన్నమైన
పెట్టుకో నోచనైతి పాపిష్ఠిదాన.

నన్నతి పేర్మిమై గనెడి నా తలిదండ్రుల ప్రేమ యర్థమౌ
చున్నది; నేడు బిడ్డ నిట నొంటరిగా విడిపోవ కాళ్ళు రా
కున్నవి; యేమి సేతు; కనియున్ గనలేని యభాగ్యురాల నే
నన్నివిధాల - కన్న కడుపన్నది కొంతల కింత తీపియే !

పెట్టియలోన నొత్తిగిలపెట్టి నినున్ నదిగంగలోనికిన్
నెట్టుచునుంటి తండ్రి ! యిక నీకును నాకు ఋణంబుదీరె, మీ
దెట్టుల నున్నదో మన యదృష్టము ! ఘోరము చేసినాను నా
పుట్టుక మాసిపోను ! నినుబోలిన రత్నము నాకు దక్కునే !

"పున్నమ చందమామ సరిపోయెడి నీ వరహాల మోము నే
నెన్నటికైన చూతునె ! మతే ! దురదృష్టము గప్పికొన్న నా
కన్నుల కంతభాగ్యమును కల్గునె ? ఏ యమయైన ఇంత నీ
కన్నము పెట్టి ఆయువిడినప్పటిమాటగదోయి నాయనా !

పాలబుగ్గల చిక్కదనాల తండ్రి !
వాలుగన్నుల చక్కదనాల తండ్రి !
మేలి నీలి నుంగురుల వరాల తండ్రి !
కాలుచెయి రాని తండ్రి ! నా కన్నతండ్రి !

కన్నతండ్రి నవ్వుల పూలు గంపెడేసి -
చిన్నినాన్నకు కన్నులు చేరెడేసి -
చక్కనయ్యకు నెరికురుల్ జానెడేసి -
చిట్టిబాబు మై నిగనిగల్ పెట్టెడేసి -

బాలభానుని బోలు నా బాలు నీదు
గర్భమున నుంచుచుంటి గంగాభవాని !
వీని నే తల్లిచేతిలోనైన బెట్టి
మాట మన్నింపుమమ్మ ! నమస్సులమ్మ !

దిక్కులను జూచి భూదేవి దిక్కు చూచి
గంగదెస చూచి బిడ్డ మొగమ్ము చూచి -
సజల నయనాలతో ఒక్కసారి "కలువ
కంటి" తలయెత్తి బాలభాస్కరుని చూచె -

మరలు రేకెత్త బిడ్డను మరల మరల
నెత్తుకొనుచు పాలిండ్లపై నొత్తుకొనుచు
బుజ్జగింపుల మమకార ముజ్జగించి
పెట్టెలోపల నుంచి జోకొట్టె తల్లి.

ఆతపత్రమ్ము భంగి కంజాతపత్ర
మొందు బంగారుతండ్రీపై నెండ తగుల
కుండ సంధించి, ఆకులోనుండీ ముద్దు
మూతిపై కట్టకడపటి ముద్దు నుంచి.

"నన్ను విడిపోవుచుండె మా నాన్న" యనుచు
కరుణ గద్గద కంఠియై కంపమాన
హస్తములతోడ కాంక్ష లల్లాడ, కనులు
మూసికొని నీటిలోనికి ద్రోసె పెట్టె.

ఏటి కెరటాలలో పెట్టె యేగుచుండ
గట్టుపై నిల్చి అట్టె నిర్ఘాంతపోయి
నిశ్చల నిరీహ నీరస నిర్నిమేష
లోచనమ్ములతో కుంతి చూచుచుండె.

# ధనుర్భంగము

అది మహాసభ - సీతా స్వయంవరార్థ
మచట గూడెను; తళతళలాడు భూష
ణాలతో ఖండఖండాంతరాల దొరలు
శివధనుర్భంగమునకు విచ్చేసినారు.

దొరలు తీర్చి భూపతులు బంగరుగద్దెలమీద గూరుచు
న్నారు - వెలుంగుచుండె నయనమ్ముల ముందొక పెద్దవిల్లు, శృం
గార మధూకమాలికను గైకొని జానకి సొంపులూరగా
ఓరగ తండ్రి ప్రక్క నిలుచున్నది ముద్దుల పెండ్లికూతురై.

ఆ కనుదోయిలో తొణుకులాడు సముజ్జ్వల దివ్యదీప్తి ము
ల్లోకము లేలు రాజసము లోగొనగా - రఘురామమూర్తి తా
నాకృతిగొన్న వీరరసమట్టుల నమ్మునిరాజు వెన్క నా
జూకుగ నిల్చియుండె ప్రియసోదరుతో అభిరామమూర్తియై.

"స్వాగత మో స్వయంవర సమాగత రాజకుమారులార ! మీ
యాగమనమ్ముచే హృది ప్రహర్ష పరిప్లుతమయ్యె - నీ ధను
ర్యాగమునందు శంకర శరాసన మెక్కిడు నెవ్వఁ డా మహా
భాగు వరించు నా యనుగుపట్టి సమస్త సభాముఖమ్మునన్."

అని జనకుండు మెల్లగ నిజాసనమం దుపవిష్టుడయ్యె - మ్రో
గెను కరతాళముల్; నతముఖీ ముఖపద్మమువైపు పర్వి పె
త్తినవి నరేంద్రపుత్రుల సతృష్ణ విలోకన భృంగపంక్తు; ల
ల్లన పులకించె మేను మిథిలాపురనాథుని ముద్దుబిడ్డకున్.

బిగువు నిండారు కొమ్ముటేనుగులవంటి
రాచవస్తాదు లెందరో లేచినారు;
శివధనుర్భంగ మట్లుండ శృంగభంగ
మయ్యెను సమస్త సభ్య సమక్షమందు.

ముని చిఱునవ్వుతోడ తన ముద్దులశిష్యుని మోము చూచె - త
మ్మునకు ధనుస్సు నిచ్చి రఘుముఖ్యుడు జానకి నోరకంటితో
గనుచు, వినమ్రుడై గురువుగారికి - సింహకిశోరమట్లు ముం
దున కరుదెంచె; నచ్చెరువుతో నృపతుల్ తలలెత్తి చూడగన్ !

"ఫెళ్ళు" మనె విల్లు - గంటలు "ఘల్లు" మనె - "గు
భిల్లు" మనె గుండె నృపులకు - "ఝల్లు" మనియె
జానకీదేహ - మొక నిమేషమ్మునందె;
నయము జయమును భయము విస్మయము గదుర.

సిగ్గు బరువున శిరసు వంచినది ఒక్క-
సీతయే కాదు - సభలోని క్షితిపతులును;
మువమునెయి పూలు వర్షించినది సతీ శి
రోమణులె గాదు - దేవతాగ్రామణులును.

చెల్లరే విల్లు విఱచునే నల్లవాడు
పదపదారేండ్ల యెలరాచపడుచువాడు
"సిగ్గు సి" గ్గంచు లేచి గర్జించినారు
కనులుగుట్టిన తెల్ల మొగాలవారు.

లక్ష్మివంటి సీతామహాలక్ష్మి విజయ
లక్ష్మితో శ్యామునకు గృహలక్ష్మి యయ్యె;
భరతజనయిత్రి ప్రేమబాష్పాలలోన
లయ్యె నతి వైభవముగ సీతమ్మపెండ్లి.

# ఊర్మిళాకుమారి

ధవుని వెనువెంట జనిన సీతామతల్లి
గడపివచ్చు వత్సర మొక్క గడియమాడ్కి;
నాథు నెడబాసి శూన్యమౌ నగరిలోన
నెట్లు నిలిపెదు? పదునాలుగేండ్లు తల్లి!

రమణుడు చెంతనుండిన నరణ్యములే యపరంజి మేడలౌ
రమణుడు లేక మేడలె యరణ్యములౌ - ఇకనేమి జానకీ
రమణికి రాణివాసమె అరణ్యనివాసము - నీవు నీ మనో
రమణుని బాసి ఘోరపుటరణ్యములో బడిపోతి విచ్చటన్.

“వదినెయు నన్నగారు వనవాసము సేయగ నన్నగారి శ్రీ
పదముల సేవచేసికొను భాగ్యము స్వేచ్ఛగ నాకు కల్గు; నీ
యవనున నీవు రావల” దటంచు ప్రియుండు నిరాకరింప, నీ
హృదయము క్రుంగి; పొంగిపొరలెత్తిన దుఃఖము మ్రింగికొంటవే!

అత్తరి "పోయి వత్తును ప్రియా ! యిక నే" నను భర్తకెట్టి ప్ర
త్యుత్తర మీయలేక యెటులో తలయెత్తి యెలుంగురాని డ
గ్గుత్తికతోడ నీలి కనుగొల్కుల బాష్పకణమ్ము లాపుచున్
"చిత్త" మటన్న నిన్ను గన చిత్తము నీరగునమ్మ ఊర్మిళా !

పైటచెఱంగుతో పుడమిపై బడకుండగ నద్దుకొమ్ము నీ
కాటుక కన్నుదామరల కాలువలై ప్రవహించు వేడి క
న్నీటి కణాలు – క్రిందపడనీయకు ! ముత్తమసాధ్వి వైన నీ
బోటి వధూటి బాష్పములు భూమి భరింపగలేదు సోదరీ !

అన్న పదమ్ములన్ గొలుచు నాస మనోహరు దేగినాడు – తా
నన్నది భర్తృపాద పరిచర్యకు ప్రేమపు టక్కగారు – ఏ
మున్నది దిక్కు నీ కిచట ? నొంటరి వైతివి తల్లి ! ఎంతయున్
చిన్నతనమ్ము – నీ వెటుల జేతువొ కోడటిక మ్మయోధ్యలో !

"నన్ను నాపుత్త్రి బంపి, అన్నను అయోధ్య
గద్దె నెక్కింప వీరకంకణము దాల్చు
లక్ష్మణకుమారు దేవేరులా !" యటంచు
ఆడిపోయదె కైక ని న్నహరహమ్ము.

క్రొవ్వలపు జవ్వనపు మూగకోరికలకు
దాపురమ్మైన మీ లేతకాపురమ్ము
చేతిమీదుగ నదవిపాల్ చేసినాడు
కనులు గుట్టిన వేమొ రాకాసివిధికి!

చెల్లెం డ్రిద్దరు ప్రాణవల్లభుల సంసేవించుచున్నారు; తా
నుల్లాసమ్మున సీత వల్లభునితో నుండెన్ వనిన్: నీ వెటుల్
తల్లీ! భర్తృ వియోగ దుఃఖమున నుల్లం బల్లకల్లోలమై
యల్లాడన్ కడ ద్రోతువమ్మ: పదునా లగ్గేడ్మ్ము లేకాకృతిన్.

నలుగురు "నంగనాచి గహనాలకు హంతుని గెంటి యింటిలో
కులుకుచు కూరుచున్న" దనుకొందు రటంచు రహంత మేని చిం
తిలకుము తల్లి! త్యాగమయదేవివి నీవని నీ చరిత్రమే
తెలుపుచునుండె-లోకము హృదిన్ గదలించు సదా త్వదశ్రుపుల్!

కమ్మని జవ్వన మ్మడవిగాచిన వెన్నెలజేసి, భర్తృవా
క్యమ్ముల కడ్డుచెప్పక మహత్తరమౌ పతిభక్తిలోన సీ
తమ్మను మించిపోయితివి - తావక దివ్య యశోలతా వితా
నమ్ములు ప్రాకిపోయె భువనమ్ముల; పుణ్యపతివ్రతంసమా!

# అనసూయాదేవి

అల కలహభోజనుని ఫలహారమునకు
నినుప గుగ్గిళ్ళ వండి వడ్డించినావు;
అమ్మ ! నీ చేతి తాలింపు కమ్మదనము
భరతదేశాన గుమగుమ పరిమళించె.

అత్యపూర్వ మమోఘ మనంత మైన
తావక పతివ్రతా మహత్త్వమ్ములోన
ఆది సాధ్వీమణుల హృదయాలతోడ
నుక్కు సెనగలు తుకతుక నుడికిపోయె !

వేద వేదాంత సౌవర్ణ వీథులందు
తిరుగుచుండెడి దివ్యమూర్తిత్రయమ్ము
నేడు నీ వంటయింట దోగాడుచుండె
గోరుముద్దలు గుజ్జనగూళ్ళు తినుచు.

కాలు కదపక బిడ్డలుయ్యేలలందు
నూగునాడె ముల్లోకమ్ము లూగుచుండె;
కాలువచ్చి గంతులువేయు కాలమునకు
ఇంతకెంతౌనొ ? వింతబాలెంతరాల !

ఇయ్యఖిల ప్రపంచములనే తమబొజ్జల మాటుకొన్న బా
బయ్యలు ముప్వురన్ శిశువులై శయనించిరి నీ గృహాన – నీ
తియ్యని జోలపాటల కిదే పులకించెను సృష్టియెల్ల – నీ
యుయ్యెల యూగులో నిదురనొందెనులే పదునాల్గు లోకముల్ !!

గర్భములేదు – కష్టపడి కన్నది లే – దిక బారసాల సం
దర్భము లే – దహో ! పురిటిస్నానములుఁ నడికట్లులేవు – ఏ
స్వర్భువనాలనుండి దిగివచ్చిరి నీ ప్రణయాంక పీఠి కీ
యర్భకు ? లంతులేని జననాంతర పుణ్యతపఃఫలమ్ములై.

ఆదియు నంతమే యెఱుగనట్టి మహామహిమాఢ్యులైన బ్ర
హ్మాదుల కుగ్గుపెట్టి ఒడియం దిడి జోలపాడు పెద్ద ము
త్తైదువ ! "ధన్యురాలవు" గదమ్మ ! త్వదుజ్జ్వల కీర్తిగీతికా
నాదము మ్రోగె స్వర్గ భువనమ్మున దైవత మౌని వీణపై

అగ్గిని గల్చి మట్టు పరియాదలు - పుణ్య పురాణపూరుషుల్
ముగ్గురు చేయవచ్చిన యమోఘపు టగ్నిపరీక్షలోపలన్
నెగ్గితి వీ, వపూర్వములు నీ చరితల్ చెవిసోకి మేనులన్
గగ్గురుపాటు పుట్టినదిగా ముగురమ్మల కొక్కపెట్టునన్ ।

కొంగులు పట్టి "మా పసుపుకుంకుమతో పతిభిక్ష పెట్టి మా
మంగళసూత్రముల్ నిలుపు" మంచు సరస్వతి సర్వమంగళా
మంగళదేవతల్ ప్రణతమస్తకలై పడియున్నవారు నీ
ముంగిటిముందు; నారదుని మోమున నవ్వులు నాట్యమాడగన్ ।

అమ్మవైనావు చతురాస్యహరిహరులకు -
అత్తవైతివి వాణీరమాంబికలకు -
ఘనతమై అత్తగారి పెత్తనము చూపి
క్రొత్త కోడండ్ర నిక దిద్దుకోగదమ్మ ।

మాతృప్రేమపునీతమౌ సఫల దాంపత్యమ్ము నీ సొమ్ము, నీ
పాతివ్రత్యములోన అత్రితపముల్ పండెన్, వియద్గంగకే
యేతామెత్తెను నీయశస్సులు, గుమాయించెన్ జగమ్మెల్ల నీ
యాతిథ్యమ్ము నమస్సులమ్మ అనసూయా ! అత్రిసీమంతినీ !

# సతీ సావిత్రి

"నల్లనివాడు రక్తనయనమ్ములవాడు - భయంకరస్వరూ
పోల్లసనమ్మువాడు - గద నూని మహామహిషమ్ముపై ప్రవ
ర్తిల్లెడివాడు - నా ప్రణయదేవుని జీవధనమ్ము తెచ్చె - నో
ఢిల్ల పురంధ్రులార! కనిపింపడుగా? దయచేసి చెప్పరే!

ఓ దీనత్వము రూపుగైకొనిన ప్రేమోన్మాదినీ! యేల నీ
వీ దారిం బడి దక్షిణాభిముఖివై యేతెంతు వీ కానలో?
నీ దిక్కైఁ దరిజేర్చువా రెవరు లేనేలేరటే తల్లి! ఏ
దేదీ! మోమిటు త్రిప్పు మెవ్వతెవు దేవీ! నీవు సావిత్రివా!

పెద్దది గొడ్డుబోతువిధి చెల్లి! నిమేషముక్రింద ఏటి కా
యొడ్డున గట్టుమీద నిలుచుండి హుటాహుటి రెండుచేతులన్
గొడ్డలిబట్టి కట్టియలుగొట్టెడి నీ హృదయేశు నెత్తిపై
గొడ్డలిపెట్టుపెట్టి పడగొట్టిన దుష్ట కిరాతు డెవ్వడో!

ఉదయశ్రీ

నారదుడు చెప్పె - బెదిరించె నాన్నగారు -
తల్లి బతిమాలె - నీ గుండెధైర్యమేమొ ! !
చా వెటింగియు కట్టుకొన్నావు నాడు !
కొదువయైపోయె పసుపు కుంకుమలు నేడు ! !

పెండ్లినా డమ్మ చెక్కిట బెట్టినట్టి
పాటుక యరాబు రవ్వంత కందలేదు-
పెద్ద ముత్తైదువలు కాళ్ళ దిద్దినట్టి
పసుపు పారాణి కనుమాపు పడనె లేదు-

అత్తయు మామగారు జనుషాంధులు; కాననభూములందు క్రొం
గ్రొత్తది కాపురమ్ము; జనకుం డిట లేదు; నిజేశు డి ట్లక
స్మాత్తుగ కొలిపోయె; కూరమాలిన క్రూరవిధాత నేడు నీ
కుత్తుక కత్తిపెట్టి తెగగోసెను చిట్టెపు రాతిగుండెతో !

వదనశ్రీ వసివాడిపోయినది, జవ్వట్లాడె లేగౌను, నీ
మృదు పాదమ్ములు బొబ్బలెత్తినవి : నెమ్మేనెల్ల కంపించె; వ
ట్టిది నీ నాధుడు నీకు దక్కుట - వధూటీ ! ఆగిపోవమ్మ ! అ
ల్లదిగో పాలుడు చాలదూరమున; నీ వందించుకోలేవులే !

"నా" యను దిక్కులేని, పదునాలవయేడును వచ్చిరాని, లే
బ్రాయపు చిట్టితల్లివి ! అరణ్యములో ఆమువెంట నొంటిగా -
నాయువు దీరిపోవు పతికై పరువెత్తెదు ! నీ ప్రపత్తికిన్
మ్రోయవె దేవదుందుభులు; మ్రొక్కవె ఈ పదునాల్గు లోకముల్!

ఒత్తెపు గింజలేని పతి ప్రాణముకోసము వెంటనంటి ప
ర్వెత్తెడు పిచ్చిపిల్ల వనియే తలపోసెనొ - కచ్చగట్టి దం
డెత్తు సతీమతల్లి వని యెంచెనొ - చట్టున నిల్చిపోయినా;
డుత్తదిగాదు చూడు మవిగో ! బిగపట్టిన దున్నపగ్గముల్ !

"వందన మో మహా మహిషవాహన ! నీదయచేత నాన్నకున్
నందను లబ్బినారు, నయనమ్ములు గల్గెను మామగారికిన్;
హైందవ సాధ్వి కీ శుభము లన్ని లభించియు భర్తలేక ఆ
నందము గల్గునా ? సుతగుణా ! పతిభిక్ష నను గ్రహింపుమా !"

"పతి నొసగు" మంచు దోసి లొగ్గితివొ లేదొ
చేతి పగ్గాలు సడలించె ప్రేతరాజు;
పఱచుచున్నది మహిష మంబరమునందు
వెంటబడుమమ్మ గుండె ద్రవించునేమొ !

చేతిమీదుగ ఎన్నెన్నో పూతపిందె
కాపురమ్ములు తీసిన ఘాతుకుండు!
నిండు ప్రాణాలు నిలుపున పిండుకొనెడి
గుండెతడిలేని కర్కోటకుండు వాడు!

కాలుని దున్నపోతు మెడ గంటల పట్టెడలోని కింకిణీ
జాల "ఘణం ఘణం" ధ్వనులు చల్లగ చల్లగ సాగి, దూర దూ
రాలకు పోయె - నీ యెలుగు రాసిన గొంతుక పిల్పులేల? "ఓ
హో" లకు నంద దాత; దదుగో! కనిపించెడి కొండమల్పులో!

వైతరణీ ప్రవాహములు వైదొలగెన్ - అసిపత్ర కానన
వ్రాతము స్వాగతమ్మిడె - సెబా సదిగో యమ రాజధానియున్!
ప్రేతపురీశు డేడి కనిపింపడు! దుర్గములోన దూరినా
డాతడు; కోటతల్పు లకటా! బిగియించిరి ద్వారపాలకుల్.

కదకంటన్ ప్రభవింప రక్తనది - సాక్షాత్ కాళికాదేవివై
నడికట్టుం బిగియించి నిల్చిన త్వదంతశ్శక్తికిన్ "ఫెళ్ళనన్"
గడియల్‌గూలి "గబీలు"మంచు యమ దుర్గద్వారముల్ బ్రద్దలై
పడియెన్ ధాత్రి; "చిరాయురస్తు" జగదంబా నీకు నీ భర్తకున్!

"భగవంతుం డొకడున్న నా కిడును నా ప్రాణేశు - లేకున్న నీ
జగముల్ నిల్చునె" యంచు భారత సతీసామర్థ్యముల్ మ్రోత మ్రో
యగ గర్జించితివమ్మ । దండధర బాహాదండ చండ ప్రచం
డ గదాదండము బెండువోయినది బిడ్డా । నీదు క్రోధాగ్నికిన్ ।

నిఖిల లోకైక సాధ్విని నిన్ను గన్న
భరతజనయిత్రి భాగ్యాలు పండెనమ్మ ।
మెచ్చుకొన్నాడు నీ భర్త నిచ్చినాడు
పుచ్చుకోవమ్మ నీ పూర్వ పుణ్యఫలము ।

విశ్వవిచిత్రమైనది పవిత్రము నీ చరితమ్ము - దిక్కులన్
శాశ్వతమయ్యె తావక యశశ్శశికాంతులు - నీవు రాజరా
జేశ్వరివే పతివ్రతల కెల్లను - పచ్చని తల్లి । ఇంత కా
యశ్వపతి క్షితీంద్రుడు కృతార్థుడులే నిను గన్న తండ్రియై ।।।

# మహాకవి పోతన

గంటమొ చేతిలోది ములుగట్టయొ? నిల్కడ యింటిలోననో
పంటపొలాన? చేయునది పద్యమొ సేద్యమొ? మంచమందు గూ
ర్చుంటివొ మంచెయందొ? కవివో గడిదేరిన కర్షకుండవో?
రెంటికి చాలియుంటివి సరే కలమా హలమా ప్రియం బగున్?

కాయలుగాచిపోయినవిగా యరచేతులు! వ్రాతగంటపున్
రాయిడిచేతనా? మొరటు నాగలిమేడి ధరించి సేద్యమున్
జేయుటచేతనా? కవికృషీవల! నీ వ్యవసాయదీక్ష "కా
హా" యని యంతలేసి కనులార్పక చూచిరిలే దివౌకసుల్!

మెత్తని చేయి నీది; సుతిమెత్తని చిత్తమువాడ వంచు నీ
పొత్తమె సాక్ష్యమిచ్చు; పొలమున్ హలమున్ గొని దున్నుచో నెటుల్
గిత్తల ముల్లుగోల నదలించితివో! వరిచేలపైన ను
వ్వెత్తుగ వ్రాలుచో పరిగపిట్టల నెట్టుల తోలినాడవో!

"నమ్ముము తల్లి నాదు వచనమ్ము: ధనమ్మునకై బజారులో
అమ్మనుజేశ్వరాధముల కమ్మను ని" న్నని బుజ్జగించి నీ
గుమ్మములోన నేడ్చు పలుకుం జెలి కాటుకకంటి వేడి బా
ష్పమ్ములు చేతితో తుడిచివైచెడి భాగ్యము నీకె యబ్బెరా ॥

గంటలు కట్టుకొంటివటగా! "విటగాండ్రను బోలునట్టి యీ
కుంటి కురూపి భూపతులకుం గవితాసుత నీయ" నంచు; ఆ
పంటవలంతియల్లునకె భాగవతమ్మును ధారవోసి, ని
ష్కంటకవృత్తికై నడుముగట్టితి వెంతటిపుణ్యమూర్తివో!

అచ్చపు జుంటితేనియల, నైందవ బింబ సుధారసాల, గో
ర్వెచ్చని పాలమీగడల; విచ్చెడి కన్నెగులాబి మొగ్గలన్
మచ్చరికించు ఈ మధుర మంజుల మోహన ముగ్ధ శైలి నీ
వెచ్చట నేర్చినావు? సుకవీ! సుకుమార కళా కళానిధీ!

కమ్మని తేటతెల్గు నుడికారము లేరిచి కూర్చి చాకచ
క్యమ్ముగ కైత లల్లు మొనగాండ్రు కవీశ్వరు లెంతమంది లో
కమ్మున లేరు – నీవలె నొకండును భక్తి రసామృత ప్రవా
హమ్ముల కేతమెత్తిన మహాకవి యేడి తెలుంగుగడ్డపై?

ఉదయశ్రీ

ఎండిన ప్రోడులే కిసలయించెనొ! యేకశిలాపురమ్ములో
బండలు పుల్కరించెనొ! అపార ముదమ్మున తెల్గుతల్లికిన్
గుండెలు పొంగిపోయి కనుగొల్కులు నిండెనొ! పచ్చిపైరులే
పండెనొ! జాలువారిన భవత్ కవితామృత భక్తిధారలన్!

భీష్మునిపైకి కుప్పించి లంఘించు గో
పాలకృష్ణుని కుండలాల కాంతి
కరిరాజు మొఱపెట్ట పరువెత్తు కటిపేల్పు
ముడివీడి మూపుపై బడిన జుట్టు
సమరమ్ము గావించు సత్య కన్నులనుండి
వెడలు ప్రేమక్రోధ వీక్షణములు
కొసరి చల్దులు మెక్కు గొల్ల పిల్లల వ్రేళ్ళ
సందు మాగాయ పచ్చడి పసందు

ఎటుల కనుగొంటివయ్య! నీ కెవరు చెప్పి
రయ్య! ఏరాత్రి కలగంటివయ్య! రంగు
కుంచెతో దిద్దితీర్చి చిత్రించినావు!
సహజపాండితి కిది నిదర్శనమటయ్య!!

ముద్దులుగార భాగవతముఁ రచియించుచు, పంచదారలో
నద్దితివేమొ గంటము మహాకవిశేఖర ! మధ్య మధ్య అ
ట్లద్దక-వట్టిగంటమున నట్టిటు గీచిన తాటియాకులో
పద్దెములందు - ఈ మధుర భావము లెచ్చటనుండి వచ్చురా ?

"భాగవతమ్ము భాగ్య పరిపాకమ ఆంధ్రులకెల్ల-దానిముం
దాగగజాల వే కవిత" లంచు నభంబున దేవదుందుభుల్
మ్రోగినవేమొ ! నీవు కలముంగొని కావ్యము వ్రాయ చిందిపో
సాగినవేమొ ! తీయని రసాల రసాలు త్వదీయలేఖినిన్ !

వేసము మార్చి యిన్ని దిగవేసి "యథా" నొనరింపకుండ శ్రీ
వ్యాసుని గ్రంథ మాంధ్రమున వ్రాసితి వందము చింద ; నీద అ
గ్రాసనమయ్య ; ఆంధ్రకవులందు ; వరాలకు నెత్తునెత్తుగా
ఆ సొగసైన పద్దెము లయారె ! తయారగు నీ కలాననే ! !

ఖ్యాతి గడించుకొన్న కవు లందరు లేరె ! అదేమి చిత్రమో
పోతన యన్నచో కరిగిపోవు నెదంద, జొహారు సేతకై
చేతులు లేచు ; ఈ జనవశీకరణాద్భుతశక్తి చూడగా
నాతని పేరులో గలదొ ; ఆయన గంటములోన నున్నదో !

# ఆంధ్ర విద్యార్థి

సర్వభూమీ పూజ్య గీర్వాణ భాషా మ
తల్లి గారాబంపుతల్లి నాకు
అత్యంత సుకుమారి ఆంధ్రభాషాయోష
అల్లారుముద్దులచెల్లి నాకు
నవనవోన్మేష సుందరమూర్తి సాహితీ
లక్ష్మియే అర్ధాంగలక్ష్మి నాకు
కమనీయ మృదుపదక్రమ కవితా బాల
కలికి పల్కుల పసికందు నాకు

పాణినీయులు దేశికప్రభులు నాకు
సరసవాఙ్మయపురము కాపురము నాకు
వాణి వాయించు మాణిక్య వీణలోని
యర్థ మెఱిగిన "ఆంధ్ర విద్యార్థి" నేను !

ఉదయశ్రీ

ఒకమాటు కనుమోడ్చుచుందు బమ్మెరవారి
మందార మకరంద మధురవృష్టి
ఒకమాటు మూర్కొనుచుందు తిమ్మనగారి
పారిజాత వినూత్న పరిమళమ్ము
ఒకమాటు చవిచూచుచుందు పెద్దనగారి
ద్రాక్షగుత్తుల సుధా సుధార
ఒకమాటు విహరించుచుందు పింగళివారి
వరకళాపూర్ణ సౌవర్ణ శిఖరి
ఒకట కవితా కుమారితో నూగుచుందు
గగన గంగా తరంగ శృంగారడోల;
ఆంధ్ర సాహిత్య నందనోద్యానసీమ
నర్థి విహరించు "ఆంధ్ర విద్యార్థి" నేను.

కాళిదాస కవీంద్ర కావ్యకళావీథి
పరుగులెత్తెడి రాచబాట నాకు
భట్టబాణుని ముద్దుపట్టి కాదంబరి
కథలు చెప్పెడి చెల్మికత్తె నాకు
భవభూతి స్నేహార్ద్ర భావవైభవ గీతి
కరుణారసాభిషేకమ్ము నాకు
వాల్మీకి కవిచక్రవర్తి భావస్ఫూర్తి
ఆటలాడెడి పూలతోట నాకు
భారతీదేవి మృదులాంక భద్రపీఠి
ముద్దు లొలికెడి రతనాల గద్దె నాకు;
తెనుగుతోటల సంస్కృత వనలతాళి
నంటుత్రొక్కెడు "ఆంధ్ర విద్యార్థి" నేను.

# అస్వాతంత్రుడు

నేనొక దగ్ధ జీవనుడనే అయినాను - మదీయ మానసో
ద్యానమునిండ రక్కసిపొదల్ చిగిరింతలు గారకంపలే
గాని, పదే పదే పయిరగాలికి నూగు గులాబి గుత్తులే
కానగరావు - స్వేచ్ఛయును గల్గునె యీ కరుణావిహారికిన్ ?

నేనొక వెట్టిమొట్టికవినే అయినాను - మదీయ జీవితా
ఖ్యానమునందు క్లిష్టగతి కష్టసమన్వయ దుష్టసంధులే
కాని, సుగమ్య సుందర సుఖంకర సూక్తి సువర్ణ పంక్తియే
కానగరాదు - బోధమును గల్గునె యీ కవితావిలాసికిన్ ?

నేనొక జీర్ణశిల్పకుడనే అయిపోయితి - నాయులిన్ సదా
పీనుగ మొండెముల్ పునుక పేరులు కుంటికురూపి బొమ్మలే
కాని, వినూత్న యౌవన వికాస మనోహర రూపరేఖయే
కానగరాదు - తృప్తియును గల్గునె యీ తృషితాంతరాత్మకున్ ?

నేనొక క్లిష్టగాయకుడనే అయిపోయితి - నా విపంచిపై
దీన గళమ్ముతో తెగిన తీగలమీద విషాదగీతులే
కాని, రసంబు పొంగి పులకల్ మొలపించు ప్రమోదగీతియే
కానగరాదు - స్థాయియును గల్గునె యీరసలుబ్ధ జీవికిన్ ?

నేనొక రంగలంపటుడనే అయినాను - మదీయ నాటకా
స్థానములో బుసల్ గుసగుసల్ సకిలింతలు చప్పరింతలే
కాని, సెబాసటంచు రసిక ప్రవరుల్ తలలూపి మెచ్చుటే
కానగరాదు - సిద్ధియును గల్గునె యీ నటనావినోదికిన్ ?

నేనొక కష్టకర్షకుడనే అయినాను - మదీయ బుద్ధి మా
గాణము నిండ ఒడ్డు మెరకల్ రవపెంకులు డొలుటప్పలే
కాని, పసందుగా పసిడి కంకులు వంగిన పంటపైరులే
కానగరావు - పుష్టియును గల్గునె నిష్ఠదరిద్ర మూర్తికిన్ ?

నేనొక నష్టజాతకుడనే అయినాను - మదీయ జన్మ చ
క్రాన కుజాష్టమాది కుటిలగ్రహ కుండలి క్రూరదృష్టులే
కాని, త్రికోణ కేంద్ర శుభగ గ్రహ వీక్షణ సామరస్యమే
కానగరా - దదృష్టము గల్గునె యీ దురదృష్టమూర్తికిన్ ?

నేనొక భగ్ననావికుడనే అయినాను – మదీయ భావనాం
భోనిధిలో మహామకరముల్ సుడిగుండములున్ తుఫానులే
కాని, సుధా సుధాకిరణ కల్పక దివ్యమణీ వితానమే
కానగరాదు – అద్దరియు గల్గునె ఈ యెదురీతగానికిన్ ?

నేనొక దీనభిక్షుకుడనే అయినాను – మదీయ జీర్ణ గే
హాన దరిద్రదేవత మహా వికట ప్రళయాట్టహాసమే
కాని, యదృష్టలక్ష్మి కడకంటి సుధా మధురార్ద్ర దృష్టియే
గానగరాదు – భాగ్యమును గల్గునె ఇట్టి యభాగ్యశాలికిన్ ?

నేనొక వ్యర్థతాపసుడనే అయినాను – మదీయ సంతత
ధ్యాన సమాధిలో వెకిలిదయ్యపు మూకల వెక్కిరింతలే
గాని, ప్రసన్నభావ కళికా లవలేశ విలాసమేనియున్
గానగరాదు - ముక్తియును గల్గునె యీ పరితప్తమౌనికిన్ ?

# తెనుగు తల్లి

కనిపింపదే నేడు ! కాకతీయ ప్రాజ్య
సామ్రాజ్య జాతీయ జయపతాక
వినిపింపదే నేడు ! విద్యానగర రాజ
సభలోని విజయ దుందుభుల మ్రోత
చెలగదే నేడు ! బొబ్బిలికోట బురుజుపై
తాండ్రపాపయ తళత్తళల బాకు
నిప్పచ్చరంబయ్యెనే నేడు - వీర ప
ల్నాటి యోధుల సింహనాదలక్ష్మి

చెక్కుచెదరని - యేనాడు మొక్కవోని -
ఆంధ్ర పౌరుష మిప్పు డధ్వాన్న మయ్యె;
మరల నొకమాటు వెనుకకు మరలిచూచి
దిద్దుకోవమ్మ; బిడ్డల, తెనుగుతల్లి !

ఉదయశ్రీ

రాజరాజుల చరిత్రల నాలపించెడి
గౌతమీ గద్గద కంఠరవము
కృష్ణరాయల కీర్తిగీతాలు కడుపులో
జీర్ణించుకొను హంపి శిథిలశిలలు
అలనాటి కాకతీయుల పౌరుషము త్రవ్వి
గంపకెత్తెడి ఓరుగంటి బయలు
బలితంపు రెడ్డి బిడ్డల సాము గరిడీల
రాటు తేలిన కొండవీటి తటులు
విని - కని - తలంచుకొని గుండె వ్రీలిపోయి
వేడి వేడి నిట్టూర్పులే విడిచినాము ;
గుడ్డ గట్టిన కడివెడు కొడుకులుండి
యిల్లు వాకిలి కరవైన తల్లివీవు ; ;

"రాయిగుద్దును" నీ పురాశిల్ప సంపత్తి
నమరావతీస్తూప సముదయంబు;
"చదివించు" నీ మహాసామ్రాజ్య కథల నాం
ధ్ర క్ష్మాపతుల జయస్తంభ లిపులు;
"గళమెత్తిపాడు" నీ గాన సౌభాగ్యమ్ము
రమణీయముగ త్యాగరాయ కృతులు;
"వేనోళ్ళచాటు" నీ వీర మాతృత్వమ్ము
పలనాటివీరుల పంబ కథలు ;
"వల్లెవేయును" నీ వైభవప్రశస్తి
హోరుమంచును నేడు మా ఓడరేవు;
బ్రతికిచెడియున్న నీపూర్వభాగ్యరేఖ
చెరిగిపోలేదు తల్లి ; మా స్మృతిపథాల ; ;

గంటాన కవితను కదను త్రొక్కించిన
"నన్నయభట్టు" లీనాడు లేరు
కలహంస కంచుఢక్కల నుగ్గునుగ్గు గా
వించు "శ్రీనాథు" లీవేళ లేరు
అంకాన వాణి నోదార్చి జోలలు వాడు
"పోతనామాత్యు" లీప్రొద్దు లేరు
పంతాన ప్రభువుచే పల్లకీ నెత్తించు
కొను "పెద్దనార్యు" లీ దినము లేరు
"వాణి నా రాణి" యంచు సవాలుకొట్టి
మాట నెగ్గించు "వీరు" లీపూట లేరు!
తిరిగి యొకమాటు వెనుకకు తిరిగిచూచి
దిద్దుకోవమ్మ! బిడ్డల, తెనుగుతల్లి!

కవులకు బంగారు కడియాలు తొడిగిన
రాయలగన్న వరాల కడుపు
సీసాలతో కవితాసార మిచ్చు శ్రీ
నాథుని గన్న రత్నాల కడుపు
భద్రాద్రిలో రామభద్రు స్థాపించు గో
పన్నను గన్న పుణ్యంపు కడుపు
జగ మగంటిమి నద్దెసల్ వెలార్చిన పాప
రాయని గన్న వజ్రాల కడుపు
పిసినిగొట్టు రాజులకును - పిలకబట్టు
కుకవులకును - పిచ్చిపిచ్చి భక్తులకు - పిటికి
పందలకు - తావు గాకుండ ముందు ముందు
దిద్దుకోవమ్మ! బిడ్డల, తెనుగుతల్లి!

# కల్యాణగీతి

శ్రీకరమ్ములు మీకు నాట్యైకలోల
శివజటాజూట గాంగేయ శీకరములు;
రంజితమ్ములు మీకు శర్వాణీ చరణ
కంజ మంజుల మంజీర శింజితములు ॥

# జయోస్తు

రాణ్మహేంద్ర కవీంద్రు రత్నాల మేడలో
    పసిడి గిన్నెల నుగ్గుబాలు త్రాగి
సోమయాజులవారి హోమవేదికలపై
    అల్లారుముద్దుగ నాటలాడి
శ్రీనాథుల సువర్ణ సీసమాలికలలో
    హాయిగా తూగుటుయ్యాలలూగి
భాగవతులవారి పంచపాళీలలో
    మెత్తని శయ్యల నొత్తిగిల్లి

విజయ విద్యానగర రాజవీధులందు
దిగ్గజమ్ములమీదనే తిరిగి తిరిగి
కంచు జయభేరి దెసల మ్రోగించుకొన్న
ఆంధ్రకవితాకుమారి ! "జయోస్తు" నీకు.

# కవితాకుమారి

జడయల్లి జడకుచ్చు లిడ "రాయప్రోలు" "త
ల్లావఝ్ఝల" కిరీట లక్ష్మినింప
"పింగళి" "కాటూరి" ముంగురుల్ సవరింప
"దేవులపల్లి" శ్రీ తిలక ముంప
"విశ్వనాథ" వినూత్న వీథుల కిన్నెర మీట
"తుమ్మల" రాష్ట్రగాన మ్మొనర్ప
"వేదుల" "నాయని" వింజామరలు వేయ
"బసవరాజు" "కొండాలి" పదములొత్త

"అడవి" "నండూరి" భరతనాట్యములు సలుప
"జాషువా" "ఏటుకూరి" హెచ్చరిక లిడగ
నవ్యసాహిత్య సింహాసనమున నీకు
ఆంధ్ర కవితాకుమారి ! "దీర్ఘాయురస్తు !"

# బీద పూజ

"వాడిన గుడ్డిపూలు గొనివచ్చెను వీ" డని జాలిమాలి నో
నాడకుమో దయామయ ! యథార్థము నీకడ విప్పిచెప్ప నో
రాడుటలేదు - పూలకొరకై పువుదోటకు నేను గూడ జ
న్మాడను - పుష్పమొక్కటయినన్ లభియింపకపోయె నా కటన్.

వారలు పెద్దపెద్ద ధనవంతుల బిడ్డలు - మంచి మంచి బం
గారపు పూలబుట్టలను గైకొని పోయిరి ముందుగానె - మా
బూరుగుచెట్టుక్రింద పడిపోయిన గోడల పూరిపాకలో
దూరిన దోర వెల్గులకు దుప్పటినెత్తితి - అమ్మ లేపినన్.

లేచి - చిఱుచాప నొకమూల దాచిపెట్టి
ప్రాత తాటాకుబుట్టను చేతబట్టి
పొంత లోపలి జల మింత పుక్కిలించి
తల్లి కాళ్ళకు వంగి వందన మొనర్చి.

తెలతెలవాఱుచుండ జనితిన్ విరితోటకు - తోటమాలి త
ల్పులు బిగియించె నా చినిగిపోయిన గుడ్డలు నన్నుజూచి; కా
ళుల బడి; గడ్డమంటి, యెటులో బతిమాలి యవస్థనంది లో
పల బడినాను - చెంత గనుపట్టిరి మిత్రులు పూలుగోయుచున్.

చకచక పూలు గోసికొని సాగిరి వారలు - శూన్యకుంజ మా
లిక లెటు చూచినన్; మిగులలే దొక పుష్పముకూడ నాకు; నే
నొకదెస విన్నబోయి నిలుచుంటి; ననున్ గని వార లందఱున్
పకపక నవ్వినారు - తలవంచితి నేనొక కొమ్మచాటునన్.

వట్టి పూ మొక్క లన్ని నా వంక చూచి
ప్రసవబంధాలు సడల బాష్పములు రాల్చె;
చేతిలోనున్న బుట్టను చింపివైచి
తిరిగివచ్చితి గంపంత దిగులుతోడ.

ఇంటికి వచ్చుచుండ గనిపించిరి దేవర దేవళమ్ములో
మంటపమందు పుష్పములు మాలలు గ్రుచ్చుచు వారు - పోయి కూ
ర్చుంటిని నేను కూడ నొకచో నొక స్తంభమువెన్క - ఇంతలో
గంటలు మ్రోగి - అర్చనలకై గుడిలోనికిపోయి రందఱున్.

పూజలై మిత్రు లిండ్లకు పోయినారు
రిక్తహస్తాల నిన్ను దర్శింపలేక
మండపము ప్రక్క ధూళిలో నిండియున్న
గ్రుడ్డిపువ్వులనే యేరుకొంటి నేను.

పరిమళము లేక - ఎవరికి పనికి రాక -
పాఱవేయ బాటల ప్రక్కపడి - కరాళ
కాల పురుషుని కాయ చక్రాల క్రింద
బ్రతుకలేని దరిద్ర పుష్పమ్ము లివ్వి.

ఈ యనాథ సుమాలనే - ఈ విశీర్ణ
జీర్ణ కుసుమాలనే - ఈ కృశించు మ్లాన
హీన దీన ప్రసూనాలనే - త్వదంఘ్రి
సేవకై దోయిలించి తెచ్చితిని నేను.

పూల దోసిలి కన్నీట పొరలిపోయె
విరుల మాలిన్య మంతయు వెడలిపోయె
ఆగియుంటి ప్రభూ ! స్వామియాజ్ఞకొఱకు
ఆదరింతువా లేదా నా "జీవపూజ"

# మాతృ శ్రీ

అభ్రంకషంబౌ హిమాలయం బే తల్లి
మౌళి జుట్టిన మల్లెపూల చెండు
గోదావరీ కృష్ణ లే దేవి కటిసీమ
వ్రేలాడు ఆణిముత్యాల సరులు
ఆంధ్రసముద్ర మే యమ్మ పాదాలపై
జీరాడు పట్టుకుచ్చెల చెఱంగు
నలుబదికోట్ల వీరుల భారతీయు లే
కల్యాణి చల్లని కడుపుపంట

ఆమె బ్రహ్మర్షి జాత కల్యాణగీత
ధర్మసముపేత వేదమంత్ర ప్రపూత
విశ్వవిఖ్యాత సుశ్రీల వెలయుగాత
పరమకరుణాసమేత మా భరతమాత ! ! !

# నమస్తే

ఎలుకగుట్టముమీద నీరేడు భువనాల
        పరువెత్తివచ్చిన పందెకాడు
ముల్లోకముల నేలు ముక్కంటియింటిలో
        పెత్తన మ్మొనరించు పెద్దకొడుకు
"నల్లమామా" యంచు నారాయణుని పరి
        యాచకా లాడు మేనల్లు కుఱ్ఱ
వడకుగుబ్బలి రాచవారిబిడ్డ భవాని
        నూఱేండ్లు నోచిన నోముపంట

అమరులం దగ్రతాంబూల మందు మేటి
ఆఱుమోముల జగజెట్టి అన్నగారు
విఘ్నదేవుడు వాహ్యాళి వెడలివచ్చె
ఆంధ్రవిద్యార్థి ! లెమ్ము జోహారు లిడగ !!

# స్వేచ్ఛాపుష్పాలు

శాంతిపూర్ణ సత్యాగ్రహ సమరమందు
జీవితమ్ముల నర్పణ సేయునట్టి
ధన్యమూర్తులు నడచెడి దారులందు
కాపురము సేయగా కోర్కె గలదు మాకు.

దేశదాస్య విముక్తికై దీక్షబూని
బందిఖానాల బ్రతుకులు బలియొనర్చు
త్యాగమూర్తుల పాదపరాగ మొదల
పులుముకొన నెంతయో కాంక్షగలదు మాకు.

కట్టుకొన గుడ్డ, త్రాగంగ గంజి లేక
గుడిసెలందు పేరాకట కుములుచున్న
కష్టజీవుల నిట్టూర్పు కాకలందు
కమలిపోవగ కోరిక గలదు మాకు.

విజయఘంటాధ్వనులు వినువీధి నింద
ప్రజలు సాగింప జాతీయ పథము వెంట
కదలు స్వాతంత్ర్యరథము చక్రాల క్రింద
నలిగిపోవ సముత్కంఠ గలదు మాకు.

దాస్యబంధ విముక్త స్వతంత్ర భరత
మాతృకంఠాన ఒక పుష్పమాల యగుచు
తల్లి యానందబాష్పాల తడిసితడిసి
పులకరింపగ అభిలాష గలదు మాకు.

ఒక ప్రశాంత ప్రభాతాన ఒక్క మంద
మలయ మారుతవీచిలో పులకరించి
మెల్లగా తల్లి చల్లని కాళ్ళపైన
రాలి కనుమూసికొనుటె సార్థకత మాకు.

# సార్థకత

అర్చకు లొనర్చు పూజల నందుకొనుచు
గుళ్ళలోపల హాయిగా కూరుచున్న
దైవముల తలకెక్కి తైతక్కలాడి
కులుకరింపగ మా మది కోర్కె లేదు.

గంధపొడి గాలిపై చల్లి విందులిడి మ
రంద బిందువులు మిళింద బృందములకు
సిగ్గు విడనాడి ఉచ్ఛిష్ట జీవితమ్ము
గడుపుటకు మా మదిని కౌతుకమ్ము లేదు.

హాయి మేయుచు శయ్యా గృహాంతరముల
పూలపాన్పులపై బడి పొంలుచున్న
మనుజ మహిషాల అడుగున మణగిపోయి
కమలిపోవగ మాకు నుత్కంఠలేదు.

తొడిమ త్రెదలించి చించి తంతువులతోడ
గొంతులు బిగించి దండలు గ్రుచ్చి మమ్ము
ముడుచుకొను మోహనాంగుల ముడులమీద
పేషనులు దిద్ద మా కభిలాష లేదు.

ప్రణయినీ మృదులాంగుళీ రచిత పుష్ప
దామమై ప్రేమమయు కంఠసీమ నలరి
వలపు కౌగిళ్ళ సందున నలిగి నలిగి
పరవశత నందు మాకు సంబరము లేదు.

ఒక ప్రశాంత ప్రభాతాన, ఒక్క మంద
మలయ మారుతవీచిలో పులకరించి
మెల్లగా తల్లి చల్లని కాళ్ళపైన
రాలి కనుమూసికొనుటె సార్థకత మాకు ॥

తిలకమ్ముగా దిద్ది తీర్చిన పూప జా
        బిలి రేక లేత వెన్నెలలు గాయ
చిరుబొజ్జ జీరాడు చికిలి కుచ్చెల చెంగు
        మురిపెంపు పాదాల ముద్దుగొనగ
జలతారు పూలకుచ్చుల వల్లెవాటుతో
        త్రాచు జందెములు దోబూచులాడ
కొలుచు ముప్పదిమూడుకోట్ల దేవతలపై
        చల్లని చూపులు వెల్లివిరియ
గౌరి కొమరుడు కొలువు సింగారమయ్యె
జాగుచేసినచో లేచి సాగునేమొ
తమ్ముడా! రమ్ము స్వామి పావములు పట్ట;
చెల్లెలా తెమ్ము పువ్వుల పళ్ళెరమ్ము.

కొలుచు వారలకు ముంగొంగు బంగారమ్ము
        పిలుచువారల కెల్ల ప్రియసఖుండు
సేవించు వారికి చేతి చింతామణి
        భావించువారికి పట్టుకొమ్మ
"దాసోహ" మనువారి దగ్గర చుట్టమ్ము
        దోసిలొగ్గినవారి తోడునీడ
ఆశ్రయించినవారి కానందమందార
        మర్థించువారల కమృతలహరి
జాలిపేగులవాడు – లోకాల కాది
దేవుడే మన పార్వతీదేవి కొడుకు!
చిట్టెలుక నెక్కి నేడు విచ్చేసినాడు;
అక్కరో! అర్ఘ్యపాత్ర మిట్లందుకొనవె!

లడ్డూ జిలేబి హల్వాలె యక్కరలేదు
బియ్యపుండ్రాళ్ళకే చెయ్యిచాచు
వలిపంపు పట్టు దువ్వలుపలే పనిలేదు
పసుపు గోచీకె సంబ్రాలుపడును
ముడుపు మూటల పెట్టుబడి పట్టువల లేదు
పొట్టి గుంజిళ్ళకే పొంగిపోవు
కల్కితురాయీలకై తగాదాలేదు
గరిక పూజకె తలకాయ నొగ్గు
పంచ కల్యాణికై యల్కపాన్పులేదు
ఎలుక తత్తడికే బుజా లెగురవైచు
పంచభక్ష్యాలకై మొండిపట్టులేదు
వచ్చి పడపప్పె తిను వట్టి పిచ్చితండ్రి.

కుడుము లర్పించు పిల్లభక్తులకు నెల్ల
యిడుములం దించి కలుము లందించు చేయి;
పార్వతీదేవి ముద్దులబ్బాయి చేయి;
తెనుగు బిడ్డల భాగ్యాలు దిద్దుగాక!

# అరుణ రేఖలు

'శ్రీ' శబ్దానికి లక్ష్మి, వైభవము, సంపద, శోభ, అభివృద్ధి ఐశ్వర్యము ఇత్యాదిగా అనేకార్థాలు ఉన్నవి. కావ్యంపేరు "ఉదయశ్రీ" బాగానే ఉన్నది కాని కవిపేరు 'కరుణశ్రీ' అనటంలో ఔచిత్యం ఏమున్న దని కొందరు పెద్దలు ధర్మసందేహాన్ని ప్రకటించారు. వ్యాకరణ వేత్తలం అనుకొనే మరికొందరు పండితులు ఈ శబ్దంమీద తర్జనభర్జనలు సాగించారు

"కరుణం" అంటే శోకరసం కదా-కరుణానికి "శ్రీ" ఏమిటి అనీ, ఒకవేళ దయార్థకం అయితే "కరుణాశ్రీ" అని ఉండవద్దా అనీ సాగ దీశారు.

పెద్దలయిన మన విమర్శకులకు మనవి చేస్తున్నాను. "కరుణశ్రీ" అంటే దయామయమైన శ్రీ కలవాడని అర్థం. ఈ పదాన్ని బుద్ధదేవునికి పర్యాయ పదంగా నేను స్వీకరించాను. ఆ దివ్యనామాన్నే కావ్యం పేరుగా కలంపేరుగా నేను అందుకొన్నాను.

అటువంటప్పుడు 'కరుణాశ్రీ' అని ఉండవద్దా అంటారేమో! అవసరంలేదు. "కరుణశ్రీ" అనే ఉండవచ్చు. భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు తనకు ప్రియమైనభక్తుడు ఎటువంటివాడో వివరిస్తూ అర్జునునితో అంటాడు —

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ"

ఇక్కడ "కరుణః" అంటే కరుణాగుణంతో కూడినవాడు అని పెద్దలు వ్యాఖ్యానించారు. కనుక "కరుణశ్రీ" అంటే దయామయమైన సంపద కలవాడనీ, ఆ పదం వ్యాకరణశుద్ధమేకాని ఏ మాత్రం విరుద్ధం కాదనీ విజ్ఞులకు విన్నవిస్తున్నాను.

"ఉదయశ్రీ - విజయశ్రీ - కరుణశ్రీ ఈ మూడు కావ్యాల్లో మీ అభిమాన కావ్యం ఏది?" ఈ విధంగా చాలమంది మిత్రులు నన్ను ప్రశ్నిస్తుంటారు. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం కొంచెం కష్టమే. ఎందువల్లనంటే కవికి తన కావ్యాల్లో దేనిమీదా తక్కువ ప్రీతి ఉండదు కనుక.

అయినా యిందుకు నా ప్రత్యుత్తర మిది : ఉదయశ్రీ నా హృదయం - విజయశ్రీ నా శిరస్సు - కరుణశ్రీ నా జీవితం.

ఉదయశ్రీ మొదటిభాగం రసజ్ఞుల ఆదరాభిమానాలు అపారంగా అందుకొన్నది ప్రతి సంవత్సరం పునర్ముద్రణం తప్పనిసరి అవుతున్నది. ఈ విధంగా ఇప్పటికి నలభైఆరు ముద్రణలు వెల్లి ఇప్పుడు నలభై ఏడో ముద్రణం నడుస్తున్నది. సహృదయులూ సుహృదయులూ అయిన పాఠకలోకానికి నా సాధువాదాలు.

ఇప్పుడు ఇది "ఉదయశ్రీ" రెండవ భాగం. ఈ భాగంకూడా "ఇరవై ఆరు" ముద్రణలు గడచి "ఇరవై ఏడో" ముద్రణం నడుస్తున్నది. ఇందులోని కిరణాలు అరుణారుణాలు - ఉజ్వలాలు - ఉల్లాసాన్నీ ఉత్సాహాన్నీ రేకెత్తించే చైతన్యరేఖలు.

ఇందులోని 'ధర్మపరుడు' 'పురుషోత్తముడు'. అనే ఖండికల విషయంలో నా భావనవేరు. అనుశ్రుతంగావచ్చే 'జనశ్రుతి'కి ఒక ఉపశ్రుతి మేళవించాను. విజ్ఞులు ఉచితజ్ఞులు ఐన రసజ్ఞులు సవిమర్శంగా దర్శిస్తారనీ భావుకత్వంతో పరామర్శిస్తారనీ విశ్వసిస్తున్నాను.

ఈ కావ్యంలో వాడిన 'హిందూ' 'హైందవ' శబ్దాలు విశాల హిందూజాతికీ అఖండ భారతావనికీ అపార హైందవసంస్కృతికీ స్ఫోరకాలు.

ఈ కావ్య నిర్మాణంలో నాకు అనేక విధాలుగా చేదోడు వాదోడుగా ఉన్న అభ్యుదయ మిత్రులు శ్రీ "ధనకుధరం వెంకటాచార్య"కు నా అభినందనాలు.

ఆదరంతో అభిమానంతో అనురాగంతో ఆప్యాయంగా నా రచనలు అందుకొంటూ ఉన్న ఆంధ్రరసజ్ఞలోకానికి చిన్నలకూ పెద్దలకూ నా కృతజ్ఞతాపూర్వక నమోవాకాలు మరో మాటు సమర్పిస్తున్నాను —

మీ

"కరుణశ్రీ"

# స్వతంత్రభారతి

'గణగణ' మ్రోగెరా విజయఘంటలు భారతమాత మందిరాం
గణమున; ధ్వజబంధములఁ గట్టిరి చిత్ర విచిత్ర రత్న తో
రణ తతి; వీధివీధుల విరాజిలుచున్న వపే త్రివర్ణ కే
తనములు; మేలుకాంచె పరతంత్ర పరాఙ్ముఖ సుప్త కంఠముల్.

కంటికి కజ్జలమ్ము నిడి, ఖద్దరుచీర ధరించి, నేఁడు పే
రంటము పిల్చుచున్నది స్వరాజ్యవధూమణి ప్రక్కయింటి వా
ల్గంటుల; కర్ణపేయములుగా ప్రవహించె 'స్వతంత్ర భారతీ'
మంటపమందు శాంత సుకుమార మనోహర గాన వాహినుల్ ॥

'పాటాగొట్టి' పరప్రభుత్వమునకున్, బ్రహ్మాండమౌ శాంతి పో
రాటంబున్ నడిపించినాఁడు మన 'వార్ధాయోగి' ఆంగ్లప్రభుల్
మూటల్ ముల్లెలు నెత్తికెత్తుకొని నిరుత్సాహులై సంద్రముల్
దాటంజొచ్చిరి; నవ్వుకొన్నవి స్వతంత్ర స్వర్ణ సోపానముల్ ॥

'నేతాజీ' ప్రతిభా ప్రతాపములు; 'గాంధీతాత' సత్యాగ్రహ
జ్యోతిర్దీప్తులు; 'దేశభక్తుల' అఖండోత్సాహముల్; విశ్వ వి
ఖ్యాతంబైన 'అగస్టు విప్లవ' మహాగాథల్, సమైక్యమ్ములై
స్వాతంత్ర్యధ్వజ మెత్తె భారత మహాసౌధాగ్ర భాగమ్ములన్ ! !

లారీ పోటులు పూలచెండ్లు, చెరసాలల్ పెండ్లివారిండ్లు, ఏ
కాఠిన్యం బయినన్ సుఖానుభవమే, "గాంధీ కళాశాల"లో
పాఠంబుల్ పఠియించు శిష్యులకు; తద్ బ్రహ్మాస్త్ర సంధానమే
పీఠంబుల్ కదలించి సీమలకుఁ బంపెన్ శ్వేత సమ్రాట్టులన్.

ప్రస్థానించిరి త్యాగమూర్తులు పవిత్రంబైన "శ్రీ కృష్ణ జ
న్మ స్థానంబున" కెందరో; నిహతులైనారెందరో శౌర్య ధై
ర్య స్థైర్యంబులు చూపి విప్లవ సముద్రంగమ్ములన్; వారి సు
ప్తాస్థి శ్రేణికలే పునాదులట మా స్వారాజ్య సౌధాలకున్ ! ! !

నీదేనోయి సమస్త భారతము తండ్రీ ! యింక నీ గద్దెపై
లేదోయీ యధికార మెవ్వరికి ! పాలింపంగదోయీ ! ప్రపం
చావర్జ్యంబుగ, సర్వమానవ సమాహ్లాదంబు సంధిల్ల, నీ
వైదుష్య ప్రతిభా విశేషములు విశ్వమ్మెల్ల కీర్తింపగన్ ! ! !

# అరుణహస్తము

అర్ధమరేయి నా సదనమందు పదంబిడి, పట్టు పాన్పుపై
నిద్దురవోవు నన్ను నవనీత కరమ్మున తట్టిలేపి, నీ
ముద్దుల కళ్ళతో భువన మోహన రేఖలు నా ముఖమ్ముపై
దిద్దుచునున్న సౌహృదవతీ! వచియింపుము నీ వెవర్తవో?

ఎవ్వతె వీవు? మంగళమయీ! మెలమెల్లఁగ కున్కిపోవు నా
దివ్వియ పెద్దచేసి నవదీప్తుల నింపితి వింటినిండ; నీ
నవ్వు తరంగ మాలల వినంబడు 'విశ్వరహస్య' నిస్వనా
లెవ్వియొ! భాగ్యముల్ పరువులెత్తెడు నీ కడగంటి చూపులన్!!!

చెక్కుల పాటలప్రభలు చిమ్మ దయాపరిపూర్ణ దృక్కులన్
చిక్కని ప్రేమరాగములు చింద, నవారుణ హస్తమెత్తి ఆ
దిక్కుకు చూపినావు! గురుతించితి నీ యనుశాసనంబు నో
చక్కనితల్లి! నా 'కరుణసాహితి' కింక నవోదయంబటే!!'

# మహాత్ముఁడు

నలువదికోట్ల తమ్ముల జీవితమ్ముల
    కాయన మాట 'వేదాక్షరంబు'
భీరులనే కర్మవీరులఁ గావించు
    'ఆయన పిలుపు శంఖారవంబు'
సత్యంబు శాంత్యహింసలకు స్వాగతమిచ్చె
    ఆయన బ్రతుకు 'మహా ప్రయాగ'
కొల్లాయితో పిచ్చిపుల్లాయి వలె నుండు
    ఆయన దీక్ష 'లోకైక రక్ష'

అతఁ డొక 'పవిత్ర ధర్మదేవాలయంబు'
అతఁడొక 'విచిత్ర విశ్వవిద్యాలయంబు'
ఆ మహాశక్తి 'అంత యిం'తంచు తూఁచఁ
జాల, మతఁ డొక పెద్ద 'హిమాలయంబు'.

# నే తా జీ

నడిపించినావు ! సైన్యములు వేలకువేలు
స్వాతంత్ర్య భారత సమరమునకు !!
జడిపించినావు ! చంచచ్చంద్ర హాసంబు
తెల్లవారల గుండె తల్లడిల్ల !!
విడిపించినావు ! జీవితమెల్ల బలిచేసి
భరతపుత్త్రిల దాస్యబంధనములు !!
తుడిపించినావు ! నీ యుడుకు నెత్తురుతోడ
పారతంత్ర్య కళంక పంకరేఖ !!

బాపుజీకి, పటేలుకు పనికిరాక
కరగి—కడలంటి—ఒక 'తరంగమవు' ఒక 'మ
హా ప్రవాహమ్మ'వై—తల్లి యడుగులంట
పొరలి ప్రవహించితివి సెబాసుర ! సుభాసు !!!

అల్లల్లాడిన యాంగ్లశాసకుల రాజ్యస్తంభముల్ నీ 'చలో
ఢిల్లీ' యన్న మహానినాదమునకున్; ఢీకొట్టె నీ శక్తి 'లాల్
ఖిల్లా'లోని నిరంకుశత్వ పశుశక్తిన్; దేవతాహస్తముల్
చల్లెన్ నీ రణభేరిపై నవయుగస్వాతంత్ర్య పుష్పాంజలుల్ !!!

'ఆజాద్ హిందు' మహాప్రభుత్వమున కధ్యక్షుండవై యే మహా
రాజుల్ గాంచని కీర్తి గాంచి, పరిపూర్ణస్వేచ్ఛకై జీవితం
బాజన్మాంత మఖండ యజ్ఞమున 'స్వాహా' చేసి మా పూజ్య నే
తాజీ వై దిశలన్ వెలార్చితివి స్వాతంత్ర్యప్రభాతప్రభల్ !!!

హిందూ ముస్లిము లేకకంఠమున 'జైహిం'దంచు నీ బావుటా
క్రిందన్ నిల్చి పురోగమించిరచె కేల్ కేల్ రాయుచున్, నేఁడిటుల్
హిందూస్థానము చీలిపోదుగద నీవే యున్నచో; నెత్తురుల్
చిందంబోవుగదా జగజ్జనని సుస్నేహార్ద్ర వక్షమ్ముపై !

'దేశద్రోహి' యటంచు నిన్ను గని సందేహించెనా నీ మహో
ద్దేశంబున్ గ్రహియింపఁజాలని పరాధీన ప్రజాబుద్ధి; నీ
'యాశాజ్యోతి' స్వతంత్రభారతము నేఁ డానందబాష్పాలతో
నీ శౌర్యోన్నతి కంజలించినది తండ్రీ; తప్పు మన్నింపరా !!

శాంతికి క్రాంతి నేరిపి, ప్రజా హృదయాబ్జములన్ సువర్ణ సం
క్రాంతులు జాలువాఱిచి, జగత్తుకు వేడివెలుం గొసంగు "భా
స్వంతుఁడ" వీవు; తావక యశస్సులు భారతమాత మౌళిపై
దొంతరమల్లె లైనవి గదోయి! ప్రఫుల్ల పరీమళమ్ముతో!

నీ వీరత్వము, నీ దృఢవ్రతము, నీ నేతృత్వమున్, నీ ప్రజా
సేవౌత్కంఠ్యము, నీ పురోగమన వైచిత్ర్యంబు; నీ సాహస
శ్రీవాల్లభ్యము గాంచి పొంగి పులకించెన్ విశ్వ విశ్వంభరా
భావోద్యానము—నీ శుభోదయము సౌభాగ్యమ్మురా జాతికిన్!

తమ్ముల నిద్రలేపి, చిర దాస్య తమస్సులు వాపి, వెల్గులన్
జిమ్ము పథమ్ముఁ జూపి విలసిల్లెడు దివ్య 'సువర్ణ సుప్రభా
తమ్మవు' నీవు; నీ జయ పతాకము నీడల నిల్చినారు భా
వమ్ముల జాతివర్ణమత వర్గ విభేదము మాని, యెల్లరున్!

'దాసోహ'మ్మని పశ్చిమప్రభుల పాదమ్ముల్ తలందాల్చు నౌ
దాసీన్యంబు సహింపఁజాలని పవిత్రక్షాత్ర కర్తవ్య దీ
క్షాసంరంభము పొంగి వెల్లువలు కాగా—తన్మహా విప్లవో
ల్లాసంబున్ జనముల్ 'సుభా' సనుచుఁ బిల్వంజొచ్చి రుత్కంఠమై.

'జైహిం'దన్న మహా నినాదము ప్రజాస్వాతంత్ర్య మంత్రమ్ముగా
వ్యాహరింతురు భారతీయు లికముం దాచంద్రతారార్కమున్;
మా హృత్పద్మవనాంతరాంతర గళ న్మారంద ధారా పరీ
వాహంబుల్ పయనించు తావక మహత్త్వశ్రీ పదస్పర్శకున్ ! !

సింగారమ్ములు చిందు మంగళ సుధాశీకమ్ము లౌ నీ కనుల్ -
అంగారమ్ములు చిమ్మె స్వార్థపరతాహంకార శీర్షాలపై;
బంగాళ మ్మది నీ మహోదయమునన్ భావిప్రపంచమ్ములో
బంగారమ్ములు పూయురా ! విజయ శోభా వైభవోపేతమై ! !

"పొంగెడు గుండెలో పొరలిపోయెడు క్రాంతి కవోష్ణ రక్తమే
చెంగలువల్ గులాబులుగ చేసెను తల్లికి పాదపూజ మా
బంగరు బోసుడా" బనుచు, భారతభాగ్యవిధాత గాంధి క
న్నుంగవ నీరుపెట్టెను అనుంగు సహోదరు నిన్ దలంచుచున్.

నీ తేజోమహిమంబు మా హృదయమందే కాదు, విశ్వ ప్రజా
చేతోవీథుల కాంతిరేఖలు వెలార్చెన్; ఖండ ఖండాంతర
ఖ్యాతంబుల్ భవదీయ పౌరుష యశోగాథల్ లిఖింపంబడున్
స్వాతంత్ర్యోజ్జ్వల 'వీరభారతకృతిన్' సౌవర్ణవర్ణాలతో ! !

# ఆగష్టు విప్లవము

అది యొక విశ్వ విప్లవ మహా శివరాత్రి ।। పరాజితప్రజా
హృదయము పొంగులెత్తి ప్రవహించిన వెచ్చనివేళ యద్ది ।। అ
య్యది పరదాస్య శృంఖలములందు కృశించెడి భారతాంబ క
భ్యుదయముహూర్త। మట్టిటులనూగెను నాఁడు ప్రభుత్వసౌధముల్।

అయ్యది తమ్మి మొగ్గరమునం దభిమన్యుఁడు రాజరాజుపై
కయ్య మొనర్ప క్రోధమున ఖడ్గము దూసిన క్రాంతిలగ్నమే ।।
అయ్యది వీరభారత మహత్తరశక్తి పరప్రభుత్వముఁ
వెయ్యిముఖాలతో కలిచివేసిన విశ్వవిహార యాత్రయే ।।

పారావారమునే దురాగ్రహముతో బంధింప నుంకించిరా
కారాగారములోన ।। విప్లవ తరంగాల్ పొంగి మిన్నంటి తద్
ద్వారమ్ముల్ పడఁగూల్చి బంధములు బ్రద్దల్ సేసి స్వేచ్ఛాఝరీ
పారంపర్యము నింపునం చెలుఁగరో పాశ్చాత్యభూమింజయుల్ ।।

ఉదయశ్రీ

లేచిపోయినవి పోలీసుల టోపీలు
వందలువేలు రాబందులట్లు
కాలిపోయినవి సర్కారు కచ్చేరీలు
ఖరదూషణాదుల కాష్ఠమట్లు
తెగిపోయినవి తంతితీగెలు భారతీ
యుల పారతంత్ర్య శృంఖలములట్లు
తరలిపోయినవి క్రిందకు రైలుపట్టాలు
పాశ్చాత్యరాజ్య సౌభాగ్యమట్లు

ఒకటి యనుటేమి నాఁటి మహోద్యమమున
రేగిపోయిన ప్రజల యుద్రేకమునకు
అల్లకల్లోలమై దద్దరిల్లిపోయె
తెల్లదొరల ప్రభుత్వ మందిరము తెల్ల.

భారత వీరవిప్లవ విపంచిక భావిచరిత్రకారుఁ డే
తీరున మేళవించునొ గదే ! యువయోద్ధల వేడిరక్తపుం
జాఱలు చూచి యశ్రువులు జాఱవొ కన్నుల, వేడివేడి ని
ట్టూరుపు లెట్టులాపుకొనునో ! ఎటులన్ స్వరముం బెకల్చునో !

# కాంగ్రెస్ రథము

ధన్యజీవనుఁడు "దాదాభాయి నౌరోజి"
ఘనకీర్తి "బాలగంగాధరుండు"
తనయంత కొమరుని గనిన "మోతీలాలు"
ప్రాజ్ఞుండు "మాళవ్య పండితుండు"
సౌజన్యవారాశి "రాజేంద్రబాబు" సు
ధీమాన్యుఁ "డబ్దుల్ కలామజాదు"
ఉత్తేజితమనస్వి "చిత్తరంజనదాసు"
శౌర్యవార్నిధి "సుభాస్ చంద్రబోసు"

"అనిబెసెంటు" "బాపూజి" "జవహరు" పటేలు"
"కృపలనీ" ఎక్కినట్టి కాంగ్రెసు రథమ్ము
నీ వధిష్ఠించితివి నేఁడు నేర్పుమెఱయ
నడపి పట్టాభి ! ప్రజల మన్ననలఁ గొనుము !!

# భగత్ సింగ్

చెంగున దూఁకెరా కుపిత సింహ కిశోరముభంగి మా 'భగత్
సింగు' బ్రిటీష్ మహాగజము శీర్షముపై; నవభారతమ్ములో
పొంగులువాఱె విప్లవ సముద్రము కట్టలుదాటి; ఎత్తెరా
మంగళహారతుల్ భరతమాతకు తద్రుధిరారుణాంశువుల్ ।।

ని న్నురిదీసి మా యెదద నిప్పు రగిల్చిరి కూటనీతి సం
పన్నులు శ్వేతజాతి పరిపాలకు; లీ హృదయాగ్ని కీల లిం
కెన్ని యుగాలకైన శమియించునె । నీ స్మృతు లంకితమ్ములై
యున్నవి మా వృగంతముల నొక్కొక్క వెచ్చని బాష్పబిందువై ।।

బాంబులు ప్రేలెరా బ్రిటిషు బాబుల గుండెలలో భవచ్చరి
త్రంబు స్మరించు మాత్రనె; స్వతంత్ర పథావ పురోగమించు నీ
వెంబడి పర్వులెత్తినవి విప్లవశక్తులు; నీ కవోష్ణ ర
క్తంబులు మా లలాట ఫలకమ్ములపై తిలకమ్ము లయ్యెరా ।।

# అల్లూరి సీతారామరాజు

పాశవశక్తితో ప్రజలపైఁ బడు నీచ నిరంకుశత్వమున్
నాశమొనర్ప దీక్షగొనినావటె! భారతభూమి విప్లవా
వేశము పొంగులెత్త ప్రభవించిన రోచిరుదాత్త వీచికా
రాశి వటే! తెలుఁగు కజరామరణంబులు నీ చరిత్రముల్!

క్షాత్రము రూపుగైకొనిన సాహసికున్ నిను గాంచి భారత
క్షేత్రమునందు పొంగి పులకించినదోయి త్రిలింగజాతి; సు
క్షత్రియవీర! నీ విజయ శంఖము బ్రద్దలుసేసె శాత్రవ
శ్రోత్రములన్! భవత్పదము సోఁకుట మన్యము ధన్యమయ్యెరా!

రాచరికంపు రక్కసి కరమ్ములు సాచి అమాయిక ప్రజన్
దోచుపరప్రభుత్వమును దోచిన రాజుల చిన్నవాఁడ! వీ
రోచితమైన తావకమహోద్యమ మాంధ్ర పురా పరాక్రమ
శ్రీ చరణమ్ములందు విరజిమ్మె నవారుణ విప్లవాంజలుల్!!

గాము దొర లిర్వు రంగరక్షకులు గాగ
విండ్లు గొని భిల్లసైన్యాలు వెంబడింప
ధర్మకౌక్షేయకమ్ము హస్తమునఁ దాల్చి
దుమికితివి తల్లి దాస్య బంధములు ద్రెంప।

దోపిడీల్ సేయు 'దొంగలదొర' వటంచు
పేలుకొనుగాక తెల్లమొగాలు నిన్ను;
దేనిపై దోపిడీ చేసితివి? దురాగ
హమ్ముపైన।। నిరంకుశత్వమ్ముపైన।।

జీవితేశ్వరు నిన్ను దర్శింపలేక
ప్రణయవతి ప్రాణమే సమర్పణమొనర్చె;
ఆమెతోడ సమైక్యమ్మునంది 'రామ
రాజ' వెల్ల 'సీతారామరాజ' వైతి।

పౌరుషము, పట్టుదల, దేశభక్తి, ధైర్య
సాహసమ్ము లనన్యాదృశములు గాగ
తెలుఁగుగుండెలు వెలిగించితివి, స్వతంత్ర
యజ్ఞమున నిందు బ్రతుకు 'స్వాహా' యొనర్చి।।

దోసిలియొగ్గి ప్రార్థనలతో నిను దోడ్కొనిపోయిరంట పో
లీసులు ! దేవదేవునివలెన్ పరిచర్య లొనర్చిరంట ! నీ
దాసుల మంచు తావక పదమ్ముల సన్నిధి నాయుధమ్ములన్
రాసులుపోసిరింట ! బళిరా ! భవదీయ మహాప్రభావముల్ !!

కళవళమందె నీ 'మిరపకాయ టపా'కు ప్రభుత్వ మిల్టరీ
దళములు; నీ విజృంభణకు తల్లడిలెన్ పఠుశక్తి; సర్వదా
తళతళలాడు నీ సుచరితమ్ములు భారతభారతీ మహో
జ్జ్వల మకుటాగ్రమందు విలసద్రుచి రంజిత రత్నపుంజముల్ !!

# తెలుఁగు వెలుఁగులు

నాగార్జునాద్రి నున్నని పాలరాలపై
శ్రీలు చిందించె మా శిల్పబాల
విద్యానగర మంజులోద్యాన వీథుల
నవ్యతల్ నెరపె మా కావ్యకన్య
త్యాగరాయల ప్రేమ రాగ డోలికలలో
కమ్మగా నూగె మా గానలక్ష్మి
ఏకశిలాపురీ ప్రాకార శిఖరాల
విహరించె మా వీర విజయరాజ్ఞి

దిక్కు దిక్కుల కీర్తిచంద్రికలు నింపి
వెలుఁగులు వెలార్చుకొనియె మా తెలుఁగుతల్లి
నా పురా వైభవానంద నందనమున
నవ్వుకొన్నవి నవ వసంతమ్ము లెన్నొ ॥

# పురుషోత్తముండు

భారతదేశచరిత్ర భారతీయులే వ్రాయక పోవడం మన దురదృష్టం. మొదటినుంచీ మన వారికి పరబ్రహ్మమీదే గాని భౌతిక ప్రపంచం మీద విశేషాభిమానం లేకపోవ డమే దీనికి కారణ మనుకుంటాను.

ప్రపంచ విజేతగా సుప్రతిష్ఠితు డౌదామన్న కాంక్షతో పురోగమించిన గ్రీకు దేశాధిపతి అలెగ్జాండరు భారతభూమిలో పురుషోత్తము నితో ప్రతిఘటించి పరాజితుడై తిరోగ మించాడు.

ఈ యథార్థాన్ని కప్పిపుచ్చి స్వార్థపరులైన గ్రీకు చరిత్రకారులు తమ గ్రంథాల్లో అలె గ్జాండరును విజేతగానూ పురుషోత్తముని పరాజితునిగానూ చిత్రించారు.ఆంగ్ల చరిత్ర కారులుకూడా వీరికి తాళం వేస్తూ ఆ అభి ప్రాయాన్నే మనకు అందించారు.

విమర్శనాదృష్టిలేని మన చరిత్రాధ్యాపకులు
అలెగ్జాండరు దండయాత్ర దగ్గరనుండి
అగష్టు విప్లవందాకా ఈ అసత్య అనర్థక
బీజాలనే మన విద్యార్థుల హృదయక్షేత్రాల్లో
నాటుతూ ఉంటారు.]

క్షాత్రతేజస్సు భారతక్షేత్ర మెల్ల
కాంతులీనిన స్వర్ణసంక్రాంతు లవ్వి;
భరతపుత్రుల కీర్తిసంపదల పంట
గాదెలకు పోసికొన్న యుగాదు లవ్వి ॥

హైందవ పతాక లాకాశమందు కెంపు
లారవోసిన యరుణోదయమ్ము లవ్వి;
భారతసవిత్రి సౌభాగ్య భాగ్య రేఖ
నవ్వినాట్యాలుసేయు దినమ్ము లవ్వి ॥

నాఁడు పాంచాల మేలుచున్నాఁ డపార
శౌర్యమూర్తి, దిగంత విశ్రాంత కీర్తి;
మత్త మాతంగ యూధ సంపత్తి వెలయ
నుత్తమ గుణోన్నతుఁడు పురుషోత్తముండు.

ఆ పురుషోత్తమప్రభు మహత్తరచిత్తము ధైర్యలక్ష్మికిన్
గాపురమయ్యె, వాని కడకన్నులు ప్రాక్తన భాగ్య రాశికిన్
దీపిక లయ్యె, దిగ్విజయదేవికి తత్ ప్రతిభా ప్రతాపముల్
నూపుర యుగ్మ మయ్యె, సుమనోజ్ఞము లాతని భారతీయతల్ ॥

"రంగులు చిందు సుందర కరమ్ములతో నవ మోహనాంగులై
యంగడి రాశిపోసికొని యమ్ముదు రంట మణుల్ సతీమణుల్;
బంగరు కొండలున్; రజిత పర్వతముల్, గల వంట భారత
ప్రాంగణ మం" దటంచు బహుభంగుల చారులు విన్నవించినన్—

గండరగండఁడై భరతఖండమునెల్ల జయించు కాంక్ష, ను
ద్దండ తురంగ సైన్య సముదాత్త జయాభ్యుదయుం, డఖండ దో
ర్దండ పరిస్ఫురద్యవన రాజ్య రమా రమణీయుఁడ 'య్యల
గ్జాండరు'వచ్చె భూవిభులు కాన్కలతో నెదు రేగుదేరఁగన్.

వచ్చుచునున్న య య్యవనవాహిని కడ్డమువచ్చి స్వాగతం
బిచ్చెను వీర భారత నరేంద్రుఁడు క్షాత్రకులోచితంబుగన్;
రెచ్చి పరాక్రమించి యెదిరించి రణం బొనరించినారు గో
ర్వెచ్చని రక్తధారలు ప్రవింపఁగ గ్రీకులు భారతీయులున్.

అక్షీణప్రతిభా బలాఢ్యము, రణవ్యాపార పారీణమౌ
లక్షా యిర్వదివేల సైన్యము జయోల్లాసంబునం దోడురాన్
దక్షత్వమ్మునఁ బోరు గ్రీకు ప్రభువుం దర్శించి జీలంనదీ
వక్షం బెంతయు తల్లడిల్లె; భవితవ్యం బెంత సందిగ్ధమో!

తమ తుండమ్ములఁ జుట్టుచున్, ధరణిమీఁదఁ గొట్టుచున్, శత్రుసై
న్యములన్ ధ్వంస మొనర్చె భారత మహేంద్రస్వామి మత్తేభ యూ
థము, పాంచాల యశోధురంధర సముద్యద్ యుద్ధభేరీ నినా
దము లాక్రాంతదిగంతరాళములు బ్రద్దల్ సేసె బ్రహ్మాండమున్.

భారత వీర సైనికుల బాణ పరంపర గ్రీకు రక్తపుం
ధారల స్నానమాడినది, తల్లడమంది చమూ సమూహముల్
పాఱె, హఠాత్తుగా యవనభాగ్యవిధాత తురంగ మంతలో
ధారణిఁ గూలె, ఆర్య వసుధాపతి బల్లెపు బాకు పోటునన్.

ఆశ నిరాశయై, వివశుఁడై వశుఁడయ్యె నఖండ సంగరా
వేశము దక్కి గ్రీకు పృథివీపతి భారత చక్రవర్తికిన్;
దేశజిగీషమై అరుగుదెంచి పరాజితుఁడైన శౌర్య వా
రాశి సికందరుం గని దరస్మితుఁడై పురుషోత్తముం డనెన్ —

'శూర శిరోమణీ ! రిపునిషూదన ! విశ్వజిగీషమై యసా
ధారణులైన గ్రీకు సరదారులతో చనుదెంచినారు; మా
భారతభూమిలో మెరకపట్టి భవజ్జగదేక జైత్ర యా
త్రా రథ మాగిపోయెను — కదల్చగలే రదుగైన ముందుకున్ !

హిందూ గ్రీకులు వియ్య మందుకొని సాహిత్యమ్ము విజ్ఞానమున్
సౌందర్యమ్మును పంచిపెట్టినవి విశ్వమ్మెల్ల; స్వార్థమ్ముతో
హిందూస్థానము గెల్వవచ్చితిరి మీరీనాఁడు, మా ముంగిటన్
బందీలైతిరి !! మారిపోయినవి మీ మా పూర్వబాంధవ్యముల్ !

లక్ష సువర్ణఖండములు లంచ మొసంగి, రహస్య వైఖరిన్
తక్షశిలాధినాథుని మనస్సును మాటిచి నేర్పుగా భవ
త్పక్షము త్రిప్పుకొంటిరి; ప్రపంచ విజేతల రాజనీతికిన్
లక్షణ మిట్టిదా ! విజయలాలస యింతటి గ్రుడ్డిదయ్యెనా !

పట్టపగల్ నదిం గడవ ప్రౌఢిమ చాలకగాదె గ్రీకు స
మ్రాట్టులు అర్ధ రాత్రి అపమార్గమునం బడి పోయినారు; మీ
పట్టుదలల్ విదేశముల పైఁబడిదోచుటయా ! చరిత్రలో
నిట్టి విచిత్రముల్ వినిచెనే భరతావని యెన్నదేనియున్ ?

ఆ రజనీ హృదిన్ రణ రహస్యము లెట్టి విచిత్రవేషముల్
మారుచుకొన్నవో గగనమండలమే యెఱుఁగున్; ఘనాఘనా
సార మెఱుంగు; నంధతమసం బెఱుఁగున్; ఎఱుగున్ నదీ పయః
పూరము—నాఁటి ప్రొద్దుపొడుపుల్ భరతోర్వికి సుప్రభాతముల్?

'భారతభూమిలో పిఱికిపందకు స్థానము లేదు, లేదు మా
పౌరుష వాణికిన్ శిధిలభావము, శత్రువు యోగ్యుఁడైనచో
గౌరవమిచ్చి గౌరవము గైకొను పద్ధతి మాది, తెల్పుఁ డే
తీరున నేఁడు మిమ్ము గుఱుతింప మటందురో" యంచు బల్కినన్.

'వీరులు మీరు, నేను నొక వీరుఁడ, వీరు మఱొక్క వీరుఁ డే
తీరున గౌరవించునో అదే క్రియ గాంచుఁ'డటంచు ధీర గం
భీర గళమ్ముతో పలికి మిన్నక నిల్చిన 'గ్రీకు రాజ కం
ఠీరవు' గాంచి ముచ్చటపడెన్ పురుషోత్తమచక్రవర్తియున్.

బంధవిముక్తుఁ జేసి ప్రియ భావముతో యవనేశునిన్ సుహృ
త్సంధి నియుక్తు జేసె నృపసత్తముఁ డాపురుషోత్తముం; డిటుల్
సంధిలె మైత్రి నాగరక జాతులు రెంటికి; నిట్లు గ్రీకు గ
ర్వాంధ తమస్సు "లాఱుపది"యైనవి భారత భాను దీప్తికిన్.

గ్రీకు చరిత్రకారులు లిఖించిన స్వాతిశయార్థ గాథలే
గైకొని ఆంగ్ల పండితులు కట్టుకథల్ రచియింప, వానికే
తోకలు చేర్చి గ్రంథముల దూర్చిరి దానిన భారతీయ చా
ర్వాకులు ! ! సత్యసూక్తి నుడువం డొకఁడున్ సవిమర్శకమ్ముగన్.

భంజన పాండితిం గని ప్రపంచము గెల్వఁ దలంచు గ్రీకు మా
ర్తాండుఁడు నేఁటి కొక్క భరతక్షితిపాలున కోడె నన్న బ్ర
హ్మాండము మున్గిపోయినటులై కథ నద్దము ద్రిప్పినా—'రల
గ్జాండరు' జేతయా ! విజితుఁడా 'పురుషోత్తముఁ'డింత మోసమా !

'ప్రాకట శౌర్య ధైర్య పరిపాకులు, వీరరసప్రతీకులౌ,
గ్రీకులు కాందిశీకు లయి కేల్గవ మోడ్చిరి వీర భారత
శ్రీ 'కను దుర్యశమ్ము తమ శీర్షముపైఁబడకుండ చల్లఁగా
లోకము కన్నుగప్పి, రెటులో మసిపూసిరి వాస్తవమ్ముపై ! !

# వేమన యోగి

యోగిరాజువో కవిరాజువో వచింపు :
మా యతిగణాలు ప్రియమొ ఈ యతిగణాలొ ?
ఖ్యాతియో గీతియో ప్రీతి ? చేతిలోని
దాత్మబోధామృతమొ కవితామృతమ్మొ : :

తళుకు లీనెడు చెక్కుటద్దాలమీఁద
జాఱిపోలేదు కోరమీసాల సొగసు;
తఱుఁగనేలేదు మంజులాధరములోని
రక్తిమ; మ్మింతలోన విరక్తియేమి ?

పొలుగాఱెడు నీ ఫాలఫలకమందు
చెఱిగిపోలేదు రాజ్యలక్ష్మి పదాలు
పసిడిమేడలు విడనాడి పల్లెటూళ్ళ
వైపునకు సాగిన విదేమి నీ పదాలు ?

"కవియో! యోగియో! తత్వదర్శకుఁడో! సాక్షాద్దక్షిణామూర్తియై
శివుఁడే వచ్చెనొ కొండవీటి కిటులన్ శిష్యాళితో" నంచు ని
న్నవలోకింపఁగ పల్లెపట్టు ప్రజ లంతా వచ్చుచున్నారు; నీ
వెవరయ్యా ? తెలుగుంబొలాలపయి విన్పించెన్ భవద్గీతికల్ !

గోచీ పెట్టెను పెట్టలే దనుటకున్ గొట్లాట; తిమ్మన్నకున్
ప్రాచీనుం డని, కాదు తిక్కనకు నర్వాచీనుఁడం చేదియో
పేచీ; యీ సిగపట్ల గోత్రముల కచ్చే నేను పోలేను; నీ
వాచామాధురి నీ నిరర్గళ కవిత్వస్ఫూర్తిఁ గీర్తించెదన్.

తెలుఁగుదనమ్ము ఆటవెలఁదిన్ జతగూర్చు కవిత్వతత్వ వే
త్తల తలమానికంబవట ! ! తావక నిర్భయ నీతి దీపికల్
వెలుఁగులు చిమ్మె జానపదవీథుల, మా తెలుఁగమ్మ గుమ్మముల్
కళకళలాడె నీ కృతులు గట్టిన పచ్చని తోరణాలతో !

అభిరామాకృతులైన నీ కృతులు నవ్యత్వాభిరామమ్ములై
ప్రభుతం గన్నవి యావదాంధ్రజన హృత్పద్మమ్ములన్, భాను స
న్నిభ ! యుష్మత్కవితారుణప్రభలు నిండెన్ గేహగేహాల; మా
యభివాదమ్ములు గొమ్ము వేమన కవీంద్రా ! కర్మయోగీశ్వరా !

సంఘ సంస్కర్తవై దురాచార విష వి
దగ్ధ జగతికి నూత్న చైతన్య మొసఁగి
త్రోవ చూపించినావు ముందునకు నీవు -
మంచి మొనఁగాడవయ్య? వేమన కవీంద్ర!

నీ మనోహర మకుట సన్నికటమందు
వెలుఁగుబాటలు గన్నారు తెలుఁగువారు;
వెలయుచున్నారు సాహితీవీథులందు
నెందఱో పిల్ల వేమన్న లిప్పుడిపుడు.

# పాకీ పిల్ల

[ఉదయం సుమారు ఏడుగంట లవుతుంది.
బజారున వస్తున్న దొక పాకీపిల్ల. చేతిలో
చీపురుకట్ట-చంకన చింపిరితట్ట. బాలభానుడు
తన లేత కరాల్తో ఆమెను లాలిస్తున్నాడు.
భగవతి వసుంధర అడు గడుగుకూ ఆమె
చిన్ని పాదాలను ముద్దుపెట్టుకుంటున్నది.]

తన సుఖము వీడి తోడి సోదరుల సౌఖ్య
మునకె జీవిత సర్వస్వమును వ్యయించి,
ఏవ మెఱుఁగని నీ యమాయికపు ప్రేమ
లో తెలుఁగజాల దీ స్వార్ధ లుబ్ధ జగతి.

నీ పవిత్ర ప్రకృతి స్వదేశోపకృతికి
త్రోవ చూపించెలే మహాత్ములకుఁ గూడ;
భరత జనయిత్రి ప్రేమంపు పసిడిముద్దు
తొలుదొలుత నీవె అందుకొందువు గదమ్మ!

చీపురు నొక్క చేత, ఒక చేతను చింపిరి గంపఁ బూని, యీ
పాపపు గుప్ప యూడ్చెదవు బాలిక ! చీదర లేదె సుంత ? నీ
యోపిక చూచి మెచ్చి తలయూచు జగత్పిత కన్నుగొల్కులన్
తేపకు తేపకున్ బయలుదేఱు నవే నులివెచ్చ బాష్పముల్ !!

ఆకల్పాంతము నీ పవిత్ర దినచర్యల్ నిత్యనిర్నిద్ర వి
శ్వైక ప్రేమ మహాగమమ్మునకు 'తూచా' పోని వ్యాఖ్యానముల్;
"పాకీదానిగ" నాడిపోసికొను ఈ పాపిష్ఠిలోకమ్ము నీ
"బాకీ" తీర్చుకొనంగలేదు జగదంబా ! జన్మ జన్మాలకున్.

కుక్షిస్థ మ్మగు కుళ్ళెఱుంగఁదు—కృశాంగుం డీవ్వలే కీడ్వఁగా
రిక్షాలో జనుచున్న ఆ పశుపు దారిన్ తొల్గిపో వంచు ని
న్నాక్షేపించును పండుకోతివలె మోమంతా కనుల్‌చేసి, ఏ
మో క్షోభించును కొంప మున్గి నటు లబ్బో ! ఎంత బిబ్బోకమో !

ఈ గతి నేహ్య మెల్ల సహియించి యుగమ్ములనుండి చేయు నీ
త్యాగము గుర్తెఱుంగదుగదా ! వెల కిచ్చెడి రెండణాలకే
యాగముసేయు లోకము, యథార్థముగా తన సేవకోసమే
భాగవతమ్ములోని భగవంతుడు నిన్ను సృజించినట్లుగన్.

చెల్లి! నీ బీద మోము దర్శించినంత
విసము గుటిపించు నేమి రక్కసి జగమ్ము?
మానవత్వమ్మునే యవమానపఱచు
పసరముల సంత యిది! దయారసము సున్న.

ఒక్క రో జీవు వీథుల నూడ్చకున్న
తేలిపోవును మా పట్టణాల సొగసు;
బయటపడునమ్మ; బాబుల బ్రతుకు లెల్ల
ఒక క్షణ మ్మీవు గంప క్రిందకును దింప.

పావనమ్మైన నీ ప్రజాసేవకొఱకు
త్యాగమయమైన నీ జీవితమ్ముకొఱకు
కార్చలే దొక్క కరుణాశ్రుకణముకూడ!!
జార్చలే దొక్క వేఁడి నిట్టూర్పుకూడ!!

ఉక్కు పాదాలతో నిన్ను త్రొక్కు 'దున్న
పోతు సంఘమ్ము'పై సానుభూతి చాలు;
కడుపు గడవంగ చాల మార్గములు గలవు
బైటబడుమమ్మ! ఈ మూగ బ్రతుకునుండి.

'పాకీపిల్ల' వటంచు నిన్ను నిరసింపంజూతు రమ్మా! స్వయం
పాకస్వాములు కొంతమంది, ఇది యే పాపంబొ! మూన్నాళ్ళలో
నే కన్నుల్ తలకెక్కి వెన్క గన రీ నిర్భాగ్యదామోదరుల్!!
పాకీదేగద మాకు మా జనని బాల్యమ్మందు పంజీవనీ!

మాతృస్థానము నందుకొన్న యది యుష్మన్మూర్తి లోకాన, ఉ:
హాతీత ప్రణయాధిదేవతకు పుణ్యక్షేత్రమే యయ్యె నీ
చేతోవీథి, పరార్థచింత నుపదేశించున్ భవద్వృత్తి, ప్ర
ఖ్యాతంబైనది నీ ప్రవృత్తి, ఇవిగోనమ్మా! నమోవాకముల్!!

# ముందడుగు

కై సేసినారు ! నీ కవికుమారులు శార
దాదేవి మెత్తమెత్తని పదాలు
చిందించినారు ! నీ శిల్పకారులు కళా
కల్యాణి కడకంట కాంతిలహరి
ప్రవాయించినారు ! నీ వైజ్ఞానికులు వృక్ష
ములచేత మనసులోపలి నిజంబు
కరగించినారు ! నీ గాయకాగ్రణులు గుం
డెలు లేని మొండిబండలను కదిపి

అభ్యుదయ మార్గమందు ముందడుగువేసి
జతన మొనరింపుమోయి ! భారతకుమార !
చేత జాతీయ కేతనశ్రీ తలిర్ప
వెలుఁగఁగలవోయి ! విజ్ఞానవీథులందు.

# ధర్మ పరశం

[జమదగ్ని శాంతమూర్తి. తపస్సంపన్నుడు. మహాఋషి. మునిపల్లెలో భార్యా పుత్రులతో కాపురం. పర్ణశాల పంచముందు ఉన్న గోమాత ఒక్కటే ఆయన సర్వస్వం. ఒకరోజు వేటకు వచ్చి ఆకలితో నకనకలాడే రాజుకూ పరివారానికీ ఆతిథ్య మిచ్చాడు జమదగ్ని మహాముని.

పిలిచి పిండివంటలతో విందుచేసినందుకు ప్రతిఫలంగా ముని హోమధేనువు మీద కన్నుపడింది కార్తవీర్యుడికి. ఆ దురాక్రమణను అంగీకరింపలేదు తపస్వి. రాజుగారికి కోపం వచ్చింది. నిరంకుశత్వాం వేయికరాలు చాచుకొని ముందుకు నడిచింది.

హింస అహింసమీద కత్తి దూసింది. అధర్మం ధర్మం మీద దాడి చేసింది. పశుబలం ఆత్మబలాన్ని పరాభ వించింది. బలవంతంగా ప్రజాధనం ప్రభుత్వ భవనంలో బందీ అయింది.

గోమాత ఘోష విని అహింస కన్నులు తెరచింది. ధర్మపరశువు పైకి లేచింది. ఆత్మబలం విజయ యాత్ర

సాగించింది. అధర్మమూ, దానిని సమర్థించిన శక్తులూ పటాపంచలయినవి. వేయిచేతులూ తెగిపడినవి. నిరంకుశత్వం నిర్మూలమయింది. ధర్మం జయించింది. ఇదీ పరశురామునిపై నా భావన. అదే నా ఈ 'ధర్మపరశు' కావ్యనిర్వచనం.]

బ్రహ్మవర్చస్సు చిందు నీ ఫాలతలము !
క్షాత్ర తేజస్సుఁ జిమ్ము నీ నేత్రయుగళి !
భార్గవా ! నీవు క్షత్రియబ్రాహ్మణుఁడవా !
బ్రాహ్మణక్షత్రియుఁడవా ! విభ్రాంతి గలిగె.

అలిక ఫలకమ్ము పయి రక్త తిలక మేమి ?
క్రాంతిసంక్రాంత మగు పురోగమన మేమి ?
గండ్రగొడ్డలితో భుజాస్కంధ మేమి ?
విశ్వభీకరమైన ఈ వేష మేమి ?

ఎవఁడురా వాఁడు కదిపి కవ్వించినాఁడు
మఱచి నిదురించు వీరకేసరిని తట్టి—
ఎవఁడురా వాఁడు ! తలదూర్ప నెంచినాఁడు
అరిభయంకర మృత్యుగహ్వరములోన.

ఎక్కడ కీ ప్రయాణము మునీంద్రకుమారక ? జింకచర్మ మే
దిక్కున పాఱవైచితి ? విదేమి కనుంగవ చింతనిప్పులన్
గ్రక్కుచునున్న ? దుద్ధృత కరమ్మున నూగెడి ఆ కుఠార మే
ముక్కడి దానవాధముల మూపుల దూఁకఁగ నుత్సహించెరా ?

నడుము బిగించి వల్కలమునన్, జడలన్ సిగజుట్టి, కన్బొమల్
ముడివడ, వీర రక్త మిడి మోమున, విప్లవ గర్జకుం దిశల్
తడబడ, కాలరుద్రుని విధాన కుఠారము చేతబట్టి నీ
వడుగిడ దద్దరిల్లినదిరా ! పృథివీతల మొక్క పెట్టునన్ !!

సత్యతపోధనుండవె ! ప్రశాంతుఁడవే ! జమదగ్ని రేణుకా
పత్యమవే ! మహేశ్వరుని భక్తుఁడవే; మఱి బ్రాహ్మణుండవే !
జాత్యనురూప ధర్మగుణసంపద నెంచక రౌద్రమూర్తివై !
హత్యల కిట్లు పాల్పడితివా ! మతిపోయినదా ! భృగూద్వహా !

నే నొక సార్వభౌముఁడ ననే మదమే తలకెక్కెనో ! కనుల్
గానఁడు కార్తవీర్యుఁ; డధికారము మౌనిజనమ్ముమీఁదనా !
ధేనువు సీయకున్న గురుదేవునిపై పగబట్టి ద్వేష రో
షానల దుర్విదగ్ధుఁడు దురాక్రమణంబున కుద్యమించునా ?

ఇంటికి పిల్చి స్వాగతము నిచ్చి, ప్రియంబున విందు సేయుచే
కంటక మయ్యెనా ప్రభువుగారికి ! ! ఆశ్రమ హోమధేనువున్
గెంటుకపోయె క్రౌర్యము చిగిర్చిన వేయికరాలు సాచి ! ! ఈ
కొంటెతనమ్ము రక్తబలి గోరదె హైహయరాజవంశమున్ ! !

మాలిమి చేసి ఎంత బతిమాలిన గోవు నొసంగనట్టి "గూం
డా"లకు బుద్ధిసెప్పెడు కుఠారముదాటికి నిల్వలేక గ
గ్గోలయిపోయి రాజుకొడుకుల్ కనుచాటుగ ఆశ్రమంబులో
కాలిడి నీవు లేని తఱి కంఠము కోసిరటే తపోధనున్ !

"పటపట గొంతుకోసిరి కృపారహితాత్ములు గోలపెట్టి బి
ట్టఱచెడి నన్ను లెక్కగొనరైరి రవంతయు రామ రామ !" యం
చిరువదియొక్కమారు జనయిత్రి యురస్స్థలి బాదుకొన్నదా !
తలచినదా ! నినున్ రుధిరధారల తండ్రిఋణమ్ము దీర్పఁగన్ !

గడగడలాడె రాచతలకాయల స్వర్గపుమెట్లు కట్టు క
ట్టిడి జగజెట్టి ! నీ బొమముడిన్ గని దైవతరాజు కాళ్ళు; త
ల్లడపడి సంభ్రమించి రుడురాడ్ దినరాజులు; రాతిగుండియల్
'దడదడ' కొట్టుకొన్నవిగదా గిరిరాజునకున్ పరంతపా !

ఎయ్యెడ నేర్చుకొంటివి మునీ! గడితేరిన రాచవారితో
కయ్యము సేయునేర్పు? మొనగాఁడవు! కోసితి వూచకోత; అ
క్షయ్యములయ్యె నీ విజయగాథలు భావిచరిత్రలోన; మా
యయ్య! అనుగ్రహించి ఇఁకనైనను గొడ్డలి క్రిందపెట్టుమా!

చిన్నతనంబునన్ శివుని శిష్యుఁడవై రజతాద్రిమీద గై
కొన్న మహాప్రయాసమునకున్ ఫలితార్థ మిదే నటయ్య! ఏ
మన్న నికేమి యున్నది మహాబలికాండ సమాప్తమయ్యె; ఇం
కెన్ని యుగాల కీ రుధిర మెందునొ భారతభూమి గుండెపై!

దర్ప మెలర్ప వైరి వసుధాపతులన్ వధియించి తండ్రికిన్
దర్పణ మాచరించితివె తద్రుధిరమ్ముల: భూమిభారమున్
దీర్పఁగ జన్మమెత్తితివి; దేశము కంటకశూన్యమయ్యె; "రా
మార్పణ" మయ్యె క్షుద్రములు స్వార్థపరత్వ నిరంకుశత్వముల్!

మే మిక చూడలేము—విరమింపుము వీరవిహారయాత్ర నో
స్వామి! భవత్కుఠారము కసాయిదుకాణము చేసివైచె నీ
భూమి సమస్తమున్, చెదరిపోవుచునుండె కనుల్, ప్రచండ తే
జో మహనీయమూర్తి; దయచూడుము; వీడు ముదగ్రరూపమున్!

బద్ధలైనవి శత్రువక్షవక్షఃకవా
టములు నీ గండ్రగొడ్డలికి దాకి
పొరలిపాఱినవి నెత్తురుటేఱు వీర వి
స్ఫూర్తి నీ కంటికెంపును గ్రహించి
దిమ్మెక్కినవి అష్టదిగ్గజమ్ముల శ్రవ
ణములు నీ సింహనాదముల కులికి
అల్లాడిపోయిన వాదిశేషుని వేయి
తలలు నీ కాలి తాపులకు నోర్చి

ఎంత సాహసమో ! ఎవ్వరెంచఁగలరు—
ఎట్టి స్థైర్యమొ ! ఎవ్వరూహించఁగలరు—
నీవు పరశువు చేఁబూని నిల్చినంత
అదలిపోయినదోయి ! బ్రహ్మాండమెల్ల.

గొడ్డలి పూని భూపతుల కుత్తుకలన్ దెగవేసి రక్తపుం
గడ్డ యొనర్చి తీ భరతఖండము భార్గవరామ ! ఎట్లు లో
బడ్డదిరా నవోత్పలముమవంటిది నీ హృది ! సత్యశౌచముల్
గొడ్డరిపోయెనే ! చెరుపుకొందువె ! మౌనికులప్రతిష్ఠలన్ !

ఒక్క మునియేమి ఇరువదియొక్క మాఱు
దర్పధను లగు నృపుల విదల్చుటేమి ?
ఏ మహాశక్తియో పొంగులెత్తి పొరలి
పెక్కులల్లార్చెఁగాక వేఱొక్కఁడగునె !

'గోవు కొట్లాట' కా దిది - దైవబలము
దానవబలమ్ముపై జయధ్వజమునెత్తె;
ఇది ప్రతిక్రియ కాదు దుర్మద నిరంకు
శ ప్రభుత్వముపై ప్రజాశక్తి గెలుపు !!

ఎవ్వ రేమనుకున్న నీ కేమి ? దైవ
శక్తి నీయందు కలదు దీక్షాతపస్వి !
కడుగుకొనుమయ్య ! రక్తపంకమ్ము తొలఁగ
నర్మదాతీర్థమందు నీ 'ధర్మపరశు' !

'తల్లిని జంపె' నంచు అయథార్థ కథానికలన్ చరిత్రలో
నల్లిరి గాని, నమ్మదుగదా మది ! దుస్సహ దుష్టశక్తులన్
ద్రుళ్ళడగింప ముందునకు దూఁకు భవాదృశ సత్యవీర శౌ
ర్యోల్లసితప్రభావు, లెటు లోర్తు రకారణమాతృహత్యకున్ !

# మా గాంధి తాత

అడుగుపెట్టినచాలు అవనీంద్ర రత్న రం
జిత కిరీటములు హారతు లొసంగు ।
బయలుదేటినచాలు జయజయధ్వనులతో
గ్రామాలు గ్రామాలు కదలివచ్చు ।
కొంగుబట్టినచాలు కోటానుకోట్ల హ
స్తములు బంగారు వర్షములు గురియు ।
పెదవి యొకింత విప్పినచాలు లక్షల
కొలఁది తలల్ వచ్చి కొలువుతీర్చు ।

నవ్వినంజాలు పతిత మానవ సమాజ
మానసమ్ములు దేదీప్యమానము లగు ।।
పట్టుపట్టిన చాలు సమ్రాట్టులైన
తలలువంతురు మా గాంధితాత ముందు ।।

# శాంతిదూత

అచ్చపు దాస్య శృంఖలములందుఁ దగుల్కొని శౌర్యధైర్యముల్
చచ్చి కృశించు ఈ భరతజాతికి నూతన శక్తిదాతవై
వచ్చినయట్టి సూర్యభగవానుఁడ వీవు; త్వదాగమమ్మునన్
విచ్చెనులెమ్ము మా నయనవీథులఁ గ్రమ్మిన కాఱుచీకటుల్ ।

పవలున్ రాత్రులు నెత్రుటేఱు ప్రవహింపన్ పాపభూయిష్ఠమౌ
నవకాశీ నరకమ్ములో చరణ విన్యాసమ్ము గావించినాఁ
డవు, నీ శాంతిమయాస్యకాంతి గని "గుండా" లందఱున్ "విశ్వమా
నవసౌభ్రాత్రవిధాత" ముందు శరసన్యాసమ్ము గావింపఁగన్ ।

నెత్తురు త్రావు రక్కసులె నీ చరణాలకడన్ వినమ్రులై
కత్తులు బల్లెముల్ గదలు కట్టులు బాకులునుం దుపాకు లిం
తెత్తున రాశిపోసి భజియించిరటే భవదంఘ్రి; మారణో
న్మత్తుల మత్తు దింపఁగల మంత్రము లెచ్చట నేర్చుకొంటివో ।।

కందల్ నిల్వున చీల్చి సోదరుల రక్త మ్మాను నక్తంచరుల్
'గూండా' మూకలు పిల్లికూనలవలెన్ కూర్చుండినారంట నీ
జెండా నీడలలో, సుధామధుర వాక్ క్షీరమ్ములం ద్రాపి యీ
గండాగొండిశిఖండులం దనుపు నీ కారుణ్య మేపాటిదో ! !

జవహరుఁ డల్లదే విజయశంఖము నొత్తుచునుండె కేల గాం
డివము ధరించి, ఘంటలు ఘణిల్లున మ్రోగెను వీరభారతీ
భవనము ముందు, పగ్గములు బట్టి ప్రజారథ మిఁక నాజవం
జవముగ త్రోలుమా ! "విజయసారధి"వై విజయమ్ము సేయుమా !

దురహంకారులు స్వార్థదూషితమతుల్ దుశ్శాసనుల్ దుష్క్రియా
పరు లున్మత్త మహాపిశాచములు పైపై దూఁకి బాధించు నీ
భరతక్షోణికి దిక్కు వేఱెవరు నీ ప్రాపొందు దక్కన్, స్వరా
జ్యరథ మ్మెక్కి ప్రజాతతిన్ నడుపుమయ్యా ! కర్మవీరాగ్రణీ ! !

'గుప్పెడు ప్రాణముల్ ప్రజలకోసమ యర్పణసేతు హింసయే
తప్పనినాఁ'డటంచు బహుధా ప్రవచించిన నీ ప్రతిష్ఠకై
ముప్పదిమూడుకోట్ల శిరముల్ ప్రణమిల్లెనుగాక గుండెపై
నిప్పులకుంపటుల్ నిలుపనేర్తు రికెన్ని దినాలు సోదరుల్ !

# రాష్ట్రసిద్ధి

మీలో మీరు సవాలుకొట్టుకొని స్వామీ! 'ఆంధ్రరాష్ట్రమ్ము' బం
గాళాఖాతములోన ద్రోసితిరి; పైగా తెల్గువా రన్నచో
వేళాకోళము లయ్యె నల్గురకు; ఈ వేదాంత భాష్యాలతో
కాలక్షేపము చాలు, నింక దిగుఁడీ కర్తవ్యరంగమ్మునన్ ॥

తోచీతోచని తోడిసోదరు లదేదో కోరుచున్నట్లుగా
చూచీచూడరు నేడు నాయకవతంసుల్, చీటికిన్ మాటికిన్
పేచీ వేతురు, రాష్ట్రవాంఛయును తప్పే యయ్యె మా వారికిన్ ।
చీచీ ఎంతటి శోచనీయదశ వచ్చెన్ నేఁటి కాంధ్రోర్వికిన్ ॥

అరచుచు మూతినాకి 'అహహా' యని తోకలు త్రిప్పి, నేలపై
దొరలుచు, వీలు చూచుకొని దూరుచు, చీకటి సందుగొందులన్
దిరిగెడు గ్రామసింహముల తీరున నాయకులుండ, తెల్గు సో
దరుల యదృష్టమందు గలదా అభివృద్ధియు రాష్ట్రసిద్ధియున్ ?

కాంతికి కళ్ళు మూసికొని, గాఢ తమోమయ ఘోర కాననా
భ్యంతరమందు ద్రిమ్మరు దివాంధములై యభిమానశూన్యులై
వంతలుపాడు మా తెలుఁగువారికి లక్ష యుగాలకైన గ
త్యంతర మున్నదే? పరుల దాస్యము జాతికి ఖ్యాతిగూర్చునే?

కలయో-వైష్ణవమాయయో - యితర సంకల్పార్థమో - యేదియో
తలపంజాలము; భారతావని స్వతంత్రంబయ్యె, మా దాస్య శృం
ఖలముల్ ఖల్లున నేలపై తెగిపడెన్, గానీ—స్వరాష్ట్రమ్ముకై
తెలుగుంబిడ్డ లొకింత నోచుకొనలేదే ఎంత దౌర్భాగ్యమో!!

ముంగలఁ గానుపించి, పదిమూరల దూరము పోయి, అంతలో
చెంగట కేగుదెంచి, చెయి జిక్క; విచిత్రముగా నదృశ్యమై,
'బంగరులేడి' వోలెఁ గనుపట్టుచునున్నది రాష్ట్రసిద్ధి - 'త్రై
లింగమహారథమ్ము' కదలింపుఁడు భారత రాజవీథులన్!!

'రంగా' వక్షత 'టంగుటూరి' యసిధారా దీక్ష 'పట్టాభి' మం
త్రాంగ ప్రౌఢిమ యీ త్రయమ్మును సమైక్యంబై విజృంభించినన్
సాంగోపాంగ సమృద్ధమై మనకు రాష్ట్రం బబ్బదా—పండవా
బంగారంబులు! నిండవా తెలుఁగు శోభల్ దేశదేశమ్ములన్!

ఉదయశ్రీ

మన పుణ్యవాహినీ మధురాంబుపూరంబు
జలధి గర్భమ్ములోఁ గలిపివైచి
మన భాసమా నాసమాన శేముషి, వృథా
వాదోపవాదాల వ్యయము సేసి
మన స్వజాతీయాభిమాన సౌభ్రాత్రమ్ము
పదవులకోసమై బలియొనర్చి
మన విశాలాంధ్ర నిర్మాణ దీక్షస్ఫూర్తి
పరుల హస్తాలలో ధారవోసి

మన పురా శౌర్య ధైర్యసంపదలు వర్ణ
మతవిభేదపిశాచి కాహుతి యొనర్చి
తెలుగుగడ్డకు తలవంపు తెచ్చినాము
మేలుకొనుఁ ; డింక మన రాష్ట్రి మేలుకొనుఁడు ; ;

# భారతభాగ్యదేవత

కత్తి కదల్పలేదు । విశిఖాల విదల్పనులేదు । గాండివం
బెత్తనులేదు । ఏక్రియ జయించితివో నరమాంస పారణో
న్మత్తుల ? నీ ప్రభావము లమానుషముల్ ।। భవదీయ శాంతి సం
పత్తికి దోసిలొగ్గెను ప్రపంచము ।। భారతభాగ్యదేవతా ।

పుటలా డెబ్బదియెన్మి దేగినవి బాపూజీ వయఃకావ్య సం
పుటిలో; పైపుట త్రిప్పులోపలనె మా పున్నెమ్ము మిన్నంది ప్ర
స్ఫుట భంగిన్ వినిపించె నేఁటి కిట సంపూర్ణ స్వతంత్ర ప్రజా
పటలీ వీరవిహార విశ్వవిజయప్రస్థాన భేరీధ్వనుల్ ।।

'యుగపురుషుండ'వంచు 'పురుషోత్తమమూర్తి'వటంచు 'మూర్తిమ
జ్జగదనురాగ శాంతిమయ సాత్వికశక్తి'వటంచు వేనవేల్
మొగముల ప్రస్తుతించెను ప్రమోదముతో జగమెల్ల నిన్ను; ఏ
మగుదురు నీకు ? తొల్లిటి మహమ్మఁదు క్రీస్తును బుద్ధదేవుఁడున్ .

# హత్య

[బాపూజీ హత్య వినగానే విధి నుద్దేశించి]

హంత ! ఇదేమి ? నీదు ప్రణయాంకతటమ్మున నిద్రపుచ్చి నీ
వింతటి వాఁడికత్తి నిటు లేటికి గ్రుచ్చితివోయి నిర్దయ
స్వాంతుఁడ! నాదు పేద హృదయమ్మున; చేయి కదల్పఁబోకు, ప్రా
ణాంతకమైన యీ నరకయాతన గుండెలు మోయలేవురా !!

# విషక్షణం

ఉయ్యాలలో నూగుచున్న ముద్దుల బిడ్డ
లేచి కెవ్వన కేకవైచెనేమి ?
పాకలో లేగకు పాలిచ్చు గోవు 'అం
బా' యంచు గొంతెత్తి యఱచెనేమి ?
జల జల ప్రవహించు జమున నిస్తబ్ధయై
నిలచి కన్నుల నీరు నింపునేమి ?
చక చక పొలము దున్నుకొని పోయెడి
రైతు నాగలి ముందుకు సాగదేమి ?

కోటలో ఆఱుగంటలు కొట్టఁబోవు
వాని హస్తాలు గడ గడ వణకునేమి ?
ఏ మహాత్ముని గుండెపై కెక్కిఁచనెనొ
కాలపురుషుని రథరథాంగములు నేఁడు ! !

# దుర్దినము

కనిపింప దిదియేమి ? కనక కాంతులు చిందు
సత్యావతార ప్రశాంతమూర్తి !
వినిపింప దిదియేమి ? వీనులవిందుగా
'రఘుపతి రాఘవ రామ భజన' !
కళ దప్పెనేమి ఏకాలమ్ము కలకల
లాడుచునుండు బిర్లాలమేడ !
తలవంచెనేమి ? మిన్నులు ముద్దుగొను మూడు
రంగుల వీరభారత పతాక !

తడిసిన దిదేమి ? కన్నీటి ధారలందు
భరతజనయిత్రి ఖద్దరు పైటచెఱఁగు -
ఏమొ పోగొట్టుకొన్నట్టు లేడ్తు రేమి ?
గోడుగోడున నలుబదికోట్ల ప్రజలు ! ! !

# పిడుగుపాటు

ఇదియేమీ ! నిజమా ! మహాత్ముఁ డిక లేనేలేఁడ ! యీ వార్త వ
ట్టిది కాదా ! కరుణాసముద్రుఁ డగు తండ్రిన్ హత్యగావించిరా !
ఇదియేమీ ! ఇదియేమి ! ఏమిటిది ! స్వామీ ఈ విషంబేమి-మ్రిం
గుదుమా-మ్రింగకతప్పదా-జగము గగ్గోలెత్తి వాపోయెడిన్.

హింస యహింసపై పగవహించె, నవోదయశక్తిమీద వి
ధ్వంసకశక్తి దూఁకిన, దధర్మము ధర్మము నాక్రమించె దు
ర్మాంస బుభుక్షు రాక్షసకరమ్ము ప్రశాంత మరుత్తరంగిణీ
హంసము నేసె, సాంధ్యసమయమ్మున విశ్వము విహ్వాలింపఁగన్.

క్రొత్తవెలుంగుబాట నెటకో గొనివచ్చి, స్వతంత్ర భారతో
దాత్త నిదర్శనంబగు ప్రదర్శనమంచు మహా భయంకరో
న్మత్త పిశాచినీ వికట నాట్యము చూపితివేమి ? ఈ కథా
వృత్తము చూడలేము-తెరవేయుము-దీపము లార్పు మో ప్రభూ !

# తీరని లోటు

గుండెలు జారిపోయె ప్రజకున్, కనుగోనల నశ్రువాహినుల్
నిండె నభమ్ము బ్రద్దలయి నెత్తిపయింబడె, దద్దరిల్లి బ్ర
హ్మాండము క్రుంగిపోయినది, అంతటి తండ్రిని ధూర్తుఁడైన పు
త్త్రుండు కిరాత హస్తములతో వధియించె నటన్న వార్తకున్ —

మెత్తని గుండెనుండి పుడమిం బ్రవహించెడు పూజ్యబాపుజీ
నెత్తురు ద్రావుచున్ కనులనీరిడె మృత్యువు, బాపులేమికిన్
సత్త్వము చిన్నపోయినది, శాంతి కృశించె, నహింస యేడ్చె ద
గ్గుత్తికతోడ, ధర్మము దిగుల్పడె, క్రుంకెను కర్మసాక్షియున్ ॥

నిండు మనస్వి - విశ్రుత వినీత పునీత యశస్వి - సాత్వికా
ఖండ తపస్వి - సత్యసహకారము చిట్టచిటారు కొమ్మపై
పండినపండు - బ్రహ్మఋషి - భారతభాగ్యవిధాత - ప్రార్థనా
మండప వేదిమీఁద నిఁక మా కనుదోయికి విందొనర్పఁడా ? ॥

# మౌ న లే ఖి ని

'వ్రాయుము వ్రాయు'మంచు బలవంతము సేతువు నన్ను భావనా
ప్రేయసి ! స్వేచ్ఛకై పరితపించెడి నల్వదిరెండుకోట్ల దే
శీయుల మైత్రికోసము కృశించి కృశించి నశించిపోయె జా
తీయమహాతపస్వి గురుదేవుఁడు; చాలు – నికేమి వ్రాయుదున్ ?

'వ్రాయుము వ్రాయు' మంచు బలవంతము సేతువు దేవి ! దేనితో
వ్రాయుదు ? శాంతి దేవత యురమ్మున చిందెడు రక్తధారతో
నా ! యమునా స్రవంతి నయనాంచలకజ్జల బాష్పధారతో
నా ! యెటువ్రాఁతు విశ్వహృదయమ్ము కలంచు విషాదకావ్యమున్ ?

ఏమని వ్రాయుదుఁ ? బ్రతుకు లిచ్చిన బాపు ఋణంబు తీర్చుకొ
న్నామనియా ? స్వరాజ్యభవనంబున శాంతికి శాంతి చేసికొ
న్నామనియా ! అఖండ కరుణానిధి తండ్రికి కాన్కలిచ్చుకొ
న్నామనియా కృతఘ్ననయనమ్ముల ఘోరవిషాగ్నిగోళముల్ ?

# ధన్యజీవి

'ప్రేమార్ద్రహృదయుఁడౌ' జీమూతవాహను
జాలిగుండెల మధ్య జననమంది -
'నిరుపమానత్యాగనిధి' దధీచి మునీంద్రు
నాశ్రమ ద్రుమరాజి నల్లువెట్టి -
'కరుణారసామృతగంగాలహరి' బుద్ధ
భగవాను కన్నీట చిగురుతొడిగి -
'ధర్మరక్షాప్రియదర్శనుం' డగు అశో
కుని చల్వ నాల్గు దిక్కులకు ప్రాకి -

చను నహింసా లతా మతల్లిని మహాత్ముఁ
డంచితమ్ముగ పూలుపూయించినాఁడు;
మాలలం గూర్చి భారతమాత కంఠ
సీమ నర్పించి దివికి వేంచేసె నేఁడు ।।

# బా ల బా పూ జీ

విషపాత్రమెత్తి త్రావెడి 'మహాయోగి' కన్
గొనలలో తాండవించిన యహింస
హృదయేశ్వరిని వీడి కదలు 'ప్రేమ తపస్వి'
బరువు చూపుల పొంగిపొరలు కరుణ
సిలువపై నిండు గుండెలు గ్రుమ్మరించు 'ద
యామూర్తి' నుదుట పారాడు శాంతి
శిరసు వంచక స్వేచ్ఛకొఱకు పోరాడు 'వీ
రాగ్రణి' హృదయాన నలరు దీక్ష

ఏకమై - భారత ప్రజానీక పూర్వ
పుణ్యసంపత్తి పొత్తిళ్ళ పొదుపుకొన్న
పుత్తలీబాయి ప్రక్కలో నొత్తిగిల్లె
పోరుబందరులో నొక్క పురిటియింట ॥

# మహాప్రస్థానము

ఏ మహాత్ము ప్రేమహృదయ మువ్పొంగెనో
కరుణవారిరాశి గట్లుతెగెనొ ॥
పొర్లిపాఱుచుండె బిర్లాగృహమునుండి
జమునవైపునకు ప్రజాస్రవంతి ॥

రత్నశిఖరి మీఁది రాయంచయే కాదు
చెట్టుమీది పరిగపిట్టకూడ
వెక్కివెక్కి యేడ్చె వేఁడి బాష్పాలతో
సాగిపోవు దాపు శవము గాంచి.

శాంత్యహింస లనెడు శస్త్రాస్త్రములు దాల్చి
సత్య కవచ మొడల సంతరించి
దండు నడిపినట్టి దండి సత్యాగ్రహి
కదలుచుండె శాంతి సదనమునకు ॥

ఆగ్రహము లేదు - కలది సత్యాగ్రహంబె ;
ఏ గృహము లేదు - కలది కారాగృహంబె ;
దేశమున కెల్ల సత్య సందేశ మతఁడు -
లోకమున కెల్ల నవనవాలోక మతఁడు -

సత్యసహకారమున కహింసా లతా మ
తల్లికను మెల్ల మెల్లఁగా నల్లువెట్టి
పూలు పూయించి తేనెలు జాలువార్చు
కర్మచంద్రుఁడు మన కింకఁ గానరాఁడు : ;

నయనములు మూసికొని బోసినవ్వుబాబు
తల్లి ప్రక్కనను నాఁ దొత్తిగిల్లె నట్లు ;
నయనములు మూసికొని యమునానదీ మ
తల్లి ప్రక్కను నేఁ దొత్తిగిల్లె నిట్లు ; ;

బాపు - ప్రియబాపు - భారత పారతంత్ర్య
బంధములు బాపు మా ప్రియ బాపు - నేఁడు
పాంచభౌతిక దేహ మర్పించుచుండె
కొడుకు లంటించు నీ యగ్ని కుంచమందు ; ;

నెత్తురులు చింద తన మొంది కత్తితోడ
దేశమును చీల్చె నా 'ఖాయిదే అజాము'
మంచిగంధపుచెక్కల మధ్యనేఁడు
భగ్గుమని మండుచుండె మా బాపుగుండె ॥

చేతికఱ్ఱ వీడి చెప్పులు విడనాడి
కదలిపోయినాఁడు గాంధితాత ।
'ఎగుడు దిగుడు' లేని 'హెచ్చుతగ్గులు' లేని
'తేఱు ముఱు' లేని దేశమునకు –

ప్రాక్సతీ స్వర్ణగర్భాన ప్రభవమంది,
తమ్ములను లేపి, నూత్న చైతన్య మొసఁగి
ధ్వాంత మెడబాపి, స్వాతంత్ర్య కాంతు లిడిన
'భువనబంధుఁడు' పశ్చిమాంభోధిఁ గ్రుంకె.

బ్రతికి పేరు ప్రతిష్ఠలు వడియలేక
చచ్చి గొప్పవా రగుదురు చాలమంది;
బ్రతికియుం జచ్చియును ఈ ప్రపంచమందు
మూడు కాలమ్ములకు మహాత్ముఁడవు నీవు ॥

# దివ్యమూర్తి

విచ్చేయుచున్నాఁడు ! విశ్వసౌభ్రాత్రమ్ము
సాధించుకొన్న 'దీక్షాతపస్వి'
దయచేయుచున్నాడు ! ధర్మమే జయ మన్న
కర్తవ్యమును దెల్పు 'కర్మయోగి'
వేంచేయుచున్నాఁడు ! వీర భారతశక్తి
చాటిచూపిన 'బోసినోటిబాబు'
వచ్చుచున్నాఁడు ! నల్వదికోట్ల ప్రజలకు
మేలుకొలిపిన 'వైతాళికుండు'

దర్శనమొసంగుచున్నాఁడు ! స్పర్శమాత్ర
పతితపావనుఁడగు 'విశ్వబాంధవుండు'
"రండు రం" డంచు పువ్వులదండ లూని
దేవతలు మింట బారులు తీర్చినారు.

# స్వర్గీయ బాపు

వీఁడటే ! దక్షిణాఫ్రిక దొరతనమును
మూడూపు లూపిన 'ముసలితాత'
ఇతఁడేనటే ! జగత్త్రితయమ్మునకు సత్య
సందేశ మందించు 'శాంతిదూత'
ఈతండటే ! ప్రజాస్వాతంత్ర్య రథమును
కదలించు 'విశ్వమంగళవిధాత'
ఈయనేనటె ! యూరపీయుల తబ్బిబ్బు
సలుపు 'సత్యాగ్రహసమరనేత'

అంచు నీ దివ్యమూర్తి దర్శించు కాంక్ష
పూలదోసిళ్ళతో వేల్పు పూవుబోండ్లు
గుములుగూడిరి స్వర్ణసౌధములమీఁద -
స్వర్గవీథుల నీ తేరు సాగువేళ.

# బాష్పాంజలి

ఎత్తిన కత్తి కాత్మ బలియిచ్చెడు మేకల పాలు ద్రావు నీ
మెత్తని చిత్తమందు కుసుమించిన కమ్మని సన్నజాజి పూ
గుత్తి పరీమళమ్ము లనుకొందురు సత్య-మహింస—నేఁడు నీ
వొత్తిగిలన్ మహాత్మ! భరితోర్విని వానికి దిక్కుగల్గునే!!

ఒక్కఁ డదృష్టవంతుఁ డయయో! భరతావని లేకపోయెనే
లెక్కకు - ఈ భయంకర మలీమస కర్మ, జగచ్చరిత్రలో
నెక్కకపోదు - ఇందు జనియించిన ముందుతరాలవారు మా
రక్కసి చర్యకున్ తమ శిరమ్ములు వంపకపోరు సిగ్గునన్.

ఏమయ్యా! మిహికాచలేశ్వరుఁడ! నీ వెన్నాళ్ళనోయుండి ఈ
సీమాంతమ్మున నిల్చిచూతువుగదా శీర్షంబు పైకెత్తి - క్షో
ణీమధ్యమ్మున నెచ్చటేని ఎపుడేనిన్ 'బాపుజీ' వంటి ని
ష్కామ ప్రేమతపస్వి పుట్టెనె-అహింసా బ్రహ్మతేజస్వియై--

# పు రో గ మ న ము

నీ చరిత మ్ముదాత్తరమణీయము - మాకు స్వతంత్ర భావనా
రోచిరహర్మ్యఖంబుల పురోగమనమ్ములు నేర్పి శృంఖలా
మోచన మాచరించిన యమోఘతపస్వివి ! నీకుఁ గల్గె వీ
రోచితమైన మృత్యువు - మహోజ్జ్వలముల్ భవదీయ సాధనల్ ॥

నలుబదికోట్ల తమ్ముల మనమ్ముల నల్వదికోట్ల జ్యోతు లు
జ్జ్వలిత మొనర్చి చీకటులు వాపితి వీవొక పెద్దజ్యోతివై -
వెలుఁగులు జిమ్ము అభ్యుదయవీథుల ముందుకు సాగుచున్న మ
మ్ముల విడనాడి స్వర్గపథముల్ వెలిఁగింపఁగ నేగితే ప్రభూ ॥

ఏ లోకమ్ముల నెందు నుండినను గానీ చల్లనైనట్టి నీ
యాలోకంబుల మాపయిం బఱపుమన్నా ! అన్నదమ్ముల్ వలెన్
మాలో మేము విభేదముల్ మఱచి ప్రేమస్నిగ్ధ జాతీయ "పం
థా"లో ముందుకు సాగిపోయెద మహింసాజ్యోతి రోచిస్స్ఫులన్.

# స్వచ్ఛందజాతి

మన జాతీయత మంటఁగల్పుకొని, నిర్మర్యాద నీచ ప్రవ
ర్తనకున్ లోఁబడి, పారతంత్ర్యమునకున్ దాసుండవై, నీ పురా
తన విజ్ఞాన విశేష శేముషి నసత్యం బంచు శంకింపఁగా
జనునే? నీ ప్రియ భారతావని ప్రపంచఖ్యాతి నార్జింపదే!!!

అచ్చపు చీకటిండ్లఁ దొరలాడుచునుండ ప్రపంచమెల్ల; నీ
పచ్చనితల్లి గుమ్మములపై వెలిగెన్ మణిదీపికల్!! కనన్
వచ్చిన ఖండఖండములవారికి కోరిక దీరునట్లుగా
బిచ్చముపెట్టె 'భారతసవిత్రి' ప్రియంబున రెండుచేతులన్!!!

చచ్చినజాతికాదు; మఱిచావదు వేయియుగాలకైన, వె
న్నిచ్చినజాతి కాదు; పరువెత్తు విరోధిని బిల్చి కౌఁగిటన్
గ్రుచ్చినజాతిరా యిది! మరుత్తరుశాఖలతోడ హాయిగా
"అచ్చనకాయ" లాడుకొనెరా! మనకీర్తిలతామతల్లికల్!!

# లు ము ం బా

చిత్తులమారి బెల్జియము జింకలు గుండెలు దద్దరిల్లి ప
ర్వెత్తెను వీరవిప్లవ మృగేంద్రము! నీ పెను గర్జ; కాఫ్రికా
మొత్తము లేచి సాగినది ముందునకున్; భవదీయధైర్య సం
పత్తి మహత్తరం బని ప్రపంచము నీకు జోహారు చేసెరా!

'మొబుటూ' కళ్ళు బయర్లు కమ్మినవి; 'షోంబే' గారికిన్ కాళ్లు చ
ల్లబడెన్; గుండెలు జారి కూలబడె గల్లంతై 'కలోంజీ' 'కసా
వుబు' పై ప్రాణము పైనపోయె; తలనొవ్వుల్ బెల్జియం మూకకున్
ప్రబలంబయ్యె; ప్రధానమంత్రిగ "లుముంబా" పేరు మార్మ్రోగఁగన్

కటికి రాకాసి చిమ్మచీకటుల తోడ
నిండి నిద్రించు ఆఫ్రికా ఖండమునకు
వెలుఁగు చూపించి ప్రజల మేల్కొలిపినట్టి
ప్రథమ వైతాళికుఁడు "లుముంబా" ప్రధాని.

ఉవయశ్రీ

భగభగమండు విప్లవమహాగ్నిజ్వాల
పరవళ్ళు త్రొక్కు జాగరణశక్తి
కుప్పించి దుముకు కాంగో మృగేంద్రస్వామి
తెల్లకప్పల మ్రింగు నల్లత్రాచు
పగిలి మిన్నంటి పైబడెదు జ్వాలాముఖి
తళతళ వెలుఁగు చైతన్యలహరి
నిండు గుండియల మండిన అఖండజ్యోతి
తహతహలాడు స్వాతంత్ర్యకాంక్ష

ఆఫ్రికాఖండ ఘోర గాఢాంధకార
వీధి వెలిగించు వేతొక్క వేగుచుక్క
త్యాగమయమూర్తి జాతి వైతాళికుండు
మంచి అభిమాని మన "లుముంబా" ప్రధాని.

# ధ్రువ తారలు

ఎవ్వారి రణగాథ లింతవర్ణింప స
త్కవుల కలాలు సార్థకత నందు
ఎవ్వారి జయగీతు లించుకపాడ గా
యకుల కంఠములు ధన్యత గడించు
ఎవ్వారి రూపు లొక్కింత రూపింప శి
ల్పుల కళాకృతి మహోజ్జ్వలత గాంచు
ఎవ్వారి పదధూళి రవ్వంతసోకిన
భూదేవి నిలువెల్ల పులకరించు

నభము మార్మ్రోగు వీరదుందుభులు వారు
త్యాగధనులైన సత్యవర్తనులు వారు
జాతిరత్నాలు వారు శాశ్వతులు వారు
పావనులు వారు ధన్యజీవనులు వారు।

వారల వీరకంఠములు వార్ధితరంగములందు నేఁటికిన్
హోరున మ్రోగు; నిత్య మరుణోదయవేళ తదీయ రక్తపుం
ధారలు పొంగులెత్తు; తదుదారకథల్ నవకుంకుమాంకముల్
తీరిచిదిద్దు భారత సతీమణి చక్కఁదనాల మోముపై.

జవసత్వంబులు చచ్చి, రిచ్చపడి, నిశ్చైతన్యమై యున్న మా
నవజాతిన్ దగురీతి మేల్కొలిపి దైన్యంబూడ్చి భావంబులన్
నవజీవంబులు నింపు త్యాగమయు లన్నా మీరు; మీరూపముల్
'ధ్రువతారల్' వెలుఁగొందు మామనములందున్ కల్పకల్పాంతముల్ ॥

మండెడు స్వరాజ్య సమరాగ్ని కుండమందు
భస్మమైన గులాబిపుష్పములు మీరు;
ఎన్ని కల్పాంతములకేని యింకిపోని
భరతమాత ఆనందబాష్పములు మీరు ।




# మూడవ భాగము

# సుమనోంజలి

ఇద మంధం తమఃకృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే.

అపును ; "శబ్దమనే జ్యోతి విశ్వమంతా వెలుగులు వెదజల్లక పోతే ఈ ముల్లోకాలు అల్లకల్లోలమై కటికచీకట్లో అటమటిస్తూ ఉండేవి." అన్న ఆచార్యదండి అభిభాషణం సర్వదా సర్వథా యథార్థం.

శబ్దం సత్యం. శబ్దం నిత్యం. శబ్దం సత్యసనాతనం. శబ్దం నిత్య నూతనం. శబ్దం లేనినాడు సృష్టిలేదు - జగత్తులేదు-సాహిత్యమేలేదు - కనుకనే క్రాంత దర్శనులైన కవులు శబ్దాన్ని సమాశ్రయించారు. ఆలంకారికులు "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నమైన పదావళి" కావ్యమనీ, "రమణీ యార్థ ప్రతిపాదకమైన శబ్దమే" కావ్యమనీ వాక్రుచ్చారు. శబ్దార్థాలు పార్వతీపరమేశ్వర స్వరూపాలుగా భావించి సంభావించాడు కవికులగురు వైన కాళిదాసు.

కొన్ని శబ్దాలు శిరీషకుసుమ సుకుమారాలు; కొన్ని శబ్దాలు వజ్ర కఠోరాలు. కొన్ని శబ్దాలు తరంగాలవలె పైకిలేస్తాయి. మరికొన్ని శబ్దాలు కురంగాలవలె ముందుకు దూకుతాయి. కిలకిల నవ్వే శబ్దాలు కొన్ని, తళతళ మెరిసే శబ్దాలు కొన్ని, మిసమిసలాడేవి కొన్ని, గుసగుసలాడేవి మరికొన్ని. అయితే సుకవి ఎక్కడ ఏశబ్దం సంగతమో చూచి సరిచూచి మరీ ప్రయోగిస్తాడు. మాలాకారుడు పూలమాల గ్రుచ్చినట్లు సమర్థుడైన కవి సంవర్ధసముచితంగా శబ్దాలను ఏర్చి కూర్చి రచన కావ్యాన్ని తీర్చి దిద్దుకుంటాడు.

కవిత్వం ఒక కమ్మని అనుభూతి. మానవత్వంలో నవత్వం చూపించే అందాల ఆశాజ్యోతి. అది జీవిత విపంచి మేళవించి మ్రోగించిన కల్యాణ గాంధర్వగీతి.

కవిత్వం ఈ లోకానికి ఆలోకాన్ని ఆహ్వానించుతుంది. ఆ లోకంతో ఈ లోకాన్ని నింపుతుంది. ఈ సమన్వయ స్వీకారమే కమనీయ కవితాశ్రీకి శ్రీకారం.

కవిత్వం ఎదలో మెదుల్తుంది-పదంలో కదుల్తుంది - హృదయాన్ని స్పృశిస్తుంది. ఉదయాన్ని సృజిస్తుంది. అభ్యుదయాన్ని అందిస్తుంది.

అందుకనే కవిత్వం సత్య సనాతనం. నిత్య నూతనం.

ఇది ఉదయశ్రీ తృతీయ భాగం. నా మానసంలో కదలిన ఒక ఆనందలహరి ఇది. అనేక రీతుల అనుభూతుల అమృతఝురి ఇది.

"శుభోదయం"తో మేల్కాంచి "అజ్ఞాత నేపథ్యం" అధిగమించి "ఆకాంక్ష"తో "జయోస్తు" పలికి "ఆనందలహరి"లో స్పందించి "భువనవిజయం" అందించగలిగినప్పుడే కరుణశ్రీ "కల్యాణవాణి" చరితార్థం అవుతుంది.

ప్రసన్నహృదయులైన రసజ్ఞ పాఠకుల కరకంజాలలో ఈ మంజుల సుమనోంజలిని సానురాగంగా సమర్పించుతున్నాను. సావధానంగా చిత్తగించమని పదే పదే మనవిచేసుకుంటున్నాను.

కరుణశ్రీ

# శు భో ద య ము

ఆంధ్రరత్నమ ! మంగళాక్షతల్ పైచల్లి
వయ్య ! నీకలలు సత్యమ్ము లయ్యె
దేశభక్తా ! వచ్చి దీవింపవయ్య ! నీ
కోరికల్ రూపు చేకూర్చుకొనియె
విశ్వదాతా ! ఇదే వీక్షింపవయ్య ! నీ
పడినకష్టములు సాఫల్యమందె
మాతండ్రి ! శ్రీరాములూ ! తిన్నగా లేచి
రా ! నీ తపస్సు సార్థకతఁ గాంచె

తాత గాంధీజి ! కస్తూరిమాతతోడ
పుచ్చుకొనవయ్య ! అగ్రతాంబూల మీవు !
ఆంధ్రజనయిత్రి నూత్న గృహప్రవేశ
మిందురండు !! మా స్వాగతం బందుకొండు !!

విచ్చేసినారు ! కవిత్రయ మ్మల్లదే
      రమణీయసౌవర్ణ రథముమీఁద
అరుదెంచినారు ! రాయలవారు ముందువె
      న్కాల అష్టదిగ్గజమ్ములు చెలంగ
దయచేసినారు ! విద్యారణ్య నాగార్జు
      నులు శిష్యసందోహములు భజింప
అలరుచున్నారు ! నాగమ్మ రుద్రమ్మలు
      వీరాంగనలు చుట్టుచేరి కొలువ

ఆంధ్రజననీ స్వతంత్రరాష్ట్రావతరణ
జయమహోదయ మంగళోత్సవము చూడ
తుంగభద్రాతరంగిణీప్రాంగణముల
ఇసుకవేసిన రాల దేమి జనంబు !!

"ఆరంభోత్సవ మాంధ్రరాష్ట్రమున కక్కా ! గౌతమీ ! కృష్ణ ! కా
వేరీ ! పెన్న ! సరస్వతీ ! యమున ! రావే గంగ ! మాయింటిలో
పేరంటం"బని తుంగభద్ర కబురంపింపంగ వా రందఱున్
జేరన్వచ్చువిధాన నల్గడ విరాజిల్లున్ ప్రజావాహినుల్.

ఆ విద్యానగరాంధ్రవైభవము నీ యంకమ్మునన్ మోసికొ
న్నా వెన్నాళ్లొ! మ ఱిన్నినాళ్ళ కుపపన్నంబయ్యె నూత్నాంధ్రరా
ష్ట్రావిర్భావము నీతటంబుననె; అమ్మా! తుంగభద్రా! యికన్
ద్యావాపృథ్వుల నీ మహోజ్జ్వలభవిష్యత్తుల్ ప్రపంచింపవే!

సాగిలి మ్రొక్కరా! తెలుఁగుజాతికి భాగ్యవిధాతయౌ మహా
త్యాగికి; "అర్ధనూటపదహారులు" జీవితసుప్రభాతముల్
యాగ హవిస్సుగా సలిపె! ఆయన సత్యతపస్సులోన "శ్రీ
బాగు" ఫలించెరా! తెలుఁగుబాగుకు మూలము పొట్టిరాముఁడా!

వైషమ్యాలకు స్వస్తిచెప్పి, పెదత్రోవల్ పూడ్చి, అన్యోన్యవి
ద్వేషమ్ముల్ హతమార్చి, స్వార్థములకున్ వీడ్కోలు గావించి, శః
భాషారాష్ట్రశుభోదయమ్మున సుహృద్భావమ్ముతోడన్ విశే
షాశిస్సుల్ గొని దీక్ష గైకొనుఁ డశేషాంధ్రుల్ "విశాలాంధ్ర"కై!

ఆఱుకోట్ల జనుల ఆనందబాష్పాలు
తుంగభద్ర యగుచు పొంగి వచ్చె;
ఆంధ్రరాష్ట్రపీఠ మధిరోహణము సేయ
కన్నతల్లి! కాళ్ళు కడుగుకొనవె!

# విశాలాంధ్ర

శ్రీశైలమల్లీశు సిగమీఁదిజాబిల్లి
తీపివెన్నెలలు చిందినది నేఁడు ;
అమరావతీస్తూప కమనీయశిల్పాలు
ననలెత్తి పరిమళించినవి నేఁడు ;
ఏడుకొండలవాని పైడిబెత్తముకాంతి
దిగ్దిగంతములు నిండినది నేఁడు ;
సింహాచలస్వామి చెంచులదొరసాని
విల్లెక్కుడించి నవ్వినది నేఁడు ;

కాకతమ్మ వాహన మోరుగంటిలోన
చెంగుమని లేచి రంకెవేసినది నేఁడు ;
హంపి యంచలి శ్రీవిఠలాలయమున
కదలినవి రాతిరథముచక్రములు నేఁడు ; ;

ఉదయశ్రీ

విలసిల్లుచున్నవి వీథివీథుల మంద
హాసరేఖలు విజయధ్వజాలు
అలరుచున్నవి వాకిటుల మహోజ్జ్వలరత్న
హారాలు మంగళతోరణాలు
వినిపించుచున్నవి విశ్వకల్యాణ వి
హారాలు వీరశంఖారవాలు
రాజిల్లుచున్నవి తేజోవిరాజితా
శాంతాలు దివ్యదీపాంకురాలు

తెనుఁగుసస్యాలు విఱుగఁబడినవి నేఁడు
తెనుఁగుతోటలు విరియఁబూచినవి నేఁడు
కనుల సంతోషబాష్పాలు తొణుకులాడ
తెనుఁగుతల్లి రంజిల్లి నవ్వినది నేఁడు ॥

జలకంబుల్ సవరించి - హస్తముల పూజాపాత్రముల్ దాల్చి - జో
దలలన్ వంచి - మహాంధ్రవిష్ణువును సందర్శింప రం డల్లదే
తలుపుల్ దీసిరి - వింటిరా తెలుఁగుగంటల్ - కంటిరా వెల్గుపం
టలు-ముక్కోటిత్రిలింగసోదరుల కన్నా! నేఁడు 'ముక్కోటి'రా॥

తంబురా శ్రుతిచేసి త్యాగయ్య ! రావయ్య !
        తెనుఁగుపాటల తియ్యదనము మీఱ
పొలము దున్నుట చాలు పోతన్న ! రావన్న !
        తెనుఁగుమాటల చక్కఁదనము చింద
ధవళాశ్వమెక్కి రుద్రమదేవి ! రావమ్మ !
        తెనుఁగుకోటల దిట్టతనము వెలుఁగ
ఆముచేనుఁగుతోఁప రామమూర్తీ ! రమ్ము !
        తెనుఁగుగుండెల గట్టిదనము చెలఁగ

రాష్ట్రపీఠాన పసుపు పారాణి దాల్చి
కొలువుదీర్చెను నేఁడు మీ తెలుఁగుతల్లి;
సరససంగీతసాహిత్యశౌర్యధైర్య
దీప్తు లెగజిమ్ముఁ డాంధ్రప్రదేశ మెల్ల !

పొంగి పులకించెనేమి త్రిలింగభూమి;
వెలుగులు వెలార్చినది నేఁడు తెలుఁగునాడు;
తమ్ముఁడా రమ్ము ! అర్ఘ్యపాద్యమ్ము లిమ్ము !
చెల్లెలా ! లెమ్ము పువ్వులపళ్ళెరమ్ము !

ఉదయశ్రీ

పాలుకారెడు జవహరులాలు చేయి
స్రీలు చిందించె నేఁ డాంధ్రసీమ యెల్ల;
పువ్వుపువ్వున తేనెలు పొంగిపొరల
నవ్వినవి నేఁడు తెనుఁగు నందనవనాలు ॥

భాగ్యనగరాన ఆంధ్రుల భాగ్యములను
దిద్దు నేఁడు మోతీలాలు పెద్దకొడుకు;
దేశనాయకు "లాంధ్రప్రదేశ"మునకు
ఆచరింతురు పుణ్యాహవాచనములు ॥

శింజానమధురమంజుల
మంజీరము లయ్యె తెలుఁగుమాగాణమ్ముల్ ॥
పుంజీభవించె నవనవ
సంజీవ సమగ్ర సస్యసౌభాగ్యంబుల్.

తెనుఁగుజనయిత్రి దోయిలించినది నీకు
భారతసవిత్రి "శ్రీరస్తు" పలుకవమ్మ ।
ఐకమత్యమ్ముతోడ ముందడుగు లిడఁగ
తెనుఁగుబిడ్డల ఆశీర్వదింపుమమ్మ ।

# ఆంధ్రకేసరి

"రండిరా యిదె! కాల్చుకోండిరా" యని నిండు
గుండెలిచ్చిన మహోద్దండమూర్తి
పట్టింపువచ్చెనా బ్రహ్మాంతవానిని
గద్దించి నిలబెట్టు పెద్దమనిషి
తనకు నామాలు పెట్టిన శిష్యులను గూడ
ఆశీర్వదించు దయామయుండు
సర్వస్వము స్వరాజ్య సమర యజ్ఞము నందు
హోమ మ్మొనర్చిన సోమయాజి

అతఁడు వెలుఁగొందు ముక్కోటి ఆంధ్రజనులు
నమ్మికొల్చిన ఏకైక నాయకుండు;
మన "ప్రకాశము" మన మహామాత్యమౌళి
సరిసములు లేని "ఆంధ్రకేసరి" యతండు!

నీలాల ముంగురుల్ ఫాలాన నటియింప
ముద్దుగా గిరజాలు దిద్దినాఁడు
సింగార మెగబోయు బంగారు నుదుటిపై
తిలకమ్ము కొనగోట తీర్చినాఁడు
ముంగాళ్ళపై పాలచెంగావి ధోవతి
జీరాడ కుచ్చెలల్ చెక్కినాఁడు
సిలుకు లాల్చీపైన జలతారు శాలువా
వింతగా వలెవాటు వేసినాఁడు
కప్పుర విడెమ్ము తావులు గుప్పు మనఁగ
పూలసంగని భంగి వాహ్యాళి వెడలె
దొర సంజెల గౌతమీ తీరములకు
"టింగు రంగా" యటంచు మా "టంగుటూరి."

ధైర్యసాహసభరితము తన చరితమే
తనజాతి చరితమై తనరువాఁడు
ధర్మదీక్షాపరత్వము తన తత్త్వమే
తనజాతి తత్త్వమై తనరువాఁడు
స్వాతంత్ర్య సముపార్జ్యము తన లక్ష్యమే
తనజాతి లక్ష్యమై తనరువాఁడు
అమరదీక్షాలవాలము తన శీలమే
తనజాతి శీలమై తనరువాఁడు
జీవితమె త్యాగమయముగా చేదుమంచు
మ్రింగిన "మహాపురారి" మా "టంగుటూరి"
"ఆంధ్రకేసరి" దివ్యనామాక్షరములు
వెలగ వింకముందు భారత చరితమందు !

# వజ్రసంకల్పుఁడు

క్విట్టిండియా కాదు క్విట్టేషియా యంచు
గర్జించె నెవని భీకరగళమ్ము
పడగలెత్తిన త్రాచుబాముల గరళమ్ము
గ్రక్కించె నెవని మంత్రాంగమహిమ
ఐదువందల యర్వదాఱు సంస్థానాలు
కరగించె నెవ్వాని కార్యదీక్ష
బార్దోలి వీరవిప్లవములో జయలక్ష్మి
గాంచె నెవ్వాని దీక్షాబలమ్ము

అతఁడు సామాన్యుఁడే ! మహోన్నత సమైక్య
సర్వతంత్ర స్వతంత్ర నిష్ఠాపటిష్ఠ
భవ్యభారత నిర్మాణ పండితుండు
వజ్రసంకల్పుఁడోయి ! మావల్లభాయి ! !

స్వాతంత్ర్య బార్డోలి సమరసేనాని "య
        ప్రథ" లేని "యుపప్రధాని"
అసమాన ధైర్యసాహస శౌర్యవారాశి
        మొక్కవోవని మేటి యుక్కుమనిషి
సంపూర్ణ దేశరక్షణ సూత్రధారుండు
        జవహరునకుఁ గూర్చు సహచరుండు
జంకెఱుంగని వజ్రసంకల్ప సంధాత
        తిరుగులేనట్టి జాతీయనేత

నవ్యభారత నిర్మాణ సవ్యసాచి
వీరసర్దారు - ధీర గంభీరమూర్తి -
కనులుమూసె నల్వదికోట్ల కనులనుండి
జలజల కవోష్ణ బాష్పధారలు స్రవింప ॥

మా సరదారు - మా యనుపమాన మహోజ్జ్వలశౌర్యసాహసా
గ్రేసరమూర్తి - మా విజయకేసరి - మా ప్రియనేత - మా నవో
ల్లాసవిధాత - మా భరతలక్ష్మిని దిద్దిన పెద్దశిల్పి - మా
యాసల పాలవెల్లి చనెనా ! యిక కంటికి కానిపింపఁడా ॥

# అజ్ఞాత నేపథ్యము

పాత్రధారులమై కళాక్షేత్రమందు
అడుగు తడబడకుండ మే మభినయింప
సూత్రధారుండవై పైనఁ జూచుచున్న
ఓ జగన్నాట్యసందర్శకా "జయోస్తు"

నవరస భావపూర్ణ మగు నాటక వేదిక మీఁద నెల్ల మా
నవులును గజ్జె గట్టి నటనం బొనరించెదు వేషధారులే;
యవనిక ముందెకాని తెర కావల వేసము విప్పినంత "రా
జెవఁడో? భటుండెవండో?"స్ఫురియింపదు; సర్వము నొక్క రూపమై;

ఆంగిక వాచికా ద్యభినయంబు లొనర్చుచు, హావభావముల్
భంగిమముల్ వెలార్చుచును, పాత్రలు వచ్చెదు నిష్క్రమించెదున్;
రంగము వెంటనే మఱొక రంగము సాగుచునుండె; దృశ్యముల్
రంగులు మార్చుచున్నవి; తెరల్ పడుచున్నవి; లేచుచున్నవిన్.

ఆడుచు పాడుచున్, తగవులాడుచు, నవ్వుచు నేడ్చుచున్, జతల్
వీడుచు పోయినారు తెరవెన్కకు; పోయినవాఁడు వెండియున్
రాఁడొకఁడేని; చిత్ర మగు నాటక మియ్యది; దీని "నాంది" నె
వ్వాఁడు పఠించెనో "భరతవాక్యము" విన్పడ దెన్నినాళ్ళకున్.

వేసము వేసి పంపితివి వేదిక మీఁదికి; పాడువేళ నా
మీసము జారిపోయి విషమించె పరిస్థితి; ప్రేక్షకుల్ పరీ
హాసము చేయనుండిరి; రహస్యముగా తెరవేయు మంచు నీ
కోసము చూచితిన్; కనుకొంటి విదెక్కడి దర్శకత్వమో!

ఎన్నో వేషములన్ ధరించితిని స్వామీ! నిన్ను దర్శింప; నె
న్నెన్నో రంగులు పుల్ముకొంటిని దయాబ్ధీ! నిన్ను మెప్పింప; నిం
కెన్నెన్నో కృతు లాలపించితిని తండ్రీ! నిన్ను రప్పింప; నెం
దున్నావో కనరావు; నీకు వినరావో అస్మదభ్యర్థనల్!

# కల్యాణవాణి

శ్రీశైల మల్లీశు శిరసుపై జాబిల్లి
చిందించు కళల చక్కందనాలు
ఏడుకొండల వేంకటేశ్వరు మెడలోని
మందారమాల కమ్మందనాలు
సింహాద్రి శ్రీ నారసింహ దేవుని తనూ
చందన చర్చ చల్లందనాలు
భద్రాది రఘురామ పాదారవింద మ
రంద బిందువుల తియ్యందనాలు

జల్లులై కొల్లకొల్లలై మెల్లమెల్ల
పెల్లుబికి వెల్లివిరియ మీ యుల్ల మెల్ల
పసుపు పారాణి నూత్నదంపతులు మీరు
ముద్దుగా కాపురము తీర్చిదిద్దుకొనుఁడు ।

శ్రీమద్దివ్యమహర్షిమండల శుభాశీర్వాద పుష్పాంజలి
శ్రీమంతంబు, మహేశహస్తయుగ హారిద్రాక్షతారోపణ
శ్రీమంతంబు, ముహుర్ముహుర్వరశిరశ్శీతాంశురేఖాస్మిత
శ్రీమంతంబు నగాధిరాజతనయాసీమంత మోపున్ మిమున్ ॥

"ఎంచఁగ మీకు నాకు వలె నిందుధరా! తలిదండ్రులు లేరి చూ
పించుఁ" డటంచు త న్నపహసించు హిమాలయరాజపుత్రితో
"మంచిది నీకు మాకువలె మామయు అత్తయు నెచ్చటుండిరో
యించుక చూపు"మంచు హసియించు మహేశ్వరుఁ డేలు మిమ్ములన్!

ఇద్దరు నొక్కమాటుగనె యీవల నావల వచ్చి, చెక్కుపల్
ముద్దిడఁబోవ ప్రేమమయమూర్తుల హైమవతీ మహేశులన్
దద్దయు నవ్వఁజేయ సరదాపడి స్వాస్యము వెన్కలాగి వా
రిద్దరు ముద్దులాడఁగ హసించు గణేశ్వరుఁ డోము మిమ్ములన్ ।

నిద్దపు నీలిముంగురుల నిగ్గులు చిక్కని పెండ్లిసిగ్గులున్,
ముద్దులు మూటగట్టు నగుమోమున దాగుడు మూతలాడ, మీ
రిద్దరు జంటయై పులకరించిన పెద్దల నోముపంటయై
దిద్దుకొనుం డికన్ దెరలుతీయని తీయని సాహచర్యముల్ ।

# ఔచితీ క్షేమేంద్రము

క్షేమంబే కద నీకు నీ కృతులకున్ క్షేమేంద్ర ! మా మాధవా
రామక్షోణిఁ ద్వదీయ దర్శనము సంప్రాప్తించె నిన్నాళ్ళకున్;
శ్రీమంతమ్ములు తావకీన కవితా సిద్ధాంతముల్ సాహితీ
సీమంతమ్ము నలంకరించె సుషమా సిందూర పూరమ్ములై !!

ఆలోకంబు లభించిన, ట్లభినవంబౌ లోచనం బిచ్చిన,
ట్లే లావణ్యవతీ కటాక్షములా మత్తెక్కించుచున్నట్లు, కా
వ్యాలంకారము గన్నటుల్ ! భరతనాట్యారంభమో యన్నటుల్ !
మాలో మా కనిపించు నేమిది రసాత్మా ! నిన్ను దర్శించుచోన్ !!

నిత్య నితాంత కావ్య రమణీ రమణీయ రసానురాగ సాం
గత్యములో “సువృత్త తిలక” మ్మలికమ్మున దిద్దితీర్చి “యౌ
చిత్య విచార చర్చ” విరచించు భవద్దరహాస ముద్రలో
నృత్య మొనర్చెనోయి రసనిర్ఝరి గుండెలు పుల్కరింపఁగన్.

అందము ఛందమై, యభినవార్ద్ర మనస్సుమనో మరంద ని
ష్యంద మమందమై, నవరసప్రకృతుల్ కృతు లుల్లసిల్ల; స్వ
స్పంద మనోజ్ఞమౌ మధురభావపరంపర పొంగులెత్త నా
నంద తరంగితమ్ముగ నొనర్చితివా సకల ప్రపంచమున్ !!

"ఇందుముఖీ ముఖాగ్రమున నింపగు కస్తురి; శ్యామసుందరీ
సుందర ఫాలభాగమున శోభిలు చందన బిందు; వట్లె కా
వ్యేందిర కౌచితీ తిలక మెంతయు కాంతి ఘటించు" నంచు నీ
వందువు; ధన్యవాదములయా హృదయప్రియ ! నీదు వాణికిన్ !

"మునిమత మీమాంసా" కృతి
సనాథ మగు నీ యుదాత్త సాహితికి రస
ధ్వని కాంతముతో సాష్టాం
గ నమస్కృతి సేయు "సుకవి కంఠా భరణా !"

ఉరుశీలోజ్జ్వల దివ్య చందమున, త్యాగోదగ్ర భాగ్యంబటుల్
సరసౌచిత్య సమృద్ధవాక్యము సుధీసంస్తుత్య; "మౌచిత్యమే
స్థిరమౌ జీవిత మౌను కావ్యమున" కన్ సిద్ధాంత మందిచ్చు నీ
"హర కోటీర కుమారచంద్రు"లెవరయ్యా! మీరు "క్షేమేంద్రులా!"

జౌచిత్యైక మరందతుందిలములై ఆనందమందారముల్
పూచెన్ నీ యెదలోని నందనవనంబుల్; నీ కళామంజరుల్
రోచిష్మంతములై దిగంతము లలర్చున్: నీ వచోవైభవం
బాచంద్రార్కము పంచిపెట్టు కవిచంద్రా। సాంద్ర చాంద్రీ సుధల్।

అతఁడు మాధవుం, డభినవైకకళాధరుఁ, డుల్లసన్మహా
ద్వైత రసజ్ఞమూర్తి, విబుధప్రియవర్ణనుఁ, డంచితాగమ
జ్యోతిరుదాత్తచిత్తుఁడు, సముజ్జ్వలలోచనుఁ డౌచితీ జగత్
ప్రీతివిధాత యంచు విహరింతురు "క్షేమపథాన" భావుకుల్.

# ఆకాంక్ష

సింహాచల శ్రీనృసింహ సర్వాంగీణ
చారుచందనసార సౌరభములు
శేషగిరీశ్వర శ్రీవేంకటేశ్వర
శుభ్ర మందస్మిత విభ్రమములు
వరకాంచికాపురీ వరదరాజస్వామి
అక్షీణ దాక్షిణ్య వీక్షణములు
శ్రీరంగ మంగళ శ్రీరంగనాయక
వైజయంతీ కాంతివైభవములు

శాంతపావన శ్రీమదనంతశయన
పద్మనాభ ప్రభు ప్రభా ప్రాభవములు
శ్రీజగన్నాథ దివ్య నీరాజనములు
నవనవశ్రీలు చిందు నా కవితయందు ।

# త్యాగయ్య

తాత గిరిరాజు కవిరాజు; తండ్రిగారు
రాలు కరగించు గొప్ప పౌరాణికుండు;
కవితయును గానమును రెండు కలిసిమెలసి
కాపురమొనర్చె త్యాగయ్య గళమునందు.

అందములొల్కు చిన్నకృతు లల్లును, గాన మొనర్చు గీతగో
విందము నిండుగుండెలు ద్రవింప, వెలార్చును అన్నమయ్య మా
రంద సుధాఝరుల్, రస తరంగములన్ విరజిమ్ము, వీనులన్
విందొనగూర్చు రేకు లరవిచ్చు పురందరదాసు కీర్తనల్।

నాయనగారు ధౌతవసనంబులు దాలిచి దేవతార్చనల్
సేయుచునుండ, తాను తులసీదళముల్ వికచప్రసూనముల్
దోయిలి నిండ దెచ్చి, వినతుండయి తండ్రికొసంగు, వాలుకం
దోయిఁ బ్రమోదబాష్పములు తొన్కఁగ భక్తిరసప్రపూర్ణుఁడై।

ధ్యానము రామభద్రుని పదమ్ములపై నిడి, లక్ష్యలక్షణ
జ్ఞానము సంతరించె; స్వరసప్తకముఁ గ్రహియించె; రాగముం
దానము పాడె; పల్లవి విధాన మెఱింగె; రసప్రధానమౌ
గానమునం జగాన మది గానము త్యాగయకున్ సమానమున్ ॥

కంజాతభవరాణి ముంజేతి రాచిల్క
 కల్కికంఠమ్ములో నొల్కు సూక్తి
ముద్దుగోపాల మోహనమురళిలో
 అందాలు చిందు రాగానురక్తి
ద్రుహిణమానసపుత్రు మహతీ విపంచిలో
 స్పందించు భక్తిరసప్రసక్తి
గంధర్వదేవు బంగారు కిన్నెరల
 తనరారు నవ్యచైతన్యశక్తి

ఏకమై లోకమున నవాలోకమైన
ఆంధ్ర సంగీతలహరిలో నైక్యమంది
కృతులుగా మారి నవనవాకృతులు దాల్చి
త్యాగరాజుల గొంతులో మ్రోగసాగె.

భోగిరాజుల మిసిమి పాన్పున బరుండి
ఉదధికెరటాల నటు నిటు నూగు ప్రభువు
త్యాగరాజుల తంబురాతీగలందు
రాగముల మీఁద నుయ్యాల లూగసాగె.

జయదేవుకడ క్రోధమయి రాధ చరణాలు
ముద్దుల మౌళిపై మోసిమోసి
అన్నమాచ్య సమక్షమం దేడుకొండల
నొంటిగా కాపురముండి యుండి
క్షేత్రయ్య రసమయక్షేత్రాన పలు నాయి
కల బిగికౌగిళ్ళ నలిగి నలిగి
తీర్థులవారు గద్దింప వ్యత్యస్త పా
దారవిందములతో నాడి యాడి

విసిగిపోయి సుంత విశ్రాంతికోసమై
సీతతోడ అనుగు భ్రాతతోడ
విశ్వమయుఁడు ప్రభువు వేంచేసియున్నాఁడు
రాముఁ డగుచు త్యాగరాజు నింట ।

నుతు లొనర్చుచు దేవతాతతులు మ్రొక్క
శ్రుతులతో నొత్తిగిలు పరంజ్యోతి నేడు
శ్రుతుల విడనాడి తంబురా శ్రుతులు మరగి
కృతులు వినుచుండె త్యాగయ్యగృహమునందు ।

బాలభాస్కరదేవు బంగారు కిరణాలు
కమలాకరాలలో కదలు లీల
శారద పూర్ణిమా చంద్ర చాంద్రీద్యుతుల్
నెలరా కపోలాల నిమురు లీల
మధుర మోహన మంద మలయ మారుతములు
వల్లీ పదాగ్రాల వ్రాలు లీల
జలధరస్వామి శీతల వర్షధారలు
సస్యకాంతల ముద్దుసలుపు లీల

తియ్యతియ్యని శ్రుతులు త్యాగయ్య కృతులు
శ్రోతృహృదయాల నానంద సుధలు చిందె:
ప్రాజ్యమైన సంగీతసామ్రాజ్యమునకు
రాగమయ రాజరాజు । మా త్యాగరాజు ।।

# ఆదిభట్ల నారాయణదాసు

ఎవరీ ముగ్ధమనోజ్ఞ దర్శనుఁ ! దెవం డీ శారదామూర్తి ! యీ
నవశృంగార రసావతారుఁ డెవరన్నా ! శ్రీమదజ్ఞాడయే
యవునా! ఆ దరహాస ! మా నడకతీ ! రా ఠీవి ! యా దర్ప ! మా
కవితాదీప్తి ! యనన్యసాధ్యములురా ! కై మోడ్పు లందింపరా !

పండించె నీకాలి గండపెండెరము రం
గాయ ముంగారు బంగారు పంట
నర్తించె నీకీర్తి నవనవస్ఫూర్తి యా
సేతు శీతాచల క్ష్మాతలాన
జోహరులందె నీ సాహిత్యనందిని
కదిలించి సహృదయహృదయములను
గంభీరమయ్యె నీ "శంభో" నినాదంబు
దిగ్దిగంతాలఁ బ్రతిధ్వనించి

కాంతు లీనెను రాజ సభాంతరాల
నీ జయశ్రీ దృగంత నీరాజనాలు;
యక్షగానకళా మహాధ్యక్షపదవి
అక్షరంబయ్యె నీపట్ల "నాదిభట్ల !"

చిఱుతాళముల జత చే ధరించినఁ జాలు
లయతాళములు శుభోదయము పలుకు
కాలిగజ్జె లొకింత ఘల్లు మన్నం జాలు
భరతమ్ము నీ ముందు శిరసు వంచు
వీణ తంత్రుల మునివ్రేళ్ళు సోకినఁ జాలు
సంగీతవాహిని పొంగిపొరలు
గంటంబుఁ బూని క్రీగంటఁ గాంచినఁ జాలు
కవిత నీ యెదుట సాక్షాత్కరించు
నేఁటి కథకులందు నీ పేరు చెప్పక
గజ్జె గట్టువాఁడు కానరాఁడు;
తెలుగువెలుఁగు దేశదేశాల నింపిన
హరికథా పితామహా ! నమోస్తు ! !

కల్యాణి రుక్మిణీ కన్య మెల్లఁగ నల్ల
నయ్య భుజమ్ముపై చెయ్యి వైచె
జనని జానకి మహాశపథమ్ముతో సుప
థమ్ము చూపెను సతీధర్మమునకు
వరగాత్రి సావిత్రి వైవస్వతుని నిల్పి
మగని ప్రాణాలకై తగవులాడె
చిన్ని మార్కండేయు శివభక్తి పదమెత్తి
మృత్యుదేవత గుండె మీఁదఁ దన్నె
"మ్రొక్కుబడిఁ" జిక్కువడి పేదబుక్క వెల్లి
నప్పుపుం దెల్గు కలకండ లచ్చువోసె;
నీదు ప్రతిభకు లోనుకానిది మఱేది?
స్వర సురత్రాణ ! అష్టభాషా ప్రవీణ !

చల్లపల్లి నృపాలు సంతోష మెంతయో
గండ పెండర మిచ్చి గౌరవించె
ఆనందగజపతి మేనెంత పొంగెనో
రమణీయ రత్నహారము లొసంగె
మైసూర్ మహారాజు మదిముద మ్మది యెంతొ
కనకాంబరమ్ములు కట్టఁబెట్టె
సరస విద్వన్మహాసమితి మే లెట్టిదో
ఘంటా సువర్ణ కంకణము లిచ్చె
లలిత సంగీత సాహిత్య కలిత యగుచు
భరతభారతి హారతి పట్టె నీకు;
హరికథావ్యాసునకును - స్నేహార్ద్ర మధుర
హాసునకును - నారాయణ దాసునకును -

"నేతి" సౌవర్ణ మాణిక్య పీఠము వెట్ట
"కుప్పా" జగా వెల్లగొడుగుఁ బట్ట
"వౌదూరి" శిల్ప సుందర కిరీటముఁ గూర్ప
"అమ్ముల" శ్రీ తిలకమ్ము తీర్ప
"చీరాల" నవరత్న హారాలు కై సేయ
"చిట్యాల" మంజు మంజీరము లిడ
"హచిభట్ల" మనోజ్ఞ కుండలా లర్పింప
"ములుకుట్ల" పన్నీరు చిలుకరింప
"వాణి" యును "వేణి" "రాణి" పారాణి దిద్ద
కొలువు దీరెను హరికథా కువలయాక్షి;
మ్రొక్కె నీకు సుగాత్రి నీముద్దుపుత్రి
నెట్లు దీవింతువో ఆదిభట్ల బాబు!

"బాలాజి" సరిక్రొత్త పారిజాతము లివ్వి
"భోగలింగము" జాజి పూవు లివ్వి
"పరిమి సుబ్రహ్మణ్య" సరసీరుహము లివ్వి
"పాతూరి" వకుళ పుష్పమ్ము లివ్వి
"పెద్దింటి" మేల్ గులాబీ ప్రసూనము లివ్వి
"ములుకుట్ల" సంపెంగ మొగ్గ లివ్వి
"బాల బ్రహ్మానందు" నీలోత్పలా లివ్వి
"తెల్లాకుల"వి మంచి మల్లె లివ్వి
కమ్మని సుగంధములు విరజిమ్ము నేఁడు
హరికథోద్యాన వనమందు; నందుకొనుము
నీవు నాటిన తోటలో పూవు లొసఁగు
శ్రీ సపర్య! నారాయణదాసవర్య!!

"ఎవఁడురా! యచట తెం డింకొక్క గ్లా" సంచు
అమృత రక్షకులకు నాజ్ఞ యొసఁగి
"సుధకంటె మా హరికథ లెస్స" యని బృహ
స్పతితోడ నర్మ భాషణము నెఱపి
"ఏమమ్మ వాణి! యేదీ వీణ! సరిక్రొత్త
తీవలా" యని 'గిరాందేవి' నడిగి
"ఆగవే రంభ! ఆ హస్త మట్టులు గాదు
త్రిప్పిపట్టు" మటంచు తప్పుదిద్ది
"ఏమయా! క్రొత్త సంగతు లే" మటంచు
బ్రహ్మమానసపుత్త్రుని పలుకరించి:
ఆదిభట్ల నారాయణాఖ్యము మహస్సు
తిరుగు నిందందు స్వర్గ మందిరములందు!!

ఉదయశ్రీ

సంగీత సాహిత్య జగదంగణము ధగ
ద్ధగిత మ్మొనర్చు గంధర్వతార
వాసిఁగాంచిన మహావాగ్గేయకారుఁడై
భారతి నర్చించు భక్తమౌళి
అమరుఁడౌ "ఉమరు ఖయ్యాం" రుబాయతు లాంధ్ర
సంస్కృతమ్ముల కెత్తు సవ్యసాచి
హరికథారాజ్య మూర్ధాభిషిక్తుండయ్యు
స్వార్థం బెఱుంగని పార్థివుండు

వాలు మెలి మీసకట్టు, జాల్వాల జుట్టు,
నొసట కుంకుమ బొట్టు, మేల్పసిడిగట్టు,
విద్దెలకు పట్టు। నడయాడు వేల్పుచెట్టు।
హరికథా శిల్పసమ్రాట్టు। "ఆదిభట్టు"

# సురభి

నవరస నాట్య సరోవర
నవజీవన వర్ధమాన నళినములారా !
నవ మిత్రములారా ! నవ
నవోదయము మీకు సురభినందనులారా !!

విజయశ్రీ లివె మీకు గైకొనుఁడయా ! వేనోళ్ళ మాప్రేక్షక
ప్రజ మేల్ మేలని మెచ్చితెచ్చిరి రసార్ద్రస్వాంతులై; యీ సభన్
విజయంచేసిన విద్వదగ్రణులు దీవింపంగ శ్రీ శారదా
విజయాలంకృత నాట్యమండలి జగద్విఖ్యాతి నార్జించుతన్.

సంగీత సాహిత్య శృంగార గంగా త
రంగాలు బుసబుస పొంగినటులు
చల్లచల్లని పాలవెల్లిలో జాబిల్లి
మల్లెమొగ్గలు వెదజల్లినటులు
వందారు సుందరీ మందార మాలా మ
రందమ్ము లందందు చిందినటులు
సోగకన్నుల రాణి మూగ చూపులలోని
రాగాలు తీగలై సాగినటులు
సురభి నగరాన తలయెత్తి, పెరిగి, విస్త
రిల్లి, శాఖోపశాఖలై యెల్ల దిక్కు
లొరసి ఫలపుష్పభరితమై మెరసె నేడు
కౌతుకము లల్లి మీ కళా కల్పవల్లి !

ఉదయశ్రీ

కనుమూసి తెఱచులోననె మారిపోయెడు
నవ దృశ్య పరివర్తనములు చూచి
ఇంద్రధనుస్సుపై కెక్కుచున్నట్లు రం
గులు మారుతెర తెరంగులును చూచి
సినిమాల తలదన్ను చిత్రవిచిత్ర సం
ఘటన నిర్మాణ దక్షతలు చూచి
'వాతాపి గణపతి' గీత మారంభించు
ప్రాక్సంప్రదాయ సంపదలు చూచి
రంగ రమణీయ జంత్ర మంత్రములు చూచి
నర్తకీ నర్తనావర్తనములు చూచి
సమ్మదము జెంది తన్మయత్వమ్ము నంది
మెచ్చెను సుధీజనమ్ము మేల్మేలు మిమ్ము ॥

స్త్రీ పాత్రంబులు స్త్రీలె దాల్చు టొక వైశిష్ట్యంబుగా నాట్య ల
క్ష్మీ పూజా పరతంత్రులైన 'ధనలక్ష్మీ' పుత్రులారా ! కళా
శ్రీపాదార్చకులార ! మీకివె శుభాశీస్సుల్; విశాలాంధ్రలో
దీపించున్ భవదీయ నాటక కళల్ దేదీప్యమానంబులై !

మన గుంటూరు; మహాంధ్ర నాటక కళా మాధుర్య సౌందర్య సా
ధనకుం బేరు; కవీంద్ర చంద్రులకు కేంద్రం బౌచు నొప్పారు; మా
జనముల్ మెచ్చిన "శారదావిజయ" దీక్షాదక్షులౌ మీ కివే
ఘనసన్మానము లాదిశేష మణిరేఖల్ సత్య సౌహార్దముల్.

# జయోస్తు

జయ జయ ! జయాభ్యుదయ ! సహృ
దయ హృదయప్రియ ! సుహృదయ ! దయసేయుము ! నీ
కయి కయిసేసిన గద్దియ
పయి విజయంచేయు ! ముదయ భాస్వంతుడవై !!

క్రొమ్మావి కొమ్మ కమ్మని
కెమ్మోవి చివుళ్ళ బుజ్జగించిన కలకం
ఠమ్ములు కలకంఠములై
సమ్మోదము తోడ నీకు స్వాగత మిచ్చున్.

వగరు వగరుగ, పుల్ల పుల్లగను, తియ్య
తియ్యగా, చేదు మ్రింగిన తెలుగుబిడ్డ
తొగరు చెక్కిళ్ళ బాష్పాలు తుడుచుకొనుచు
"జయము" పలుకును నవయుగస్వామి ! నీకు.

రాజువట నూత్న సంవత్సరమున కీవు ।
రమ్ము రమ్మోయి । ఈ చైత్రరథపథాల ।
చిగురు చెంగావి కలికి కుచ్చెలులు చెదర
ప్రకృతి నీ కెత్తు ప్రణయ నీరాజనమ్ము ।

కెంజిగురాకు చేతుల నొకించుక వంచి ప్రఫుల్ల మంజరీ
మంజుల మాధవీ మధుర మంగళమూర్తి వసంతలక్ష్మి పు
ష్పాంజలి పట్టు నీకు, కమలాకరముల్ రసరాగపూర్ణ దృ
క్కంజములన్ వెలార్చు నవకౌతుక బాష్ప మరందబిందువుల్.

కన్నులు విప్పకే తెరలు గట్టిన చీకటిలో ప్రసుప్తమై
యున్న జగత్తు నీ నవయుగోదయవేళ స్వయంప్రబుద్ధమై
వన్నెలు దిద్దుకోవలె । నవత్వములోపల మానవత్వ మ
భ్యున్నతి నందుకోవలె । మహోజ్జ్వల జీవన సుప్రభాతముల్ ।।

భజనలు పక్షపాతము లపశ్రుతు లెక్కువ; రక్తి తక్కువై
గజిబిజిచేసె తర్జనల గర్జనలన్ విజయాబ్ద; మింతతో
విజయకు వీడుకోలు చదివించి జగ మ్మిక నిర్వికారమౌ
విజయ సమాగమ మ్మనుభవించుత । నూత్న శుభోదయమ్ములో.

"ఏరోజుకైన చల్లారునా 'కొరియా'బ
 జారులో రేగిన కారుచిచ్చు"

"ఏనాటికైన కాలూనునా 'వియతుమిన్'
 జావుటాపై శాంతి పావురమ్ము"

ఏదినమ్మునకైన ఎగురునా 'ఫ్రెంచిండి
 యా' గుండెపై 'ఇండియా పతాక"

"ఎప్పటికైన శాంతించునా జమ్ము కా
 శ్మీరాలపై కరాచీ తుఫాను"

అనుచు నుత్కంఠమై భవిష్యత్తువైపు
కాంచుచున్నది నేఁటి ప్రపంచ మెల్ల;
క్రొత్త ఏడాది నీ "కట్టుపెత్తనమున"
తొలఁగుత జగత్తునకు దుండగుల భయాలు ।।

నాగార్జునాద్రి నున్నని పాలరాళ్ళపై
 సిరులు చిల్కిన తెల్గు శిల్పలహరి

ఏకశిలాపురీ ప్రాకారములపైన
 విశ్రమించిన తెల్గు విజయలహరి

విద్యానగర నందనోద్యాన వీథుల
 కాంతు లీనిన తెల్గు కావ్యలహరి

త్యాగరాయల భావరాగ దోలికలలో
 కళలు చిందిన తెల్గు గానలహరి

ఒక్కసారిగ మరల నింకొక్కసారి
పొంగిపొరలును గాక త్రైలింగజగతి;
పసిడిపంటల ఆంధ్రసౌభాగ్యలక్ష్మి
నవ్వుకొనుగాక ఈ నవానందవేళ ।।

అది "యుగాది" నీది ! తెలుగమ్మ స్వతంత్ర గృహప్రవేశ భా
గ్యోదయమైన పిమ్మట; నవోదిత రాష్ట్రములో సమైక్య సం
పాదనచేసి అభ్యుదయ పద్ధతులందు పురోగమించి ఆ
హ్లాదము గూర్పుమోయి ప్రజ లందరు నీకు"జయంబు"పల్కఁగన్.

వేయుటకేమిలే ! వేసిన అభివృద్ధి
పథకాలు మఱి బూజుపట్టకుండ
చేయుటకేమిలే ! చేసిన ధర్మ తీ
ర్మానాలు రూపులు మారకుండ
పొంగుటకేమిలే ! పొంగిన తటినీ త
రంగాలు పంటలు మ్రింగకుండ
పలుకుటకేమిలే ! పలికిన పౌరవా
గ్దానాలు నోళ్ళలో నానకుండ

వెడలి ముందుకు - వెనుకంజ వేయకుండ -
తిరిగి వెనుకకు గోతులు తీయకుండ —
మేలుకొని - మేలుగా రాజ్యమేలుకొనెడి-
తెలుఁగు వెలుఁగుల తొలి యుగాదికి "జయోస్తు."

# మా గురుదేవులు

కప్పురము పలుకు, భావన
విప్పిన నెమిలిపురి, మనసు వెన్నెల, పూవుం
దెప్పగదే దీవన, మా
కుప్పా శ్రీ ఆంజనేయ గురుదేవులకున్.

ఫాలంబందు విభూతిరేఖలు, పయిన్ పట్టంచు దుశ్శాల్వ, ముం
గేలన్ భాష్యము, కుండలాలు చెవులన్ గీల్కొల్పి, ఏమేమియో
ఆలాపించుచు, వెంట శిష్యతతి రాగా; పెద్ద బాజారునన్
కాళీదాసుని భంగి వత్తురు ! నమస్కారంబు మీ మూర్తికిన్.

సాక్షాత్పాణినివో ! పతంజలివొ ! అస్మద్దేశికస్వామివై
దాక్షిణ్యంబున చేరదీసి అనవద్యంబైన విద్యాధనం
బక్షయ్యం బగు భిక్ష పెట్టితివి: ప్రత్యక్షంబు ప్రత్యక్షరం:
బక్షీణంబులు మీ కటాక్షములు మా కాధేయ పాధేయముల్.

సభ్యత మోసులెత్తె: గుణసంపద తీగెలు సాగె: రాగవా
ల్లభ్యము పల్లవించె: సరళత్వము పువ్వులు పూచె: భావసౌ
రభ్యము నిండె స్వీకృత పురాకృత పుణ్యఫలంబు పండె: మా
కభ్యుదయంబు చేకురె దయామయ ! యుష్మదనుగ్రహంబునన్.

ఆశాస్యంబుల కాగమంబు, ధృతి కన్వాదేశ, మామ్రేడితం
బాశాజ్యోతికి, వీప్స నిర్మితికి, ప్రత్యాహార ముత్సాహ ధీ
కౌశల్యంబుల కెల్ల, సంహిత సమీక్షాశక్తికిన్, యుష్మదీ
యాశీర్వాద మొకండు ! పూజ్యగురుదేవా ! కౌముదీవల్లభా !

గ్రహియించినారు వ్యాకరణంబు సాధుస
    త్తములైన దేశికోత్తముల చెంత
ప్రవచించినారు రెండవ వ్యాసదేవులై
    రసధురీణములౌ పురాణములను
త్రావించినారు విద్యాసుధల్ పెక్కుచం
    దాల విద్యార్థి బృందాల కర్థి
రచియించినా రపూర్వములైన భవ్యకా
    వ్యములు రసజ్ఞసేవ్యములుగాగ

మలచుకొన్నారు సౌమ్యరమ్యప్రశాంత
పావనమ్మైన నిస్స్వార్థ జీవనమ్ము
నిలుచుకొన్నారు సద్యశో విభవములను,
ఆంజనేయాభిధేయ ! కుప్పాన్వవాయ !!

ఉదయశ్రీ

ఎంతో యిష్టము మా గురూత్తములకీ యేనన్; ప్రధానాంధ్ర భా
ష్యాంతవ్యాకరణప్రపాఠనము, శిష్టాచారసంపత్తియున్,
శాంతోదారమహేశ్వరాంఘ్రియుగళీ సాష్టాంగ పుణ్యక్రియా
సంతోషంబు, తెనుంగు భాగవత, ముద్రైశిష్య వాత్సల్యమున్.

శ్రీమద్వేదులసూర్యకోవిదమణే శ్శిష్యాగ్రణీ ర్దక్షిణా
మూర్తే రాత్తకళానిధేః ప్రియసుతః ప్రజ్ఞాప్రియంభావుకః ।
కుప్పావంశపయః పయోనిధివిధుః సాహిత్యవిద్వన్మణిః
శ్రీమాన్ తత్రభవాన్ భవాన్ విజయతే శ్రీ ఆంజనేయప్రభుః ॥

# శ్రీ విశ్వనాథ

నిద్రాణ మ్మగు జాతికిఁ నవనవోన్మేషమ్ము చేకూర్చి ని
ర్ణిద్రస్ఫూర్తి, పథప్రవర్తియయి నర్తించెన్ భవన్మూర్తిలో ।
భద్రంబుల్ భవదీయ భారతికి విద్వన్మండలాధ్యక్ష । శ్రీ
మద్రామాయణకల్పవృక్ష । కవిసమ్రాట్; నిత్యసత్యప్రియా ।

ఎవరయ్యా ప్రతి - విశ్వనాథులకు - బ్రాహ్మీదత్త సాహిత్య సం
స్తవనీయప్రతిభాసనాథులకు - విశ్వస్తుత్య పాండిత్య వై
భవ సంప్రాప్త యశోధినాథులకు - నిర్వ్యాజానురాగంబునన్,
కవితాయోగమునన్, ప్రసన్నరసవద్గాథాప్రయోగంబునన్ ।।।

నవలల్ గూర్చును; నాటకంబులను విన్నాణంబుగాఁ దీర్చు; మేల్
కవితల్ నేర్చు; కథల్ వెలార్చు; సుమహాకావ్యంబు లీడేర్చు; నీ
జవసత్వంబులు సర్వతోముఖ మహాసాహిత్యసౌభాగ్యముల్ ।
భవదీయస్తవనీయలేఖిని కివే బ్రహ్మాయురారోగ్యముల్ ।।

విశ్వ"కళాప్రపూర్ణు" డని విశ్వకవీ! నిను నేఁడు సాహితీ
విశ్వము విశ్వసించె, మన విశ్వకళా పరిషత్తు తానిటుల్
శాశ్వతమైన గౌరవ మొసంగె; మహాంధ్రమునందు రాజరా
జేశ్వరియై భవత్కవిత యేలుత ప్రాజ్ఞరసజ్ఞరాజ్యమున్.

చాళుక్యజనపాలు కేలఁ గేల్కీలించి
నన్నయ్య సుప్రసన్నముగఁ జూచె
శబ్దశాసనుని పార్శ్వమ్మున నిలుచుండి
తిక్కయజ్వ రసైకదృష్టిఁ జూచె
తిక్కయజ్వకు ప్రక్క ప్రక్కగా నిల్చి శ్రీ
నాథుండు సబహుమానముగఁ జూచె
కవిసార్వభౌము వెన్కనె నిలంబడి పొంగి
పొంగి పెద్దన తొంగి తొంగి చూచె

శయ్య బిగిదేఱు – భావాలు జాలువాఱు
చేవ నిండాఱు - వైచిత్రి చెలువుమీఱు
అక్షర మ్మక్షరము కల్పవృక్ష మగుచు
నీవు రామాయణము వ్రాయు నిముసమందు.

అరిపో వెన్నాళ్ళ కారాజు మునిరాజు
గడ్డాల రాలు "ముక్తాకణాలు"
అలసిపోఁ డెన్నేళ్ళకైన పాడుచు నాట
లాడు దుందుడుకు "శాంతమ్మకొడుకు"
ఆగిపోదు శతాబ్దులైనను పొంగు లె
త్తిన మిన్నువాక "గాధేయురాక"
అంతమ్ముగాదు యుగాంతాలకును గౌత
మాశ్రమమ్మందు "నహల్యవిందు"

చంటిబిడ్డ రాముఁడు మునివంట నొక్క-
కందిపోయిన కౌసల్య కందిగింజ
రంగుమారదు కోటివర్షాలకైన
తాత్త్వికస్ఫూర్తి! సత్యచైతన్యమూర్తి!

[దేవేంద్రుఁడు స్వగతము]

తిమ్మన పారిజాతము క్షితిస్థలికిం గొనిపోవుటాది దే
హమ్ము వడంకు 'సత్యకవులన్న' - తదాఖ్యుఁడ నేఁడు కల్పవృ
క్షమ్మును గొంచుబోయి బిగగట్టెను రామునితో, మహాపవ్రబం
ధ మ్మది యయ్యె; నింద్రు తలఁదన్నుఁగ నేఁడొక సత్కవీంద్రుఁడా!

[నారద నారాయణులు]

"ఆ యహిరాజు పాన్పున సుధాంబుధిపై శయనించువారు నా
రాయణ! యొద్దునం దిసుకరాల పరుండితిరేమి?" "సత్యనా
రాయణుఁడన్ తెలుంగుల మహాకవి కిన్నెరసాని పాటలన్
కాయము పొంగి వేయిపడగల్ కదలన్ మన శేషుఁ డేగెరా!"

[ఉమా శంకరులు]

"స్వామీ! ఎక్కడనుండి?" "సత్యకవి మాస్వామీ యనన్ బోయి నా
నే!" "మూఁడవ కన్ నేమిటి?" "మూతయయి పోయెన్ వాని కేనాడొ!" "లే
దేమీ చేత త్రిశూల?" "మా! మఱచిపోతిన్ వాని నట్టింట!" "లే
దేమీ గంగ శిరస్సుపై?" "కలసిపోయెఁ వాని వాగ్ధోరణిన్."

# సాహితీ మాధవముం

యన్మహోపన్యాస తన్మయత్వమ్ములో
పొంగిపోయినది త్రైలింగభూమి
యద్వక్తృవీథి దీవ్యద్వియద్గంగయై
పర్వులెత్తినది సౌపర్వవాణి
యత్కృతుల్ కల్యాణ సత్కృతుల్ గొనువేళ
నృత్యమ్మొనర్చె సాహిత్యలక్ష్మి
యద్యశోలత సంసదుద్యానములఁ బూచె
కొల్లకొల్లఁగ మంచి మల్లెపూలు

అతఁడు నవరసగంగాధరాద్యనేక
సార సారస్వతాలోక చక్రవర్తి
"అభినవానంద భరత" భావార్ద్రి "మధుర
మాధవుఁ"డతండు। "రస జగన్నాథుఁ"డతఁడు।

ఆ వైదుష్య మపార; మా ప్రతిభ దివ్యం: బా మహోదాత్త భా
షా వైచిత్రి యమోఘ; మా రసధునీ సాహిత్య సామ్రాజ్య ల
క్ష్మీ వాల్లభ్య మనన్యలభ్య: మన వాసిం గాంచి విన్నాణపుం
ప్రోవుల్ మాధవరామశర్మ గురుదేవుల్ పొల్తు రాంధ్రావనిన్ ॥

మాధవ మాధవీ సుమ సమంచితముల్, విలసత్కళా జగ
న్నాథము, లక్షరామృత సనాథము, లున్నమితోత్తమాంగ గం
గాధర జాటజూట మణికాంతులు, కావ్యకళా స్రవంతులై
యాధునికాంధ్ర వాఙ్మయ దృగంతములన్ సరసీకరించుతన్.

పాతివ్రత్యము సల్పు వ్యంజన మహాభక్తిన్ తదాస్యమ్మునన్;
చేతుల్ మోడ్చి సమాశ్రయించును రసశ్రీ తద్వచో వైభరిన్;
తాతారాయడుశాస్త్రిపాదులచె శాబ్ద ప్రక్రియా సాహిరీ
గీతాచార్యులు - మాధవీయమణి వెల్గించున్ దిగంతమ్ములన్ ॥

కార్తిక పూర్ణిమా వికచ కైరవ హాస విలాస మాధురీ
స్ఫూర్తిమదుజ్జ్వలార్ధ పరిపుష్ట కనత్ కమనీయ కౌముదీ
నర్తన కింకిణీ క్వణన నందిత మంద మదున్మనోహరా
వర్తనముల్ । భృశ మ్మభినవమ్ములు । మాధవ వాగ్విహారముల్ ॥

# ఏటుకూరి

పంకజభవ రమణీ మణి
కంకణ ఝుంకృతులు; విశ్వకల్యాణ కళా
కింకిణి కుహ్రుహుతులు; మా
వేంకటనుంసయ్యా నవ కవిబ్రహ్మ కృతుల్ ।

"నాయకురాలచే" తెలుగునాంటికి నీ పలనాంటి భారతా
మ్నాయము; స్నిగ్ధముగ్ధ చరణమ్ములలో స్ఫురణమ్ము లెన్నియో ।
గాయకురాలచే తెలుగుగడ్డకు నీ కవితా త్రివేణి । గం
గా యమునా సరస్వతుల కౌగిలిలో గిలిగింత లెన్నియో ।

తీయని శయ్యపై కొలువుదీర్చిన నీ కవితాకుమారి కం
దోయికి దోయిలించెను గదోయి రసజ్ఞత । మంచి మంచి జా
తీయము లేర్చి కూర్చి సరిదిద్దితి వాంధ్రిని; విప్పె నూతనా
ధ్యాయము నీదు వృత్తము లుదాత్తములై నవభారతమ్మునన్ ।

ముంచెత్తెన్ సుమనోమనోంబుజవనమ్మున్ ప్రత్యుషస్నాహితీ
సంచారమ్ములతో త్వదీయ కవితా సావిత్రి; నీ మానినీ
మాంచాలా మధురాధరస్ఫురణలో మార్మ్రోగె సోత్కంఠమా
పాంచాలీ కలకంఠకంఠము; కవిబ్రహ్మ। కృతార్థుండవే।

కండగల భాషలో కలకండ కల్పి
తెలుగుబిడ్డల నోటి కందించినావు।
నాఁటికిని నేఁటికిని మఱేనాఁటికైన
సాటిలేనిది నీదారి। యేటుకూరి।

# ఆమ్రపాలి ఆత్మార్పణము

[బుద్ధ భగవానులు శిష్య సమేతంగా వైశాలీ నగరానికి ఆనాడే విజయంచేశారు. రాజనర్తకి ఆమ్రపాలి ఆనందంతో జగద్గురువుకు స్వాగత మిచ్చింది। ఆ ఆనంద పారవశ్యంలో ఆమె అంతరంగంలో తరంగాలై తలయెత్తి రక్తి భక్తి జంట జంటగా ప్రవహించాయి.]

ఇంత తీయగా చిగిర్చింది ఎందుకో ఈ ఉదయం
ఇంత హాయిగా నిట్టూర్చింది ఎందుకో నా హృదయం
ఎంతో సంతోషంతో ఎగిరి దూకుతున్నవి కురంగాలు
అంతరంగం ముంచెత్తుతున్నవి అవేవో భావ తరంగాలు.

శాక్య రాజ్యస్వామి జాయ మాయాదేవి
లోకోత్తరమ్మయిన లుంబినీవనములో
కడుపుచల్లగ కన్న కల్యాణములపంట
కాలూనునంట । వైశాలిన ర్తకియింట ।।

చిఱునవ్వులో పారిజాతాలు పూచిన కరుణారస సింధువు
చరణాలలో కోటి స్వర్గాలు దాచిన శరణాగత బంధువు
అరుదెంచుచున్నాడు నేడు ఆపన్న విపన్నవర్తకుడు
దయచేయుచున్నాడు నేడు ధర్మచక్రప్రవర్తకుడు.

కఠిన కర్కశ శరాఘాతమ్ముచే కూలి
వ్రాలు రాయంచ కుయ్యాలించి లాలించి
రక్షించు అక్షీణ దాక్షిణ్యముల పంట
కాలూనునంట ! వైశాలి నర్తకి యింట !!

నా ప్రభువు ! నా కరుణమూర్తి ! నన్ను మన్నించారు
నా ప్రార్థన ఆలకించారు నా పిలుపు అంగీకరించారు
ఎందరెందరో కోటీశ్వరులు తమ మందిరాల కాహ్వానించారు
అందరినీ కాదని ప్రభువు ఈ ఆమ్రపాలినే అనుగ్రహించారు.

రాజ్యమ్ము ప్రణయ సామ్రాజ్యము విడనాడి
తళుకు చెక్కుళ్ళ ముద్దుల నందనుని వీడి
కదలిపోయిన విశ్వకారుణ్యముల పంట
కాలూనునంట వైశాలి నర్తకి యింట !!

ఉదయశ్రీ

మధుర మధురంగా పులకిస్తున్నది నా మామిడి తోట।
మధువు లొలికిస్తున్న దీనాడు మల్లెపువ్వుల దాట।
కొమ్మ కొమ్మనా గుమ్మటాలై క్రొత్త చిగుళ్ళు లేస్తున్నవి।
కమ్మకమ్మగా కోకిలమ్మలు కంఠమెత్తి రాగాలు తీస్తున్నవి।

కదలి మహాభి నిష్క్రమణంబు సాగించి
పల్లెపడుచు సుజాత పాయసము భుజించి
బుద్ధత్వమును గన్న బోధివృక్షము పంట
కాలూనునంట। వైశాలి నర్తకి యింట।।

నా మానసం మానస సరోవరం వలె మారిపోతున్నది।
నా భావన సహస్రపత్రకమలమై తేలి పోతున్నది।
నా అనురాగం సుకుమార సుగంధమై దెసల ప్రసరిస్తున్నది।
నా ఆనందం మధుర మకరందమై పొంగి ప్రవహిస్తున్నది।।

కన్నీటితో జగత్కాలుష్యమును గడిగి
శాంతి కలహంసలకు కాంతిరెక్కలు తొడిగి
అజ్ఞానముల నణచు విజ్ఞానముల పంట
కాలూనునంట। వైశాలి నర్తకి యింట।।

తథాగతులు మా యింటికి దయతో విజయంచేస్తారట ।
సుధాకరులు ఈ కలువపూవును చూడటానికి వస్తారట ।
నా జీవనం వనమయూరమై నవోల్లాసంతో నర్తిస్తున్నది ।
నా యౌవనం తన పవిత్ర కర్తవ్యాన్ని సవనవంగా గుర్తిస్తున్నది ॥

కలుకు కత్తులు పెటికి కంఠాలు తెగనఱకి
ప్రజల నెత్తురు త్రాగు గజదొంగలను గూడ
సాధువులుగా మార్చు సౌహార్దముల పంట
కాలూనునంట । వైశాలి నర్తకి యింట ॥

చక్కని కలహంసలా వెండిరెక్కలు తొడుక్కున్నది శరత్తు ।
చిక్కని మధు పరాగాలు చిమ్ముతున్నది మలయమరుత్తు ।
పరవసించి పొంగి పొరలుతూ పరువెత్తి వస్తున్నది సరిత్తు ।
నిరవధికంగా నిర్నిమేషంగా నిలిచి నిరీక్షిస్తున్నది వియత్తు ॥

మూగప్రాణుల బంధమోక్షణమ్మొందించి
యాగవేదికల వాగమృతమ్ము చిందించి
"సర్వార్థసిద్ధ"మౌ సౌజన్యముల పంట
కాలూనునంట । వైశాలి నర్తకి యింట ॥

విచ్చేస్తాడు నేడు నా యింటికి విశ్వశాంతి ప్రదాయకుడు
వెలుగు నిస్తాడు నా కంటికి విజయ మంగళ విధాయకుడు
నా అదృష్టనర్తకి గజ్జెకట్టి నాట్యం చేస్తుం దీనాడు।
శాంతరసాన్ని శృంగారం శరణు పొందుతుంది నేడు।।

ఆ ప్రభువు చూపు తాపత్రయ మ్మెడదాపు
ఆ దయామయు మాట అపవర్గముల మూట
"సర్వతోభద్ర"మా శాంత్యహింసల పంట
కాలూనునంట। వైశాలి నర్తకి యింట।।

జగద్గురువుల కీరాజనర్తకి స్వాగతమిస్తుంది నేడు
జన్మజన్మాల సాధన సార్థకమౌతుం దీనాడు
గగనం పుష్పవృష్టి కురుస్తుంది। కరగి నీరౌతుంది భూమి।
పూజ లందుకుంటాడు నా స్వామి, "బుద్ధం శరణం గచ్ఛామి."

సంసార దుఃఖ హరణాలు। చైతన్య పరిస్ఫురణాలు।
శాంతిదేవత కలంకరణాలు। సౌభాగ్య సమవతరణాలు।
అజ్ఞాన తమస్సు లణచు అహస్కరుని కిరణాలు।।
శాక్యసింహుల శ్రీచరణాలు।। సర్వదా నాకు శరణాలు।।

# సైనికుని ఉత్తరం

[ఇది శివమంగళ సింహ 'సుమన్' హిందీ రచనకు స్వేచ్ఛాను వాదం. 1963 రిపబ్లిక్ దిన మహోత్సవ సందర్భమున "ఆకాశవాణి విజయవాడ" కేంద్రము నుంచి ప్రసారిత మైనది.]

ఓ నా దేశప్రజలారా ! ఉభయకుశలోపరి
ఉత్తరం వ్రాస్తున్నాను ఉత్తరం ఇదిగో మరి.

కరాళ మృత్యు దంష్ట్రాంకురాల తెర చాటునుంచి
గంగా యమునా బ్రహ్మపుత్రలు జన్మించిన చోటునుంచి
కత్తులు తుపాకులు కదం త్రొక్కే కఠోరకదనవేదినుంచి
ఉత్తరం వ్రాస్తున్నాను ఉత్తరగిరి మీదినుంచి.

అత్యంతం అమూల్యమైన మానవత్వాన్ని
ఆమూలాగ్రం నాశనం చేయాలని
ప్రత్యేకం పనిగట్టుకున్నారు పాతకులు
సత్యాన్నీ ప్రేమనీ సౌహార్దాన్నీ
హత్యచేస్తున్న కిరాతకులు.

ఇద్దరి నడుమ సరిహద్దుల కోసం గుద్దులాట కాదిది
సమస్త విశ్వశాంతిని సవాలుచేసే జటిల సమస్య ఇది
కుక్కల్లా లెక్కకు రాని దిక్కులేని చావు చావటమో
జయించి జీవిత పరమార్థాన్ని సార్థకం చేయటమో.

రణం కాదు ! కాదిది రణం ! రామ కార్య నిర్వాహణం !
అహోరాత్రాలు జాగరణం - మహామహిష సంహరణం -
బ్రతుకో చావో తప్పదు పవిత్ర జాహ్నవీ తీరం !
స్వామి కార్య నిర్వాహణం - క్షణభంగురం జీవనం !

దేనికిలే పేరు తమ్ముడూ ! నేనొక సైనిక వీరుణ్ణి
దీనురాలైన ఒకానొక వితంతువు కుమారుణ్ణి
బ్రతుకు గతుకుల్లో ప్రాణాలు బిగబట్టుకొని
అమ్మ పెంచింది నన్ను అరచేతుల్లో పెట్టుకొని.

కరగి స్రవించే కన్నతల్లి నిండుగుండెల కన్నీళ్ళలో
పెరిగి పెద్దయినాను చిరిగిన నిరాశ పొత్తిళ్ళలో
గ్రామం పేరు ఏమంటున్నావా భాయీ !
భూమి మీది గ్రామాలన్నీ ఒకేలా నాకు కన్పిస్తాయి.

సన్నని సందులు ; సావిళ్ళు ; ఎద్దు బండ్లు ;
కన్నుల విందు చేసే చిన్ని చిన్ని పూరిండ్లు ;
పైరు పొలాలు ; పంటకంకుల కళకళలు ;
పడుచు లంగా కలంకారీ అలంకారాల తళతళలు ;
సంధ్యారుణ కాంతుల్లో స్నానంచేస్తూ "అంబా" అని అంటూ
కోడె దూడను నాకుతున్న గోమాత కన్నుల మిలమిలలు ;;
గ్రామాలన్నీ ఒకేలా నాకు కన్పిస్తాయి ;

ఈ కందకంలో ఇలా పడివుండి
ఈ రోజుకు సరిగా మూడురోజులు;
రగిలే పొగలు - పగిలే బాంబులు - మండే మంటలు -
మృత్యుదేవత నీలినీడలు పారాడే గంటలు.

జామునేపునుంచీ వాతావరణం శాంతంగానే ఉన్నది ;
సైనిక భాషలో శాంతికి సరైన అర్థం ఏమున్నది ?
ఎవరివో ఆర్తధ్వనులు చెవులు బద్దలు చేస్తున్నవి ;
దొంగతోడేళ్ళ బిరుసు గడ్డాల బరబరలు విన్పిస్తున్నవి ;;

ఎముకలు కొరుక్కుతినే చలిలో కాళ్ళుచేతులు కొంకర్లు పోతున్నవి
నెత్తురు గడ్డకట్టింది - నేత్రాలు నిరర్థక మౌతున్నవి.

ఉదయశ్రీ

ఎదలో వెచ్చవెచ్చగా కదులుతూ మెదులుతూ
పదే పదె గుర్తుకు వస్తున్నవి -
దూరాన ఉన్న కన్న తల్లి చల్లని మమతా!
అనురాగమయి అర్ధాంగి తియ్యని అమాయికతా!
పిట్టల కిచకిచలలో కిలకిల నవ్వే
చిట్టిబాబు చిన్నారి పెదవులజతా!
ఎదలో వెచ్చ వెచ్చగా కదులుతూ మెదులుతూ
పదే పదే గుర్తుకు వస్తున్నవి.

కనిపిస్తున్నవి అవిగో కన్నతల్లి కనికరపు కళ్ళు!!
జలజల స్రవిస్తున్నవి నులివెచ్చని కన్నీళ్ళు!!
తల్లిని ఓదార్చే ఇల్లాలికి తడిసి ముద్దలయినవి చెక్కిళ్ళు!!
ఒడిలో ఉన్న పసివాడు ఊరకే మింగుతున్నాడు గుక్కిళ్ళు.

ప్రక్కనున్న పంచాయితీ రేడియో ఒక్కటే అమ్మకు తోడు
అక్కడే కుక్కిమంచంలో అమ్మ పడుకున్నది నేడు
మింటి ముంగిట్లో మిలమిల మెరుస్తున్న నక్షత్రంవైపు
అదేపనిగా పరుగిడుతున్నది అమ్మ చూపు,
ఎవరైనా చెప్పండి అమ్మకు ధైర్యంగా ఉండమని.
నా శిరస్సుపై ఆమె ఆశీస్సులు కురుస్తుండమని.

అమ్మా! నీవు నిబ్బరంగా ఉండు ఆందోళన ఎందుకు?
నీ పేరు తలుచుకుంటూ నేను నడుస్తున్నాను ముందుకు.
నక్కి నక్కి నరుల కండలు కొరుక్కుతినే
నక్కల డొక్కలు చీలుస్తున్నాను.
రక్కసి రాబందుల ఉక్కుముక్కులు
చెక్కి ౘక్కలు చేస్తున్నాను.

ధన్యమైన నీ స్తన్యం మీద ఒట్టు పెట్టుకొని
గట్టిగా చెబుతున్నాను చేతిలో తుపాకీ పట్టుకొని
"వీరమాత" అనే బిరుదం నీ కంఠంలో
హారంగా అలంకరిస్తాను అచిరకాలంలో.

రణరంగం నుంచి తిరిగి ఇంటికి రాగలిగితే
కన్నులారా కన్నతల్లిని నిన్ను చూచుకోగలిగితే
నీకాళ్ళ కళ్ళకద్దుకొని - నీ చేతులు ముద్దు గొని
నీ పాదధూళి అలికంపై తిలకంగా దిద్దుకొని
నిలువునా పులకించి పోతాను.
నిజమైన వీరుడ నౌతాను.
లేదా తల్లీ! ఏది ఏమైనా సరే నేను మాత్రం
కన్నతల్లి గౌరవానికి కళంకం తీసుకురాను ఏమాత్రం.

ఉదయశ్రీ

ఎవరు నీవు! ఎవరునీవు! ఎందుకు ఏడుస్తున్నావు?
అమ్మ ప్రక్కన నిలుచుండి అలా అశ్రువులు రాలుస్తున్నావు.
క్షణం క్షణం కరిగిపోతూ జ్వలించే మైనపు వత్తిలా!
ఝంఝూమారుతానికి చలించే చిన్నారి పూలగుత్తిలా!

దురంత దుర్దిన దురాక్రమణలో నిరాశ చెందకు
నిరంత నిస్పృహతో నిట్టూరుస్తూ లోలోపల కుందకు
నీ హృదయంలో నిబ్బరం కోల్పోకు
నీ ధైర్యం సడలనీకు - చింతాక్రాంతురాలివి కాకు
మంగళమయమైన ఈ మహిమాన్విత సమయంలో
అమంగళంగా అశ్రుతరంగాలు పొంగి పొరలనీకు.

ఇది పూజాసమయం - ఆరాధనకు వేళయింది -
జగజ్జనని కాళికాదేవి ఆలయద్వారం తెరవబడింది -
అగరుధూపం - అక్షతలూ - అన్నీ - తీసుకురా!
అసృగ్ బిందుల చిందులతో తడిసి వికసించిన
అరుణ కమలాలు కోసుకురా!

కాదిది కల్యాణి! ఒకరిద్దరి సంగతి
యావద్దేశానికీ సంభవించింది విపత్కర పరిస్థితి

వందలు వేలు వీర సైనికులు నావంటివారు
పందెం వేసుకొని ముందుకు వచ్చి పడుతున్నారు ।
పవిత్ర కర్తవ్య మహాయజ్ఞంలో
ప్రాణాలు ఆహుతు లిడుతున్నారు ।

పరమోత్కృష్టమైన ఇటువంటి అదృష్టం
బ్రతుకులో ప్రాప్తించడం ఎంతో కష్టం.
అదేదో ఆవేదన అంతరాత్మ అంతరాంతరాలందున
గుబగుబలాడుతున్నది గుండెల సందున
ప్రాణం పోయేముందు ఒక్కసారి నిన్ను చూడాలి ।
పసుపు కుంకుమల బంగారు కాంతిలో స్నానమాడాలి ।
నీ లోచనకాంతులు నాలోని నవజీవన స్రవంతులు ।
ఆలోచనకు సమయం లేదు । ఆత్మార్పణకు వేళయింది ।
విశాల భారత విమోచన వీరదుందుభి మ్రోగింది ।
వెలుగులు వెదజల్లుతూ విజయోత్సవం సాగింది ।

ఏమాత్రం నీకు నామీద ప్రేమ ఉన్నా
ఒః మాత్రం తప్పకుండా నీవు చెయ్యాలి ।
ఉక్కుతునుకల వంటి మన బిడ్డల మనసుల్లో
"దిక్కులేని వార"మనే భావం తీసెయ్యాలి.

ఓనయశ్రీ

వాళ్ళకు ఆత్మగౌరవం నూరిపోయాలి.
వాళ్ళు పెద్ద వాళ్ళయి సంఘంలో తలెత్తుకు తిరగాలి.
వాళ్ళ నాన్న పేరు తలుచుకొని సగర్వంగా
వాళ్ళ దేహాలు నిలువునా పులకించాలి.

కరుణామయీ ! కన్నీళ్ళు తుడుచుకో !
విచారం దిగమ్రింగు ! వీరనారీమణివై నడుచుకో !
కర్తవ్య నిర్వహణం !
కఠోర పరీక్షా నిరీక్షా క్షణం !

నారీ జీవనం నాటికీ నేటికీ ఒకలాగే నడచిపోతున్నది
గుండెలనిండా మండే దుఃఖజ్వాలలు భరించుతూ
పెదవులపై మాత్రం చిరునవ్వులు చిందించుతూ
నారీ జీవనం నాటికీ నేటికీ ఇలాగే నడచిపోతున్నది.

పౌరుష పూర్ణమైన నా ప్రతిజ్ఞకు హారతిపట్టు !
పరువు నిలబెట్టు ! భారత గౌరవానికి జేకొట్టు !
నీ కన్నబిడ్డలకు నిప్పుతో చెలగాటం నేర్పు !
ఇదే లోకం నీ కిచ్చిన తీర్పు !
భావి సంతానానికి ఇదే మనం పంచి ఇచ్చే బహుమానం
త్రివేణియై ప్రవహించే శౌర్యం - ధైర్యం బలిదానం.

ఉదయశ్రీ

వస్తాను వస్తాను తప్పకుండా వచ్చేస్తాను
మువ్వన్నెల విజయపతాకంలా నవ్వుతూ ఎగిరివస్తాను.

గాండీవధరుని నరుని ప్రతిజ్ఞ
తాండవిస్తున్నది నా జిహ్వాగ్రాన ।
ఇకలేదు తిరోగమనం ।
చకచకా సాగుతున్నది పురోగమనం.

తెస్తాను తెస్తాను ముమ్మాటికీ తెస్తాను
విలువైన విజయోపహారం వేగిరం తీసుకువస్తాను
దురాక్రమితమైన దేశ పారతంత్ర్యానికి
విముక్తిగీతం ఆలపిస్తాను.

ఇదిగో ఇప్పుడు జ్వలించిపోతున్నాను
హిమాచ్ఛాదిత గిరి శిఖరాల మీద
దేదీప్యమానంగా ప్రజ్వలించి పోతున్నాను
క్రమ్మిన అమావాస్య చిమ్మ చీకట్లను చీల్చివేస్తున్నాను.

అచంచల సౌభాగ్యవతి - అమర భారతి - అఖండజ్యోతికి
అక్షయమైన ఆజ్యంగా వేడినెత్తురు అర్పిస్తున్నాను.
సర్వస్వం సమర్పిస్తున్నాను.

# ఆనందలహరి

తెల్లవారితే దేశమంతా
వెల్లివిరుస్తుంది ఆగస్టు పదునైదు :
తెల్లవారికి స్వస్తి చెప్పడంతో
తీరిపోయిం దానాటితో మన ఖైదు :

రేపటి కిరణాలు పాపల చెక్కిళ్ల
సోకుతాయి తీయతీయగా ః
రేపటి మలయ మారుతాలు పాపల నుదుళ్ల
తాకుతాయి హాయి హాయిగా ః

రోజూ కంటె రేపు నాజూకుగా
ఊగుతాయి పూలతోటలో రోజాలు ః
రోజూ కంటె రేపు తేజస్సుగా
మ్రోగుతాయి ఎట్టకోటలో బాజాలు ః

ఉదయశ్రీ

ఎప్పటికంటే ఎంతో ఉల్లాసంగా
ఎగురుతుంది రేపు త్రివర్ణ పతాకం ।
ఎప్పటికంటే ఎంతో ఉత్సాహంగా
విప్పుకుంటుంది హృదయం ప్రజానీకం ।

పది పన్నెండేండ్లయింది పట్టుకొన్న
పారతంత్ర్య పిశాచిని దూరంగా సాగనంపి.
పదములకు గట్టిగా చుట్టుకొన్న
దానిస బంధాలు ఫటఫటా త్రెంపి.

ఎంతో భక్తితో రేపు ఎత్తుతుంది జయహారతి
సంతోషంతో నవ్వుతూ జననికి స్వరాజ్య భారతి
అది మన భారతీయుల స్వాతంత్ర్య మహా పర్వోదయం ।।
అది మన గుండెలు పండించుకొన్న ఆనందమయ సర్వోదయం ।।

వినవస్తున్నవి విజయశ్రీ మంజుల మంజీర నిస్వనాలు
వికసిస్తున్నవి మానసంలో హిరణ్మయ కమలవనాలు
ఎందుకో తనలోతాను అందంగా నవ్వుకుంటున్నది తూర్పు
అందీఅందని అనురాగంలో అందిస్తున్నది ముత్యాల కూర్పు.

ఉదయశ్రీ

పదమూడు వసంతాలు నిండిన
బాలకుమారీ ! నీ వెవ్వరు ?
అంతరంగాలలో శాంతితరంగాలు లేపే
కాంతితరంగిణీ ! నీ వెవ్వరు ?

త్రివర్ణ పతాకం నీడలో నిలిచిన
సువర్ణ ముఖీ ! నీ వెవ్వరు ?
"సత్యమేవ జయతే" అని చాటే
నిత్యకల్యాణీ ! నీ వెవ్వరు ?

చతుస్సింహ ముద్రాంకిత
చక్రేశ్వరి నీ వెవ్వరు ?
ముసిముసి నవ్వులు చిందించు
ముద్దుల చెల్లీ ! నీ వెవ్వరు ?

రాణా ప్రతాపసింహుని రక్తారుణ రోచిస్సులు
ఛత్రపతి శివాజీ ప్రభు క్షాత్రోచిత తేజస్సులు
కృష్ణరాయ భువనవిజయ కీర్తిలతా వర్చస్సులు
కదలెను నీ కన్నుల్లో కల్యాణీ ! నీ వెవ్వరు ?

ఝాన్సీలక్ష్మి శౌర్యం ! బహదూర్‌షా ధైర్యం !
మంగళపాండ్యా బలిదానం తాంతియాతోపే అభిమానం !
శాలివాహనుల సాహసం ! కాకతీయుల పౌరుషం !
చిలుకుతున్నవి నీ పలుకులు ! చిట్టి తల్లీ ! నీ వెవ్వరు ?

యశోధర ప్రేమధామంలో ప్రసరించిన నవ్వులు !
అశోకుని ఆరామంలో వికసించిన పువ్వులు !
విక్రమార్క కాళిదాసులు వెలిగించిన దివ్వెలు !
సాక్షాత్కరించు నీ చూడ్కులు ! చైతన్యమయీ ! నీ వెవ్వరు ?

"నేను స్వతంత్ర్య బాలను !
నిరంతర నవనవోన్మేషశీలను !
నేను స్వరాజ్యకుమారిని.
నిత్యకళ్యాణ సుకుమారిని!

దాదాభాయి నౌరోజీ దేదీప్యమాన దేశభక్తి
గోపాలకృష్ణ గోఖలే గురుతర స్వేచ్ఛానురక్తి
బాలగంగాధర తిలకుల కూలంకష భావయుక్తి
లాలా లజపతిరాయల జ్వాలామయ మహాశక్తి

ఉదయశ్రీ

మదనమోహన మాళవీయ మధురమధుర సౌజన్యం
చిత్తరంజన మహోదయుల ఉత్తేజిత చైతన్యం
బార్డోలి సమరసేనాని అపప్రథ లేని ఉపప్రధాని
చెక్కుచెదరని ఉక్కుమనిషి పటేలు ప్రజ్ఞాప్రాభవం

శాంతికి క్రాంతినేర్పిన తేజస్వంతుడు
కాంతికి సంక్రాంతి తీర్చిన భాస్వంతుడు
జాతీయ జగజ్జ్యోతి స్వాతంత్ర్య మహావిభూతి
నేతాజీ సుభాస్‌చంద్రుని నిరుపమ ప్రతిభా వైభవం

నాకు ప్రాణంపోశాయి నన్ను పెంచి పెద్దచేశాయి
నాకు బలం చేకూర్చాయి నన్ను ముందుకు నడిపించాయి

ఆయన పలుకు విశ్వానికి పంచమవేదం
ఆయన పిలుపు దేశానికి శంఖ నినాదం
ఆయన దీక్ష సమస్త జగత్తుకు శ్రీ రామరక్ష
ఆయన జీవనం మానవజాతికి ఉజ్జీవనం

ఆయన ఒక విచిత్ర విశ్వవిద్యాలయం
ఆయన ఒక పవిత్ర ధర్మ దేవాలయం
ఆయన ఒక ఉత్తుంగ హిమాలయం
ఆయన సత్యాహింసల సమన్వయం

ఉదయశ్రీ

ఆయన అజాతశత్రుడు ఆయన మహాతపస్వి
ఆయన యుగపురుషుడు ఆయన మహామనస్వి
ఆ మహాత్ముని ఆ మహామహుని అమరహస్తాలు
ప్రేమతో అమృతం పోసి పెంచి పెద్దచేశాయి నన్ను.

"స్వాతంత్ర్యలక్ష్మి"ని నేను. "స్వరాజ్యలక్ష్మి"ని నేను.
జాతికి చైతన్యం చేకూర్చే "సౌభాగ్యలక్ష్మి"ని నేను.

ఆనాటి ఆగష్టు విప్లవం
ఏనాటికీ మరపురాని మహోపప్లవం

అది హరుడు హాలాహలం మ్రింగిన మహాశివరాత్రి
ఆనాడు కంపించింది సమస్త భూతధాత్రి

చకచకా కదిలింది ముందుకు క్రాంతిరథం
స్వాగతం పలికింది స్వాతంత్ర్యమహాపథం

ఊగింది మహాప్రజ
రేగింది మహాప్రజ
సాగింది మహాప్రజ

కాలి కూలాయి కార్యాలయాలలో కవిలెకట్టలు
నేల రాలాయి రాబందుల్లా పోలీసుల బుట్టలు

సత్యాగ్రహం చేశాయి రైళ్ళు
తలుపులు తెరచుకున్నాయి జైళ్ళు

తల్లడిల్లింది తెల్లదొరల ప్రభుత్వం
దద్దరిల్లింది స్వార్థపరుల నిరంకుశత్వం
స్వరాజ్యదేవాలయంఘంటలు "గణగణ" ధ్వనించాయి
స్వతంత్రవిజయదుందుభులు "ధణధణ" విన్పించాయి

అది యజ్ఞం - అది అఖండ మహాయజ్ఞం
అది నిరంతరంగా సాగిన స్వరాజ్య మహాయజ్ఞం

యుగయుగాలు వెలిగించిన అల్లూరి సీతారామరాజులు
"దేశభక్తులు""దేశోద్ధారకులు""ఆంధ్రరత్నాలు""ఆంధ్రకేసరులు"

అర్ధరథులు అతిరథులు మహారథులు
అసమానశౌర్యధైర్యనిధులు
అజ్ఞాత వీరకుమారు లెందరెందరో ముందుకు దూకారు
పవిత్ర యజ్ఞకుండాల్లో బ్రతుకులు బలిచేశారు.

కండలు ప్రేల్చారు ! రక్తం కార్చారు !
ఆహవ మహాగ్ని కీలల్లో స్వాహా అయిపోయినారు !
భగభగ మండే జ్వాలల్లో భస్మావశేష మైనారు !

తల్లుల కన్నీటిధారల్లో తడిసితడిసి
చల్లబడింది స్వరాజ్య హోమకుండం,
పంకిలమైన యజ్ఞకుండం పంకంలోనుంచి
అంకురించిం దొక అత్యద్భుతమైన పంకజం.

పంకజంలో ప్రభవించిన "భారత భాగ్యలక్ష్మి"ని నేను.
"స్వాతంత్ర్యలక్ష్మి"ని నేను - "స్వరాజ్యలక్ష్మి"ని నేను.

నేను స్వాతంత్ర్యస్వర్ణలతను - నా ఆకులు "పచ్చన"
నా చివుళ్ళు "ఎర్రన" — నా పువ్వులు "తెల్లన"
మువ్వన్నెల "పతాకానికి" ముద్దుల "ప్రతీకాన్ని" నేను
అందమైన అశోకచక్రానికి అమృతాభిషేకాన్ని నేను.

[ఇది 1961 రిపబ్లిక్ దిన మహోత్సవం నాడు ఢిల్లీ నగరంలో ఆకాశవాణి కేంద్రంవారు ఏర్పాటుచేసిన "జాతీయ కవి మహా సభ"లో తెలుగుకవిగా ఆహ్వానింపబడి చదివిన కవితాఖండిక."]

# భువనవిజయం

మహారథం విజయరథం భువనవిజయ మహారథం
మాధవ విద్యారణ్యుల మధురమధుర మనోరథం
తిమ్మరసు మహామాత్యుల కమ్మనికలల శుభాకృతి
మూరురాయగండడు రస భారతి కిడిన బహూకృతి.

కృష్ణరాయ మౌళిమకుట కీలిత మణిసంక్రాంతులు
ఆంధ్రభోజ విజయపతా కాంచల చంచత్కాంతులు
దిగంతాలు వెలిగించెను దృగంతాలు మెరపించెను
జయశ్రీలు కురిపించెను జగమునెల్ల మురిపించెను.

తెలుగుతల్లి గుమ్మంలో వెలిగించిరి గుమ్మటాలు
నలుదిక్కుల గుమాయించె తెలుగుతోట పరిమళాలు
మహారథం విజయరథం భువనవిజయ మహారథం
మాధవ విద్యారణ్యుల మధురమధుర మనోరథం.

ఉదయశ్రీ

తియ్యతియ్యగా తెలుగువీణ దేశమంతా మ్రోగింది
ఒయ్యారంగా తెలుగుకవిత ఉయ్యాలలూగింది
కర్నాటాంధ్ర రాజ్యశ్రీ కరకంకణ నిక్వణాలు
వినిపించుతున్నవి మునుముందుగా వీనులవిందుగా -

హంపీ విరూపాక్షదేవుని ఆలయగోపురం
జంపుగా సగర్వంగా నిలుచున్నది రొమ్మువిరిచి
పంపా సరస్సులోని బంగారు పద్మాలు
పకపక నవ్వుతున్నవి మైమరచి.

తుంగాభద్రా సముత్తుంగ తరంగాలు
పొంగిపొరలుతూ నాట్యమాడుతున్నవి
స్వామి గుడి ముందరి సంగీతమంటపం స్తంభాలు
సంతోషంతో సరిగమలు పాడుతున్నవి.

వీచిందీనాడు మందమందంగా మలయమరుత్తు
తోచిందీనాడు నవరసమయమై కావ్యజగత్తు
పూచిందీనాడు అందంగా ఆనందంగా విజయశరత్తు
చాచిందీనాడు సుందరసువర్ణహస్తం సాహితీపరిషత్తు.

ఉదయశ్రీ

అశోకవనంలో ఆనాడు అమ్మణ్ణిని చూచిన
"ఆంజనేయుల ఆనందబాష్పం" ఈ మహాసభ
విద్యానగరం ఉద్యానవనంలో పూచిన
గుమగుమలాడే గులాబీపుష్పం ఈ మహాసభ.

అర్ధేందుధరుని హరుని అష్టతనువుల వలె
ఆదిశక్తి ఉమాదేవి అష్టబాహుల వలె
ఆనందమూర్తి శ్రీకృష్ణుని అష్టభార్యల వలె
ఆచార్యభరతుని నాట్యశాస్త్రంలోని అష్టరసముల వలె

అవనికి ఆధారమైన అష్టదిగ్గజముల ప్రతినిధులు
అమృతరసం చిందించే ఆనంద కళానిధులు
సరిగా ఎనిమిదిమందికవులు సరిక్రొత్త చవులు
సరస సాహితీ స్వయంభువులు!

ఇందీవరము లీను క్రాల్గన్నుల సుందర శరదిందుముఖులు
అందంగా అటూఇటూ వింజామరాలు వీస్తున్నారు
వందిమాగధులు కైవారాలు చేస్తున్నారు
చందనతాంబూలా లిచ్చి సభ్యులను సత్కరిస్తున్నారు.

అభివాదాలందీ ఆంధ్రకవితాపితామహులు ।
"అల్లిక జిగిబిగి" పెల్లుబికిన అల్లసాని మహామహులు ।
రత్నాల గండపెండారం రాయలచే గ్రహించారు
సురుచిర "శిరీష పేశల సుధామయోక్తు"లకు పేరు వహించారు.

"శతపత్రేక్షణ" "చంచరీకచికుర" "చక్రస్తని"
అందాలరాణి మీ వరూధిని సౌందర్య సర్వస్వబోధిని
అన్నులమిన్న అమరకంఠం విప్పి "ఆనందోబ్రహ్మ" అన్నది
"చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని" క్షీరాబ్ధిలో జన్మించిన చిన్నది.

కవిత్వానికి వేయిపడగలెత్తిన కవిసమ్రాట్టువట ।
కమలగర్భుని రాణి నెన్నుదుటి కమ్మకస్తురి బొట్టువట ।
అవనీసుర ప్రవరుడైన మీ ప్రవరుని వలె
అంతెత్తు హిమాలయానికి అమాంతం ఎగరాలని
అక్కడి అంబరచుంబి శిఖరాలు అవలోకించాలని
చిక్కని లవలీనికుంజాలలో స్వేచ్ఛగా విహరించాలని
అంతలేసి పింఛాల అందమైన నెమిళ్ళతో ఆడాలని
ఇంతలేసి వాల్గన్నుల వరూధిని
గొంతులో గొంతు కలిపి పాడాలని
అనుకుంటారు అధునాతనులు ఆంధ్రయువకులు

ఉదయశ్రీ

పదాలకు పసరు పూయించుకోటానికి
పంచెలు బాగా పైకి దోపుకొని ప్రయాణానికి
సిద్ధమవుతున్నారు ప్రతిదినం ఇప్పటికీ
సిద్ధుడు మాత్రం రావటంలేదు ఎప్పటికీ.

వందనాలు వందనాలు నందితిమ్మన కవీంద్రులకు
చిక్కని సుధలు చిందే చక్కని శరచ్చంద్రులకు
"నాకధునీ శీకరముల చెమ్మ"లచే మీ పలుకులు
సౌకుమార్యానికి పట్టుకొమ్మలచే మీ కవిత్వం కులుకులు.

మీ సత్యభామ లావణ్యసీమ
మీ సాత్రాజితి మహనీయ సౌభాగ్యవతి
మీ పారిజాతం సుషమామయ సువర్ణ సుప్రభాతం
పరువం తప్పదు - వసివాడదు - పరిమళం వీడదు -

నవదంపతులను నందనవనంలోకి పంపించి
దివిలోపలి పారిజాతాన్ని భువికి దింపించి
మహీతలాన్ని మార్చివేసింది మరియొక స్వర్గంగ
మానవుణ్ణి దేవత చేసింది మీ కవితాస్వర్గంగ

సున్నితమైన నడకలు మీకు "వెన్నతో పెట్టినవి"
సుకుమారమైన భావాలు మీరు "పుట్టగా పుట్టినవి"
వెన్నెలవంటి కన్నెల చిన్నిపదాల విన్యాసాలు మీ సొత్తు
అన్నట్లు తిమ్మనార్యా! విన్నారా ఈ చిన్నగమ్మత్తు!!

పారిజాత పరిమళాలు పసికట్టిన నవయువతులు
పడకటింట్లలో సత్యభామ లౌతున్నారట!
అలుక తీర్పవచ్చిన అభినవకృష్ణులు
తలగడవైపే నిలబడుతున్నారట!

క్షేమమా శ్లేషకవితాచక్రవర్తి!!
ఎన్నాళ్ళకు కన్నారా కనుగొన్నాను మీ మూర్తి!
సరికాని గిరికాకుమారి బాగుందా?
కాంభోజీ రాగాలాపం అలాగే సాగిందా! ఆగిందా!

నరేంద్రుని పదన్యాసాలు - సురేంద్రుని ఉపన్యాసాలు
నర్మసచివుడు నటించిన దొంగ సన్యాసాలు
మంజువాణి మంజువాణీ విలాస విన్యాసాలు
నీ పాత్రలు "సానలు పట్టిన జాతిరత్నాలు."

ఉదయశ్రీ

నీ శ్లేష సౌభాగ్యం నేర్చుకొన్నది కావ్యజగతి
ఆశ్లేషభాగ్యం దిద్దితీర్చుకొన్నది కళాప్రగతి
కోలాహలుని కోలాహలానికేమిలే మందమతి
కవిత్వంవంటి కన్నెను కన్నది శుక్తిమతి.

బళిరా! పింగళి సూరనార్యా! కళాప్రపూర్ణ సౌందర్యా!
కలిత లలిత కావ్యకల్పనాధుర్యా!
నీవాక్కు బ్రహ్మవాక్కు! నీ రచన రసాలస!
నీ కవిత్వమంటే అందరికీ అదేదో ఒక "మధురలాలస!"

నాకంలోని రాకాచంద్రముఖుల
నాజూకైన ముచ్చటముళ్ళు
తాకి వచ్చినవి ఉయ్యాల ఊపులో
నీ కవితాసుందరి డాకాలిప్రేళ్ళు!!

కాటుక కళ్ళ కలభాషిణిని కూడా
కలుపుకొని రాలేకపోయినారా మీవెంట
కాసేపు వాయించేదిగా వీణ
కమ్మకమ్మగా చూస్తూ కడకంట.

నీ సూక్తి "శుచిముఖి", నీ ప్రతిభ "ప్రభావతి",
నీ సృష్టి "కలభాషిణి", నీ దృష్టి "అభినవకౌముది"?
నీ కృతులు శుభాకృతులు, నింపుకొన్నవి చమత్కృతులు,
తెనుగుసాహితీలక్ష్మికి కవి తీయని అలంకృతులు,

ఎవరండీ మీరు పరమమాహేశ్వరులు,
ఏమేమీ స్వామీ, ధూర్జటి కవీశ్వరులు!!
అతులిత మాధురీ మహిమాన్వితులు,
స్తుతమతులు, విమల విభూతి విభూషితులు,

నిత్యనూతన మైన నీ కవితా కళా విశేషం
నిమేషకాలం అనిమేషంగా చూట్టానికి
కాళహస్తి మహాక్షేత్రంలో కడు చిత్రంగా
కళ్ళు మొలిచాయిటే శివలింగానికి!!

చెప్పు తొడుక్కున్న తిన్నప్ప కాలు
శివలింగం ముఖాన పెట్టించావు
సత్కవితా వీరుణ్ణి నత్కీరుణ్ణి
"శంకరగిరి మన్యాలు" పట్టించావు,

ఉదయశ్రీ

చెప్పండి స్వామీ ఇంతకూ అవునా కాదా సహజగంధం?
"సింధుర రాజగమనా ధమ్మిల్ల బంధం"

చేసీచేయని దధిభాండం లోపలినుంచి
తీసీతీయని నవనీతం నీ శివానుభూతి ।
తోచీతోచని బాలభానురోచిస్సులో
పూచీపూయని జలజాతం నీ కవితారీతి ।

అయ్యలరాజు రామభద్రయ్యగారా ।
అభ్యుదయానికి మ్రోగించారు నగారా ।
"కానక కన్న సంతానం" వంటి
కావ్యం పూచింది మీ కవితా హృదయం
ఆంధ్రసాహిత్యమనే ఆరామాని కది
అతికిపోయిన "అభ్యుదయం"

తియ్యతియ్యగా తెరతియ్యగా
అయ్యలరాజులై రంగంలో అడుగుపెట్టారు
ఒయ్యారాల విజయవిలాసాలకు
ఒబ్బిడంతులై గజ్జెకట్టారు.

కందుకూరి రుద్రకవిగారు!
అందుకోండి ఆనందంగా మా జోహారు!
అందాలు చిందే "అష్టకం" సృష్టించిన
"కందుకూరి జనార్దనులు" గదా మీరు!!

రంభా పరిరంభణ భావనా పరవశుడు
సంభోగ సంరంభ విజృంభమాణ మానసుడు
"శంభో! ఆగు! రంభ నిచ్చి సాగు!"
గంభీరంగా అన్నాడు నీ నిరంకుశుడు.

పరమశివుని జూదానికి పిలిచాడు
పాచికవైచి భక్తవశంకరుని గెలిచాడు
పందెం కట్టి కదలుమని జందెం పట్టుకొన్నాడు
నిరంకుశుడు తన "నిరంకుశత్వం" నిలబెట్టుకొన్నాడు.

తెనాలి రామకృష్ణ మహాకవీ!
వినాలి మా మనవి కొంచెం తమచెవి;
"తాపింఛచ్ఛదగుచ్ఛసచ్ఛవులు" నీకెంతో ప్రియం
పదగుంఫనలకు నిలయం నీ "పాండురంగవిజయం"

నీవు నిర్మించిన నిగమశర్మ అక్క
"మచ్చ ఎరుగని చక్కదనాల చుక్క"
అచ్చమైన ఆంధ్రుల తోటలో
ముచ్చటగా పెరిగిన" అంటుమామిడి మొక్క।"

"ఇంతలు నంతలు నగు తన
సంతానాన్ని" వెంటబెట్టుకొని
నీతోకూడా సభకు రాలేదు
నిగమశర్మ అక్క ఇంకా నయం।
కూర్చోటానికి చోటు లేదని కాదు నా భయం।
"ప్రారంభించిన వేదపాఠముల" కని బంగారుతల్లి
ప్రారంభిస్తుందేమో పాతపాఠం మళ్లీమళ్లీ.

నీవు సృష్టించిన నిగమశర్మలు
"నేతిబీరకాయలు" "నీర్వట్టు మడుగులు"
"దుర్విదగ్ధులు" "విరహజ్వరార్తులు" "పరమధూర్తులు"
"యువతి భుక్తనిర్ముక్త పరిధాన యుక్తులు"
నేటికీ సంఘంలో
నూటికి ఏబదిమంది
దేవరవారికి తెలియనిదేముంది।

జయము జయము శ్రీకృష్ణరాయ దేవేంద్రులకు ॥
జయము జయము భువనవిజయ పూర్ణచంద్రులకు ॥
జయము జయము దిగంత విశ్రాంత యశోభిరాములకు ॥
జయము జయము సాహితీ సమరాంగణ సార్వభౌములకు ॥

తులసితోటలో వెలసిన చిన్నారిసుకుమారి
చిరునవ్వుల పువ్వులలో కలసిమెలసి
కళకళలాడింది తమ కవితాకుమారి వాల్జడ
తళతళ మెరసింది తమ కావ్యశ్రీ గజ్జెల పట్టెడ

ఆముక్తమాల్యద సీమంతం మీది చేమంతులు ధరించి
పులకించి పూలరంగడైనాడు శ్రీరంగశాయి
మాలదాసరి మంగళకైశికీ మహత్త్వాలు
బ్రహ్మరాక్షసులను సైతం పరమభక్తుల్ని చేశాయి.

"ఆ నిష్ఠానిధి గేహసీమలో" అహోరాత్రాలు ప్రతిధ్వనించే
నానావిధ "దివ్యప్రబంధానుసంధాన ధ్వానాలు"
రంగపతి "శృంగార పల్యంకికా వహనాలు"
"వనమాలికా కరణాలు" "వాల్లభ్యలభ్యధ్వజగ్రహణాలు"

శయపూజాంబుజాలు" "చెంగల్వ డిగ్గియలు" "జలాహరణాలు"
"పసుపాడిన ద్రవిడాంగనల పాగడపు చరణాలు"
తమ ప్రతిభా పాండిత్యాలకు తార్కాణాలు
తమ వైష్ణవ విజ్ఞాన విశేషానికి అభిజ్ఞానాలు.

అంచలు పంచెలుగా భావించి సమీపించి
అందుకోబోవు ఆరెకుల అమాయికత్వానికి
అంచెలంచెలుగా నవ్వుకుంటున్నారు
మంచెలమీది "శాలిగోపికలు"

ఒక్క గజాన్ని కాపాడటానికి ఉన్ముక్త ధమ్మిల్లంతో
ఉక్కిరిబిక్కిరై పరువులెత్తాడు ఒకనాడు శ్రీకృష్ణదేవుడు
అష్టదిగ్గజాలను ఆస్థానంలో అట్టిపెట్టుకొని
ఆనందంగా పోషిస్తున్నాడు ఈనాడు ఈ కృష్ణదేవుడు.

ఆంధ్రభోజులు మహారాజులు ఆశ్రితజన కల్పభూజులు।
అధిగత సర్వతంత్రస్వతంత్రులు అప్పాజీ మహామంత్రులు।
సామ్రాజ్యం ప్రభువుల వంతు॥ సాహిత్యం కవుల వంతు॥
సౌభాగ్యం ప్రజలవంతు ॥ "సర్వేజనా స్సుఖినో భవంతు"

# నమస్సుమాంజలి

కొందరు ప్రతిభా వ్యుత్పత్తులలో 'ప్రతిభ గరీయసి' అన్నారు. కొందరు 'వ్యుత్పత్తి మహీయసి' అన్నారు. మరికొందరు ప్రతిభా వ్యుత్పత్తులకు సమప్రాధాన్యం అంగీకరించారు. వాస్తవానికి ఇదే ప్రశస్తమైన పద్ధతి. ప్రతిభ లోపించిన కావ్యానికి ప్రకాశం ఉండదు; వ్యుత్పత్తి కొరవడిన కావ్యానికి వికాసం ఉండదు.

కారయిత్రీ భావయిత్రీ శక్తులు రెండూ అన్యోన్యాశ్రయాలు. కారయిత్రి కావ్యాన్ని సృష్టిస్తుంది. భావయిత్రి అందలి అందాన్నీ, ఆనందాన్నీ అనుభవిస్తుంది సర్వాంగ సుందరమైన సారస్వత స్వరూపానికి కవీ సహృదయుడూ ఉభయులూ అవసరమే. అందుకనే 'సరస్వత్యాస్తత్వం కవి సహృదయాఖ్యం విజయతే' అన్నారు ఆచార్య అభినవ గుప్తపాదులు. తెలుగు గుండెలు కవితను నిండించుకొని రసజ్ఞతను పండించుకొన్నవి. తెలుగుతల్లి ప్రేమాంకంలో కవులకూ రసజ్ఞులకూ కొరత లేదు.

ఈనాడు "పద్యానికి ప్రచారం పడిపోయింది" అన్నమాట పసలేని మాట. ఎందుకంటే పద్యంగానీ, గద్యంగానీ హృద్యంగా అనవద్యంగా రచించటం కావాలి గాని అభిమానంతో అనురాగంతో అందుకొని ఆనందించే సహృదయులు ఎల్లప్పుడూ ఉన్నారు. ఇది నా అచంచల విశ్వాసం.

ఉదయశ్రీ ప్రథమభాగం ఇప్పటికి నలుబదిఏడు ముద్రణలు దాటింది. ద్వితీయ భాగం ఇరువదినాలుగు ముద్రణలు అతిక్రమించింది. 'కరుణశ్రీ' 'విజయశ్రీ' ఇరవై ఆరు,ఇరవై ఏడు ముద్రణలు అందుకొన్నవి. మొన్న మొన్ననే వెలువడిన ఉదయశ్రీ మూడవ భాగం ఆరవ ముద్రణం పొందింది. అంతగా నా కవితను ఆదరిస్తూ, ఇంతగా నన్ను మన్నిస్తున్న ప్రసన్నమధురమైన రసజ్ఞహృదయానికి చేతులెత్తి నమస్కరిస్తున్నాను. వారి మన్ననలను కన్నుల కద్దుకుంటున్నాను.

ఇది ఉదయశ్రీ నాల్గవభాగం - నాల్గోముద్రణం. ఈ నూతన సంవత్సర శుభ సందర్భంలో దీనిని సహృదయుల కరకమలాలలో సమర్పిస్తున్నాను.

ఈ కృతి కీర్తిశేషులు శ్రీ జూటూరి గురప్పగారి దివ్యస్మృతికి బహూకృతి. శ్రీ గురప్ప శ్రేష్ఠి ప్రొద్దుటూరు వాస్తవ్యులు. సుప్రసిద్ధ వర్తకవరేణ్యులు. శ్రీ కృష్ణభక్తులు, ఉదారహృదయులు వారి కుమారులైన శ్రీ రమణయ్య తమ తండ్రి గారి పేరుతో శతపత్రాత్మకమైన నా సత్కృతిని గ్రహించి సహస్రపత్రాత్మకమైన సత్కృతితో నన్ను గౌరవించినారు. ఈ తియ్యని నెయ్యాన్ని వెయ్యార్లుగా వెలార్చినవారు సుకవిచూడామణులు శ్రీ సుబ్బన్న శతావధానిగారు. వారికీ, వీరికీ నా హార్దికాభినందనలు అందిస్తున్నాను.

ఈ కావ్య సంపుటిలో "సింహేంద్రవాహన" మొదలు 'శ్రీకృష్ణ దేవరాయల' వరకు ఇరువదినాలుగు రచన లున్నవి. ఇందలి "వియద్వాణి" సౌమ్య ఉగాది కవి సమ్మేళనం విజయవాడ ఆకాశవాణి కేంద్రంనుండి ప్రసారితమైనది. "స్వర్ణలత" సుప్రసిద్ధ హిందీ కవి సుమిత్రానందన్ పంత్ కవితకు భావానుకృతి. అలాగే "సవితాదేవి కవితాలేఖ" శ్రీ నరేంద్ర హిందీకవితకూ, 'జ్యోతిర్మూర్తి' శ్రీ గులాం రసూల్ కాశ్మీరీ కవితకూ, 'సుప్రభాతము' డాక్టర్ ఉమారాయ్‌గారి బెంగాలీ కవితకూ భావానువాదాలు. ఇవన్నీ రిపబ్లిక్ దినోత్సవాల సందర్భంగా జాతీయ కవిసమ్మేళనాలలో ఆకాశవాణి హైదరాబాద్, విజయవాడ కేంద్రాలనుండి ప్రసారితాలు. వారందరికీ నా కృతజ్ఞతలు

కరుణశ్రీ

# సింహేంద్రవాహన

"జయ మహాకాళి! జయ జగజ్జనని! జయము!!
రాజరాజేశ్వరీ! భవానీ! జయమ్ము!!
త్రిపురసుందరీ! భువనేశ్వరీ! జయమ్ము!!
జయము! సింహేంద్రవాహనా! జయము జయము!!

వాఁడొక దున్నపోతు! బలవంతుఁడు! బ్రహ్మ వరప్రసాది! "యీ
రేడు జగమ్ములందు సరియెవ్వరు నా" కని విఱ్ఱవీగుచు
న్నాఁడు; ప్రపంచవంచన మొనర్చి త్రివిష్టప మాక్రమించుకొ
న్నాఁడు; వివేకశూన్యుఁడు వినం డెవ రెట్టి హితమ్ము చెప్పినన్.

వాఁ డొక దుండగీఁడు; మెడ వంగని మొండికిఖండి; స్నేహముం
బూఁచిదపాలొనర్చెడి ప్రబుద్ధుఁడు; స్వార్థపరుండు; పెంచుకొ
న్నాఁడు దురాశ, నందనవనంబును బీడొనరించి స్వర్గమున్
బాడొనరించినాఁడు, పశుబంధుఁడు దుస్సహ దుర్మదాంధుఁడున్!

ఉదయశ్రీ,

వాఁ డొక రాక్షసుండు, నయవంచనలో మొనగాఁడు, సుంత మో
మోడఁడు లోకనిందకు, మదోద్ధతుఁ "డాడిన దెల్ల యాటగా"
"పాడిన దెల్ల పాటగ" ప్రపంచము సర్వము చావ చుట్టుచు
న్నాఁడటె! నమ్మకమ్ముపయి నమ్మకమన్నది లేదు వానికిన్.

వాఁ డొక తుమ్ము తుమ్మిన నవగ్రహముల్ భయకంపితమ్ములై
యూడిపడున్ ధరిత్రిపయి నొక్కవడిన్ వడగండ్ల కైవడిన్;
వాఁడివిషాణముల్ దురదవాయఁగ వాఁ డొక కుమ్ము కుమ్మినన్
పోడిమి దక్కి బ్రద్దలయి పోవును నాకపురీకవాటముల్॥

పేరు మహిషాసురుఁడు! దగాకోరు! మ్రుచ్చ
దనమునకు మూర్ఖతకును "బెట్టినది పేరు"॥
వాఁడు బాధింపనట్టి దేవతలు లేరు;
వాఁడు పరిభవింపని మునీశ్వరులు లేరు.

అమ్మదమత్తచిత్తుని యహంకృతి హద్దులు దాటె దుర్నివా
రమ్మయి, బ్రహ్మ యిచ్చిన వరమ్మున కావరమెక్కి నెత్తికిన్
గొమ్ములు వచ్చె రాక్షసునకున్; జెనకున్ బనిమాలి సాధులన్;
దమ్ములు లేవు వాని సవిధమ్మున నిల్వఁగ వజ్రపాణికిన్.

మింటికి మంటి కంటి, మితిమీఱిన వాని పరాక్రమంపు పె
న్మంటలు కాల్చుచుండె భువనమ్ముల; వాని శమింపఁజేయ ము
క్కంటికి తమ్మికంటికి మగంటిమి చాలకపోయె; నా జగ
త్కంటకుఁ ద్రుంచి లోకములఁ గావఁగదే! జగదేకమాతృకా!"

అంచు ప్రార్థించు సురసంచయముల కనిక
రించి నయనాంచలముల వీక్షించె దేవి;
అమ్మ హృదయ మ్మెఱింగి మృగాధిరాజు
"చెంగు" మని లేచి దుమికి గర్జించి నిలచె!

బాణకృపాణపాణు లిరుప్రక్కల ముప్పదిమూడుకోట్ల గీ
ర్వాణులు శ్రేణులై బలిసిరాన్, మునుముందు మృగేంద్రవాహనా
సీన భవాని సాగినది చేతఁ ద్రిశూలము నూని సంగర
క్షోణికినై, క్రుధారుణరుచుల్ కనుగొల్కుల నొల్కవోయుచున్!

అమ్మహిషుం డటుల్ నిజభుజాగ్రమునం గద దాల్చి దైత్య సై
న్యమ్ములతో సుపర్వనివహమ్ములఁ దాకి యదల్చె; కొమ్ములన్
గ్రుమ్మి విదల్చె; డుల్చిరి విరోధి శిరోధు లమర్త్యు; లీ క్రియన్
"దొమ్మిది రాత్రు" లొండొరులతో నని సల్పిరి దేవదానవుల్!

గండరగండఁడౌ మహిషు గర్వము సర్వము కాలరాచి, బ్ర
హ్మాండము దద్దరిల్ల జగదంబ భవాని మహాత్రిశూలమున్
గుండెలలోన గ్రుచ్చి, కటకుం గరవాలున వాని శీర్షమున్
ఖండనసేసె లోకము లఖండ ముదంబున తాండవింపఁగన్.

ఇమ్మహిషాసురప్రతిమ లెందఱొ ముందుయుగాలఁ బుట్టి వి
శ్వమ్మున రెగ్గొనర్ప "ననివార్య మహాజనశక్తిగా" నమై
క్యమ్మయి దుష్టరాక్షసుల గర్వమడంచి జగమ్ము గాతు నం
చమ్మ భవాని బూర్మి నభయమ్మిడియెన్ సకల ప్రజాళికిన్.

ఇది మహాశక్తివిజయః మియ్యది దురంత
దుర్మద దురాక్రమణ దురుద్యోగములకు
దుర్భర పరాజయమ్ముః ఘాతుక కిరాత
జాతి పెనుభూతములకు శాశ్వతసమాధిః॥

దానవపీడ పీడుట కుదాహరణమ్ముగ దేవలోకమున్
మానవలోకమున్ భువనమాతృ సమర్చ లొనర్చెః "నిత్య క
ల్యాణము పచ్చతోరణము" నై భరతావని యుల్లసిల్ల "దే
వీ నవరాత్ర" శోభ ప్రభవించె సమస్త దిగంచలమ్ములన్ ॥

# సాత్రాజితి జైత్రవాణి

[జగత్కంటకుడైన నరకుని సంహరించుటకు జగత్పతియైన పతి వెంట సంగ్రామరంగానికి వచ్చినది సాత్రాజితి. నరకుడు దుర హంకారముతో యుద్ధానికి సిద్ధపడినాడు. ఆ లోకకంటకుని ఆలోకింపగానే సాత్రాజితి కంఠములో జైత్రవాణి మ్రోగినది]

రంకెల్ మానుము రాక్షసాధమ! అవక్రమ్మైన చక్రమ్ముతో
పంకేజాక్షుఁడు వచ్చె నీ శిరము దుంపన్ నేఁడు: యుష్మన్మనో
హంకార మ్మఖిలమ్ము వమ్మయి లయమ్మైపోవ నస్మద్ధను
ష్టంకారమ్ము పగుల్చు నీ చెవులు! నిశ్శంకుండవై నిల్వరా!

దుర్మార్గుండవు! ధూర్తబుద్ధివి! దురాత్ముల్ నీ చమూనాయకుల్
ధర్మద్రోహులు పౌరజానపద విధ్వంసక్రియా పారగుల్!!
నిర్మర్యాద నికృష్టవర్తను నినున్ నిర్జించి యీ భూమిపై
ధర్మస్థాపన చేయవచ్చె జగదంతర్యామి నా స్వామియై!

గ్రామములన్ దహించి, పరకాంతల బల్మి గ్రహించి, దైవత
గ్రామణులన్ మధించి, ఋషికల్పుల బట్టి వధించి, లోక సం
క్షేమ నిరోధివౌ నిఖిల జీవ విరోధివి నీవు, "సత్య సం
గ్రామము "తప్పదింక, నరకా!" నరకాంతకు" దోయిలింపరా!

"గాజులచేయి కార్ముకము గైకొని రాక్షసరాజుతోడ ఘో
రాజి యొనర్చుటా'' యని తిరస్కృతి సల్పితివే, విశేష వి
భ్రాజదవక్రవిక్రమ పరాక్రమ భారతవీరనారి సా
త్రాజితిరా! జగజ్జననిరా! అపరాజితరా! నిశాచరా!

నీవు మనుష్యులన్ బ్రతుకనీవు; మఱిప్పుడు తప్పదయ్యె నీ
చావు; ప్రజావళి విజయసౌధములన్ వెలిగించు రేపు దీ
పావళి దివ్యదీప్తులు, తథాస్తు! నినున్ హతమార్చు విశ్వ వి
ద్రావణమైన యుష్మదపరాధము! ఓ రజనీచరాధమా!!

# వి జ య దీ పా వ ళి

బలిచక్రవర్తిని బంధించి పాతాళ
మునకు వామనుఁడు పంపినది నేఁడె ।
రావణుం బరిమార్చి రాముఁ డర్ధాంగితో
ననుజన్ము భరతుఁ గాంచినది నేఁడె ।
క్రూరుఁడౌ నరకాసురుని సత్యభామ కృ
ష్ణుని వెంటఁజని వధించినది నేఁడె ।
విక్రమార్కుఁడు శత్రువిజయంబుఁ గావించి
తనపేర శకమునిల్పినది నేఁడె ।

శ్రీమహావీర జినుఁ దహింసామహాస్సు
దెసలఁ బ్రసరింప సిద్ధిపొందినది నేఁడె ।
వచ్చె నిదిగా సౌవర్ణ శోభాప్రపూర్ణ
సర్వజనము ।। దీపావళీ పర్వదినము ।।

ఉదయశ్రీ

తోటాలు గాల్చి ముందునకు దూఁకెడి వేళ
క్రుద్ధులౌ ఫాలనేత్రుల విధాన
దివ్విటీల్ గిరగిర త్రిప్పి పర్విడు వేళ
కలియుగ భీమసేనుల విధాన
విష్ణుచక్రాలను వెలిగించు నవ్వేళ
చెలువొప్పు బాలకృష్ణుల విధాన
చివ్వున అవ్వాయిచువ్వ రువ్వెడి వేళ
విలుదాల్చు వీరార్జునుల విధాన
ఔట్లు రాకెట్లు పేల్చెడు నట్టి వేళ
ప్రళయ భీకర వీరభద్రుల విధాన
రైతుబిడ్డలు పౌరుషజ్యోతులైరి
ప్రథిత దీపావళీ మహాపర్వ వేళ.

పడుచుకోడలు సిగ్గుపడుచు ముత్యాల పూ
వత్తి కాల్చెను మొగమెత్తకుండ
దీపపంక్తులు దిద్దితీర్చు నమ్మకు నూనె
గిన్నియ నందించె చిన్నిబిడ్డ
పొరలి పోయెడి చిచ్చుబుడ్డి కాంతులలోన
చెలి క్రొత్తచీర కాంచెను మగండు
గుమ్మమ్ము గడపలోఁ గూర్చుండి తాటాకు
గుమ్మటాల్ త్రిప్పె అమ్మమ్మగారు
కారు చీకట్లు చరచర పాటిపోవ
ఇంట బయటను దివ్వెల పంట పండె;
తళుకు లొలుకు నక్షత్ర మండలము తోడ
ఆకసము నేలపయి దిగినట్లు తోఁచె ॥

అత్త వారింట క్రొత్తల్లుఁడు గుట్టు మ
ట్టు లెఱింగి బెట్టుబెట్టుగ చరించె
బావగారిని చెవుల్‌పట్టి యాడించు చె
ల్లిని పిల్చి బుగ్గ గిల్లినది అక్క
గుడిసెపై జారిన క్రొంగొత్త సొరపిందె
పాపెమ్మ కోసమై కోసె కాపు
భయపడు వదినమ్మపై చిచింద్రీ వైచి
కిలకిల నవ్వె ముద్దుల మఱంది
కర్షకుల కార్మికుల మహా హర్షబాష్ప
వర్షబిందువులట్లు దీపములు మెఱసె;
వీథివీథుల నింటింట వెల్లివిరిసె
నవనవోన్మేష కౌతుకానందలహరి.

రావమ్మ చెల్లి! దీపావళీ! ఇవె అందు
కోవమ్మ మా స్నేహ భావనలను
లేవమ్మ తల్లి! శ్రీదేవి! మా యింటికి
తేవమ్మ నీ మేలి దీవనలను
పోవమ్మ దౌర్భాగ్య దేవతా! యిక వెళ్ళి
పోవమ్మ మాయూరి పొలము దాటి
ఈవమ్మ ఫలము భూదేవి! పంటలరాణి!
క్రిమి కీటకమ్ములు సమసిపోవ
దీపముల నెత్తి దివిటీలు త్రిప్పిత్రిప్పి
త్రోవ చూపించితిమి పితృదేవతలకు;
దివ్యలోకమ్ములను ప్రసాదింపు మయ్య!
అయ్య! యమధర్మరాజ! నమోస్తు నీకు!!

# సు మ హి మా ల య ము

దివిషత్తరంగిణీ తీర సురసుందరీ
కరకంకణ క్వణ క్వణన వీణారావ
కలిత హరవిజయ మంగళగీతికా ప్రతి
ధ్వనిత కందరుఁడ హిమవద్గిరీంద్రుఁడ నేను.

బహుపుణ్య నదనదీ లహరీ ముహుర్ముహుర్
మహనీయదర్శన స్పృహణీయుఁడను నేను
భరతరాజ్ఞీ శిరోభాసమాన మనోజ్ఞ
వజ్రకోటీర హిమవద్గిరీంద్రుఁడ నేను.

హర జటాజూటాగ్ర తరుణేందు దరహాస
లీలా సముల్లాస కైలాసుఁడను నేను
రాజహంస విహార రమణీయ రాజీవ
రాజీ విరాజి నవరస మానసుఁడ నేను.

ఉపనిషత్ సుందరీ సుపవిత్ర పదకంజ
మంజు మంజీర శింజితము నిండిన దిచట
చేత ముప్పొంగ భూమాత గోమాత యై
పృథు చక్రవర్తి కోషధులు పిండిన దిచట.

విల్లుగా మేరు పృథ్వీధరంబును వంచి
ఫణివల్లభుని ధనుర్గుణముగా బంధించి
విశిఖంబుగా మహావిష్ణువును సంధించి
త్రిపురాసురుల సంహరించె హరుఁడిచ్చోట.

క్రోధించి సాధువుల బాధించి వేధించు
మహిషాది ధూర్త దుర్మద దుష్టదానవుల
సంహార మొనరింప సింహవాహన మెక్కి
దుర్గాభవాని ముందుకు సాగె నిచ్చోట.

ముల్లోకముల నల్లకల్లోల మొనరించు
ధర్మవిద్రోహి యగు తారకుని బరిమార్ప
కదలె త్రింశత్కోటి త్రిదశ యోధులఁ గూడి
సర్వసేనానియై శక్తిధరుఁ డిచ్చోట.

అర్ధాంగి పాంచాలి ప్రార్థింప నిజభుజా
స్కంధాన గద దాల్చి కౌంతేయమధ్యముఁడు
యక్షరాక్షస చమూ విక్షోభ మొనరించి
సౌగంధికాబ్జముల సాధించె నిచ్చోట.

తొడగొట్టి యెగసి పైబడి శిరోగంగ గ్ర
క్కదల ముక్కంటి నెక్కటి కయ్యమున గెల్చి
భావిభారత రణశ్రీ విజేత కిరీటి
పాశుపతంబు సంపాదించె నిచ్చోట.

ఆడుకొన్నా రిచట ఆమ్నాయ బాలికలు
యుగవీథులందు నాలుగు స్తంభములయాట
పాడుకొన్నా రిచట బ్రహ్మర్షి సత్తములు
గంగా తరంగిణీ గతులలో శ్రుతి గలిపి.

నరుని నారాయణుని చరణ విన్యాసముల
భూదేవి నిలువెల్ల పులకించిపోయె నిట
జైమిని పైల వైశంపాయన సుమంతు
లకు చతుర్వేదాలు ప్రకటించె వ్యాసుఁ డిట.

కాళిదాస కవీంద్రు కవితాకుమారి నా
శిఖరాంచలములందు స్వేచ్ఛగా తిరిగినది
కందికుందెడి యక్షసుందరికి చల్లగా
అందించినది "మేఘసందేశ" మిచ్చోట.

కాళిదాసకవీంద్రు కవితాకుమారి మా
గౌరి కాళ్లకు పసుపుపారాణి తీర్చినది
తళుకు వాల్గనుల కజ్జలరేఖ గీల్కొల్పి
అలికాన కల్యాణ తిలకంబు దిద్దినది.

ఇది నా తపోభూమి ఇది నా మహాభూమి
బదరీ మహాక్షేత్ర పరమపావన భూమి
సత్యధర్మముల కాశాజ్యోతి యగు భూమి
శౌర్యధైర్యముల స్వేచ్ఛాగీతి యగు భూమి.

విశ్వవిఖ్యాత మగు వీరభారతభూమి
వేదప్రపూత మగు విజయభారత భూమి
ఈ భూమిపైకి దండెత్తి వచ్చిన దెవరు ?
ఈ నేలపైకి క్రొవ్వెక్కి వచ్చిన దెవడు -

ఉదయశ్రీ

ఎవడురా మా గోడ లెక్కివచ్చెడివాడు ?
ఎవడురా దొంగ మాయిల్లు జొచ్చెడివాడు ?
నలుబది నాల్గు కోటుల వీరు లేకమై
భరత పౌరుషరేఖ పరదురాలోకమై;

నరులుగా గాండీవ ధరులుగా నిలబడిన
హరులుగా త్రిపురసంహరులుగా కనబడిన
భీములై రణరంగభీములై పయిబడిన
దుర్గలై విజయసంసర్గలై వెలువడిన;

పర్వెత్తకుందురా గర్వాంధ సైంధవులు!
కుమిలిపోకుందురా కుటిల కామాంధకులు!
తొలఁగి పోకుందురా ధూర్త దుశ్శాసనులు!
పాటిపోకుందురా క్రూర మహిషాసురులు!

పన్నెగాంచిన విశ్వ వైతాళికుఁడ నేను
వాసికెక్కిన హిమవద్గిరీంద్రుఁడ నేను
లెండు నా ప్రజలార లెండు సోదరులార
చండప్రచండ మార్తాండ కిరణములార.

రోషంబులును కులద్వేషంబులును దొంగ
వేషంబులును స్వార్థదోషంబులును వదలి
సత్యంబుగా ఐకమత్యంబుగా జయా
న్నత్యంబుగా జనస్తుత్యంబుగా కదలి

ప్రళయకాల మహోగ్ర భానుకిరణమ్ములై
దిగ్దిగంతముల నవదీప్తు లొలికింపవలె,
కల్పాంత కుపిత సాగర తరంగమ్ములై
వైరిరాజన్య సైన్యముల ముంచెత్తవలె.

విలయ రుద్ర కరాళ వికట గర్జనములై
దిగ్గజమ్ముల చెవులు దిమ్మెక్కఁ జేయవలె
సంవర్త సమయ ఝుంఝూమారుతమ్ములై
విమత విరోధి శీర్షముల నెగఁజిమ్మవలె.

భావిభారత నిరభ్యంతరాభ్యుదయ సం
భావనాహ్లాద భర పారవశ్యుఁడ నేను,
ఆర్ద్ర మానస పులకితాంతరానందాశ్రు
వాహినీ భరిత హిమవద్గిరీంద్రుఁడ నేను.

# జ్యోతిర్మయి

నీవొక వేణుగీతి వయి నిద్దురలేపితి వీ ప్రసుప్త బృం
దావనమున్; లతా తరు వితానము “కొమ్మకు కోటిపువ్వులై”
తావులు గ్రుమ్మరించె; సముదాత్తము లీ మధురక్షణాలు; నే
నీవయి నీవు నేనయి గ్రహింతము విశ్వకళారహస్యముల్ ।

నీవొక నాట్యలక్ష్మి వయి నృత్యమొనర్చితి వీ ప్రఫుల్ల రా
జీవ వనంబునందు, నవజీవన మబ్బె సమస్త సృష్టికిన్;
తావక లాస్య సుందర పదాంకిత కింకిణికా ధ్వనుల్ చిరం
జీవము లయ్యె; కల్గు రససిద్ధి యికన్ జగదంతరాత్మకున్.

నీ వొక మేఘమాల వయి నెమ్మదిగా పయనించి వచ్చి నా
భావ విహాయసంబు నిరుప్రక్కలఁ గ్రమ్మితి వొక్కమాటు; ఈ
శ్రావణ శోభలో నిను ప్రసన్నమతిం గరగించి సృష్టికిన్
జీవముపోతునా పుడమిచేడియ గుండెలు పుల్కరింపఁగన్.

ఉదయశ్రీ

నీ వొక పాలవెల్లివయి నింపితి వీ హృదయంబులో రసా
ప్లావితముల్ సుధామధుర భావతరంగము; లబ్బె నూతనో
జ్జీవన; మీ కళాకలిత జీవను భావిభవంబు సాహితీ
శ్రీవిభవంబులో పరవశించి స్పృశించు దిశాంచలంబులన్!

నీ వొక చిట్టితల్లి వయి నీ చిఱునవ్వుల పూలసజ్జతో
దేవుని పూజకై బయలుదేఱితి నావెనువెంట; అల్ల దే
కోవెలగంట 'ఖంగు' మని గుండెలలో ధ్వనియించె; శీఘ్రమే
పోవలె అందుకోవలె అపూర్వములైన ప్రభుప్రసాదముల్!

నీ వొక కల్పవల్లివయి నిల్చితి మాభవనాంగణమ్ము క్రొ
మ్మావి కడన్ నమస్సుమ సముంచితసంచితభాగ్యరేఖతో!
భావమయీ! త్రయీహృదయ పద్మ మరందములందు ముంచి శః
భావుక సంచయమ్మునకుఁ బంచుదుమా రసవత్ఫలమ్ములన్.

నీ వొక జ్యోతిర్మయి వై
దేవీ! వెలిగింపు నవ్యదీప్తులతో నా
జీవిత పథము, ముహుర్ముహు
రావిర్భూతములుగా జయాభ్యుదయమ్ముల్.

# శాంతిదూత

లేలెమ్మోయి కవీ। జగజ్జనని పిల్చెన్; దివ్య కర్తవ్య దీ
క్షా లక్ష్మీ జయకంకణ మ్మిది కరాగ్రంబందు గీలింపు; న
వ్యాలోకంబులు నిల్పు నల్దెసల; భవ్యంబౌ భవల్లేఖినీ
కాళిందీ లహరీ ప్రపూరముల లోకా లెల్ల ముంచెత్తరా।

శత్రుచమూతతిన్ గసిమసంగుటకున్ గరుణార్ద్రనేత్రుఁడై
గాత్రము కంపిలన్ నరుఁడు గాండివమున్ దిగజార్చెరా కురు
క్షేత్రమునందు; నీ విజయగీతములన్ వినిపించి వానిలో
క్షాత్రము నింపరా। విజయసారథివై విజయమ్ము చేయరా।

చిక్కని వీరగీతులు రచింపుము। భారతపౌరుషంబు న
ల్దిక్కుల పొంగులెత్త నినదింపుము గుండెల వీరదుందుభుల్।
ఒక్కొక భారతీతనయుఁ డొక్కొక సింహకిశోరమూర్తియై
ప్రుక్కడి కుంభికుంభముల ముక్కలు ప్రక్కలు సేయునట్లుగన్।

కొంచె విధాత నీ యెదదకుం గుటిపెట్టిన వాడిబాణమే
గంటముగా లిఖింపు మొక కావ్యము; నీ కరుణాకుమారి శ్రీ
గంటి కవోష్ణ బాష్పకళికల్ రస పూర్ణములై సువర్ణపుం
బంటలు రాళిపోయ నవభారతమున్ సృజియింపరా కవీ।

గుండెలు పిండు బాధ నొక గుప్పిటబట్టి, హృదంతరంబులో
మండు దవాగ్ని చిన్నగవుమాటున దాచి, "పరార్థమే భవత్
పాండితికిన్ ఫలం" బనెడి భావముతో రసభాండముల్ కళా
ఖండములన్ వెలార్చుము యుగాల మొగాలు "జిగేల్ జిగేల్" మనన్ ॥

# క్రాంతిగీత

శ్రీమద్భారత భాస్కరద్యుతులు నర్తించెన్ స్వతంత్రమ్ములై
భూమీమండలమందు; నంధతమసమ్ముల్ విచ్చె; సీమాంతముల్
హేమంతంబులు పూచె; కైవసములయ్యెన్ సర్వసౌభాగ్యముల్
ఏమయ్యా చెలికాడ! నిల్వబడినావే నీవు కన్నీళ్లతో ॥

"వైషమ్యాలు శమింపలేదు; పదవీవ్యామోహముల్ చావలే
దీషణ్మాత్రముగూడ; మూతవడలేదే కైతవద్వారముల్;
భాషోన్మాదము తగ్గలేదు; నశియింపన్‌లేదు మిథ్యాకుల
ద్వేషంబుల్; మఱి యెన్నినాళ్ల కిట వర్ధిల్లున్ ప్రజాభాగ్యముల్!"

పదియుందొమ్మిది యేండ్లు దగ్గరెను బాబా! నీ త్రివర్ణధ్వజం
బది జాతీయ సువర్ణకాంతుల ప్రసన్నంబై; దేశవాల్లభ్య మ
భ్యుదయం బందెడు వేళ ఘాతుక వృకంబుల్ కొన్ని పేరాసతో
కదలం జొచ్చె హిమాద్రిసానువుల ప్రక్కన్ దొక్క లల్లార్చుచున్!

బారులలో దురాక్రమణదారులు బారులు దీరి; స్వర్ణకే
దారము లాక్రమింప సరదాపడినారఁటె । వీరమాత కా
శ్మీరము నాకివేయ పొలిమేరలు దాటిరఁటే దగా ముఠా
దారులు "ప్రక్కయింటి పరదా సరదారులు" మాయదారులై.

రవివై రంజింపుము భువి;
పవివై భంజింపు మహితపక్షంబుల; స్వ
ర్గవివై నిండింపుము సుధ;
కవివై పండింపు మఖిల కల్యాణమ్ముల్ ।

# వి యం ద్వా ణి

అది ఫాల్గున నిశి
ఆనాడు బహుళ ఏకాదశి
గగనసుందరి అలిక ఫలకాన
కళ్యాణ తిలకంలా మెరుస్తున్నాడు శశి.

అప్పుడే గడియారం మూడుగంటలు కొట్టింది
చప్పున మనస్సుకేదో తట్టింది
మెల్లగా గదిలోకి వెళ్ళి లైటు వేశాను
బల్లమీది లేఖ మళ్ళీమళ్ళీ చూశాను.

రచన పంపించి తీరాలి తెల్లవారితే తెలుగు ఉగాదికి
వెళ్ళదామా అనిపించింది ఒక్కమాటు మేడ మీదికి
ఎక్కుతున్నాను పైపైకి ఒక్కొక్క మెట్టు
చక్కగా వంగి చూస్తున్నది ప్రక్కనున్న గున్నమామిడిచెట్టు.

ఉదయశ్రీ

ఏకాంతంగా కూర్చుని ఆకాశంలోకి వీక్షించాను
నక్షత్ర ఖచిత నభోమండలం పరీక్షించాను
రెక్కలు తొడుక్కొని మనస్సు ఎక్కడెక్కడికో ఎగిరిపోతున్నది
విచిత్ర విభ్రమ విద్యుద్ఘాతంలో విలీనమౌతున్నది.

నల్లని ముఖమల్ సిల్కు పరుపులపై
చెల్లాచెదరైన ముత్యాల సరాలు
దేదీప్యమానంగా వెలుగుతున్నవి
తెల్ల తెల్లని నక్షత్రాలు

చందనం చివురించి నట్లున్నది - నందనం వికసించినట్లున్నది
మందాకిని పొంగి నట్లున్నది - బృందావనం నవ్వినట్లున్నది
అందాలు చిందుతున్నది ఆకసం
విశాల వినీల వికస్వర విహాయసం

నిశ్చల నిశ్శబ్ద సంగీతం నింగినుంచి వినబడుతున్నది
అచ్ఛ స్వచ్ఛంద సౌందర్యం ఆకసంలో కనబడుతున్నది
ప్రశాంత నిశాంతం పరవశత్వంతో తూగింది
విశాలమైన ఆకాశం పలుకసాగింది

"ఇన్నాళ్ళకు నీ కళ్ళకు ఇలా కనుపించాను నేను
ఎన్నాళ్ళనుంచో నీకోసం ఎదురు చూస్తున్నాను.
అక్షరమైన విశ్వమహా కావ్యంలో ప్రక్షిప్తాలు పరీక్షిస్తున్నాను
లక్ష లక్ష నక్షత్ర నయనాలతో దీక్షగా నిరీక్షిస్తున్నాను

యుగయుగాల నాటినుంచీ
ఇలాగే వెలుగులు వెదజల్లుతున్నాను
జగాలు జన్మింపక ముందు నుంచీ
ధగధగా ఇలాగే మెరుస్తున్నాను.

సురాసురులు పాలకడలి మథించడం చూచాను
మహాకాళి మహిషాసురుణ్ణి వధించడం చూచాను
స్మరుడు హరునిమీద శరం సంధించడం చూచాను
బలిచక్రవర్తిని వామనుడు బంధించడం చూచాను.

అగస్త్యుడు సముద్రాన్ని ఆపోశన పట్టడం ఎరుగుదును
దేవేంద్రుడు కొండలరెక్కలు తెగగొట్టడం ఎరుగుదును
జగత్తును హిరణ్యాక్షుడు చాపచుట్టడం ఎరుగుదును
ముగ్గురు మూర్తులకు అనసూయ ఉగ్గుపెట్టడం ఎరుగుదును.

బాదరాయణ మహర్షి బ్రహ్మసూత్రాలు వ్రాయకముందు
'ఆదాం అవ్వల' దాంపత్యం చేదుకాయలు కాయకముందు
"హరప్పా" "మొహెంజోదారో"లు ఆవిర్భవించకముందు
హిమాలయ మహాపర్వతం సముద్రంనుంచి లేవకముందు

ఆదికాలంనుంచీ - అనాదికాలంనుంచీ - నేనున్నాను
అప్పటికీ యిప్పటికీ ఎప్పటికీ ఒకేలాగున్నాను."

నేను విస్మయంతో వింటున్నాను
వినీల వియత్తలం అంటున్నది.

"అలెగ్జాండర్లు అశోకులు అబ్రహాంలింకన్లు
సోక్రటీసులు ప్లేటోలు సొహరాబు రుస్తుములు
సీజర్లు నెపోలియన్లు చంఘీజుఖానులు
రాజులు మహారాజులు వక్తలు ప్రవక్తలు

వీరులు మేధావులు విశ్వవిజేతలు జాతినేతలు
ఎందరెందరో నాకనులముందు కదలిపోయారు
ఏ ఒక్కరూ కాలప్రవాహానికి ఎదురీదలేకపోయారు
కన్నులు మూసికొని కాలగర్భంలో కలిసిపోయారు.

ఉదయశ్రీ

రాజులు సామ్రాజ్యాలు రత్నఖచిత సింహాసనాలు
సౌధాలు కిరీటాలు జలతారు మేలిముసుగులు
కరాళకాలజ్వాలల్లో కరిగి నీరై పోయాయి
ధరాపరాగాలుగా మారి - స్వరూపాలు గోల్పోయాయి.

కాలం క్షణకాలం ఆగదు - కాలం దుర్నివారం
అది దూరం తెలియని అపార పారావారం
కాలచక్రం నా కన్నుసన్నల్లో మెదుల్తుంది
గ్రహానీకం నా గృహాంగణంలో కదుల్తుంది.

క్షణాలు దినాలు మాసాలు సంవత్సరాలు
యుగాలు కల్పాలు కల్పాంతాలు
చరచరా సాగిపోతున్నవి గిరగిరా తిరిగిపోతున్నవి
కాలం అజేయం కాలం అమేయం.

నేను దిగ్భ్రాంతుడనై అలాగే కూర్చుని వింటున్నాను
ఆకాశవాణి మళ్ళీ ఆరంభించి అంటున్నది
కాలం పంచకల్యాణి
కాలానికి కళ్ళెం పెడుతుంది కవివాణి.

ఉదయశ్రీ

కాలాన్ని కవిత్వానికి స్వాధీనం చెయ్యి
జీవితాన్ని పూలమాలగా కట్టి మెళ్ళో వెయ్యి
జగతిని ప్రగతితో సమన్వయించు
మానవత్వంలోని నవత్వాన్ని కవిత్వంతో సమర్పించు

నాలోని ప్రభాకరునిలా ప్రకాశించు
నాలోని ధ్రువతారలా మార్గం చూపించు
నాలోని మేఘంలా మెల్లగా వర్షించు
నాలోని చందమామలా చల్లగా స్పర్శించు.

నారాజ్యంలో సూర్యచంద్రులు వేళతప్పరు
నాసీమలో నక్షత్రకాంతలు త్రోవతప్పరు
విశ్వానికి వెలుగుబాటలు ప్రసాదిస్తారు
సమరసభావంతో సమన్వయం సాధిస్తారు.

నాఅడుగు జాడలలో పురోగమించు
నావెలుగునీడలలో ప్రయాణం సాగించు
సత్యాన్ని సౌందర్యంతో నిండించు ।
నిత్యకల్యాణాన్ని నీ పలుకుల్లో పండించు ।।।

# సవితాదేవి కవితాలేఖ

ఏమండీ కవిగారూ! నమస్కారం-ఏమి చేస్తున్నారు!
క్షేమంగా ఉన్నారా! ప్రస్తుతం ఏమి కావ్యం రచిస్తున్నారు!
ఇదిగో మీకు లేఖ వ్రాస్తున్నాను నేనండీ మీ సవితను!
పదే పదే పత్రికల్లో చదువుతున్నాను మీ కవితను.

మిమ్మల్నీ మీకవితల్నీ మెచ్చుకునేదాన్ని
మీకు ప్రశంసాలేఖలు కురిపించేదాన్ని
అప్పటిలా మీకవిత్వాన్ని అభినందించలే నిప్పుడు
అప్పటిలా నా ధన్యవాదాలు అందించలే నిప్పుడు.

పుస్తకంలోని పుటలు పుంఖానుపుంఖంగా నింపుతున్నారు
మస్తకంలోని సరిక్రొత్త సరకు మార్కెట్టులోకి దింపుతున్నారు
కవిత్వం మానివేసి - కవిత్వంమీద కవిత్వం వ్రాస్తున్నారు
నవత్వం మైకంలోపడి మానవత్వం మరచిపోతున్నారు.

పంక్తి మీద పంక్తి "పకడ్‌బందీ"గా సంధిస్తున్నారు
బలవంతంగా భావాన్ని పదాలలో బంధిస్తున్నారు
వ్యర్థమైన బరువుతో పద్యం నడుము వంగుతున్నది
స్వార్థం పరమార్థాన్ని దిగమింగుతున్నది.

కవిత్వం అంటే ఉపదేశాలూ ఉపన్యాసాలూ కానేకావు
సిద్ధాంతాలూ హేతువాదాలూ అసలే కావు
కల్లాకపటం తెలియని పల్లెపడుచులా ఉండవలసిన కవిత్వంచిన్నది
కళ్ళద్దాలు ధరించి వేదిక నెక్కి ఉపన్యాసాలు దంచుతున్నది.

కవీ! దివినుండి ఇప్పుడే దిగివచ్చిన ప్రవక్తవై పోతున్నావు
సందేశాల ఆవేశంలో అందానికి దూరమౌతున్నావు
అడ్డదిడ్డమైన రేఖల్లో అందాన్ని అన్వేషిస్తున్నావు
ముందు కన్పించే అందాలబొమ్మను ఎందుకో ద్వేషిస్తున్నావు.

అనుభూతి ఆర్ద్రతా ఏమాత్రం లేకుండా -
పరవశించి భావనలో కరిగిపోకుండా -
ఏమి లాభం స్వామీ రాముడిమీద పద్యాలు రచించి
చెవుల్లో మ్రోగటం లేదా కవితాక్రౌంచి కరుణవిపంచి!

కదలటం లేదా ఎదలో క్రౌంచపక్షి ఆక్రందనం ;
"ఆ క్రందనమే"గా ఆదికవి హృదయస్పందనం
నిషాదునిమీద నీదృష్టి నిలుపుకున్నావు
విషాద విహ్వల విహంగిని విస్మరించావు ; ;

ఒక నిష్ఠుర నిషాదుని నిశితశరం దూసుకువచ్చింది
ఒక మహత్తర కావ్యాన్ని విశ్వానికి అందిచ్చింది
మళ్లీమళ్లీ పుడుతున్నాడు గిడుతున్నాడు మామూలు నరుడు ;
కావ్యం వ్రాసిన కవిమాత్రం కలకాలం అజరామరుడు ; ;

నీరసమైన కిరాతుని నారసం చూచి నీవు భీతిచెందకు
నిర్భాగ్యుడైన నిషాదుని నిరీక్షించి నీవు భయమందకు
విశ్వకల్యాణకరమైన సృష్టికార్యానికి విముఖుడవు కాకు
నిరంతర రసస్రవంతికి పరాఙ్ముఖుడవై పారిపోకు.

అపరాధియైన ఆ వ్యాధుడు మాత్రం ఎవడు -
ఆలోచిస్తే ఆదికవి వాల్మీకి మొదటి రూపమేగా అతడు -
క్రౌంచాన్ని కొట్టినందుకు కవికి వచ్చింది కోపం
ఎట్టయెదుట నిలబడింది విడిచిపెట్టిన మొట్టమొదటి రూపం ;

దారుణమైన నీలోని ఆ పూర్వరూపాన్ని పారద్రోలు దూరంగా
క్రూరమైన దానికుటిల దంష్ట్రిలు గ్రుచ్చుకుంటాయి నీకు ఘోరంగా
"పెద్దమనిషి" "బుద్ధిమంతుడు" అనే పేరుకోసం తహతహలాడి
కరుణామయి కవితను బలిచేస్తావా కనికరం విడనాడి.

కవీ వినవయ్యా విను ।। కవిత్వానికి ఆలంబనం "నారీమతల్లి"
ఆమె సహజ సౌభాగ్యంతో పుష్పించిన కల్పవల్లి
కవీ వినవయ్యా విను ।। కవిత్వానికి జనయిత్రి "ధరిత్రి"
విత్తనాలకోసం వేచియున్న విశ్వధాత్రి.

కవిత్వాన్ని కవిత్వంగా గౌరవించడం కవికి హుందాతనం
కవిత్వమనేది సత్యసనాతనం । నిత్యనూతనం ।
క్రొత్తదైనా సరి క్రొత్తదైనా కవిత్వం కవిత్వమే ।
ఉత్త ఉపదేశాలు మానివేయి । ఉదాత్తమైన కవిత్వం వ్రాయి ।

అయిపోతున్నది లేఖ - మూడుముక్కల్లో ముగిస్తున్నాను -
ప్రియమైన కవీ, ఒక్క సంగతి హెచ్చరిస్తున్నాను -
జలబిందువై సముద్రంలో మునిగిపోవడమా -
చందమామవై పాలకడలిలో పైకితేలడమా -

ఉపయశ్రీ

మంచిదేదో ఆలోచించు ; ఆవిధంగా ఆచరించు ;
కొంచెంగా చెప్పినా గొప్పగా గ్రహించు ;
కవిత్వం చైతన్యవంతమైన గంగాఝరి ;
ఆ వేగానికి అనుభూతి మహోన్నత హిమగిరి.

అనుభూతిలేని శుష్కహృదయుని వాణి
ముదుసలి మగడు తాళిగట్టిన అందాలరాణి
ఉపన్యాసాలు కట్టిపెట్టి ఉత్తమంగా సృష్టించు కవిత
ఉంటాను

ఇట్లు
ప్రియమైన నీ సవిత

# గులామ్ ఖాదర్

[కాశ్మీరములోని 'ఖాగ్' గ్రామము గులామ్‌ఖాదరు నివాసస్థానము. దురాక్రమణ దారులైన పాక్ గూఢచారులను కనిపట్టి తరిమికొట్టి ఆ సంకుల సంగ్రామములో అసువులువాసిన అమరమూర్తి గులామ్ ఖాదరు. ఆ అమరవీరుని సమరగాథయే ఈ రచనకు ఆధారము.]

అక్రమమ్ముగ తన గ్రామ మాక్రమించు
దుండగుల గుండె చీల్చు వీరుం డతండు ।
అణువణువు మాతృభూమి రక్షణము కొఱకు
వ్యయముచేసిన ధన్యజీవను డతండు.

లంచమిచ్చి తన్ను వంచింప నెంచిన
వంచకులను ధిక్కరించినాడు ।
మతము పేరుచెప్పి మాయచేయవలంచు
చెన్నటులను దొక్కచించినాడు.

"మతము మతమటంచు మైకమ్ము తలకెక్కి-
హతమొనర్పఁదగునె యవని జనుల ?
మాతృభూమికన్న మత మున్నదా !" యంచు
మోసగాంధ్రద నోరు మూసినాఁడు.

పాకీస్థా నుసికొల్పిన
రాకాసుల పాఱఁద్రోల గ్రామీణ ప్రజా
నీకము నేకమొనర్చిన
నీ కేరీ సాటి ! ముందు నిలిచిన మేటీ !

గ్రామము కూడగట్టుకొని, కట్టిడి దోపిడిమూక మీద నం
గ్రామము చాటి, ముందునకు కాలిడనీయని వీరకార్మిక
స్వామివి నీవు; నీ సమర సాహసలీలకు పుల్కరించె "ని
స్లాము" సెబాసు ఖావరుగులాము ! సలాము త్వదీయ దీక్షకున్.

"ఇప్పు డిచేల వచ్చితిరి ? శతక్షితిఖండము భారతమ్ములో
నెప్పుడొ చేరిపోయె పదునెన్మిది యేదులనాడె; చాలు మీ
తప్పుదు మాయదారి పరదా సరదా; సరదారులార ! మీ
రిప్పురి వీడిపొండు; సహియింపము మీ పలుగాకి చేష్టలన్ !"

"ఈకాశ్మీరము సొత్తు భారతముతోనే కాని, పల్గాకి యా
పాకిస్థానము తోడ కా' దనుచు నిస్పష్టమ్ముగా చాటమే
లోకమ్మెల్ల; వ్యథల్ క్రుధల్ వృథలు; చాలున్ దండముల్ మీకు మీ
రాకల్ మాకు చిరాకు; లోబడము మీ రాకాసి కౌగిళ్లకున్."

"ఎల్లల్ దాటుట, యిండ్లుగాల్చుట, ప్రజన్ హింసించుటల్, పంటలన్
గొల్లంగొట్టుట, గొంతుకోయుట, తుపాకుల్ ప్రేల్చుటల్, జీవితా
లల్లాడించుట న్యాయసమ్మతములే ? అల్లా మిమున్ మెచ్చునే ?
చెల్లంబో విట మీదుపంతములు కాశ్మీర ప్రదేశమ్ములో."

అంచు గర్జించి క్రుద్ధసింహము విధాన
దూకితివి దొంగతోడేళ్ల మూకపైన;
ఐదురోజులు భీకరాహవమునందు
వేడినెత్తురు కురిసె నీవాఁడి బరిసె.

వైరులఁద్రోలి నేలపయి వ్రాలిన ముస్లిము వీర ! నీ యసృ
గ్ధారల ధన్యమైనది గదా క్షితి; నీ స్మృతి కల్మి నొక్కఁ కా
శ్మీరమె కాదులే, పరవశించిన తావక దేశభక్తికిన్
భారతజాతి యెల్ల ఋణపడ్డదిరా పదివేల యేండ్లకున్.

ఉదయశ్రీ

భారతావనిలో నున్న యారుకోట్ల
ముస్లిములు నీ పరాక్రమమ్మును స్మరించి
మురిసిపోయిరి; నీ వీరచరిత మాతృ
పూజ కౌక నవ్యదివ్య నీరాజనంబు.

'అమరవీరుఁడ'వైన నీ సమరగాథ
"భాగపురి" రక్షకైన నీ త్యాగదీక్ష
ధీర గంభీరశక్తి నీ దేశభక్తి
మెఱయు నిక ముందు ; వీరకాశ్మీరమందు ;

# ఆయూబ్ ఆత్మగతము

జిత్తులమారి జంబుకము "చెవ్వనులై" మెడబట్టి త్రోయ దం
డెత్తితి మాతృదేశము పయిన్, సమరాన విరోధి చేతిలో
చిత్తయి పోయితిన్; చపలచిత్తుఁడ, మత్తుఁడ; నాదుమత్తు గ
మ్మత్తుగ దించినారు ధృతిమంతులు భారత వీరసైనికుల్.

"భుట్టో అంకెలు, మాయటాంకులు, పెకింగ్‌బొంకుల్, మదిన్నమ్మియా
నట్టేటం బడియెన్ మదాంధుఁ"డని నానాదేశముల్ నన్నె చీ
కొట్టెన్ - మేరుగిరీంద్రముం దగరు ఢీకొట్టెన్‌గదే। నేఁడిటుల్
"పట్టాల్ దప్పిన బండి"నైతి నిక నా ప్రారబ్ధ మెట్లున్నదో।

ఆకాశ్మీరము వంకబెట్టుకొని యన్యాయమ్ముగా నిండియా
పైకిం దూకితి, నోరులేని ప్రజపై వర్షించితిన్ బాంబులున్
రాకెట్లున్; రిపుసైన్యముల్ తరుమ పోరన్ దోకజాడించి చీ
కాకై పోతిని। చిన్నపోతిని। చిరాకై పోతి లోకానికిన్॥

ఉదయశ్రీ

మొండి శిఖండి దుఁడగపు మూకల కాకల కోడి యిఁడియా
గుండెలు క్రుంగి లొఁగు ననుకొంటి; నవక్ర పరాక్రముల్ రణో
ద్దండులు భారతీయులు; యథార్థమెఱుంగక మోసపోయితిన్;
దఁడుగయయ్యె నాశ్రమ; కృతఘ్నములయ్యె శతఘ్నులన్నియున్॥

టాంకుల్పోయె। ఫిరఁగు లెత్తువడె। ఫైటర్ జెట్ విమానంబులున్
డింకాగొట్టె। పటాలముల్ బెదరె, తండ్రీ। గుండియల్ జారెరా।
కింకర్తవ్య విమూఢ చిత్తునకు దిక్కెవ్వారు మీకఁటె; నా
వంకం జూడరె। నా మొఱల్ వినరె। మీవాడన్ కటాక్షింపరే।

# కన్నతల్లి కన్నీటిలేఖ

గుండె పగిలిపోతున్నది - గొంతు సురిగి పోతున్నది -
చార్మినార్ చేతులెత్తి - "శాంతి శాంతి" అనుచున్నది.

సెగలు పొగలు చెలరేగెను - పగలు పాములై మూగెను
"అమరజీవి" హృదయంపై అగ్నిపర్వతం మ్రోగెను.

ఇది నా కన్నీటిలేఖ - ఇది నా దురదృష్టరేఖ -
మతి తప్పిన నందనులకు మాతృశ్రీ వ్రాయు లేఖ.

ఈలలు గోలలు గుంపులు-ఎన్నెన్నో గర్జింపులు
తెలుగుజాతి నాయకులకు నలుగురిలో తలవంపులు.

దహనాలిక చాలింపుడు - సహనా లవలంబింపుడు
పెట్రోలును కాదోయీ! ప్రేమసుధలు చిలికింపుడు.

బహిష్కారములు వీడుడు పరిష్కారములు చూడుడు
కయ్యాలకు స్వస్తిచెప్పి నెయ్యాలకు కేల్ సాపుడు.

అన్నదమ్ము లన్యోన్యం ఆయుధాలు దూయకండి
కన్నతల్లి కడుపుమీద కత్తిపెట్టి కోయకండి.

అన్నపూర్ణ రొమ్ములపై - హాలాహలం పూయకండి
ఎన్నో యేండ్ల మహాకృషి — ఏటిపాలు చేయకండి.

అటు ఎవ్వరు — ఇటు ఎవ్వరు — అంతా నా సంతానం !
నా తెలుగులు ! నా వెలుగులు ! నాహృదయం ! నాప్రాణం !

వేడుకతో నా ఒడిలో — ఆడుకొనే గోవిందులు
పరవశించి నా గుడిలో — పాడుకొనే పసికందులు.

అచట బహిష్కరణాలా ! ఇచట దురాక్రమణాలా !
అట సజీవ దహనాలా—ఇట క్రోధస్ఫురణాలా !

ఒక్కతల్లి బిడ్డలలో—ఎక్కడిది దయ్యా ఈ కసి !
చక్కని సౌధం నడిమికి ముక్కలు చేసే రక్కసి.

ఉదయశ్రీ

ఆంధ్ర తెలంగాణా రాయలసీమల కొకే నీతి
ఒకే రీతి—ఒకే జ్యోతి—ఒకే ఒకే ఒకే "జాతి"

నిండుగుండె పొలములలో—పండింపుడు సానుభూతి
ఐదుకోట్ల తెలుగుబిడ్డ—లాలపించు డైక్యగీతి.

ఒంటికంటి గుంటనక్క—కుంటి నడకలను గనకుడు
పంటచేలు పాడుచేయు—పందికొక్కులను జెనకుడు.

త్రాడుతెగిన గాలిపటం—తప్పుడు బాటల జనకుడు
చుప్పనాతి శూర్పణఖల—చెప్పుడు మాటలు వినకుడు.

కబంధ హస్తాలు చాచి—కబళించుట స్వార్థమురా!
"ఎగబడితే" ఎదుటివారు "తెగబడుట" యధార్థమురా!

అంతులేని ఆశలతో ఆక్రమణలు చేయకురా!
నింగిలోని స్వర్గాలకు-నిచ్చెనలను వేయకురా!

అమాయికుల మనసులలో—అనుమానం తొలగింపుడు,
వెనుకబడిన సోదరులకు విశ్వాసం కలిగింపుడు.

మేలుగూర్చు బాటలలో-మీ ఊహలు సాగింపుడు
ప్రియజనని గృహాన "సమన్వయ దీపం" వెలిగింపుడు.

మ్రోగుచున్న హృదయవీణ-తీగలు మరి త్రెంపవద్దు
సాగుతున్న సౌహార్దం-జాజితలలు త్రుంపవద్దు.

తెలుగు యశోగీతులు "శ్రుతిగలిపి" తీయగా పాడుడు
"భాగ్యనగర" సౌభాగ్యం భద్రంగా కాపాడుడు.

పచ్చని పందిళ్ళ క్రింద-చిచ్చుబుడ్లు కాల్పకండి
ప్రక్క యిండ్ల మీద "పిచ్చికుక్కల" నుసి కొల్పకండి.

ముసుగు దయ్యములను "ప్రజలముందు" దుమ్ముదులిపింపుడు
మసిపట్టిన దానవులను-మానవులను గావింపుడు.

కష్టసుఖాల్ కలబోసుక-కలసి మెలసి పంచుకొనుడు
నష్టమైన లాభమైన-నలుగురిదని ఎంచుకొనుడు.

ఎరుగని పెడదారులబడి-యిక్కట్లకు లోనైతిరి.
ఇరుగమ్మకు పొరుగమ్మకు-ఎంత చులకనై పోతిరి.

చిక్కు-పడిన సూత్రాలను-స్నేహంతో విడదీయుడు
గడ్డు సమస్యలు "శాంతంగా" కనుగొని సరిచేయుడు.

పలికిన వాగ్దానాలకు భంగం రానీయకండి
అన్నదమ్ము లొకరి నొకరు - అన్యాయం చేయకండి.

జరిగిన పొరబాట్లు తిరిగి-జరుగకుండ చూచుకోండి
చేసిన తప్పులు మళ్ళీ-చేయకుండ కాచుకోండి.

దింపుడు ఉష్ణోగ్రత సా-ధింపుడు సర్వ సమగ్రత
"భస్మాసురు" లున్నారోయ్-తస్మాజ్జాగ్రత । జాగ్రత ।।

# భుట్టోషష్ఠాష్టకము ౧

పాకెట్లో రాకెట్లిడి
బ్రాకెట్లాడకుము ప్రజల భవితవ్యముతో;
జోకర్లను స్వార్థానికి
బ్రోకర్ల నొనర్పకోయి। భుట్టో ఖాయీ।

రాకాసి కాకులను గొని
రాకోయీ శాంతిపావురమ్ముల పైకిన్।
"పాకీ స్థానము" నొక్క "తు
పాకీస్థానము"గ మారుపంబోకోయీ।।

పేచీల నిడకు। మిచ్చిన
పూచీలను విడకు। మల్పబుద్ధులతో లా
లూచీలు పడకు। మన్యుల
గోచీలం బట్టి దూకకుము నడికడలిన్।।

రాజీ రాజీవమువలె
రాజిల్లిన కాంతిసిరి విరాజిల్లునుగా ।
రాజేయకు రణకుంపటి ।
మాజీ నాజీవి గాకుమా ఘట్టోజీ ।

కొట్టో । మార్కెట్టో । డా
పెకెట్టో । సిగరెట్టో । గండుచీమల పుట్టో ।
చట్టో । పాముల బుట్టో ।
ఘట్టో । నీ బుఱ్ఱ వట్టి బూరుగుచెట్టో ॥

చిట్టెలుక కొక్కిరించిన
పట్టపుటేనుగు ప్రతిష్ఠ భగ్నంబగునా ।
గట్టుకు తల డీకొట్టిన
పొట్టేలుకె నష్ట మోయి । ఘట్టో భాయీ :

# భుట్టో షష్ఠాష్టకము ౨

మొదలే తానొక పిచ్చికోతి। మఱి నిప్పుల్ ద్రొక్కె। కల్ ద్రావె। నా
పిదపం దోకకుఁ దేలుకుట్టె। పయి నావేశించె నే భూతమో।
అదిరా చెప్పెడిదేమి యాకలకలం। బాపోశ। లాకేక। లా
గదమాయింపులు। దొంగతంతులును। ఆగల్లంతు। లాగంతులున్॥

ఇస్లామ్ ధర్మము మంటగల్పి, ప్రజలన్ హింసించి ధూర్తుండవై
ముస్లిమ్ పెద్దలఁ గష్టపెట్టితివి మోమోటంబు లేకుండగా।
అశ్లీలోక్తుల బుట్ట। మాయల మఱట్టా। భద్రతామండలిన్
"మిస్లీడ్" చేయుదు వెంతకాల మిటు పండెన్ నీదు దౌర్భాగ్యముల్।

"కుక్కలు పోవుచున్న వవిగో।" నని ప్రేలెదు నీదు గొంతుకన్
నొక్క మనీషి యొక్కరుడునున్ సభలోపల లేకపోయెనే।
నిక్కము భారతీయు లవనిన్ నిను బోలిన గుంటనక్కలన్
టక్కరి పందికొక్కుల హుటాహుటిఁ బట్టఁగ వేటకుక్కలే॥

భారతభూమిలో పెరిగి, భారతమాత పయస్సు గ్రోలి, యీ
భారతధూళిలో పొరలి, భారతరక్తము మేనఁ దాల్చి, దు
ర్వార మనీష నేఁ డొక పరాయి తురాయి ధరించి ప్రేలెదే
"భారతకుక్కురంబు" లని భాయి ! వచింపుము నీవెవండవో ?

"పొగరుఁబోతు"వనో "త్రాగుఁబోతు"వనియొ
"వదరుఁబోతు"వనో నిన్ను మదిఁ దలంచి
మిన్నకున్నారులే మున్నదిన్నయట్లు
భద్రతామండలీ పట్టభద్రు లెల్ల.

శిశుపాలుం డలనాఁడు నిండుసభలో శ్రీకృష్ణదేవున్ నిరం
కుశుఁడై కర్ణకఠోర కర్కశ కటూక్తుల్ పల్కి తానెట్టి దు
ర్దశపా లయ్యెనొ ! అట్టి దుర్దశయె ప్రాప్తం బౌను నీకెప్పుడో !
పశువాచస్కుల కేమి ! మానవపథభ్రష్టుండవై పోకుమా !!

అక్కసు పట్టఁజాలక దయామయుఁ డిచ్చిన నోటి నక్కటా
కక్కసుదొడ్డి చేసికొని కాఱులుకూసిన లాభమేమి ! నీ
రక్కసనాల్క బైటపడె ! బంకెలువేసిన వాసిగందువే !
ఫక్కున నవ్వుకొన్నది ప్రపంచము నీ కటు వాక్ప్రపంచమున్.

భుట్టోభాయీ ! నీ పొక
పొట్టలైపోతివోయి ! భూధరమును డీ
కొట్టితివి ! కొండ కొండయె
కట్టా ! నీ తలయె ఖండఖండములయ్యెన్.

• • •

# కరాచీతో ఢిల్లీ

దువ్వకు దుండగులను, కాల్
ద్రవ్వకు చివ్వకు, వృథా క్రుథన్ బ్రువ్వకు, రాల్
రువ్వకు పొరుగిండ్ల పయిన్,
గవ్వకు కొఱగాని నాటకము లాడకుమా!

దిమ్మకుము ప్రజల నెత్తురు!
క్రుమ్మకు మాప్తులను కోరకొమ్ముల తోడన్!
అమ్మకుము దేశ మొరులకు!
నమ్మకుము కరాచి! నంగనాచి పెకింగున్!

చైనా చూపిన యెంగిలి
చైనాకి మదించి రోక జాడించకు; మే
మైనా పెకింగు పెంపుడు
"మైనా" వైనావ! మంచి మాటలు రావా!

వాయించిరి చెంపలు; సము
దాయించిరి; వీపు వంచి తాషామరపా
వేయించిరి; మా సేనలు
మూయించిరిలే భవచ్ఛమూవదనంబుల్.

ఛీఛీ! వెలికిల బడిన తి
వాచీ! గతిచెడిన రిష్టువాచీ! విడుమీ
పేచీ! ప్రేలకు మీ దు
ర్వాచికములు, మైత్రి కాలరాచి కరాచీ!

వేషాలు విప్పి, మత వి
ద్వేషాలకు స్వస్తిచెప్పి, తీయని హృదయా
శ్లేషాలు శాంతిమయ సం
తోషాలు భజించి ప్రజలతో సుఖపడుమా!

# యాహ్యా సప్తకము

'కంసుం'డంచు 'నృశంసు'డంచు నిను లోకంబెల్ల దూషించె; నీ
హింసాకాండలతో శ్మశానమయిపోయెన్ తూర్పు బెంగాలు; వి
ధ్వంసం బయ్యెను మానవత్వము; నిరాధార ప్రజావాహినీ
మాంసోన్మత్త మహాపిశాచములు యుష్మత్ సైనికానీకముల్ ।।

పల్లెల్ గూల్చి, గృహాలు గాల్చి, ప్రజలన్ బాధించి, నీ అక్కలన్
చెల్లెండ్రన్ చెఱపట్టి, యెల్ల జగముల్ ఛీకొట్ట దేశమ్మునే
అల్లాడించిన నీవు వీరుడవ? రెహ్మాన్ ద్రోహియా? యాహియా।
'అల్లా' మెచ్చునె నీ కిరాతకపు చర్యల్ ।। నిన్ను మన్నించునే ।।

కారాగారములోన బెట్టితివి 'బంగ్లాబంధునిన్'; శాంతికిన్
'గోరీ కట్టితి' వింటిలో; 'మరతుపాకుల్' 'టాంకులే' నీ కళా
కారుల్ । మారణహోమ సాక్ష్యములు 'ఢాకా' విశ్వవిద్యాలయ
ద్వారమ్ముల్ ప్రకటించు నేటికి భవద్ భస్మాసుర క్రీడలన్ ।।

'పాకు' తుపాకిగుండ్లు పసిపాపల మెత్తని గుండెకాయలన్
దాకుచునుండ చూచిన 'ఖుదా' కను లెంతగ నీరు నిండెనో ॥
కాకులు గ్రద్దలున్ బొడువగా నడివీథుల నెత్రు చిందు 'చీ
కా' కగుచున్న కాయముల గాంచి 'ఖురాన్' కడు పెంతమండెనో॥

రష్యారాజ్యము సంధిచేసికొనె మా రాజ్యమ్ముతోడన్; చిరా
యుష్యం బబ్బెను శాంతిభద్రతల కోహో ! యాహియా ! ఏషియా
'యేష్యం' బంతయు మాటిపోయెను; జగమ్మీ సంధిసూత్రాలకున్
'భాష్య' మ్మప్పుడె చెప్పె; సాగ వికఁ వాక్పారుష్య వైదుష్యముల్

చిక్కని దేశభక్తుడగు 'షేక్ ముజిబూర్ రెహమాను' చేతికిన్
'జికెక్క'నటంచు నిక్కకుము ! చీకటిమాటున శాంతి గొంతుకన్
నొక్కకు ! దమ్ములుండిన గనుంగొనుదున్ పదిమంది ముందటన్
రక్కసిబుద్ధి మాని బహిరంగ విచారణ నిర్వహింపుమా ॥

పాకిస్థానము చీలిపోవుటయె దౌర్భాగ్యంబు ! అదట్లుండగా
నీకీ స్థానము సంక్రమించుట మహానిష్టంబు ! మా యిండియా
పాకిస్థానము లేకమై నిలిచి సౌభ్రాత్రంబు పాటించినన్
లోకుల్ మెత్తు; రమాయిక ప్రజకు గల్గున్ శాంతి సౌభాగ్యముల్ ।

# అనుగుతల్లి ఆహ్వానం

జిందారహో బేటా రెహమాన్ !
క్షేమంగా ఉన్నావా మేరీ జాన్ !
నేను నీ మాతృశ్రీని బాంగ్లాదేశాన్ని
నీకు పంపుతున్నాను బాష్పసందేశాన్ని.
పదిలక్షలమంది బాంగ్లామృతవీరుల
కదుష్ణ రుధిరధారలతో
కోటిమంది కాందిశీకుల
కన్నీటి ధారలతో
నీ కీ లేఖ వ్రాస్తున్నా
నీ రాకకోసం నిత్యమూ ఎదురుచూస్తున్నా.

ఏమని వ్రాసేది నీకు
ఇక్కడి నా క్షేమసమాచారాలు
ఏమూల చూచినా ఇంకా
ఏడ్పులూ హాహాకారాలూ

అక్కడి నీ క్షేమం
అడగటానికి లేవటంలేదు నోరు
రక్కసి కబంధుల కౌగిట్లో
చిక్కుకున్నాడు నా "ముజిబూరు"

విన్నావా బాబూ!
ఇప్పుడు నీ రాష్ట్రం స్వతంత్రమైంది
తూర్పుపాకీస్థాన్ పాస్టైపోయింది
ఆజాద్ బాంగ్లాదేశం ఆవిర్భవించింది

ఆనాడు నిన్ను సంప్రదింపులకని ఆహ్వానించిన కిరాతకులు
అర్ధరాత్రి అన్యాయంగా పట్టి బంధించారు విశ్వాసఘాతుకులు
విమానంలో ఎక్కించి కరాచీకి తరలించారు
అమానుష హత్యాకాండలకు నడుం కట్టారు
అక్రమంగా పాక్ సేనలు ఆనాడు సాగించిన దురాక్రమణలు
అన్నీ ఇన్నీ కావు - ఎన్నటికీ అవి మఱుపురావు

ఆ నరహంతకుల పైశాచిక నృత్యాలకు
విశృంఖల విధ్వంసక కృత్యాలకు-
అఘాయిత్యాలకు హత్యలకు అత్యాచారాలకు
దారుణ మారణ హోమాలకు-

ఉదయశ్రీ

కాలి పొగచూరిన గ్రామాలు సాక్షి
గగనాని కెగసిన ధూమాలు సాక్షి
మంటలలో మాడిపోయిన పంటపొలాలు సాక్షి
గుంటలలో పూడిపోయిన శవాలగుట్టలు సాక్షి

అమ్మగుండెల్లో బాకు దించుతూండగా
"అమ్మో" అని అటచిన పాలబుగ్గల పసికందులు సాక్షి
దిక్కులేని దిగంబర దేహాలపై ఎక్కి
ముక్కులతో పొడుస్తున్న ముసలి రాబందులు సాక్షి

శ్మశానాలుగా మారిన మన పొలాలు
దశాబ్దాలదాకా పండనట్లున్నాయి
బాంగ్లా వీధుల్లో పారిన నెత్తురు మడుగులు
పదేండ్లదాకా ఎండనట్లున్నాయి

నీ వానాడు వెలిగించిన విప్లవజ్యోతి నీ సోదరులకు దారిచూపింది
నీవు ఎగురవేసిన జాతీయపతాక నింగినిండా వెలుగులు నింపింది
నీవు మ్రోగించిన రణభేరి నిఖిల దిక్కులా ప్రతిధ్వనించింది
నీవు సాగించిన జైత్రయాత్ర నిరాటంకంగా పురోగమించింది

41)

దురాక్రమణను తొమ్మిది నెలలుగా నిరోధించింది ముక్తివాహిని
హోరాహోరి పోరాటంలో పారింది వీరుల రక్తవాహిని
పాకిస్థాన్ దుండగులు ప్రజలపైబడి దోచుకున్నారు
నూరు లక్షలమంది నిరాశ్రయులు భారతమాతకడుపులో తలదాచుకున్నారు

అంతలో భారతసైన్యం మనకు అండగా నిలిచింది
పాక్ సేనల చర్మం ఒలిచింది
ఫటాలున బద్దలైనాయి పాటన్ టాంకులు
పటాపంచలైనాయి ఫైటర్ జట్ విమానాలు
తోకముడిచారు దుండగులు
పరాజితులైనారు నరహంతకులు
అంతా అద్భుతంగా జరిగిపోయింది
పాకీస్థాన్ నడుము విరిగిపోయింది
నిరంకుశత్వం నిష్క్రమించింది
స్వతంత్ర బాంగ్లా సాక్షాత్కరించింది

అయితే చేటా !
ఇప్పుడు నీ మాతృభూమిని నీవు గుర్తుపట్టలేవు
అప్పటి ఇండ్లూ వాకిళ్లూ అలా లేవు - నీ దేశం
దావురుపిల్లి నోటిలోనుంచి బయటపడిన పావురంలా ఉంది

ఉపయశ్రీ

పందులు చిందులు త్రొక్కిన పంటపొలంలా ఉంది
నరకాసురుడు తగులబెట్టిన నందనవనంలా ఉంది

పగబట్టిన నల్లత్రాచులు
మాయదారి మారీచులు

కసిపోక మసిపూసికొనే నీచులు రేచులులా
నీచుట్టూ మూగి ఉన్నారు
నీతో అప్పుడే మంతనాలు సాగిస్తున్నారు
చింతకాయలు రాలవులే మంత్రాలకు
స్వేచ్ఛాప్రియులు లొంగరులే కుతంత్రాలకు

నీవు వెంటనే మాతృదేశానికి బయలుదేరి రావాలి
ఇక్కడ జరిగిన సంగతులన్నీ తెలుసుకోవాలి
"అల్లా" చల్లంగా రక్షించి
"ఆజాద్ బాంగ్లా" అధ్యక్షుడివి కావాలి

నీ బేగం నీకోసం నిరీక్షిస్తున్నది
బేటీ హసీనా బెంగపెట్టుకొని ఏడుస్తున్నది
నీ మనుమరాలు నిద్దురలోకూడా
"దాదా! దాదా" అని విన్నే పిలుస్తూ కలవరిస్తున్నది

ఉదయశ్రీ

నీవు వెంటనే బయలుదేరి రా బేటా !
నిన్ను ఆహ్వానిస్తున్నది ఢాకా
ఎదురుచూస్తున్నది నీవు వచ్చేదాకా

అయితే ఒక్క సంగతి మాత్రం మరచిపోకు బేటా !
నీవు వచ్చే దోవలో
భారతదేశంలో ఆగు
ఢిల్లీ మనపాలిట బంగారుతల్లి
ఆపదలో ఆదుకొన్న వీరనారీమతల్లి
ఆ చల్లనితల్లికి, సలాములు చెల్లించు
ఆపైన విమానాన్ని స్వదేశానికి మళ్ళించు

# స్వర్ణలత

అల్లదుగో పూలతీవ
అందానికి అసలుత్రోవ
ఆడుతూ పాడుతూ మెల్లిమెల్లిగా
అల్లుకుంది అల్లిబిల్లిగా
అల్లదుగో మొల్లతీగ
అల్లరి పసిపిల్లలాగ.

వడిగా వచ్చిన వర్షం
వల్లికి హెచ్చిన హర్షం
అరవిచ్చిన ఆ పువ్వులు
చిలిపిపిల్ల చిరునవ్వులు.

పందిరిగుంజను కౌగిలించుకొని
పసందుగా పైకి నిక్కింది
ముందున్న పశువుల పాకమీదికి
మోచెయ్యి మోపి ఎక్కింది

ఉదయశ్రీ

చిందించింది స్మితరేఖలు మందమందంగా
అందించింది సరిక్రొత్త సొగసులు ఆనందంగా
అరవిచ్చిన పసిడిమొల్ల
చిరునవ్వుల చిలిపిపిల్ల
బిక్కపలచని తనూవల్లి
పరవశమై వూగి వూగి
చక్కదనాల ప్రేమసూత్రంలా
సహజశోభతో సాగి సాగి
పూలగుత్తులవలె గుండ్రంగా
పొటమరించిన హృదయం పొంగు
ఆలోకించినకొలంది అందం చిందే మేలిరంగు
ఎప్పుడో మరి దీని విలాసం కొంత
అప్పుపుచ్చుకొన్నది తప్పనిసరిగా ఉరగకాంత

ఒయ్యారంగా పరిమళ దోలలో
ఉయ్యాలలూగుతూ
తియ్యని మౌనంలో మైమరచి
తేపతేపకూ తూగుతూ

ఉదయశ్రీ

ఈ నా అనురాగవల్లి ప్రాణంలో ప్రాణంగా
మానసం ముంగిట అల్లుకుంది
మమతకు తార్కాణంగా.

నవ్వింది తొలిపూటుగా
నా పూలకన్నె తెరచాటుగా

అల్లదుగో మొల్లతీవ
ఆనందపు అమృతనావ.

ఒంటికాలితో నిలబడింది
ఒయ్యారంగా మునివ్రేళ్ళపైన
కంటి కింపుగా జంపుగా
కనబడుతూ లేబ్రాయమైన.

మోకాలు అదో చిత్రంగా కొంచెం
ముందుకు వంచింది
డాకాలు కుడి పిక్కపై
నాజూకుగా ఆనించింది
మిలమిలలాడే చిగుళ్ళ
మేనంతా ధరించింది
వెలుగునీడల మేలిముసుగు
తలపై సవరించింది

తళతళ మెరిసే వెండిరెక్కలు గాలిలో తెరిచి
అరణ్యంమధ్య పచ్చికబయళ్ళలో నిలిచి
ఆకాశంలోకి సూటిగా అమాంతం ఎగరబోతున్న
అచ్చర మచ్చెకంటిని అచ్చంగా అనుకరిస్తూవున్న
పసిబుగ్గల తీవమొల్ల
చిరుసిగ్గుల చిలిపిపిల్ల.

ఆడుతూ పాడుతూ మెల్లి మెల్లిగా
అల్లుకున్నది అల్లిబిల్లిగా
రంగారు జరీ జాలరీ లంగా కట్టుకొని
బంగారు మొగ్గల సొమ్ములు సింగారించుకొని

అలంకారంగా చెట్లచెట్ల
కలంకారీ పైట వేసుకొని

పొంగిపొరలిన లావణ్యం అల వలె
నింగిమీద నక్షత్రాల నీలినీడల వల వలె

భరించలేక సౌకుమార్యం బరువు తలపై
సరిగా అడుగుబడక తడబడుతున్నది ఇలపై

ఉదయశ్రీ

అనువైన అలల భంగిమలతో అటూ ఇటూ వంగి
వనస్పతి జగత్తునుంచి వచ్చిన నిర్ఝరిణీ భంగి
పచ్చనిరంగు ప్రవహించే పసినరాల లతాంగి
చకచక ముందుకు దుమికే చంచల చారుకురంగి

అల్లదుగో పూలతీవ
అందానికి అసలు త్రోవ

అంతరంగంలో గూడుకట్టుకున్న
అంక్షలేని ఆకాంక్ష రీతి
అంతటా పులుముకొని
అనురాగాల ఆత్మానుభూతి

ఇలాసుందరి నవయౌవన విలాసక్రీడ వలె
ఖులాసా స్వప్నాల క్రీనీడ వలె
అవలంబించి అదుగో ఆ స్తంభం వెన్నెముకపట్టు
ఆరోహిస్తున్నట్టు జగచ్చైతన్యం మెట్టుపైమెట్టు

విశ్వజీవితానికి వికాసమార్గం చూపిస్తూ
వియత్తలం నిండా విశేష సుగంధం వ్యాపిస్తూ

మూలభూతమైన స్థూలధరిత్రి కడుపులోనుంచి
ముడి తమస్సును వడివడిగా వెలువరించి

అంతరాంతరాల్లో దాగివున్న ప్రాణధనాలు
కాంతిమయ మంజుల మణిప్రసూనాలు
శాంతిపతాకలా చాచిన
చంచల కరాంచలంలో ధరించి

సుందర సుకుమార భుజవృంతాలు
సున్నితంగా పైకి సారించి
అందిస్తున్నది అందరికీ వికాసాన్ని
అధరాలమీది మధుర మందహాసాన్ని

ప్రాణాలకు ప్రాణమైన నవనవోల్లాసాన్ని-
ఉల్లంలో వెల్లివిరిసే ఉజ్వల విలాసాన్ని-

అల్లదుగో పూలతీవ
అందానికి అసలుత్రోవ.

సత్యం! మానవుడు సల్పుతున్నాడు ప్రతీక్ష
నిత్యం ఈ తీగను చూచి నేర్చుకోవాలి నవ్యదీక్ష

ఉదయశ్రీ

అచ్చమైన పూలతీవ అమాయిక రాగాలలో
వెచ్చవెచ్చని ప్రాణాల పచ్చని అగ్నిజ్వాలలో
వెలిగించాలి ఒక దీపం
కలిగించాలి చైతన్యానికి నవ్యస్వరూపం
కనపడాలి మానవ పథం
కదలాలి జీవన రథం

జగత్తుకు 'ప్రేమే' ఆద్యంతాలు కావాలి
యుగాన్ని నడిపే సారథిగా
'త్యాగం' ముందుకు రావాలి.

చావుబ్రతుకుల సంఘర్షణలో
సతమత మవుతున్న మానవులకు-
సమరాల బురదలో దిగబడి
సగం చచ్చిన మానవులకు-

ఆదర్శం పూలతీవ
అందానికి అదే త్రోవ.

# సుప్రభాతము

ఇది ప్రశాంత ప్రభాతం
ఇది సుందర సుప్రభాతం
వాన వెలిసిన అనంతరం
వచ్చిన శుభ ప్రభాతం.

ఇవిగో ఇవి రవికిరణాలు
జనతా జాగరణాలు
దివినీ భువినీ ఏకంచేసే
అరుణారుణ అవతరణాలు.

కోటబురుజు కొనగోడలపై
గొప్పగొప్ప మేడలపై
వాలుతున్నవి ఏటవాలుగా
బాలభాను‌ని కిరణాలు.

## ఉదయశ్రీ

కోవెల గోపురాలకు
కొండల శిఖరాలకు
రంగురంగుల సింగారాలు చేస్తున్నవి
ముంగిళ్ళలో బంగారాలు ఆరబోస్తున్నవి.

బాలభానుని కిరణాలు
ప్రకృతికి అలంకరణాలు.

తెల్లవార్లూ తెగ కురిసి కురిసి
తెల్లపోయిన మేఘాలు గుండె లవిసి
తారాపథంలో పడమటి తీరాన
దేరాలు వేసుకుంటున్నవి దూరాన.

అల్లారు ముద్దుల గాలిపిల్లలు
చల్లచల్లగా ప్రాకుతున్నవి
అల్లంత దూరాన్నుంచే వచ్చి
హాయి హాయిగా తాకుతున్నవి.

కళకళలాడే ఉదయశ్రీ
కమనీయ కపోలాలు
అవవి అంతటా విరజిమ్ముతున్నవి
అందాల అపరంజి పూలు.

సమూలం చిగిర్చిన
"శమూల" తరుపల్లవాలు
ఎంతో ఎఱ్ఱగా మెరుస్తున్నవి
నిట్టూర్పులకు దీపశిఖలలాగు
నిబ్బరంగా తలలాడిస్తున్నవి.

ఐనా ఈ నా హృదంతరంలో
అనుక్షణం ఒకే రీతిగా-
తేజోమయ దీపకళిక
వెలుగుతున్నది నవజ్యోతిగా.

లేదు ప్రకాశం లేదు ప్రసూనం
లేదు రాగం లేనేలేదు అనురాగం-
కేవలం ఒక ఆనందమయ అస్తిత్వం
"అహమస్మి" అన్నది
సగర్వంగా జ్వలిస్తున్నది.

చిన్నిచిన్ని పిట్టలుకూడా
గూండ్లముందుకు వచ్చివచ్చి
చిక్కని రెక్కలు విదుల్చుకుంటున్నవి
ముక్కులతో గ్రుచ్చిగ్రుచ్చి-

## ఉదయశ్రీ

గుంపులు గుంపులై గువ్వలు
గోరువెచ్చని ఊరెండలో
చేస్తున్నవి షికారు-
నింపుకుంటున్నవి తడిసిన
రెక్కల అంచుల్లో
బంగారు నీరు.

మరి నేనో!
నా అంతరంగం కూడా
ఒక వింత విహంగమై
రెక్కలు తొడుక్కొని
ఎక్కడెక్కడికో ఎగిరిపోవాలని
ఊరకే ఉబలాట పడుతున్నది.

ప్రథమ వర్షానంతరం
పృథివీ గర్భంలో నుంచి
మధుర మధుర పరీమళం
ప్రకృతి అంతటా ప్రసరిస్తున్నట్లు -
పచ్చిక బయళ్ళ పచ్చని గోరువెచ్చని
సుధాలహరిలో ఓలలాడుతూ
ప్రకాశ పుంజం పరిధిని దాటి
పరివ్యాప్త మౌతున్నట్లు-

ఉదయశ్రీ

వాన నీరు వకుళపుష్పాలతోపాటు
చెట్ల ఆకుల అంచుల్లోనుంచి
చిట పట మని
బొట్లు బొట్లుగా రాలుతున్నది
నేల పయిని.

అదుగో సూర్యభగవానుడు
అటుచూడు -
రాజవీథిలో మురికినీటిలో సైతం
ప్రతిఫలిస్తున్నాడు-
కారుమేఘాలను దూరదూరంగా
పారదోలుతున్నాడు -
పట్టణాలలో, పల్లెలలో
ప్రపంచమంతా
ప్రసరింపజేస్తున్నాడు
తన కిరణాలు -
ప్రథమ వర్షానంతరం
హర్షానికి ఆవిష్కరణాలు.
ఇదిగో ఇప్పుడు నీవు
రావచ్చు రాజవీథిలోకి
తలెత్తి ధైర్యంగా
చూడవచ్చు పైకి.

అటు తడిబట్టలు చుట్టుకొన్న
మబ్బుల బాయ -
ఇటు వరవలై ప్రవహించు
బురద నీరు -

చల్లని గాలికెరటాలతో
సరసాలాడుతూ,
సంతుష్టుడైనాడు భానుడు -
జగతికి ప్రాణమైన
సూర్య భగవానుడు.

రవి బింబం
తృణ తృణంలో
కణ కణంలో
ప్రతిబింబిస్తున్నది
"అహమస్మి" అనే తత్వం
ఆనందంకోసం
ప్రతీక్షిస్తున్నది.

• • •

# జ్యోతిర్మూర్తి

అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్లపేరు జ్యోతిర్మయి
పైగంబర్ మూసా 'తూర్' పర్వత శిఖరాగ్రముపయి
పరవశుడయి కనిన ప్రభుపు పరమశాంత కరుణామయి.

చక్కని నెలరాజు తళుకుచుక్కల శరదంబరమున
చిక్కని వెన్నెల విందులు మక్కువతో పంచువేళ
సుందరమగు 'డాల్' సరస్సునందలి పత్రపుటమ్ముల
అందపు కెరటాల నామె చిందు కలువబాల లీల.

అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్లపేరు జ్యోతిర్మయి
పైగంబర్ మూసా 'తూర్' పర్వత శిఖరాగ్రముపయి
పరవశుడయి కనిన ప్రభుపు పరమోజ్జ్వల కరుణామయి.

శ్రీమతి సీమంతసీమ చేమంతులు గురిసె నదే
సౌభాగ్యవతీలలామ సౌందర్యము మెరసె నదే;
నీల నీల మేఘమాల మేలిముసుగు తెర తొలంగ
వెలిగెడి స్వచ్ఛందోజ్జ్వల విమలాతపమో యనంగ
పండువెన్నెలందు ఆరుబయట మేడముంగిటిలో
పసిడి పళ్ళెరమున వెండి పాలగిండివలె నున్నది.
నిద్దపు కౌముది అచ్చరముద్దియ మెడలో సిగ్గుల
ముద్దె ముద్దైన పైడి ముత్తావళి నేనన్నది
అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్ల పేరు కరుణామయి.

సుందరి కనుబొమల సౌరు సోగసోయగమ్ము లూరు
ఉదయించెడి విదియనాటి కొదమ చందమామతీరు
అది ఆకాశాచల శైలాగ్రశిఖర జయకేతువు
అనురాగ తరంగిణిపయి ధనురాకారపు సేతువు
నవ నవ యౌవన సౌవర్ణ ప్రాసాదమున పేర్చి
కూర్చి సొగసు లెల్ల దిద్దితీర్చిన నీలాల ఆర్చి.
ఎక్కడికో పరువిడు సెలయేరుదాట లేడిగుంపు
ఒక్కటిగా నెగిరి దుముకు ఒయ్యారపు వంపుసొంపు
అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్ల పేరు జ్యోతిర్మయి.

నవదీప్తుల నందిన సుందరి కజ్జల నేత్రమ్ములు
మధుర మధురసప్రపూర్ణ మరకతమణి పాత్రమ్ములు
అలల వెన్నెలల మధుపాత్రల నెవడో అమరశిల్పి
చెక్కినాడు నడుమ జోడు చిక్కని తారకల నిల్పి
లేదా బాదాము గోము లీనెడు వెన్నెల దొన్నెల
రేఖాచిత్రాలు గీసి రెవరో కాటుక వన్నెల
అదికాదా అందమైన అల 'నర్గిస్' పూలపైన
వ్రాలి లేవలేవో భ్రమరాలు చిర కుతూహలాన
అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్ల పేరు జ్యోతిర్మయి.

తరుణి తళుకు కపోలాలు అరుణారుణ ఉషశ్రీలు
పండిన జిగినిండిన రసభరిత దాడిమీ ఫలాలు
సుకుమార మనోజ్ఞమూర్తి సురభిళ సౌభాగ్యవల్లి
సకల భువన మోహనముగ వికసించిన జంటపూలు
ఆ చక్కని జంటపూలు అనురాగాల స్రవంతులు
ప్రసరించెనొ ప్రక్కనున్న పద్మరాగమణికాంతులు
ఆ వెలంది కపోలాలు అగునగు పగడాలపంట
ఠీవిగ గగనాని కెగరబోవు పావురాల జంట
అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్ల పేట జ్యోతిర్మయి.

నిగ నిగ మని మెరయుచున్న నెలత మోవి సింగారము
ధగ ధగ మని వెలుగుచున్న పండువన్నె అంగారము
మధుర మధుర మధురసాలు కదలే ఒక అమృత గుళిక
ఉల్లాసపు టుడుకు రక్త మొలికే నవరత్న కళిక
శిల్పి యసామాన్య శిల్ప శేముషి కది జయపతాక
ముద్రికలో పొదుగబోవు ముద్దులొలుకు మణిశలాక
'లైలా' విరహము భరింపజాలని 'మజ్నూ' తన హృది
చీలుచుకొన ననురాగము చిందుచున్నయట్లున్నది
అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్లపేరు జ్యోతిర్మయి.

ఆమె కపోలమ్ముపైని ఆ నల్లని పుట్టుమచ్చ
సుందరి తల వెండ్రుక సుడి చుట్టుకొన్న గరుడపచ్చ
అరవిచ్చిన విరజాజుల విరిపందిరి మీదనెక్కి
చూచుచున్న దీ రాబుల్ సుకుమారి నిక్కినిక్కి
కమ్మని గంధమ్ములు విరజిమ్ము కొమ్మచివర చేరి
సొమ్మసిల్లి సొగసి పాడుచున్నది బుల్‌బుల్ కిశోరి
నాగరాజు శిరమునందు దాగియున్న మరకతమణి
కదలి జారి పడుచున్నది కాశ్మీరపు పసిడి ధరణి
అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్లపేరు జ్యోతిర్మయి.

బాల ఘుసృణ శిరోజములు పట్టుదారముల కుచ్చులు
షేలిమితీవల మెత్తని మేల్తరంపు వల ఉచ్చులు
సరసశీతలచ్ఛాయల సౌందర్యపు రహదారులు
క్రిక్కిరిసిన 'షేద' తరుల చిక్కని బారులు బారులు
బంగరు ఆర్చితలుపుల పైనెవరో కౌతుకాన
వ్రేలదీసి రీ "ముఖమల్ జాలరి తెర" అంచులాన
సంధ్యారుణ మధుమయి సంస్పర్శ సోలి సోలి యిటుల
గుమిగూడెనా తటిల్లతలు హిమాలయ స్ఫటిక తటుల
అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్ల పేరు జ్యోతిర్మయి.

చలియ స్వేద బిందులు వర్షించిన నవ హిమకణాలు
వెండి పళ్ళెమం దెవరో విరజిమ్మిన మౌక్తికాలు
సులలిత తారక జ్యోత్స్నాసుందరి సకలాంగమ్ముల
అలంకార మొనరించెను అసంఖ్యాకమగు సొమ్ముల.
శ్రీమంత మ్మగు సురుచిర సీమంతతలాన బాల
ప్రీతిమీర కైసేసెను జాతిముత్తియముల మాల
అటు నిటు చెల్లాచెదరై చిటిలిపోవ వ్యథ లెల్లను
తలవాకిటి శిల నెవరో గులకరాలు వెదజల్లెను
అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్ల పేరు జ్యోతిర్మయి.

వనజేక్షణ వక్షము యౌవనలక్ష్మీ ప్రత్యక్షము
కనక కలశ యుగ్మము నవ కౌశేయాంచల లగ్నము
కమ్మని కాబూలీ దానిమ్మగింజ లూనెనంట
చెలువుమీరు కొమ్మ నడిమి సీమరేగుపండ్ల జంట.
ఒక క్షణమ్ములోన విచ్చనున్న కమల కలికావ్వయి
మకరంద మనోజ్ఞ మధురిమలు ప్రసరించెను పయిపయి
అల్లదిగో తేజోమయి అనుపమాన శోభామయి
అల్లా పంపించిన ఆ పిల్లపేరు జ్యోతిర్మయి
పైగంబరు మూసా "తూర్" పర్వత శిఖరాగ్రముపయి
పరవశుడై కనిన ప్రభువు పరమోజ్జ్వల కరుణామయి.

• • •

# జీవన గీతము

పాలకడలిలో ప్రభవించిన హాలాహలం జీవితం
హాలాహలాన్ని దాచుకొన్న హరుని గళం జీవితం
కూతుర్ని సాగనంపే కణ్వమహర్షి గోర్వెచ్చ కన్నీరు జీవితం
రాత్రీ పగలూ ఒకేరీతిగా మ్రోతలెత్తే మున్నీరు జీవితం.

సిలువమీది క్రీస్తుప్రభువు చలువల చిరునవ్వు జీవితం
తెలవారుగట్ల తలవంచిన తెలి కలువపువ్వు జీవితం
భగవంతుడు మానవుని కిచ్చిన పరీక్షాపత్రం జీవితం
పగలు నయితం దీపం వెలిగే పల్లెటూరిసత్రం జీవితం.

గుళ్ళోకి పొయ్యే చెల్లాయి పళ్ళెంలోని నైవేద్యం వంటిది
బళ్ళోకి వెళ్ళే అబ్బాయి పలకమీది పాతపద్యం వంటిది
పగటూనిన భవిష్యత్తుతో పాణిగ్రహణం వంటిది
సగానికి పైగా పట్టిన చంద్రగ్రహణం వంటిది.

పాపలేని ఊయలను ఊచే బాలెంత కడుపుతీపు జీవితం
శాపంతో రూపుచెదే అహల్య జాలిచూపు జీవితం
చిట్టితండ్రిని నట్టేటిలో వదిలే కుంతీకుమారి బాధ జీవితం
గట్టుమీది గడ్డిపరక చెప్పిన కన్నీటి కరుణగాథ జీవితం.

అత్తవారింట్లో అడుగుపెట్టే కొత్తకోడలి అదృష్టం బ్రతుకు
మొత్తుకున్నా తెలియరాని మూగవాని అభీష్టం బ్రతుకు
వగరూ తీపీ చేదూ కలిపిన ఉగాది పచ్చడి బ్రతుకు
యుగయుగాలుగా తెగ చిక్కుబడి బిగిసిన పీటముడి బ్రతుకు.

ప్రతి మానవుని జీవితం శ్రుతికలియని ఒక వింతపాట
గతుకులలో గడ్డలలో కాలుసాగని చిక్కుబాట
ప్రతి మానవుని జీవితం చితి ఎక్కబోతున్న సీత
గతాగతాల నెత్తిమీద కాలపురుషుని కత్తిగీత

అయినా తమ్ముడూ ! జయం నీదే ! ఆత్మ విశ్వాసం విడకు
పయిన భగవంతు డున్నాడులే పయనం సాగించు భయపడకు
నీ ఆశాజ్యోతి జ్వలిస్తుంది - నీ సాధన నిలుస్తుంది
నీ తపస్సు ఫలిస్తుంది - నిజం నిజంగా గెలుస్తుంది.

# మన గురజాడ

ఎవ్వ రీ నవ్య సాహిత్య వైతాళికులు ।
ఎవ్వ రీ భవ్య సాహిత్య సంచాలకులు ।
ఎవ్వ రీ దివ్య సాహిత్య నవ నందనము
ముద్దుముద్దుగ తీర్చిదిద్దు వనపాలకులు ।।

వ్యావహారిక భాష కావాహనము పల్కి
యావదాంధ్రుల నాల్కలందు తేనెలు చిల్కి
అందాల ఆణిముత్యాల సరముల కల్పి
ఛందాలు కూర్చు స్వచ్ఛంద కవితా శిల్పి ।।

హృదయమున సరిక్రొత్త ఊహ రేకెత్తించి
ఉదయమును మేల్కొల్పు ఉత్తమ కళావేత్త
చకచకా గతము చీల్చుకు భవిష్యత్తులో
కాలుపెట్టిన నిత్యకల్యాణ యుగకర్త ।।

హాస్య రసమును ప్రజల ఆస్యాలపై నిలిపి
లాస్యాలు నేర్పు "కన్యాశుల్క" నిర్మాత
జగ మెఱుంగుల నవ్యసాహిత్య మందించు
జగ మెఱింగిన ప్రజా సారస్వత విధాత ॥

తళుకు చెక్కిళ్ళ పుత్తడిబొమ్మ పూర్ణమ్మ
చిన్ని గుండెలలోని కన్నీటి కెరటాలు
పలుకు పలుకున పొంగి పైపైకి ప్రవహింప
తిలకించి ప్రకృతియే పులకించిపోయింది ॥

తలపోసి కొత్తపాతల మేలు కలయికను
కొలబోసి పరిపాళ్ళ కలబోసిన యశస్వి
ప్రజలలో నిజదేశభక్తి రేకెత్తించి
ధ్వజమెత్తి చెడుగుపై దండెత్తిన మనస్వి ॥

ఎవరొహో యీ నవ్య కవితా భగీరథులు ।
ఎవ రీ నవీన మానవతా మహారథులు ।
జవసత్వముల పాంచజన్యంబు పూరించు
నవ కురుక్షేత్ర విప్లవ విజయసారథులు ॥

# విశ్వ వైతాళికుడు

[ స్టాలిన్ మహాశయుని మరణవార్త విని ]

స్తంభించింది అకస్మాత్తుగా
జగత్తంతా ఒక్క క్షణం
జారింది లోకం చెక్కిళ్ళపై
గోరువెచ్చని అశ్రుకణం

నిలబడింది నిమేషకాలం
నిర్నిమేషంగా ఓల్గానది
కరగి నీరై గట్లు లెంచుకొని
పొరలిపోయింది జనతాహృది

తలవంచింది దీనంగా
మౌనంగా అరుణపతాకం
సమర్పించింది శ్రద్ధాంజలి
సమస్త ప్రజానీకం

ఉదయశ్రీ

కలాన్ని చుట్టుకొని ముందుకు
కదలలేకున్నది కవిత
జాలిగా నిట్టూర్చింది
శాంతివాడిలో మానవత

పదే పదే కదలనే
కదలదా పెదవుల జంట
పదే పదే మ్రోగనే
మ్రోగదా గుడిలో గంట

కదలక కదలక కదిలిందో
ప్రపంచమంతా నిశ్శబ్దం
మ్రోగక మ్రోగక మ్రోగిందో
ముందుకు సాగుతుంది శతాబ్దం

ఆయన వెలిగించిన ఆశాజ్యోతి అడ్డగిస్తుంది అశాంతిని
ఆయన ఆలపించిన క్రాంతిగీతి ప్రసరిస్తుంది ప్రశాంతిని
రైతుకు పట్టం కట్టిన రష్యాభాగ్యవిధాత అతడు
టాలీకి కిరీటం పెట్టిన స్టాలిన్ మహానేత యతడు

# రుద్రమదేవి

నాందీగీతి

ఏకశిల కోటలోని ప్రత్యేకశిలయు
ధీర గంభీర గతుల రాత్రింబవళ్ళు
గాన మొనరించు గద్గద గళము నెత్తి
రాణి రుద్రమ్మ శౌర్య ధైర్యాల గాథ ।

బృందగానం

రమణీయ మహేంద్రోజ్వల రాజ్యశ్రీ ఓరుగల్లు
కమనీయ అనల్పశిల్ప కావ్యశ్రీ పుట్టినిల్లు
కాకతి ప్రోలుని శౌర్య శ్రీకారం ఓరుగల్లు
అరి విజయమునందు దాని కదియే సరియనంజెల్లు
కాకతి గణపతి ధైర్య ప్రాకారం ఓరుగల్లు
కురుక్షేత్ర సమరానికి గురిపెట్టిన నరునివిల్లు
రుద్రమదేవీ వైభవ భద్రపీఠి ఓరుగల్లు
వీరవారి పేరు విన్న వైరుల గుండెలు "గుభిల్లు".

స్వామి స్వయంభూ కరుణా సౌభాగ్యం ఓరుగల్లు
విశ్వేశ్వర దేశికు దీవెన లెంతయు నుల్లసిల్లు
వర వరాహ జయకేతువు చిరుగంటల ఘల్లుఘల్లు
ఆలకించు శాత్రవ నివహాల గుండె "జల్లు జల్లు"

సంగీతిక

తెలుగు దేశము నోరుగలు రాజధానిగా
పాలించుచుండె గణపతిదేవ భూవిభుడు;
సామంత మండలేశ్వరులు కానుక లంప
వంది మాగధులు కైవారముల్ గావింప.

బృందగానం

జయ గణపతి చక్రవర్తి ॥ జయజయ కారుణ్యమూర్తి ॥
జయజయజయ దశదిశాంత సమాక్రాంత చారుకీర్తి ॥
జయ కాకతికులభూషణ ॥ జయజయజయ మృదుభాషణ ॥
జయ ప్రమథ గణావతార ॥ శరణాగత పరిపోషణ ॥
జయజయ చలమర్తిగండ ॥ జయజయ కదనప్రచండ ॥
జయజయజయ జయలక్ష్మీ సంశోభిత బాహుదండ ॥
జయజయ ధర్మోద్ధారక ॥ జయజయ పరబల సాధక ॥
సదా స్వయంభూ దైవత పదాంభోరుహారాధక ॥

జయము పరమమాహేశ్వర ! జయిము రాజరాజేశ్వర !
కువలయ భుజదండ ! అనుమకొండ పురవరాధీశ్వర !

సంగీతిక

గణపతిదేవ మహీపతి గాదిలి పుత్రిక రుద్రమ
జనకునివలె శౌర్య ధైర్య సాహసములకు సముద్రము
పుత్రనిర్విశేషముగా భూపతి పుత్రిని పెంచెను
శస్త్రశాస్త్ర సకలకళా సంపన్నను గావించెను.

అశ్వారోహణమునందు ఆరితేరె రుద్రమాంబ
ఖడ్గయుద్ధమున నిపుణత గడియించెను రుద్రమాంబ
మృగయాఖేలనమునందు మేటియయ్యె రుద్రమాంబ
రాజనీతి శాస్త్రరీతి తేజరిల్లె రుద్రమాంబ.

చతురుపాయముల నెంతయు చతురురాలు రుద్రమాంబ
ధనుష్కళా కౌశలమున దక్షురాలు రుద్రమాంబ
శత్రువ్యూహచ్ఛేదన శక్తి గాంచె రుద్రమాంబ
పరదుర్గ విభేదనమున పాండితి గనె రుద్రమాంబ.

అన్ని గుణములు తనకు అనురూపురాలైన
పుత్త్రికనువీక్షించి పొంగె రోజురోజు
తన యనంతరము రుద్రమ నాంధ్రసామ్రాజ్య
సింహపీఠిని ప్రతిష్ఠింప నెంచెను రాజు.

బృందగానం

కదలివచ్చు హిమాలయము కాకతిగణపతిదేవుడు
హిమాలయము ననుసరించు ఉమాదేవి రుద్రమాంబ.
కడలంటే పాలకడలి కాకతిగణపతిదేవుడు
పాలకడలి ననుసరించు పద్మాలయ రుద్రమాంబ.

కీర్తితపోనిధి సాత్యవతేయుడు గణపతిదేవుడు
సంపూర్ణ మహాభారతసంహిత శ్రీరుద్రమాంబ.
కాలెత్తు వీరరసము కాకతిగణపతిదేవుడు
వీరము వెన్నంటివచ్చు విజయశ్రీ రుద్రమాంబ.

తేజోమయుడగు దినకర దేవుడు గణపతిదేవుడు
తరుణ తరణి అరుణారుణ కిరణావళి రుద్రమాంబ.
ఏకైక శ్రీచక్రము కాకతిగణపతిదేవుడు
చక్రేశ్వరి త్రిపురేశ్వరి జగదంబిక రుద్రాంబిక.

ఆంధ్రసామ్రాజ్య భద్రసింహాసనమున
వెలుగులు వెలార్చె సరిక్రొత్త తెలుగురాణి;
వేదవిదుల మంత్రప్రపూతోదకముల
చెలగె రుద్రాంబ పట్టాభిషేక మహము.

రవి సహస్ర ప్రభాసి చిరత్న రత్న
కాంచన కిరీట మది శిరోగ్రమున మెఱసె;
సమద శత్రుభయాంకరోజ్జ్వల కరాళ
కాళి కరవాల మది కరాగ్రమున నొరసె.

బృందగానం

కాకతి గణపతి చక్రవర్తి చిర
కాల కాంక్షలే నిండినవో
ఏకశిలా సామ్రాజ్యలక్ష్మి కా
వించిన తపములె పండినవో

విశ్వేశ్వర దేశికుల ప్రసాదము
విజయ కాంతులను పంచినదో
శాశ్వతమై శివదేవుల ప్రతిభా
సంపద శుభములు నించినదో

తెలుగుతల్లి గౌరవ శిఖరమ్ముల
తేజోరేఖలు మెఱసినవో
తెలుగురాణి రతనాల మౌళిపై
దివ్యాశిస్సులు కురిసినవో

ఆంధ్రశిల్పకళ అందచందములు
ఆశాంతమ్ముల వెలిగినవో
ఆంధ్రవీర భుజశౌర్య దీధితులు
అఖండముగ మనగలిగినవో

సంగీతిక

శ్రీ స్వయంభూ స్వామి శిరసుపై సురగంగ
రంగత్తరంగమై పొంగి పొరలెను నేడు
ఏకశిలాపురీ ప్రాకార శిఖరాల
జయలక్ష్మి లలిత లాస్యము సల్పినది నేడు.

రామప్పగుడిలోని రమణీయ శిల్పాలు
పారవశ్యము నంది పల్లవించెను నేడు
ఏకవీరాదేవి శ్రీకంఠ మాలికా
మందారములు మధువు చిందించినవి నేడు.

వేయి స్తంభాల కోవెలలోని ప్రతి రాయి
తీయ తీయని కలల తేలిపోయెను నేడు
ఆంధ్రసమ్రాజ్ఞి రుద్రమ భద్రపీఠిపయి
కొలువుసింగారమై కూర్చుండె నీనాడు.

ఉదయరవిప్రభల ముదము నొందె ప్రజాహృదబ్జములు
సొదలం బడె చూడలేని చుప్పనాతి దివాంధములు.

మురారి హరిహరు లిరువురు మూతులు బిగియించినారు
దురంత దుఃఖముపాలై ద్రోహము మది నెంచినారు.

రాజ్యమునకు మేమే వారసుల మంచు చాటినారు
కుటిలమతులు లోలోపల కుతంత్రములను మీటినారు.

దుష్టులైన విద్రోహులతో తమ చేతులు కలిపిరి
సామంతులలో కొందరు స్వామిద్రోహము సలిపిరి.

ఆలోకించిరి శివదేవామాత్యులు పరిస్థితిని
అంపించిరి జైత్రయాత్రకై రాణిని త్వరితగతిని.

ఉదయశ్రీ

## సంగీతిక

ఆంధ్రేశ్వరీ మహోదగ్ర భేరీధ్వనుల్
దిగ్గజమ్ముల చెవుల్ దిమ్మెక్కఁజేసినవి

రుద్రమాంబా రుషారుణ దృగ్దృగంతాలు
దిగ్దిగంతాలు నవదీప్తి లెగజిమ్మినవి

వీరనారీ ఖడ్గ ధారా ప్రవాహాలు
వైరిరాజన్య సైన్యముల ముంచెత్తినవి

కాకతి సమ్రాజ్ఞి గజవాజినివహాలు
వివత విరోధి శీర్షము కాలరాచినవి

ప్రళయకాల మహోగ్ర భానుకిరణాల వలె
కల్పాంత కుపిత సాగర తరంగముల వలె

సంవర్త సమయ ఝంఝూమారుతాల వలె
విలయ రుద్ర కరాళ వికట నటనాల వలె

కాకతీయ బలాలు కదలినవి ముందునకు —
ఏకశిల సైన్యాలు దూకినవి ముందునకు —

ఉదయశ్రీ

బృందగానం

సాగిందదిగో జైత్రరథం ! శాంతిదేవతా చైత్రరథం !!
విహాయసంలో వెలుగులు నింపుచు మహేంద్రజననీ మనోరథం
వీరదుందుభుల ధణంధణలతో విజయకింకిణుల ఘణంఘణలతో
శూరభటుల హుంకారమ్ములతో వారణగణ ఘీంకారమ్ములతో

పూవులు చల్లగ పుణ్యపురంధ్రులు జేపెట్టగ మూడుకోట్ల ఆంధ్రులు
దీవెన లీయగ దేశికచంద్రులు సేవింపగ సామంతనరేంద్రులు
గుండామూకల గుండియ లదరగ కుటిలవర్తనుల కోర్కెలు చెదరగ
ఘనవరాహ లాంఛన ప్రభావళి కనుగొని శత్రుల హృదయము బెదరగ.

సంగీతిక

తెలుగురాణి కరాన వెలుగు పచ్చలబాకు
నిద్రపోయెను ప్రజావిద్రోహి వక్షముల
తెలుగురాణి శిరాన వెలుగు కల్కితురాయి
మిరుమిట్లు గొనె స్వార్థపరుల కన్నులలోన

తెలుగురాణి గళాన వెలుగు ముక్తామాల
తూగాడె జయలక్ష్మి కౌగిలింతలలోన
తెలుగురాణి పదాన వెలుగు మణినూపురము
మ్రోగె వైరిహృన్మందిరమ్ములలోన

కేసి నాయకుల రాకాసి కోరలు పీకి
        భల్లాల వల్లభు పండ్లు రాల్చి
పాండ్యరాజుల పంచబంగాళ మొనరించి
        చోళభూవరుల గగ్గోలుపరచి
కల్యాణదుర్గేశు గర్వమ్ము పోకార్చి
        పూగినాటి నృపాలు పొగరణంచి
నాగదేవుని బట్టి నలినలిగా గొట్టి
        కందవోలునరేంద్రు క్రిందుసేసి

వీరనారీశిరోమణి భారతీయ
గౌరవపతాక రుద్రాంబికా మతల్లి
విజయదుందుభి మ్రోగించి ప్రజల నేలె
దేశమందెల్ల సుఖశాంతి తేజరిల్ల.

హరిహర మురారిదేవుల దురుపదేశ
దుర్విషము నెత్తికెక్క ఆంధ్రోర్వీమీద
ఏడులక్షల సేనతో నెత్తివచ్చె
దేవగిరివల్లభుడు మహాదేవరాజు.

## సంగీతిక

దండెత్తి వచ్చు నుద్దండవైరిని గాంచి
నిండు ధైర్యమ్ముతో నిలచె రుద్రమదేవి
శేముషీనిధులైన శివదేవమంత్రులను
పిలిపించి యోజనల్ సలిపె రుద్రమదేవి.

విశ్వాసపాత్రులను వీరసామంత భూ
పతుల సాయము పిల్వబంచె రుద్రమదేవి
కోటబురుజులపైన మేటి మగటిమి గల్గు
ఉద్దండ భటుల కాపుంచె రుద్రమదేవి

ఆంధ్ర పౌరుషము చిందాడు కాకతి చమూ
నాయకులతో దండు నడిపె రుద్రమదేవి
దేశరక్షణ మహోద్దేశ సిద్ధికి తెల్గు
బిడ్డలను చేయెత్తి పిలిచె రుద్రమదేవి.

★

లెండు లెండు లెండోయ్ ! లేలెండోయ్ !
రండు రండు రండోయ్ ! రారండోయ్ !
గాండీవమ్ములు గదాదండములు
తాండవించు దోర్దండమ్ములతో.

తెలుగుతల్లి ఎలుగెత్తి బిడ్డలను
దేశరక్షణకు పిలిచిందోయ్
దివ్యమైన సంభావ్యమైన క
ర్తవ్యం ముందర నిలిచిందోయ్.

సాటిలేని ముక్కోటి ఆంధ్రు లొక
త్రాటిమీదనే నడవాలోయ్
గోటమీటి రిపుకోటి "నోరుగల్
కోట" కీర్తి నిలబెట్టాలోయ్.

ఖండనమున చండప్రచండ మా
ర్తాండమూర్తులై వెలగండోయ్
కండ క్రొవ్వుతో దండెత్తిన యీ
మొండికిఖండుల చెండాడండోయ్.

సంగీతిక

జాతీయకేతన శ్వేతవారాహోగ్ర
దంష్ట్రాప్రభలు మింట తాండవించినయట్లు
శ్రీస్వయంభూస్వామి చికిలి చిచ్చుఱకన్ను
చటుల కాలానలచ్ఛటలు గురిసినయట్లు

ఏకవీరాదేవి భీకరభ్రుకుటీ త
రంగ భంగిమము లుప్పొంగి పొరలినయట్లు
కాకతమ్మ కరాళ కంఠహుంకారాలు
విశ్వరూపముదాల్చి వెల్లివిరిసినయట్లు —

కరము తళతళ మెరయు కఱకు ఖడ్గాలతో
రగిలి భగభగమండు రౌద్రరూపాలతో
దెసల దిగమ్రింగు సుద్రిక్త భావాలతో
చెవులు బ్రద్దలు సేయు సింహనాదాలతో

కాకతీయదళాలు కదలినవి ముందునకు
ఏకశిల సైన్యాలు దూకినవి ముందునకు -

రుద్రాంబ ప్రళయ సముద్ర వీచికభంగి
మించి శత్రుల నాక్రమించి ముంచెత్తినది

రుద్రాంబ నిర్నిద్ర భద్రకాళిక భంగి
చెలరేగి శత్రువుల చించి చెండాడినది

రుద్రాంబ లయకాలరుద్ర దంష్ట్రిక భంగి
మెఱసి శాత్రవుల బిట్టొరసి భయపెట్టినది

రుద్రాంబ ఝంఝా మరుద్రథోద్ధతి పొంగి
కవలి శాత్రవుల గ్రక్కదలించివేసినది.

కోట పట్టుకొనఁగ కొండంత ఆశతో
అరిగినట్టి దేవగిరివిభుండు
శోకమూడిచి ఓడి కాకతి రుద్రమ్మ
ముందు శిరమువంచి "బంది" యయ్యె.

*

"అపరాధము అపరాధము అమ్మా రుద్రమదేవీ ।
బుద్ధి బుద్ధి హద్దు దాటబోనిక రుద్రమదేవీ ।
కోటి సువర్ణమ్ము లిచ్చుకొందును రుద్రమదేవీ ।
ప్రాణభిక్ష పెట్టుమమ్మ రాణీరుద్రమదేవీ । "

*

తప్పు క్షమియించి ముద్రలు కోటి గ్రహియించి
విడిచిపుచ్చెను రిపుని వీరరుద్రమదేవి
సైనికుల కెల్ల వజ్రాలు వేనకువేలు
కానుకల పంచినది రాణి రుద్రమదేవి.

ప్రశాంత గంభీరమయ్యె విశాలాంధ్ర సామ్రాజ్యం
కందోయికి విందుచేసె కాకతీయ సామ్రాజ్యం
వెలుగువెల్లువలు నింపెను తెలుగురాణి సామ్రాజ్యం
"భారతి గౌరవ పతాక" ఓరుగల్లు సామ్రాజ్యం.

• • •

# అమరావతి

అందచందాలు చిందాడు బౌద్ధస్తూప
శిల్ప లక్ష్మి స్మిత శ్రీలయందు
శాతవాహన మహాచక్రవర్తుల ఆంధ్ర
జాతీయ కేతనాంచలములందు

ఖండ ఖండాంతరాగత మహాయాన బౌ
ద్ధాచార్య వాక్ ప్రవాహములయందు
అమరేశ్వరస్వామి ఆలయమ్మున మ్రోగు
కంచుఘంటల ఘణంఘణలయందు

విశ్వవిద్యాలయాంగణ వేదులందు
బౌద్ధ వైదిక మత కరస్పర్శలందు
"మూడుపూ లారుకాయలై" ముద్దులాడె
దిగ్దిగంతాల అమరావతీ ప్రశస్తి.

• • •

# శ్రీ కృష్ణదేవరాయలు

ఆముక్తమాల్యదా సీమంత శిఖమీద
చేమంతి దండతో చెలిమిచేసి
మాలదాసరి జగన్మంగళకైశికీ
గానప్రవాహన స్నానమాడి
విష్ణుచిత్తుని యింట వైష్ణవోత్తములకు
శాకపాకంబుల చవులు చెప్పి
పాలరా సోపానపంక్తి రాయంచ తె
క్కల కొన పసుపు బంగారు దిద్ది

దేవళము గూండ్లలో కూర్కు పావురాల
మేలి చిఱుగంట రవళిచే మేలుకొల్పి
రాయదేవేంద్ర ! నీ కళారాజ్యలక్ష్మి
తెలుఁగు సాహితి కలదాఁక వెలుఁగుఁగాక !!

. . .

# సత్యం శివం సుందరమ్

"కళ కళకోసమే" అంటుంది ఒకపక్షం.

"కళ సమాజంకోసం" అంటుంది మరోపక్షం.

వాస్తవానికి ఈ రెండు పక్షాలూ ప్రతిపక్షాలు కావు.

కళ కళగా జీవించాలంటే ముందుగా అది సత్యం సుందరం కావాలి అప్పుడే అది ఆనందాన్ని ఇవ్వగల్గుతుంది. అందంతోపాటు సందేశం కూడా ఉంటే ఇక చెప్పేదేముంది! అది శివత్వాన్ని సైతం సంతరించుకుని ఉత్తమోత్తమంగా విరాజిల్లుతుంది. ఇందువల్ల సత్యసౌందర్య రహితంగా గీసిన గీతలూ, వ్రాసిన వ్రాతలూ కావ్య మనిపించుకోవనీ, సత్యమూ సుందరమూ శివమూ ఐనది ఉత్తమోత్తమ కావ్యమనీ, తేలింది.

అవంతిసుందరి సౌందర్యంలోనేకాక సాహిత్యంలోసైతం సాటి లేని వధూటి. ఆమె "కావ్యమీమాంస" అనే అలంకారశాస్త్రం రచించిన ఆచార్య రాజశేఖరుని అర్ధాంగలక్ష్మి.

ఒకనాడు రాజశేఖరుడు అవంతిసుందరికి ఒక దంతపుపెట్టెను బహూకరిస్తూ అన్నాడు: "నీ పుట్టినరోజు కానుక ఈ పెట్టెలో ఉన్నది. పెట్టెపైన ఉన్న సర్పమూ శివుడూ ఆంజనేయుడూ లోపలఉన్న వస్తువుకు కాపలా కాస్తున్నవి. ఈ బొమ్మలు ఆధారంగా ఈ పెట్టెలో ఉన్న వస్తువేమిటో కనుక్కోవాలి."

అవంతి రవంత నవ్వింది. పెట్టెను చేతిలోకి తీసుకుంది. ఆలోచింపసాగింది ....

మొదటిబొమ్మ పాము. పాము దేనిని హరిస్తుంది? వాయువును. వాయువు ఎందుకోసం వస్తుంది? పరిమళంకోసం. పరిమళం ఎక్కడ

ఉంటుంది? పుష్పంలో. కనుక ఈ పెట్టెలో ఉన్నది పుష్పం కావాలి. మరి ఏ పుష్పమై ఉంటుంది? రెండోబొమ్మ శివుడు. శివుడు ఎవరిని నిరోధిస్తాడు? మన్మథుణ్ణి. ఆ పుష్పబాణుడికి ఏ పుష్పాలు కావాలి? అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం. ఈ ఐదింటిలో ఏదో ఒకటి ఇందులో ఉండితీరాలి. మూడో చిత్రం హనుమంతుడు. హనుమంతుడు ఎవరిని అడ్డగించాడు? ఉదయించే సూర్యుణ్ణి. సూర్యుడికి ఏ పుష్పం ఇష్టం? అరవిందం - అంటే కమలం. అవును కమలం....

అవంతిసుందరి ముఖకమలం వికసించింది.

"కనుక్కోగ్గమంటారా!"

"అవశ్యం."

"ఈ పెట్టెలోది తామరపూవు."

"మేలు మేలు! నీ కుశాగ్రబుద్ధికి కోటికోటి ధన్యవాదాలు."

రాజశేఖరుడు పెట్టె తెరచి అందులోని కాంచన కమలాన్ని తీసి చూపించాడు.

"ఎంత బాగుంది!"

"నీ బుద్ధికంటేనా!" అని ఆ కమలాన్ని ఆమె కబరీభరంలో అలంకరిస్తూ "ఈ సువర్ణ కమలానికి సుగంధంకూడా ఉంటే ఇంకా ఎంత బాగుండేదో!" అన్నాడు అతడు.

"అవును; అందమైన కావ్యానికి సందేశంకూడా తోడైనట్లు" అన్నది ఆమె.

మనం పై వాక్యాన్ని ఇలా త్రిప్పి చెప్పుకోవచ్చు—

"అందమైన కావ్యానికి సందేశంకూడా తోడైతే బంగారానికి పరిమళం అబ్బినట్లుగా ఉంటుంది."

— కరుణశ్రీ

# శ్రీ ని వా సో దా హ ర ణ ము

## ప్రథమావిభక్తి

(పద్యము)

శ్రీశతపత్రనేత్ర విలసిల్లు తటిల్లతగా, దరస్మిత
శ్రీ శశిరేఖగా, సుధలు చింద్దెడి చూడ్కులు పూలవానగా,
ఆశలు పండు శేషగిరియందు వసించిన నీలమేఘసం
కాశుఁడు వేంకటేశుఁడు జగమ్ముల నేలు స్వయంప్రకాశుఁడై.

(కరిక)

ఉపనిషన్మానససరస్సున నుదయమందిన వారిజాతము
అపరిమితముగ భక్తిముక్తుల ఆశ్రితుల కిడు పారిజాతము
రూపములు పది దాల్చి కుమతుల రూపుమాపిన దేవదేవుఁడు
ఆపదలు పోకార్చి సుమతుల నాదుకొను కరుణాస్వభావుఁడు
వైజయంతీ దివ్యపరిమళ వాసితం బగు ప్రభువు వక్షము
శ్రీ జయాభ్యుదయోన్నతులు దయసేయు తత్కరుణాకటాక్షము
ఏడుకొండలసామియై యీరేడు భువనము లరయు వేలుపు
ఏడుగడయై భక్తజనముల నేలుకొను తరిగట్టుదాలుపు.

(ఉత్కళిక)

వాయుజుని సంధించి ప్రియమున - తోయధిని బంధించి రయమున
దానవుని వధియించి దురమున - జానకిని గ్రహియించి కరమున
శోభనము లొనగూర్చువాఁడట వైభవము వెలార్చు ఱేఁడట
నీలజలద తనూవిలాసుఁడు జాలిగుండెల శ్రీనివాసుఁడు.

ద్వితీయావిభక్తి

(పద్యము)

నల్లనివాని, మేలి చిఱునవ్వులవాని, సురారి గొంతుకల్
గిల్లెడువాని, కాంతు లొలికించు కనుంగవవాని, చూడ్కికిన్
జల్లనివాని, గంటి విలస న్నవరత్న కిరీట సుప్రభా
వేల్లితమౌళివాని, ప్రభవిష్ణువిలాసుని శ్రీనివాసునిన్.

(కళిక)

"స్వామి పుష్కరిణి" పార్శ్వమున వెలసినవాని
ప్రేమతో గొంతెత్తి పిలువ పలికెడువాని
సోమకుని తెగటార్చి శ్రుతులు తెచ్చినవాని
సామగానము మెచ్చి జయము లిచ్చినవాని
దేవేంద్రు దుండగము త్రిప్పికొట్టినవాని
గోవర్ధనము నెత్తి గొడుగు పట్టినవాని
రంగారు నూర్ధ్వపుంద్రముల ఫాలమువాని
బంగారు జలతారు పట్టుచేలమువాని.

(ఉత్కళిక)

అందగా తన్నెంచి – కొండ లధిరోహించి
రెండుచేతులు చాచి – చంపమిదు ప్రజఁ జూచి
గుండియలు పులకించి – దుండగములు క్షమించి
నిండు కనికర మూని – దండ చేర్చెదువాని.

## తృతీయావిభక్తి

(పద్యము)

చనుఁడి కొండకు; "స్వామిపుష్కరిణి"లో స్నానమ్ము గావింపుఁడీ;
జనులారా! కనులార గాంచుడి విభుఁ; సాష్టాంగముల్ సల్పి వ
చ్చిన యిక్కట్టులు విన్నవించుకొనుఁడీ; శ్రీ శేషశైలేశుతో,
ఘనతేజోనిధితో, జగత్ప్రభువుతో, కారుణ్యవారాశితో.

(కళిక)

ముజ్జగాలు బొజ్జనిముడు ముద్దులొలుకు రూపుతోడ
సజ్జనులను బుజ్జగించు చల్లనైన చూపుతోడ
ఉరమునందు వలపు గొలుపుచున్న వైజయంతితోడ
శిరమునందు తళుకు లొలుకు స్నిగ్ధమకుట కాంతితోడ
కనకకాంతి కలిత లలిత కటక కంకణములతోడ
మణిమయూఖ సహిత మహిత మకరతోరణములతోడ
చెలువుమీఱ కొలువుదీరు శ్రీనివాసమూర్తితోడ
పులకరించి పలుకరించు భువనచక్రవర్తితోడ.

(ఉత్కళిక)

ఉభయ పార్శ్వములను గ్రాలు - "అభయ" "వరద" శుభకరాలు
ఆర్తజనుల భయము దీర్ప - స్ఫూర్తి నొసఁగి జయము గూర్ప
తాల్చి శంఖ చక్రములను - చీల్చి క్రూరవిక్రములను
జగతి నెసఁగు విభునితోడ సుగతి నొసఁగు ప్రభునితోడ.

చతుర్థీవిభక్తి

(పద్యము)

విరికై తుమ్మెదలీల నా హృదయ మువ్విళ్ళూరు నెల్లప్పుడున్
హరికై, సత్కరుణా సుధాలహరికై, ఆనందమందాకినీ
ఝరికై, నిత్య నివాసశేషగిరికై, సంతృప్తదైత్యేభ కే
సరికై, సుందర మందహాస సుషమా సౌభాగ్య సంచారికై.

(కళిక)

సనక సనందన సంసేవ్యునకై
జన గణ మంగళ సంభావ్యునకై
వకుళమాలికా వరపుత్త్రునకై
సకల జగన్నుత చారిత్రునకై
దళదంభోరుహ దళనయనునకై
బలి నణఁచిన ఫణిపతిశయనునకై
శరణాగత శుభ సంక్రమణునకై
కరి నేలిన వేంకటరమణునకై.

(ఉత్కళిక)
మ్రొక్కిన వారిని - చక్కని దారిని
నిరతము నడపుచు - దురితము లడపుచు
చిక్కులు దీఱఁగ - మక్కువ మీఱఁగ
అరసెడు దొరకై - గిరిదేవరకై

పంచమీవిభక్తి

(పద్యము)
నవనళినాయతాక్షు వలనన్ జయముల్ సమకూరు మాకు; మా
నవ గణ కల్పకమ్ము వలనన్ ప్రియముల్ చెలువొందు మాకు; దా
నవ దళ దర్పహారి వలనన్ భయముల్ లయమౌను మాకు; ఈ
"నవరస చక్రవర్తి" వలనన్ ఫలియించును మా కభీష్టముల్.

(కళిక)
పద్మావతీదేవి ప్రాణప్రియుని వలన
పద్మజార్చిత పాదపద్మద్వయుని వలన
బ్రహ్మాండ పూర్ణ శోభా సముద్రుని వలన
బ్రహ్మోత్సవానంద పట్టభద్రుని వలన
పెద తిరుమలాచార్య పెన్నిధానము వలన
సదనురాగ రసార్ద్రసన్నిధానము వలన
గణనీయ కల్యాణ కాంతిమండలు వలన
మణి ఖచిత సౌవర్ణ మకరకుండలు వలన.

(ఉత్కళిక)

రాకేందుతేజునకు - ఆకాశరాజునకు
గారాబముల పట్టి - కోరి చేకొనినట్టి
దివ్యసౌందర్యమ్ము - నవ్య లావణ్యమ్ము
కల మనోహరు వలన - కలి తమోహరు వలన.

షష్ఠీవిభక్తి

(పద్యము)

ధిక్కారం బొనరించు ఖేదము; ప్రసాదించున్ ప్రమోదమ్ము: పే
రెక్కెన్ స్వామి "ప్రసన్న కల్పతరువై" యీరేడు లోకాలలో;
దక్కెన్ నా కిటు; మ్రొక్కుకొందు జగదంతర్యామికిన్; పెక్కులౌ
చిక్కుల్ దీర్చు విహంగగామికి; మహాశేషాచలస్వామికిన్.

(కళిక)

పాలకడలి తరంగములపయి పవ్వళించిన శేషశాయికి
మేలుగా అలమేలుమంగను నేలుకొను కళ్యాణదాయికి
తమ్ములకు కుముదమ్ములకు ప్రమదమ్ము నిడు కందోయివానికి
అమ్మ పమతో సుప్రభాతము లందుకొను రసరాజధానికి
పేరురంబున పసిఁడి కాసులపేరు ధగధగ మెఱయు శౌరికి
తారహారములను గళంబునఁ దాల్చి వెలిఁగెడి చక్రధారికి
చెలులతో శ్రీకృష్ణరాయల సేవ లందు జయిప్రదాతకు
ఎలమిమై తరిగొండ వేంకమ నేలుకొన్న త్రిలోకనేతకు.

(ఉత్కళిక)

గుడ్డివారికి కన్నులిచ్చుచు - వడ్డికాసుల కిచ్చ మెచ్చుచు
నిత్యపూజలు స్వీకరించుచు - అత్యయములు నిరాకరించుచు
అందమగు ఆనందనిలయము - నందు వెలసిన కాంతివలయము
కందళించిన కల్పశాఖకు - మందహాస మనోజ్ఞరేఖకు.

సప్తమీవిభక్తి

(పద్యము)

ఉ॥ హృదయంబు నవ్యనళినేక్షణ వీక్షణ దివ్యదీప్తి స
మ్మోహితమై నిమగ్న మగుచున్నది నా ప్రభునందు, నా జగ
న్మోహను నందు, నా మధుర ముగ్ధకపోలునియందు, నా చతు
ర్బాహుని యందు, నా పతితపావనమంగళమూర్తియందునన్.

(కళిక)

జగములను సృజించి పెంచి సంహరించు ప్రభునియందు
భృగుమహర్షి గర్వ మపహరించు విశ్వవిభునియందు
అన్నమయ్య మృదులశయ్య నవధరించు సదయునందు
విన్నపములు వీనులార విను రసార్ద్రహృదయునందు
మొగమునందు నగవు చిందు ముగ్ధ మధుర మూర్తియందు
నిగమవీథులందు మెఱయు నిత్య సత్య కీర్తియందు
గగనవాహినీ మరంద కలిత పద సరోజునందు
సుగతి నొసఁగి తమము లణఁచు సూర్యకోటితేజునందు.

(ఉత్కళిక)

అల వికుంఠపురిని వదలి - కలశ జలధి నుండి కదలి
దీనజనుల దిగులుఁబాప - మానవులకు వెలుఁగుఁ జూప
వేంకటాద్రి నవతరించి - కింకరుల ననుగ్రహించి
సేవలందు దేవునందు - పావనప్రభావునందు.

సంబోధన ప్రథమావిభక్తి

(పద్యము)

వేదోద్ధారణ ! మందరాభరణ ! పృథ్వీధర్మనిర్మాణ ! ప్ర
హ్లాదత్రాణ; బలిప్రతారణ ! నృపాహంకారనిర్వాపణా !
వైదేహీరమణా ! ధనంజయజయవ్యాపారపారీణ ! క్షో
ణీదివ్యత్కరుణా ! తమోహరణ ! తంద్రీ ! శ్రీనివాసప్రభూ !

(కళిక)

ఆపద మొక్కుల ఆశ్రితబంధూ !
కాపాడం గదె కరుణాసింధూ !
ఆలింపుము మొఱ ఆదివరాహా !
పాలింపుము ప్రియభక్తసమూహా !
అదుకొనవయా ఆనందమయా !
చేదుకొనవయా శ్రితముని నిచయా !
మందర మెత్తిన మా యిలువేల్పా !
వందనములు గొను వలమురితాల్పా !

(ఉత్కళిక)
నిస్తులదీక్ష । కౌస్తుభవక్ష ।
త్రిజగన్మోహన । ద్విజరాడ్వాహన ।
అరిజనమర్దన । శరణు జనార్దన ।
పంకజనయనా । వేంకటరమణా ।

సార్వవిభక్తికము

నీ వానంద రసైక మూర్తివి । శ్రుతుల్ నిన్నుం బ్రశంసించు । నీ చే వెల్గున్ జగమెల్ల । నీకొఱకు పుష్పించున్ త్రయీవల్లికల్ । నీవల్లన్ సిరు లబ్బు । నీకు సరి లేనేలేరు । నీయందె నా భావం బైక్యమునందె । భక్తసులభా ! పద్మావతీవల్లభా ।

అంకితాంకము

కరుణశ్రీ రచియించి తెచ్చె నొక కాన్కన్; చిత్త ముప్పొంగ నీ చరణాబ్జమ్ముల నుంచె; నందుకొనవే స్వామీ । త్రిలోకైక సుం దర । యుష్మత్కరుణారసప్లుతికి ఈ నా చిన్నికావ్యం "బుదా హరణం"బై వెలుగొందుఁగాక మన యన్యోన్యానురాగాంకమై.

నమస్సమర్పణము

తెలుఁగుం దేనెలు తేర్చి, తీర్చి "సువిభక్తిశ్రీ"లతో, "చంపకో త్పలముల్" చక్కనమర్చి, మేల్ "కళిక"లాపైపేర్చి, మేలేర్చి "ఉ త్కళికల్" కూర్చితి నీ సువర్ణ సుమనోదామంబు; నీహార ని ర్మలనిత్యస్మితహార। "హార" "ముపహార" మ్మిత్తుఁగైకో ప్రభూ।

# ఆదిదంపతులు

"స్వామీ!" "ఏమి?" "అదృషమున్న యశముల్ సంప్రాప్తమా" "లక్ష్యమెం
దే?" మృత్యుంజయులందె" "దండధరు గుండెల్ తన్నితిన్" "దేనితో?"
"వామాంఘ్రిన్" "మరి మామకీన మది దేవా" యన్న స్మేరాస్యుఁడౌ
వామాంగీకృత సర్వమంగళుఁడు విశ్వశ్రేయముల్ గూర్చుతన్.

"ఎవ్వరు తండ్రిగారు? మరి యెవ్వరు పెండ్లికుమారు తాతగా?
రెవ్వరు గోత్రనామము లవే?" మన పర్వతరాట్పురోహితుల్;
నవ్వుచు చూచు మాధవుని నవ్వుచు చూచు సుధాంశుశేఖరున్
నవ్వుచు చూచు గౌరి చిరునవ్వులు మీపయి జాజిపువ్వులౌ!

వాగర్థ ప్రణయైకమత్యమయి, సేవాభావనాపూత చే
తో గోరాడ్ గమనాధిపత్యమయి, సంతుష్యద్రసౌచిత్యమై
యోగిస్తుత్యమునై, పరస్పర తపోయోగాత్తదాంపత్యమౌ
శ్రీ గౌరీశ్వర సాన్నిహిత్యము కటాక్షించున్ సుసాహిత్యమున్.

# కల్యాణమాలిక

మౌళిన్ కల్కితురాయి, రొమ్మున స్ఫురన్మాణిక్యహారావళుల్,
ఫాలంబందు త్రిపుండ్రముల్, కటితటిన్ బంగారు చేలంబు, హ
స్తాలన్ శంఖము చక్రమున్ మెఱయ సీతాలక్ష్మణోపేతమై
శ్రీలోలంబగు వెల్గొకండు వికసించెన్ నేడు భద్రాద్రిపై.

పూచెను దిక్కులన్ వెలుగు పువ్వులు; యజ్ఞహవిస్సుగంధముల్
వీచెను; రాతి గుండెలు ద్రవించెను; తల్లడిలెన్ సుబాహు మా
రీచ విజృంభణంబు; నిదురించెను రౌద్రధనుష్ప్రవృత్తి భ
ద్రాచలమందు పెండ్లికొడుకై రఘురాముఁడు కొల్వుదీర్పగన్.

కల్యాణంబట నేడు నీకు త్రిజగత్కల్యాణ! సౌందర్యసౌ
శీల్యశ్రీ పరిపూత సీత, జయలక్ష్మీ మంజులాపాంగమాం
గల్య జ్యోతిరుపేత, క్రొంజివురు బుగ్గల్ సిగ్గు సింగారమై
మాల్యాలంకరణం బొనర్చునట రామా! నీదు కంఠమ్మునన్.

"ఇతడటే పుత్రకామేష్టి పండించిన
        కౌసల్య బంగారు కడుపుపంట ।
ఇతడటే తాటకన్ హతమార్చి లోకాల
        గోడు వాపిన రాచకోడెగాడు ।
ఇతడటే గాధేయు క్రతువు సంరక్షించి
        మునుల దీవెన లందుకొనిన మేటి ।
ఇతడటే నిజపదాంకిత రజోరాజిచే
        శిలకు ప్రాణాలు వోసిన ఘనుండు ।

ఇతడటే శూలి కోదండ మెక్కుపెట్టి
రెండు చేసిన విక్రమోద్దండమూర్తి ।
ఇతడటే మన జనకభూపతులవారి
పెద్దయల్లుండు సరిక్రొత్త పెండ్లికొడుకు ।।

అంచు మిథిలాపురీప్రజ లంతులేని
సంతసము సందడింప నంతంత లేసి
కనుల గనుగొన రఘురాము కంఠసీమ
జానకి యలంకరించె "కల్యాణమాల ।"

సీతమ్మ చెంగావి చివురుదోసిట నెవ్వి
పద్మరాగమ్ముల భంగి నొప్పె
శ్రీరామచంద్రుని శిరముపై నిడ నెవ్వి
కుందప్రసూనాల చంద మందె
శ్యామసుందరు మేన జారు వేళల నెవ్వి
ఇంద్రనీలములట్టు లెసక మెసగె
జలజల నలుకెలంకుల చిందుచో నెవ్వి
పుష్పవర్షంపు సొంపును వహించె

పావనము లవ్వి ధన్యజీవనము లవ్వి
సకల జగతికి శుభము లొసంగుగాక
జానకీరామ సౌభాగ్యసహిత మహిత
మంగళ మనోజ్ఞ కల్యాణ మౌక్తికములు.

• • •

# పెండ్లి

బృందారకానంద మందార మకరంద
బిందునిష్యందాల విందు పెండ్లి;
రంగారు ముంగారు బంగారు సరసాంత
రంగాల సత్యాన ర్తనము పెండ్లి;
సోగకన్నులరాణి రాగరంజితపాణి
రాణించు మాణిక్యవీణ పెండ్లి;
చిన్నారి పొన్నారి చిగురు చెక్కిళ్ళలో
నవ్వులొలుకు గులాబిపువ్వు పెండ్లి;

ప్రేమతో దేవతలు పెట్టు భిక్ష పెండ్లి;
అక్షయంబైన శ్రీరామరక్ష పెండ్లి;
వధువు వరుడును "ద్వంద్వ"మై మధువు గ్రోలు
ప్రేమ బృందావనారామసీమ పెండ్లి ।।

# జయభవాని

అది పర్వదినం
అది సుపర్వదినం
అది సర్వ సుపర్వ పర్వదినం
అది భారతావని కొక గర్వదినం

*

నగేంద్రనందన
మృగేంద్రవాహన మెక్కి
మహాకాళియై మహిషాసురుణ్ణి
మర్దించిన మహత్తరదిన మది।
రావణుణ్ణి సంహరించటం కోసం
రవికుల లలాముడైన శ్రీరాముడు
రాజరాజేశ్వరీ మహాదేవిని
పూజించిన పుణ్యదిన మది।
దురాక్రమణ సాగించిన
కురువీరుల ధాటి
పరాక్రమంతో పటాపంచలు గావించి కిరీటి
విరాటుని గోవులను మళ్లించిన విజయదిన మది

విల్లమ్ములు పట్టుకొని వీరతిలకం పెట్టుకొని
భారతీయ బాలకులు భవిష్యత్పాలకులు
ఉత్సాహంతో ఊరి పొలిమేరలు దాటే
ఉజ్వలదిన మది ! !

*

ఆరోజు విజయదశమి;
అరుణోదయ సమయం;
అది దుర్గామహాదేవి ఆలయం!
వీరమాత జిజియా
ఆరాధిస్తున్నది జగజ్జనని దుర్గను.
కేల ధనుర్బాణాలు ధరించి
బాలశివాజీ అరుదెంచాడు —
"అమ్మల గన్న అమ్మ"ను అర్చించే
అమ్మప్రక్క కూర్చున్నాడు -
జీజాబాయి పూజాకుంకుమంతో
వీరశివుని నుదుట విజయతిలకం దిద్దింది -
కళకళ వెలిగే కర్పూరహారతి
కన్నబిడ్డ కన్నుల కద్దింది -
పెల్లుబికే ఉల్లాసంతో శివాజీ
తల్లికి నమస్కరించాడు తలవంచి
కరగిన హృదయంతో కంపించే హస్తంతో
శివుని శిరస్సు నిమిరింది జిజియాబాయి.

జనని ఆనందబాష్పాలు
జగజ్జనని ఆశీఃపుష్పాలు
కుమారశివుని మౌళిపై సమానంగా జలజల రాలాయి.

*

కన్నబిడ్డను ప్రబోధిస్తూ అన్నది జీజియామాత -
"నాన్నా ! శివా ! విన్నావా ఈ వీరగాథ
కొన్నివేల సంవత్సరాలకు పూర్వం ద్వాపరయుగంలో
కన్నతల్లి కుంతీదేవి కాళ్ళకు ప్రణమిల్లి
'అమ్మా ! ఆశీర్వదించు !'
అన్నాడొక చిన్నవాడు
అతడి పేరు అర్జునుడు."
చెప్పుకొనిపోతున్నది జీజియామాత హర్షంతో !
ఆలకిస్తున్నాడు బాలశివాజీ అవనతశీర్షంతో !

అప్పుడు కుంతీదేవి ఏమన్నదనుకున్నావు !
"అన్నా ! అర్జునా ! నీవు
పవిత్రమైన భరతవంశంలో ప్రభవించావు
భరతుడు సింహాలను చెవులు పట్టుకు ఆడించాడు
పులిరాజుల వీపులపై క్రీడించాడు
దురహంకారులను నిర్మూలించాడు
చతుస్సముద్రముద్రిత ధరిత్రీచక్రాన్ని పాలించాడు.

భారతపౌరుషం దిద్దితీర్చుకో !
అరణ్యవాసాలు అజ్ఞాతవాసాలు ఓర్చుకో !
నీ తోడి సోదరులను మరువకు !
అధర్మానికి అన్యాయానికీ వెరువకు !
విజయుడవని విస్మరించకు !
పార్థశబ్దానికి అపార్థం ఘటించకు !
పరమశివుని ఆరాధించి పాశుపతం సంపాదించు
కురుక్షేత్రంలో విజృంభించి విరోధులను నిరోధించు -
నరుడవై గాండీవధరుడవై
నిరంకుశత్వాన్ని నిర్మూలించు -
దిగ్దిగంతాలు ప్రతిధ్వనించేటట్లు
దేవదత్తాన్ని పూరించు -
మంటలు రేపిన తుంటరులను మన్నించకు
చెలువల వలువలూడ్చిన తులువలను క్షమించకు -
ధర్మపక్షానికి జయం తప్పదు
అధర్మపక్షానికి క్షయం తప్పదు -
ఖండించు క్రౌర్య కౌటిల్యాల శిరస్సు
పండించు భరతవంశం తపస్సు"

•

కన్నబిడ్డను ప్రబోధిస్తూ అన్నది కుంతీదేవి -
"అన్నా! అర్జునా! విన్నావా ఈ వీరగాథ!
కొన్నివేల సంవత్సరాలకు పూర్వం త్రేతాయుగంలో
కన్నతల్లి అంజనాదేవి కాళ్ళకు ప్రణమిల్లి
'అమ్మా! ఆశీర్వదించు!"
అన్నాడొక చిన్నవాడు
అతడిపేరు హనుమంతుడు"
చెప్పుకుపోతున్నది హర్షంతో కుంతీదేవి!
చెవియొగ్గి వింటున్నాడు కుతూహలంతో గాండీవి!

"అప్పుడు అంజనాదేవి ఏమన్నదనుకున్నావు!
"అన్నా! హనుమా! నీవు
వాయుదేవుని వరప్రసాదంతో వర్ధిల్లావు
నీ తండ్రి కపికేసరియైన కేసరి
నిత్యప్రత్యగ్ర పరాక్రమం నీకే సరి -
నీ నిరంతర కర్తవ్యదీక్ష
నీకు సర్వదా శ్రీరామరక్ష

*

మండే మార్తాండ మండలం నీ కొక
మధురమైన మామిడిపండు
కొండలు నరికిన ఆఖండలుని వజ్రప్రహారం నీ
గండస్థలి కొక పూలచెండు

అపారపారావారం నీ కొక పిల్లకాల్వ
అమోఘ బ్రహ్మాస్త్రం నీ కొక పట్టుశాల్వ
మానవత్వాన్ని దోచుకొన్న దానవత్వాన్ని ద్వేషించు
మాత్సర్యం చెరబెట్టిన మాతృశ్రీని అన్వేషించు
విజ్ఞానాన్ని ప్రవర్శించి
అభిజ్ఞానాన్ని అందించు
లోకాన్ని చీకాకు పరచే రాకాసి మూకల్ని
మూకటివేళ్ళతో పెల్చివెయ్యి।
అధికార దురహంకారాన్ని
అగ్నిజ్వాలలతో కాల్చివెయ్యి।
వెలుగు నిన్ను ఎలుగెత్తి పిలుస్తుంది।
చీకటి నీకు దూరంగా నిలుస్తుంది।
సంజీవిపర్వతం నీ ముంజేతి ముందు వెలుస్తుంది।।"

*

కన్నబిడ్డను ప్రబోధిస్తూ అన్నది అంజనాదేవి -
"అన్నా। హనుమన్నా। విన్నావా ఈ వీరగాథ।
కొన్నివేల సంవత్సరాలకు పూర్వం కృతయుగంలో
కన్నతల్లి వినతాదేవి కాళ్ళకు ప్రణమిల్లి
'అమ్మా। ఆశీర్వదించు।'
అన్నా డొక చిన్నవాడు
అతడిపేరు గరుత్మాన్."

అంటూ చెబుతున్నది అంజన హర్షంతో
వింటున్నాడు హనుమ వినమ్రశీర్షంతో

*

"అప్పుడు వినతామాత ఏమన్నదనుకున్నావు !
"నాయనా ! గరుత్మన్ ! నీవు వైనతేయుడివి
అమరేంద్రునకుసైతం అజేయుడివి
నీవు నిసలైన మహావీరుడవు
నీవు అసలైన అసహాయశూరుడవు

*

ఛీ పొట్టకూటి వెట్టిచాకిరీ ఇక చేయలేము
ఛీ పాపజాతిని వీపుపై మోయలేము
ఛీ శృంఖలాలు ఎంత విదిల్చినా కదలటంలేదు
పాముల్లాగా పాదాలకు చుట్టుకొని వదలటంలేదు
అమృతకలశాన్ని దివినుండి భువికి దించు !
చీకటింట్లో స్వేచ్ఛాదీపాన్ని వెలిగించు !
నీ పక్షవిక్షేపాలకు పర్వతాలు దద్దరిల్లాలి !
నీ గరున్మరున్మహారవానికి సాగరసప్తకం ఘూర్ణిల్లాలి !
నీ మాతను వీరమాతను చేయి !
నీ జాతికి నవజీవనం పోయి !!

*

కన్నబిడ్డను ప్రబోధిస్తూ అన్నది వినతాదేవి -
నాన్నా ! గరుత్మన్ ! విన్నావా ఈ వీరగాథ !
కొన్నివేల యుగాలకు పూర్వం
కన్నతల్లి గౌరీభవాని కాళ్ళకు ప్రణమిల్లి
'అమ్మా ! ఆశీర్వదించు !'
అన్నా డొక చిన్నవాడు
అతడి పేరు శక్తిధరుడు"
విన్పిస్తున్నది వినతాదేవి హర్షంతో
వింటున్నాడు గరుడుడు విజయోత్కర్షంతో

*

"అప్పుడు గౌరీమాత ఏమన్నదనుకున్నావు !
నా ముద్దుల తండ్రీ ! నీవు శక్తిధరుడవు ! ముక్తికరుడవు !
ముక్కోటిదేవతలను ఒక్కత్రాటిపై నడిపించు !
దేవసేనకు అధిపతివై ప్రకాశించు !
అశక్తులైన అమరులకు స్వశక్తి అనుగ్రహించు !
నక్తంచరుల చెరనుండి అమరావతికి
ముక్తి ప్రసాదించు !
జనమారకుడైన తారకుణ్ణి
రణరంగంలో నిగ్రహించు !

*

'సుధర్మ' అధర్మానికి ఆలవాల మయింది
'మందాకిని' మద్యపంకిల మైపోయింది
'మందారం' మోడువారింది
'నందనవనం' పాడుబడింది
నీలో ఉన్నది పరమశివుని తేజస్సు!
నీకు త్రోవచూపుతుంది అమోఘమైన అమ్మ ఆశీస్సు!"

*

అంటూ ఆ జగన్మాత ఆశీర్వదించింది అసహాయశూరుణ్ణి
స్వకుమారుణ్ణి సుకుమారుణ్ణి కుమారుణ్ణి
వింటున్నావా శివాజీ !"
అంటున్నది జిజియాజీ -
"ఏః వినంగా శక్తిధరుని వీరగాథ
వినిపించింది వినత గరుత్మంతుడికి -
ఆ గరుత్మంతుని పరాక్రమగాథ
వినిపించింది అంజన హనుమంతుడికి -
ఆ హనుమంతుని పౌరుషగాథ
వినిపించింది కుంతి ధనంజయుడికి -
ఆ ధనంజయుని విజయగాథ
వినిపించాను నీకు నేను —"

*

బాలశివుని ఫాలతలం ప్రభాపటల పరీవృతం
వీరశివుని ముఖాంబుజం విజయశ్రీ విరాజితం
జిజియా కుమారశివుణ్ణి
చేయెత్తి దీవించింది
చివరికిలా ప్రబోధించింది –

•

"యుగయుగాల వీరగాథలు అందిచ్చాను
కథలో కథ గ్రుచ్చి వ్రాకుచ్చాను
పాతయుగాల గాథలని పరిహాసం చేయకు
తాతలనాటి కథలని తలపోయకు
పాతమీద రోత అభినయించటం
చేతగాని ప్రేత లక్షణం ।
సింహావలోకనం చేయటం రాని
గ్రామసింహాల కది విలక్షణమైన ఉపలక్షణం ।
వెనుక కాచుకుంటూ – ముందు చూచుకుంటూ
సజావుగా సాగిపోవటం జీవితపరమార్థం ।
వెనకచూపు లేకపోయిందో
వెన్నెముక జారిపోవటం యథార్థం ।

•

దేశంవైపు ఒకమాటు దృష్టిసారించు
దీన హీన మానవుల స్థితిగతులు విచారించు
గ్రామం గ్రామంలో క్షామం తాండవిస్తుంటే
క్షేమం భయపడి పారిపోతున్నది।
ఎండల్లో వానల్లో కొండల్లో కోనల్లో
తిండిలేక అండలేక గూడులేక గుడ్డలేక
తిరుగుతున్నారు మా వనేచరులు।
అసహాయులైన అటవికజాతులు।
స్వాతంత్ర్య పతాకం క్రింద అందరినీ సంఘటితం కావించు।।
జాతి నరనరాల్లో నూతన చైతన్యం పూరించు।।
నా పుత్రుడు ఆదర్శచరిత్రుడు కావాలని
క్షాత్రం మూర్తీభవించిన ఛత్రపతి కావాలని
ఛత్రపతి ఛత్రచ్ఛాయలో స్వధర్మం వర్ధిల్లాలని
అధర్మం అడుగంటాలని
అభ్యుదయం మిన్నంటాలని
కలలుగన్న కన్నతల్లి కాంక్షలు పండించు।
మార్తాండుడు మకరరాశిలో ప్రవేశించినట్టు
నీవు కార్యరంగంలో అడుగుపెట్టు।
శివా। నీ
భవానీఖడ్గంపై ఒట్టు।
అరాజకాన్ని పోగొట్టు।

సురాజ్యమైన స్వరాజ్యాన్ని నిలబెట్టు!
మహోన్మాదానికి గోరీకట్టు!
గమ్యం గుర్తించు! కర్తవ్యం నిర్వర్తించు!
శాంతికోసం క్రాంతిపథంలో
సంక్రాంతిరథం సాగించు!
జైత్రయాత్ర కొనసాగించు!
జయం నీదే! సంశయం మెందుకు?
'జయ భవానీ' అంటూ సాగిపో ముందుకు!
"విజయీభవ!" అన్నది జిజియామాత
"జయ శివాజీ" అన్నట్లున్నది గుడిలో జగన్మాత.

•

"జయ భవానీ" అంటూ చెంగున లేచాడు శివాజీ
ఖంగున మంటపంలో గంట మ్రోగింది
ఆలయప్రాంగణమంతా మార్మోగింది
"జయ భవానీ" "జయ భవానీ" "జయభవానీ!!"

• • •

# కనకదుర్గాభవాని

బాల

అక్షమాలయు పుస్తక మ్మభయ వరద
హస్తములు దాల్చి వరములను వలయు దేవి
శ్రీజగన్మాత "బాల" రక్షించుగాత
కనకదుర్గాభవాని। శంకరుని రాణి।

లలిత

హస్తముల పుష్పబాణ పాశాంకుశములు
నెన్నుదుట కన్ను వెలుగొందు కన్నతల్లి
శ్రీ జగన్మాత "లలిత" రక్షించుగాత
కనకదుర్గాభవాని। శంకరుని రాణి।

అన్నపూర్ణ

స్వర్ణదర్వియు పాయసపూర్ణపాత్ర
దాల్చి భక్తుల ప్రేమతో దనుపు తల్లి
వరములిడు "నన్నపూర్ణ" సౌవర్ణవర్ణ
కనకదుర్గాభవాని। శంకరుని రాణి।

అశ్వారూఢ

అశ్వరాజము నెక్కి నిత్యప్రసన్న
వదనయై భక్తవాత్సల్యసదన యైన
అమృతవల్లి "అశ్వారూఢ" యైన తల్లి
కనకదుర్గాభవాని ! శంకరుని రాణి !

రాజమాతంగి

అలికఫలకాన మృగమదతిలక రేఖ
మౌళి శశిరేఖ కేల్దోయి మధురవీణ
దాల్చిన శుభాంగి "రాజమాతంగి" దేవి
కనకదుర్గాభవాని ! శంకరుని రాణి !

వాగ్వాదిని

కుందమందారగౌర ! బాలేందుమకుట !
పుస్తక సువర్ణలేఖినీహస్త ! అమల
కమల నిలయ ! "వాగ్వాదిని" అమృతహృదయ !
కనకదుర్గాభవాని ! శంకరుని రాణి !

వారాహి

వికచపద్మాసనాసీన ! విమలగాత్రి !
విశ్వజనయిత్రి ! గిరిపుత్రి ! విజయదాత్రి !
పాహిమాం పాహి "వారాహి" పాహి పాహి !
కనకదుర్గాభవాని ! శంకరుని రాణి !

పరాశక్తి

చారు నవరత్న ఖచిత కాంచన కిరీట !
పరమ కారుణ్య రసపూర్ణ పద్మనయన !
భక్తిముక్తుల నిడు "పరాశక్తి" జయము !
కనకదుర్గాభవాని ! శంకరుని రాణి !

భువనేశ్వరి

ఉదయభానుప్రభామూర్తి ! సదయహృదయ !
సరసదరహాస మధుర సుందర కపోల !
జనని "భువనేశ్వరీదేవి" జయము ! జయము !
కనకదుర్గాభవాని ! శంకరుని రాణి !

చండి

అష్టభుజ ! శిష్టరంజని ! దుష్టదైత్య
గర్వభంజని ! సర్వమంగళ ! శుభాంగి !
"చండి" సింహేంద్రవాహన ! శరణు ! శరణు !
కనకదుర్గాభవాని ! శంకరుని రాణి !

# మంగళ మహాశ్రీ

దిక్కుల తేజస్సు చిందు దివ్యవైకుంఠము వీడి,
చిక్కని సుధలు చెల్వొందు క్షీరవార్నిధి విడనాడి,
ఇక్కడ నీ మంగళాద్రి నేల పెట్టితివి కాపురము
చక్కదనాల నా స్వామి స్వాంతము దయకు దాపురము !

డింభకు రక్షింప నాడు దైవమ్ము స్పందించి యటుల
స్తంభమ్ము వెల్వడినావు సముదిత ఘోరఘోషార్భటుల
సంభూతివేళ మెదియును జనుదెంచె లెమ్ము వైళంబ
అంభోధికన్యకా మానసాంభోజ మత్తరోలంబ !

గర్జింపు గర్జింపు పగటు కటకుగుండియలు భేదిల్ల;
భర్జింపు నిర్జింపు స్వామి ప్రత్యర్థిదైత్యుల నెల్ల;
వర్జింపు నీ మౌనముద్ర వాకిలి వెక్కె దానవుడు:
ఆర్జింపు మార్తశరణ్య యశము, నీవాడు మానవుడు.

సరిహద్దు దాటి పైదూకె సహసా హిరణ్యకశిపుడు
పరిభవ మందుచున్నాడు భారతప్రహ్లాదు డిప్పుడు
కరుణించి స్తంభమ్ము వెడలి గ్రక్కున కదలి రావేమి
వరమంగళాచల గుహల వసియించు నరసింహ! స్వామి!

"మ్రొక్కిన వరమీని వేల్పు మోమోట మే" మనె సుమతి
అక్కర వచ్చెను నేడు హరి హరి! పైదూకె విమతి
ఒక్కొక్క వీరు డొక్కొక్క యుగ్ర నృసింహుడై కదల
గ్రక్కున నావేశమగుము రక్కసిమూక గ్రక్కదల.

మంగళము సర్వసురమౌళిమణిపుంజ రుచి
మంజరిత మంజుపదకంజా!
మంగళ మపాంగ సుషమా మధురిమా గళిత
మానవ మనః కలుషపుంజా!
మంగళము దుర్దనుజ మర్దన జనార్దన! స
మాశ్రిత మహోజ్జ్వల జయశ్రీ!
మంగళము సన్నిహిత మంగళమహీధర! స
మాకలిత మంగళమహశ్రీ!

# యా ద గి రి స్వా మి

సాంధ్యతాండవ మహాసంరంభ హరశిర
శ్చంద్రరేఖకు కులస్వాము లగుచు
నవవసంతోదయోన్మత్త కింశుకకోర
కమ్ముల కనుగు చుట్టమ్ము లగుచు
ఇందిరానందన స్యందనమ్మయిన రా
చిలుక ముక్కునకు పైచిలుకు లగుచు
కాలభైరవ భయంకర కఠోర కరాళ
దంష్ట్రికలకు ప్రతిద్వంద్వు లగుచు

కనకకశిపు కరాళ వక్షః కవాట
పాటనప్రక్రియా సముద్భటములైన
యాదగిరి శ్రీనృసింహు దీవ్యన్నఖంబు
లస్మ దఘముల చించి చెండాడుగాక !

# జ్యోతిర్మయ మృత్యుంజయము

[ఆసేతు శీతాచలము భారతజాతీయ సమైక్యతను వెల్లివిరియించిన చైతన్య తరంగములు ద్వాదశ జ్యోతిర్లింగములు. ఈ మహా మహేశ్వర క్షేత్రము లను శ్రీశంకరభగవత్పాదులు సందర్శించి సమర్చించి సంస్తుతించారు. శ్రీశంకరుల సంస్కృత కవితాకదంబముల కివి తెలుగు ప్రతిబింబములు.]

"సౌరాష్ట్రే సోమనాథం చ"

శీతాంశుం దలదాల్చి చల్లని సుధల్ చిందించుచున్ సజ్జన
వ్రాతంబున్ గరుణింప నింపయిన సౌరాష్ట్రప్రదేశమ్మునన్
జేతో మోదముతో వెలుంగుదువటే శ్రీ "సోమనాథుండ"వై
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహారు మృత్యుంజయా!

"శ్రీశైలే మల్లికార్జునమ్"

చేతుల్ మోడ్చి యమర్త్యులెల్లరు సమర్చింపన్ మహైశ్వర్యముల్
చేతం బూని తులాద్రితుంగమగు నా శ్రీశైలశృంగాన సం
ప్రీతిన్ నిల్చు భవాబ్ధిసేతువవు స్వామీ! నీవు "మల్లీశ్వర"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహారు మృత్యుంజయా!

"ఉజ్జయిన్యాం మహాకాళమ్"

ప్రాతర్భాను మయూఖమాలికలు పైపై ప్రాక, శిప్రానదీ
వాతంబుల్ మెయి సోక, మృత్యువును ద్రోవన్ భృత్యులంబ్రోవ, వి
ఖ్యాతిం గంటి వవంతికాస్థలి "మహాకాళేశ్వర"స్వామివై
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహరు మృత్యుంజయా!

"ఓంకారే పరమేశ్వరమ్"

ఖ్యాతంబై పరిపూతమౌ ప్రవిలసత్కావేరికా నర్మదా
ద్వైతప్రాంగణసన్నివేశమగు మాంధాతృప్రదేశంబునం
దో యంద్రీ ! వెలుగొందుచుందువట నీ "వోంకారనాథుండ"వై
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహరు మృత్యుంజయా!

"కేదారం హిమవత్ పృష్ఠే"

శీతాహార్యతటాంచలమ్ములపయిన్ సిద్ధుల్ మునుల్ దేవతల్
దైతేయుల్ భజియింప శైలతనుజాతం గూడి గంధర్వసం
గీతంబుల్ విను నిన్ గనుంగొనుదు శ్రీ "కేదారనాథేశ్వర"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహరు మృత్యుంజయా!

"డాకిన్యాం భీమశంకరమ్"

భూత ప్రేత పిశాచ దైత్య నివహంబుల్ శాకినీ డాకినీ
వ్రాతంబుల్ తలలొగ్గ, భక్తజన రక్షాదక్షదీక్షన్ జగద్
భీతింబాపెదు "భీమశంకరుడ"వై భీమాతటోద్భాసివౌ
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహరు మృత్యుంజయా!

"వారాణస్యాం చ విశ్వేశమ్"

శీతక్ష్మాధరరాజపుత్రి కరమున్ జేసేత గీలించి వి
ఖ్యాతానందవనీ విహారముల నాహ్లాదించు స్వామిన్ నుతుల్
సేతున్ నిన్ను ననాథనాథు, శివు, కాశీ "విశ్వనాథేశ్వరున్"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహారు మృత్యుంజయా!

"త్ర్యంబకం గౌతమీతటే"

చైతన్యోజ్జ్వల నిత్యనిర్మల మహాసహ్యాద్రిపై గౌతమీ
స్రోతఃపూతతటాన నిన్ గనిన నిర్ధూతంబులౌ పాతక
వ్రాతంబుల్, మురిపించు ముక్తిరమ-దేవా! "త్ర్యంబకేశాహ్వయా"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహారు మృత్యుంజయా!

"వైద్యనాథం చితాభూమౌ"

పూతప్రజ్వలికాభిధానసరణిం బూర్వోత్తరన్ దేవతా
దైతేయార్చిత పాదపద్మముల నాస్థానించి, శర్వాణి వా
క్చాతుర్యంబుల కిచ్చమెచ్చెదవు నిచ్చల్ "వైద్యనాథాహ్వయా"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహారు మృత్యుంజయా!

"నాగేశం దారుకావనే"

ఏతల్లోకము లేలు పెన్నిధివి నీవే ద్వారకాసన్నిధిన్
జ్యోతిష్మన్మణి భోగిభోగములు సంశోభించు నెమ్మేనితో
చేతఃప్రీతిగ భుక్తిముక్తు లిడవా శ్రీ "నాగనాథాహ్వయా"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహారు మృత్యుంజయా!

"సేతుబంధే చ రామేశమ్"

ధౌతాఘవ్రజ తామ్రపర్ణి పతిపాదా లంటుచోటన్ మహా
సేతూత్తంసము గట్టి, బాణతతి నాజిన్ రావణున్ ద్రుంచు నా
సీతావల్లభుచే సమర్చితుడవౌ శ్రీ "రామలింగేశ్వర"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహారు మృత్యుంజయా!

"ఘుశ్మేశం చ శివాలయే"

ఓతప్రోతములౌ శుభమ్ములకు చేయూతై, పరావాక్కులో
లోతై, సర్వజగద్విధాతవయి ఎల్లోరా పురిన్ ముక్తికిన్
దాతృత్వమ్ము వహించి మించితివి గాదా స్వామి ! "ఘుశ్మేశ్వర"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా! జోహారు మృత్యుంజయా!

ఫలశ్రుతి

ఐతిహ్యం బనురక్తశంకర ముదాత్తాలోక మీ ద్వాదశ
జ్యోతిర్లింగ మహా మహేశ్వర వర స్తోత్రం; బెవండేనియున్
ప్రాతస్సంధ్యలయందు దీని జదువన్ ప్రాప్తించు తద్ ద్వాదశ
జ్యోతిర్మూర్తుల గన్న పుణ్యము; లభించున్ స్వామి కారుణ్యమున్ ॥

• • •

# మధురానగరిలో....

సరగున మధురా నగరికి
పెరుగమ్మంబోదు ! దారి విడువుము కృష్ణా !
కర మింత తగిలినంతనె
పరవశమగు తనువు ! మీద బడకుము కృష్ణా !

పిల్లనగ్రోవి రవమ్మున
పిల్లల మురిపించి మోహపెట్టెదవేమీ !
చల్లమ్మ మమ్ము మరు విరి
విల్లమ్ముల యెదుట పారవేయకు స్వామీ !

కన్నయ్యా ! పూవిల్తుని
కన్నయ్యా ! మా యశోద కన్నయ్యా ! నా
చిన్నారి కన్నెవలపులు
కొన్నయ్యా ! నన్ను దోచుకోబోకయ్యా !

# సీత

[గోమతీతీరంలో శ్రీరాముడు అశ్వమేధదీక్షితుడై ఉన్నాడు. కుశలవులు ప్రతిదినమూ యజ్ఞశాలకు వచ్చి రామాయణగానం చేస్తున్నారు. ఒకనాడు మహర్షులూ, పౌరజనపదులూ కూడి యున్న మహాసభలో నిర్దోషురాలైన జానకిని శ్రీరామునకు సమర్పించుటకు వాల్మీకులవారు సీతతో వస్తున్న దృశ్యం-]

బృందగీతి

శ్రీకారం చుట్టుకున్న
స్త్రీజాతి కథానిక వలె
ఆకారం దాల్చిన లో
కైక శోకగీతిక వలె

వాల్మీకులవారి వెంట
వచ్చుచుంటి వెవ రమ్మా?
ఎవ రమ్మా? ఎవ రమ్మా?
అమ్మా! నీ వెవరమ్మా?

శ్రీరాముడు

భగీరథుని రథం వెనుక
ప్రవహించే సురనది వలె
అరుంధతీవిభుని వెనుక
అడుగిడే నందిని వలె
వాల్మీకిమహర్షి వెనుక
వస్తున్నది నా జానకి ! !

కౌసల్య

నాకోడలు ! నాజానకి !
నాభాగ్యము ! నాప్రాణము !
చిక్కి చిక్కి తనూవల్లి
చిట్టితల్లి వస్తున్నది ! !

సౌమిత్రి

వాల్మీకాశ్రమము చెంత
వదలిపెట్టి వచ్చినట్టి
ఇక్ష్వాకుల యశోలక్ష్మి
ఇప్పుడు తిరిగి వస్తున్నది !

భరతుడు

తెల్లనివన్నీ పాలని
నల్లనివన్నీ నీళ్ళని
కల్లా కపటము లెరుగని
కన్నతల్లి వస్తున్నది !

కైక
లోకులు పలుగాకులుగా
'హా హా' యని అరచి కరచి
ఏకాకినిగా చేసిన
కోకిలమ్మ వస్తున్నది ।

సుమిత్ర
ప్రకృతంతా బాష్పంగా
పారిజాతపుష్పంగా
పతిసేవావ్రతము నడుపు
పరమసాధ్వి వస్తున్నది ।

ఊర్మిళ
మహీస్థలికి దిగివచ్చిన
మహాలక్ష్మి మాదిరిగా
వాల్మీకుల వారివెంట
వస్తున్నది అక్కగారు ।

మాండవి
హిమవద్గిరివెంట వచ్చు
ఉమాదేవి చందమ్మున
వాల్మీకుల వారివెంట
వస్తున్నది అక్కగారు ।

శ్రుతకీర్తి
రసార్ద్రమై ప్రవహించే
రామాయణరచన రీతి

వాల్మీకులవారి వెంట
వస్తున్నది అక్కగారు !

శత్రుఘ్నుడు

నీతి నియమ రహితమైన
రాతిగుండె సంఘానికి
బుద్ధిచెప్పిపోవుటకై
పెద్దవదిన వస్తున్నది !

వసిష్ఠుడు

కుశలవులను గన్నతల్లి
దశరథేశ్వరుని కోడలు
మన రాముని ధర్మపత్ని
జనకపుత్రి వస్తున్నది !

అరుంధతి

ఆదికవుల గంటములో
అమృతలహరి చిందించిన
వేదమాత మహాసాధ్వి
విశ్వజనని వస్తున్నది !

కుశలవులు

అదిగోరా అమ్మ ! అమ్మ !
అనురాగపు పూలకొమ్మ !
ధర్మముతో దయలాగున
తాతవెంట వస్తున్నది !

హనుమ

సీతమ్మ వచ్చింది ! !
సీతమ్మ వచ్చింది ! !
మాతల్లి మాయమ్మ
సీతమ్మ వచ్చింది ! !

ప్రజలు

మన రాణి వచ్చింది
మన రాణి వచ్చింది
ఇనకులాధీశ్వరుని
ఇల్లాలు వచ్చింది !

౨

బృందగీతి

సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల వెంబడి
శ్రీరాముని హృదయంలో
చెలరేగెను పెనుతుఫాను

సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల వెంబడి
రామచంద్రు వదనముపయి
క్రమ్ముకొనెను కారుమబ్బులు

సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల వెంబడి

రాముని నయనమ్ములలో
ప్రేమజలధి గట్లు తెగెను

వాల్మీకి

రఘురామ! రఘురామ! రామ!
రవివంశజలరాశిసోమ!
అవధారు రాజలలామ!
భువనైకపావననామ!

ఈ సీత లోకైకపూత
ఇక్ష్వాకువంశసంజాత!
ఇల్లాలి నంగీకరింపు
చల్లగా జగతి పాలింపు

అటువంటి పట్టుపు పుట్టి
ఇటువంటి ప్రభుని చేపట్టి
ఎటువంటి ఇక్కట్ల నందె
కటకటా మిథిలేశపట్టి!

ఆనాడు లంకలో బిడ్డ
నగ్నికుండమున నెట్టితివి
ఈనాడు నడి కోడి నఖిని
కానకు వెడలగొట్టితివి

దివి సాక్షి ! భువి సాక్షి ! హోమ
గవి సాక్షి ! రవిసాక్షి ! రామ !
వేదాలు సాక్షి ! నాతల్లి
వైదేహి సాధ్వీమతల్లి !

బృందగీతి

అన్నాడు వల్మీకభవుడు
విన్నాడు మేదినీధవుడు
తిలకించె పరిషత్తు నపుడు
దీనదీనమ్ముగా నృపుడు

వసిష్ఠుడు

పౌరజానపదులారా !
పరమధర్మవిదులారా !
పరిత్యక్తసాధ్వి నిపుడు
పరిగ్రహించును రాముడు

ప్రజలు

పరీక్ష కావలె పరీక్ష కావలె
పాతివ్రత్యం పరీక్ష కావలె

వాల్మీకి

జనకజ కగ్నిపరీక్ష
జరిగెను మున్నొకమాటు
జనులార ! వైదేహి నిపుడు
శంకించు టిది పొరపాటు

ప్రజలు
ఎపుడో ఎచటో ఎవరికి తెలియును
ఇప్పుడే ఇచటే ఇది కావలయును

వసిష్ఠుడు
సాకేతప్రజలు మీరు
సత్యపరాఙ్ముఖులు కారు
సాధ్వీమణి ఈ జానకి
సందేహింతురు దేనికి ?

ప్రజలు
ప్రత్యక్షములో పరోక్ష మేటికి ?
పరీక్షకోరకే నిరీక్ష నేటికి ?

బృందగీతి
ప్రాచేతసముని రాముని
జూచెను సాకాంక్షముగా
చూచి చూడనట్లు శిరము
నూచె రాము డడ్డముగా

వాల్మీకులు దీనముగా
వసిష్ఠులను తిలకించిరి
వసిష్ఠులును మౌనముగా
వారిని గని తల వంచిరి.

శ్రీరాముడు
ప్రజారాధనమె రఘుకుల
పార్థివులకు ధర్మపథము

ప్రజలందరు విన జనకజ
పలుకుగాక మరి శపథము

వాల్మీకి

ముద్దులబిడ్డా ! వింటివె
పెద్దలైన వీ రెల్లరు
శపథ మొనర్చిననెగాని
సాధ్విగ నిను గననొల్లరు.

౩

బృందగీతి

సీతవచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల ముందర -
శ్రీరాముని పేరులోని
శ్రీ సిగ్గున శిరసు వంచె.
సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల ముందర -
రాతిగుండె రాజనీతి
రఘురాముని కనులు మూసె.
సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల ముందర -
గగనము నిర్ఘాంతపోయి
కన్నార్పక చూచుచుండె.

సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల ముందర -
గుండె కరిగి కెరటాలై
గోమతి వెక్కివెక్కి యేడ్చె

సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల ముందర -
కాలం కాలాడక క్షణ
కాలం స్తంభించిపోయె

సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల ముందర -
వియత్పథములో వేల్పుల
విమానాలు క్రిక్కిరిసెను

సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకుల ముందర -
భూతధాత్రి గుండెలలో
మాతృత్వం పొంగిపొరలె.

౪

బృందగీతి

అరుంధతీవసిష్ఠులను
అవలోకించెను జానకి

ఉపయశ్రీ

జాలి దూలు ముగుర త్తల
ఆలోకించెను జానకి

అన్నగారి మొగము గాంచు
అనుజుల గాంచినది సీత
బిక్క మొగము వేసిన తన
బిడ్డల గాంచినది సీత

అల్లాదే చెల్లెంద్ర మ
హ ర్తిని కనుగొనె జానకి
మూర్ఛిల్లిన ఆంజనేయ
మూ ర్తిని కనుగొనె జానకి

భయపడి గుజగుజలువోవు
ప్రజలను చూచినది సీత
బరువుగ కనురెప్ప లెత్తి
ప్రభువును చూచినది సీత

అభిమానం పట్టలేక
ఆక్రోశించినది సీత ।
అవమానం మోయలేక
ఆక్రందించినది సీత ।

"అమ్మా! అమ్మా! అమ్మా!"
లని మూర్ఛా రనెను సీత!
అమ్మలేని బిడ్డలాగు
లలమటించె మహీజాత!

సీత

శ్రీరాముని స్మరణమె నా
జీవన సర్వస్వమేని
నా తల్లీ భూదేవీ!
నాకు త్రోవ చూపింపుము!

నా నాథునితప్ప పరుల
నా మదిలో తలపనేని
నా తల్లీ భూదేవీ!
నను నీ యొడి చేర్చుకొమ్ము!

స్వామి చరణ కమల రుచుల
నా మానస మలరునేని
నా తల్లీ భూదేవీ!
నను నీలో కలుపుకొనుము!

౨౬

బృందగీతి

"జననీ! జననీ! జననీ!"
అని మూర్ఛా రనెను సీత!

జనని లేని బిడ్డ చంద
మున వాపోయినది సీత !

"కటకట ! కటకటా !" యనుచు
కరిగి నీరయ్యెను స్వామి
"ఫటఫట ఫటఫటా" యనుచు
బ్రద్దలైపోయెను భూమి

భూమాత సాక్షాత్కరించి
పుత్రిని బుజ్జగించినది
కన్నీరు పైటతో నొత్తి
గట్టిగా కౌగిలించినది.

కన్నతల్లిని కౌగిలించి
గళమెత్తి రోదించె సాధ్వి
అనుగుబిడ్డను బుజ్జగించి
తనవెంట గొనిపోయె పృథ్వి

"సీతా "సీతా" సీతా"
శ్రీరాముని కంఠధ్వని !
"మాతా "మాతా" మాతా"
పాతాళమున ప్రతిధ్వని !

• • •

# శ్రీ పతాక

మహిషాసురుని బట్టి మట్టుపెట్టెడి వేళ
శర్వాణి యెత్తిన జయపతాక
విశ్వవిశ్వంభరా విజయియై భరత భూ
జాని యెత్తిన మహోజ్జ్వల పతాక
శక హూణ యవన నాయకుల త్రోలగ విక్ర
మార్కు డెత్తిన హిరణ్మయ పతాక
పాటలీపుత్రమ్ము కోటపై చాణక్య
శిష్యు డెత్తిన సముంచిత పతాక

సర్వమత సామరస్య సంసక్తి నతుల
నుతుల గైకొన్న వీరభారత పతాక
దిగ్దిగంతాల కాంతులు దిద్దితీర్చి
గణుతి గనుగాక! వేయి యుగాలదాక!!

# దీక్షా కంకణము

శ్రీ స్వయంభూస్వామి శిరసుపై సురగంగ
రంగత్తరంగాలు పొంగిపొరలెను నాడు

ఏకశిలాపురీ ప్రాకార శిఖరాలు
జయలక్ష్మి లలిత లాస్యము లందుకొనె నాడు

రామప్పగుడిలోని రమణీయ శిల్పాలు
పారవశ్యమునంది పల్లవించెను నాడు

ఏకవీరాదేవి శ్రీకంఠమాలికా
మందారములు మధువు చిందించినవి నాడు

వేయి స్తంభాల కోవెలలోని ప్రతిరాయి
తీయతీయని కలల తేలిపోయెను నాడు

ఆంధ్ర సమ్రాజ్ఞి రుద్రమ భద్ర పీఠిపయి
కొలువు సింగారమయి కూరుచుండెను నాడు

నాటి 'కాకతి' మహోన్నత విజయతోరణము
గొంతెత్తి పిలుచు "ముక్కోటి" ఆంధ్రుల నేడు

మన "విశాలాంధ్ర సమైక్య సంరక్షణ"కు
కంకణమ్ములు దాల్ప కదలిరం డీనాడు.

# విన్నపం

అన్నా అమరజీవీ! మన్నించు మమ్మల్ని
అన్యోన్యం కీచులాడుకుంటున్న నీ అనుగుతమ్ముల్ని

అనుభవించుమని నీ పందించిన అమృతభాండాన్ని
బద్దలు కొట్టుకుంటున్న బుద్ధిలేని దద్దమ్మల్ని

అవసరానికి పనికిరాని అసందర్భ ఆవేశాలతో
సందుచూచుకొని దూరే చచ్చు పెద్దమ్మల్ని

పచ్చని కాపురంలో చిచ్చులు రేపుకొని
గిచ్చుకుంటూ గుచ్చుకుంటూ కూర్చున్న పిచ్చితమ్ముల్ని

వేషాలతో ద్వేషాలతో రోషాలు పెంచుకొని
కావేషాలతో కాలిపోతున్న గడ్డిబొమ్మల్ని

ఉదయశ్రీ

ముందువెనుకలు చూచుకొని అందరం ఒకటే అనుకొని
నీతిగా నిజాయితీగా బతకటం చేతకాని మాచకమ్మల్ని

వెలుగులు వెదజల్లలేక తెలుగు తేజం కోల్పోయి
కునికిపాట్లు పడుతూ కొడిగట్టిన దీపంసెమ్మెల్ని

జాతి భవిష్యత్తును పూడ్చిపెట్టి సమైక్యతకు సమాధికట్టి
గోతుల్లో కాపలా కాస్తున్న పాతగచ్చుదిమ్మల్ని

అన్నా అమరజీవీ! మన్నించు మమ్మల్ని
అన్యోన్యం కీచులాడుకుంటున్న నీ అనుగుతమ్ముల్ని.

• • •

# నిజాయితీ జయించింది

కైలాస శిఖరాగ్రాన మేస్తున్న కాలకంఠుని నంది
"ఖణిల్లున" ఠంకె పెట్టి గంతువేసింది
ఘనాఘనం గంభీరంగా గర్జించింది
గగనం ప్రతిధ్వనించింది
తటిల్లత నటించింది
వర్షంలో తడిసిన వసుంధర
హర్షంతో పులకించింది
ఆకాశం ఆశ్చర్యంతో అదేపనిగా తిలకించింది.

*

ఎంతవర్షం! ఎంతవర్షం!
ఎప్పుడూ కనీ వినీ ఎరుగని వింతవర్షం!
అంతవర్షంలో అమ్మ ఇంకా ఇంటికి రాలేదని
ఆకటితో అటమటించిపోతూన్న ఆవుదూడ
"అంబా అంబా" అంటూ అతిదీనంగా ఎదురుచూస్తున్నది.
అదిగో! గోమాత రానేవచ్చింది
వానలో తడిసిన భూమాతలా ఉంది.

ఆప్పుడూ అమాంతం అమ్మపైకి దూకింది
కన్నతల్లి చిన్నిబిడ్డ ఒళ్ళంతా నాకింది
తల్లి పొదుగులో తలదూర్చిన లేగదూడ
తనివితీరా తాగింది గుమ్మపాలు
చేపువచ్చిన క్షీరధారలు
చెంబునిండా పిదుకొన్నిపోయింది ఇల్లాలు.

*

కన్నీటితో గోమాత అంటున్నది -
కలవరంతో గోవత్సం వింటున్నది -
కన్నా! కడుపునిండా పాలు త్రాగు
గంగడోలు కదుల్తూ గారాముగా ఊగు
కల్లా కపటం తెలియని కన్నతండ్రివి నీవు
అల్లరిలోకంలో ఇకముం దెల్లా బ్రతుకుతావు?
నీకూ నాకూ ఈరోజుతో తీరిపోయింది ఋణం
ఈ నా శరీరం సమస్తం కోనలోని పులిరాజుకు అర్పణం
మాట యిచ్చి వచ్చాను "మా బాబుకు పాలిచ్చి వస్తా"నని
"అరగంటలో తిరిగివచ్చి ఆకలి తీరుస్తా"నని.
బిక్కమొగంతో బావురుమంటున్న బిడ్డను ఓదారుస్తూ -
చెప్పుకుపోతున్నది ఆవు చెక్కున చెక్కు చేరుస్తూ -
కండలు తిరిగి పెరిగి
వెండికొండలా కదిలే నిన్ను చూడా లనుకున్నాను

ఎండలో వానలో రైతుకు
అండగా కైదండగా ఉండే నిన్ను
కన్నులనిండా చూచుకొని మురిసిపోవాలని కలలు గన్నాను
రేపటినుంచీ నీ కన్నతల్లి కనిపించదు నీకు
రెప్పలనిండా వేడి కన్నీరు పొరలి రానీకు
అమ్మమీది మమకారం తెంచుకో
అమ్మమాటలు మాత్రం అక్షరాలా గుర్తుంచుకో
ఒంటిగా గట్లవెంట తిరుగకు తుంటరిస్నేహాలు మరుగకు
పొలాలలో దొంగమేతలు మేసి పోట్లాడుకొనే ఆబోతులు
కోరకొమ్ములతో కుమ్ముతాయి జాగ్రత్త
దుమ్ములు విరజిమ్ముతాయి జాగ్రత్త

*

ఎక్కడబడితే అక్కడ "కుక్కలున్నాయి జాగ్రత్త"
అంగళ్ళలో ముంగిళ్ళలో "దొంగలున్నారు జాగ్రత్త"

*

అడ్డగాడిదలు నడ్డివిరుచుకొని
రోడ్డు నడుమ నడుస్తుంటాయి
కదిలిస్తే కాళ్ళు త్రొక్కుతాయి
ఎడమగా ఎడమెడముగా నడచిపోవాలి
జనసమ్మర్దాన్ని జాగ్రత్తగా గడచిపోవాలి

*

"హద్దూ పద్దూ" లేకుండా పెరిగి
"ముద్దూ ముచ్చట్లు" తెలీకుండా తిరిగి
అద్దాలతలుపులు బద్దలుకొట్టే
మొద్దబ్బాయి లెదురౌతారు జాగ్రత్త

*

బ్రతుకంతా వెనక్కి నడిచి నడిచి
బండి బోల్తా కొట్టించి
పట్కా తెంపుకొని పరుగెత్తే
జట్కాగుర్రాలు పైనబడతాయి జాగ్రత్త

*

"కాకా"పట్టి "బాకా"లూదే కాకాసురులు
లోకం ముఖానికి బురదపూసే మూకాసురులు
శ్వేతాంబరులు పీతాంబరులు
దిగంబరులు పైగంబరులు
రకరకాలవారు
చకచకా వస్తూంటారు
సర్దుకొని పోతుండాలి జాగ్రత్త

*

పొద్దస్తమానం పొలంగట్ల వెంబడి తిరిగి
పొద్దుపోయి ఇంటికి పోబోకు
బజార్లలో కటికచీకట్లు పచార్లు చేస్తూంటాయి
చీకటిబజార్లలో నడిస్తే చిక్కులపాలౌతావు జాగ్రత్త

*

ఒండొరులు విసురుకొనే కంకరరాళ్ళు ఒంటికి తగలకుండా
పరస్పరం పైన చిమ్ముకొనే పేడముద్దలు నీపైన పడకుండా
తప్పుకొని నేర్పుగా దాటిపోవాలి బాబూ ! జాగ్రత్త -
కన్నీటితో గోమాత అంటున్నది
కలవరంతో ఆవుదూడ వింటున్నది -

•

కాలకంఠుని నందివాహనం "మూలవిరాట్టు" నీకు
కడలిలో పుట్టిన కామధేనువు "కులదేవత" నీకు
గోమాత నీ కన్నతల్లి ! భూమాత నీపాలిటి కల్పవల్లి !
నీవు ధర్మదేవత సంతానానివి
నీ తండ్రి తాతల ప్రతిష్ఠ నిలబెట్టు
నీ జాతి నిండుగౌరవానికి నీరాజనం పట్టు

•

"ఏడువకు నాన్నా ! పేళయింది వెళ్ళివస్తాను
ఏడువకు చిన్నా! వెళ్ళివస్తాను - ఏడువకు కన్నా! వెళ్ళివస్తాను -"
అంటూనే వెళ్ళిపోయింది ఆవుతల్లి శీఘ్రం
ఆవు "నిజాయితీ"కి - ఆశ్చర్యపడింది వ్యాఘ్రం

•

"నీతికీ నిజాయితీకీ - ఖ్యాతిగాంచింది మీ జాతి
రాతిగుండెను సైతం రసమయం చేసింది నీ రీతి

నిన్ను తింటే భగవంతుడు
నన్ను మన్నింపడు
ఆవూ దూడా కలిసి మెలసి
జీవించండి హాయిగా
మంచిని పంచిపెట్టండి
మానవులకు చిరస్థాయిగా"
అప్పనుమరి!
క్రూరవ్యాఘ్రం గోవుగా మారటంలోనే ఉన్నది పరమార్థం
ఆవు వ్యాఘ్రంగా మారితే అది సంఘానికే అనర్థం
ఆకాశవాణి పుష్పవర్షం కురిపించి అభినందించింది
ఆనందమయ హృదయంతో ఆశీస్సులు అందించింది -

ఎంతవర్షం! ఎంతవర్షం!
ఎన్నడూ కనీ వినీ ఎరుగని వింతవర్షం!
"ఆవూ దూడా కథ" అభ్యుదయానికి ఒక ప్రతీక
ఐకమత్యానికీ అనురాగానికీ అది విజయపతాక.

• • •

# స్వర్గములో విప్లవము

[ ఆంధ్రప్రదేశ్ రాజధానిలో జరిగిన "ప్రపంచ తెలుగుమహాసభ"లలో ఏర్పాటు చేయబడిన "కవిసమ్మేళనము"నందు వికసించిన కవిత యిది తెలుగు సాహిత్యం, తెలుగు సంగీతం, తెలుగు సంస్కృతి, తెలుగు శిల్పం, తెలుగు నాట్యం, తెలుగు చలన చిత్రరంగం, తెలుగువారి అభిరుచులు స్వర్గంలో ఎలా వ్యాపించిందీ స్వర్గవాసులలో ఎటువంటి మార్పుతెచ్చిందీ, సంభావించిన ఊహాచిత్ర మిది. ]

"ఇందిరా ! ఇదేమి ? ఇంటిలో కూర్చుండి
వంటచేయుచుంటి వొంటిగాను ?"
"అక్క ! భాగ్యనగరమట ! తెల్గుసభలట !
కోడలమ్మపోయి కులుకుచుండె ! !"

స్వర్ణదీతటాన సౌపర్వకన్యలు
"ఎంకిపాట" లభినయింతురంట !
ప్రతిదినమ్ము అదితి "బంగారుబొమ్మ పూ
ర్ణమ్మ" మోము ముద్దులాడునంట !

ఉదయశ్రీ

"త్యాగరాజు"గారి తంబురా శ్రుతి విని
వాణి వీణ మౌన మూనెనంట।
"ఘంటసాల" వారి గానామృతము గ్రోలి
అమృత మొల్లరంట అమరులెల్ల।

అమరకాంతలెల్ల "అమరావతీకేశ
బంధము"లకె మోజుపడుదురంట।
చెక్కిరంట దేవశిల్పులు "ఓరుగల్
ద్వారబంధము"ను సుధర్మముందు।

సిద్ధహస్తుడైన "క్షేత్రయ్య" గారికి
రంభ ప్రణయలేఖ వ్రాసెనంట।
"కూచిపూడిబాణి" క్రొత్తగా నేర్చిన
అచ్చరలకు విలువ హెచ్చెనంట।

ఒకటి రెండు సార్లు "ఊర్వశి" రాదాయె
ఇంద్రసభకు ఎచటి కేగె నామె?
తెలుగు చలనచిత్రకళ ప్రేమతో పిల్వ
దివిని విడిచి భువికి దిగెను మగువ।

ఉదయశ్రీ

భాగ్యనగరి ద్రాక్షపండ్లు తెచ్చినగాని
తెరవదంట తలుపు దివిజగృహిణి ।
అమృతమానువేళ "ఆవగాయ"ను సురల్
నంచుకొందురంట నడుమ నడుమ ।

భాగవతములోని పద్యాలతో శచీ
దేవి పెదవి మరియు తీపియెక్కె ।
రుచులు పల్లవించు శచిమోవి క్షణమైన
వీడలేదు నేడు వేల్పురేడు ।

కవి సమూహమందు కాళిదాసుడులెస్స ।
మహలులందు తాజమహలు లెస్స ।
నగరులందు భాగ్యనగరియే హైలెస్స ।
దేశభాషలందు తెలుగు లెస్స ।।

* * *

# కత్తినే చివురాకు గుత్తిగా మార్చితివి !

దుండగుల్ తండోపతండమ్ములై భరత
ఖండమును దోచుకొన దండెత్తినపుడెల్ల
క్రోధాంధులైన యసురాధముల్ చెలరేగి
సాధుసందోహముల బాధించినపుడెల్ల
దానవత్వము కరాగ్రాన ఖడ్గము దాల్చి
మానవత్వమ్ము నవమానించినపుడెల్ల
స్వార్థముప్పొంగి పరమార్థమును దిగమ్రింగి
వ్యర్థముగ శాంతితో స్పర్థించినపుడెల్ల
కరుణమై భువికి నవతరణమై దీనులకు
శరణమయ్యెను స్వామి పరవశించెను భూమి !
దుర్మదాంధుల స్థాయి నిర్మూలమై పోయి
ధర్మధేనువు ఘంట మార్మ్రోగె నింటింట.

దుఃఖజలదసమూహములు దూరదూరముగ తొలగెను
జ్ఞానభాను మయూఖములు సకలదిక్కులను వెలిగెను
కవుల మానసాంతరముల కవితాంబుజములు విరిసెను
దివ్యఋషుల ఆశీస్సులు దేశచరితపై కురిసెను.

తరలి కృతయుగము త్రేతాయుగము వచ్చినది
రామచంద్రుని కీర్తిరాసు లందిచ్చినది
అరిగి త్రేతయును ద్వాపర మరుగుదెంచినది
శ్రీకృష్ణవైభవశ్రీలు వెలయించినది
అటుపైన కలియుగము నందుకొన్నది జగము
కలియుగము గుండెలో కదలె గాంధీయుగము
గాంధినామము దిగ్దిగంతముల మ్రోగినది
గాంధి వెనువెంట లోకమె కదలసాగినది.

తిలకించిన కవిచంద్రులు వెలుగువెన్నెలలు పంచిరి
పులకించిన గుండెలతో పుష్పాంజలు లర్పించిరి
"రోమారోలా" బాపూజీ మహిమము కీర్తించెను
రవికవి కవితాసుందరి నవనవమై నర్తించెను.

ఏమి జనత ! ఏమి ఘనత ! ఎంత పరవశించె మేను
ఈ మహాసముద్రములో నిసుకకణము నైతి నేను
ఈ ప్రజాప్రవాహములో నేను పదము కదపలేను
ఈ జయ జయ గానములో నేను పెదవి మెదపలేను.

కుటిల గర్జనలు దిక్కుల పిక్కటిల్లినవి
చటులార్భటులు వియత్తటుల చెలరేగినవి
"దెబ్బకు దెబ్బ కత్తికి కత్తియే" యన్న
వికటాట్టహాసాలు వినువీధి మ్రోగినవి.

కత్తికి పదునెక్కించిరి కుత్తుకలను తెగగోసిరి
మనుజులు దనుజులుగ మారి అనుజుల ప్రాణము దీసిరి
మరఫిరంగులను పేల్చిరి ధరణి గుండియలు కాల్చిరి
బాంబులతో విమానాలు అంబరాన నడిపించిరి
పొగలు గగనమున నిండెను భగభగ జగములు మండెను
ఇనుపగుండ్ల వానలు - ప్రవహించెను నెత్తురుసోనలు -

ఈ యుక్కు యుగము మన కెంత బలమిచ్చెనో
మతమనే పేరొక్క మతము హతమార్చినది
ఈ ఖడ్గయుగము మన కేమి ఫలమిచ్చెనో
దేశ మొక దేశమును దిగమ్రింగివేసినది.

ఇటువైపున విజ్ఞానులు అటువైపున అజ్ఞానులు
కల్లా కపటము లెరుగని పల్లెటూరి భగవానులు
పారా గొడ్డలి ధరించి పనిచేసెడి మజుదూరులు
పంటలు పండించి ప్రజకు పంచు రైతు సరదారులు.

ఎదురు చూచిరి వార లేమహాత్ముండైన
ఎప్పుడైన అవతారమెత్తి రాడా యంచు
రాకాసి మూకలను పోకార్చి లోకమే
మార్చి మనుజుల దిద్ది తీర్చి పోడా యంచు

వారెరుంగరు కాని వసుధాంగణముపైన
ఉదయించె నప్పుడే ఒక అహింసామాని
ఆ మహాత్ముని వెలుగులో మునిగినది క్షోణి
స్నేహభావము గ్రహించెను మానవశ్రేణి.

ఆత డెవడు? ఆత డెవరు? అర్ధనగ్నవృద్ధమూర్తి!
కన్నులలో ప్రజల ఆర్తి కంఠములో జయస్ఫూర్తి?
అతని లలాటమున నాట్యమాడు బ్రహ్మవర్చస్సులు
అతని దృగంతముల తేలియాడు సత్యరోచిస్సులు
అతని విశ్వప్రేమకు అసిధారలె తలలు వంచు
వాని ప్రతిజ్ఞకు వజ్రకవాటంబులె సంచలించు.

అతడే మన శాంతిమాత అతడే మన గాంధితాత
అఖిల ప్రపంచమునకు ప్రేమాస్పదుడగు మహానేత
యుద్ధభయ మ్మూడిపి జగతి నుద్ధరించె నతని వాణి
బుద్ధ మహమ్మద్ క్రీస్తుల సిద్ధాంతమ్ముల త్రివేణి.

కరిగిపోయె ఫిరంగి సురిగిపోయె తుపాకి
విరిగిపోయెను కత్తి తిరిగిపోయెను మిత్తి
ఈ యహింసామంత్ర మింత వినబడినంత
మారణాస్త్రాలు మటుమాయమయ్యెను వింత!

ఉదయశ్రీ

బండబారిన కఠిన పాషాణహృదయాలు
కరిగి తియ్యని తేనెకాల్వలయ్యెను నేడు
రావణుడు "రాముడను కావలె" నటంచు మది
భావించి హోమములు కావించు నీనాడు.

అవతరించినది మానవయుగం బీరీతి
అందుకొన్నది బాపు ఆశీర్మహాగీతి
నష్టమై కూలె దానవయుగం బాభంగి
దాటబాస్త్రముల పెనుభారాన మెడవంగి.

బండనే విరజాజి దండగా కూర్చితివి
"కత్తినే చివురాకు గుత్తిగా" మార్చితివి
దానవుని సరిదిద్ది మానవుని చేసితివి
ఈ విద్య బాపు! నీ వెచ్చోట నేర్చితివి?

అందుకొనుము బాపూ! నీ కర్ఘ్యాంజలి ఈ ఛందము
చిందింపుము ఈ నా జలబిందులపై మకరందము
ఆగాఖాన్ భవనములో ఆ యిరువురు మహామహుల
పుణ్యస్మృతిలో జలజల పొంగెను కన్నీటిజాలు

అందుల నీ కనురెప్పల సందులలో జారు బాష్ప
బిందులలో చెవరిన చిరుచిందులలో ఒకటి చాలు
చిందింపుము ఈ నా జలబిందులపై మకరందము
అందుకొనుము బాపూ! నీ కర్ఘ్యాంజలి ఈ ఛందము.

• • •

# ప్రగతిపథంలో సమంతారథం

నీవూ నేనూ కలిస్తే మనం
మనం మనం కలిస్తే జనం
జనమంతా ఒకటైతేనే ప్రయోజనం
అందుకే సమతా సూత్రాల నియోజనం

దేశమంటే మట్టి కాదని అందరికీ తెలుసు
దేశమంటే మనుషులనీ అందరికీ తెలుసు
అయితే ఆ చరణాలను ఆచరణలో పెట్టడం
ఎందరికి తెలుసు ?

దేశాన్ని ప్రేమించాలని అందరూ అంటారు
మంచిని పెంచాలనికూడా అందరూ అంటారు
అయితే ఈ సత్యాన్ని నిత్యకృత్యంగా చేసుకొనేవారు
ఎందరు ఉంటారు ?

ఉదయశ్రీ

వసుధైక కుటుంబం వాంఛనీయమే అందరికీ
అసలైన మానవత్వ మంటే అభిమానమే అందరికీ
అయితే ఈ "అసలు"లో దాగి ఉన్న సిసలైన అర్థం
అర్థమయింది ఎందరికి ?

భళ్లున తెల్లవారుతున్న సంగతి ఎల్లరికీ తెలుసు
నల్లని చీకట్లు వెళ్ళిపోతున్నవని ఎల్లరికీ తెలుసు
పొద్దుపొడిచి బారెడు పైకెక్కిందే
నిద్దుర మేల్కోవాలని ఎవరికి తెలుసు ?

అందరం ఒకతల్లి బిడ్డలమనే అంటారు
అందుకనే ఐకమత్యంగా ఉండాలనీ అనుకుంటారు
అయితే ఈ ఐకమత్యం ఏబజారులో అమ్ముతారో
ఎవరికి తెలుసునంటారు ?

ఇప్పటికీ మనిషి సాటిమనిషిమీద సవారీ చేస్తున్నాడు
ఇప్పటికీ మనిషి మరోమనిషి మాలిన్యాన్ని మోస్తున్నాడు
ఇప్పటికీ కిరాతుని శరం పావురంశిరాన్ని గురిచూస్తున్నది
ఇప్పటికీ అధర్మం ధర్మాన్ని ఏరిలీస్తున్నది

ఈనాటికీ రోడ్లమీద రోదిస్తున్నారు దీనవాళ్ళు
ఈనాటికీ ఎంగిలాకులకోసం ఎగబడుతున్నారు బిచ్చగాళ్ళు
ముందు మూతులునాకుతూ వెనుక గోతులు తీస్తున్నారు మోసగాళ్ల
చేతులు తిప్పుతూ నీతులు చెప్పుతున్నారు పగటివేసగాళ్ల

గురువులతో గుద్దులాటకు దిగుతున్నారు శిష్యులు
శిష్యులముందు లఘువు లయిపోతున్నారు గురువులు
గురువులూ శిష్యులూ కలిసిమెలిసి ఉండకపోవడంవల్ల
బరువులై పోతున్నాయి చదువులు

పాలకులు బాధ్యతలు గుర్తించాలంటున్నారు ప్రజలు
ప్రజలు బాగా తయారు కావాలంటున్నారు పాలకులు
ప్రజలూ పాలకులూ ఒకటైతేనేగాని
భవిష్యత్తు లేదంటున్నారు వైతాళికులు.

లంచాలూ లాలూచీలూ పెరిగిపోతున్నాయి
తిరగలేక ప్రజల కాళ్ళు అరిగిపోతున్నాయి
అంగళ్లలో పదార్థాలూ, అంతరంగాలలో యథార్థాలూ
అదేపనిగా తరిగిపోతున్నాయి.

ఉదయశ్రీ

బద్ధకం మాని సమతాసౌధానికి
సిద్ధం చేయించండి ఇటుకలు ।
ఇకముందు మింగలేరు ప్రజలు
ఈ చందమామ ఘుటికలు

మొన్నటిదాకా సోమరితనాన్ని ముసుగుపెట్టుకొని
కుంభకర్ణులమై గురకలు పెడుతున్నాము
నిన్నటినుంచీ అన్యాయాన్ని సహించలేక
వికర్ణులమై ముందడుగు పెడుతున్నాము

వస్తున్నది వస్తున్నది వస్తున్నది అన్నపూర్ణ
వస్తున్న కుమారులకై పరమాన్నం తెస్తున్నది
ధర్మచక్ర చక్రేశ్వరి దయాపూర్ణ వస్తున్నది
'సత్యమేవ జయతే' అని జగతి కభయమిస్తున్నది

సకల ప్రియ మమతామయ సమతా స్వాతంత్ర్యరథం ।
నవజాగృత యువభారత నర నారీ మనోరథం ।
వస్తున్నది వస్తున్నది వసుధైక కుటుంబ రథం ।
వస్తూ కొని తెస్తున్నది సుస్థిరసుఖశాంతి పథం ।।

# బుద్ధదేవుని పునరాహ్వానము

దయసేయంగదవయ్య శాక్యమునిచంద్రా! నీ పదస్పర్శచే
గయిసేయంగదవయ్య భారత మహీఖండంబు; దీవ్యత్ కృపా
మయ మందార మరంద బిందులహరీ మందస్మితాలోకముల్
దయసేయంగదవయ్య మానవ మనస్తాపంబు చల్లారఁగన్.

స్వార్థ జ్వాలల దేశభద్రతలు స్వాహా యయ్యె; విద్రోహముల్
వర్ధిల్లెన్; కుటిల ప్రచారములు దుర్వారంబు లయ్యెన్; మన
స్పర్ధా సంకులమైన యీ జగతికిన్ శాంతిం బ్రసాదింప సి
ద్ధార్థస్వామి! మహాకృపామతి దిగిరావయ్యా పురోగామివై!

హింసాశక్తులు రక్తదాహమున దండెత్తెన్ దరిద్రప్రజా
సంసారమ్ములపై; పురోగమనముల్ స్తంభించె; స్వాతంత్ర్యమే
ధ్వంసంబయ్యె; కిరాత శాత శరవిద్ధంబైన యిద్ధారుణీ
హంసన్ గాయము మాన్పి కావవలెనయ్యా! రమ్ము వేగమ్మునన్!

ఉదయశ్రీ

ఆటంబాంబుల బీటవాఱినది బ్రహ్మాండంబు; సద్భావమే
మోసైపోయెను; పంచశీల పథకమ్ముల్ దుమ్ముపట్టెన్; దురా
శాటోపంబులు హద్దుమీఱినవి; పోరాటమ్మే ఆరాటమై
లూటీచేసిరి మానవత్వమును ఆలోకింపు లోకప్రభూ!

హాలోన్మత్తులు దేవదత్తులు; జిఘాంసాలోలులౌ అంగుళీ
మాలుల్ రేగిరి: లోభ మోహ మద కామ క్రోధ మాత్సర్య దుర్
వ్యాళ క్ష్వేళ కరాళ హాలహల కీలాభీలమై అల్లక
ల్లోలమ్మయ్యె జగమ్ము సర్వము, దయాళూ! రమ్ము రక్షింపఁగన్!

ఘీంకారం బొనరించుచుం బయికి మాకెన్ ఓనిపీనాంబరా
లంకారమ్ముల కొమ్ముదెస్గు తడవేలా శాక్యసింహా! యికన్
జంకుం గొంకును లేని నీ మధుర హస్తస్పర్శతో తన్మనో
హంకారం బెదలించి పాదముల సాష్టాంగంపడంజేయవే!

యుద్ధజ్వాలలు మూగె; భీతిలి జగమ్ముయ్యాలలూగెన్; రుషా
క్రుద్ధవ్యాఘ్రము "గాండ్రుగాండ్రు" మనుచున్ గ్రొన్నెత్తుటల్ త్రాగె; జా
త్యౌద్ధత్యమ్ములు రేగె; దుండగుల యత్యాచారముల్ సాగె; నో
సిద్ధార్థా! ప్రళయాగ్నులార్పవె! ప్రజాశ్రేయమ్ము చేకూర్పవే!

# ప్రేమమూర్తి

సిలువపై నెత్తురు చిందించి పాపుల
పాపాల బాపు కృపాపయోధి
అమృతసందేశమ్ము నందించి భ్రష్టుల
శిష్టుల గావించు స్నేహమయుడు
నడువజాలక బోర్లపడు గొర్రెపిల్లను
కౌగిట గదియించు కన్నతండ్రి
ఆర్తుల ప్రార్థన ఆలించి లాలించి
పాలించు ఆపన్న బాంధవుండు

అతివిశాల ప్రపంచవైద్యాలయమున
బద్ధులై యున్న రోగుల నుద్ధరించు
పెద్దవైద్యుడు పరిశుద్ధ ప్రేమమూర్తి
క్రీస్తుదేవుడు ప్రజల రక్షించుగాక !

# క్రిస్మస్ కిరణాలు

తెల్లని వెండిరెక్కలతో తేజరిల్లే దేవదూతలు
చల్లని పండువెన్నెలలో సంచరించే శుభవిధాతలు
కారుణ్యగుణధన్యయైన మేరీకన్యకు కన్పించారు
సారోదారమైన "సువార్త" చక్కగా విన్పించారు

"భయపడకు భయపడకు తల్లీ! భగవంతుడు కరుణిస్తాడు
జయం! జయం! నీ కడుపున జగత్ప్రభువు జన్మిస్తాడు
మానవజాతిని చేరదీసి మంచిమార్గ మందిస్తాడు
దానవత్వాన్ని రూపుమాపి దాక్షిణ్యం చిందిస్తాడు,"

ఆ మాట విన్న మేరీ హృదయం ఆనందంతో నిండింది
ఆమె జన్మ సార్థకమయింది ఆమె తపసు పండింది
కాంతిరేఖల కరుణమూర్తికి తాను కన్నతల్లి కాబోతున్నది
శాంతిచూపుల జగత్ప్రభువుకు తాను జనయిత్రి కాబోతున్నది

ఉదయశ్రీ

అనంత నీలాకాశంలో తళుక్కుమని మెరిసిం దొకప్రక్క
కనకకాంతులు చిమ్ముతూ కదలిం దా చక్కని చుక్క
పతితపావనుడైన మహామహుడు పశువులపాకలో ప్రభవించాడు
గతిలేని జగతికి ప్రగతి కల్పింప గడ్డిగంపలో శయనించాడు

చిన్నితండ్రిని కన్నతల్లి కన్నులవిందుగా తిలకించింది
మన్నూ మిన్నూ ఏకమైనట్లు మాతృహృదయం పులకించింది
ప్రపంచం నలుమూలలా ప్రకాశం ప్రసరించింది నిండు నిండుగ
ప్రజానీకాని కాలోజే ప్రప్రథమమైన "క్రిస్మస్" పండుగ.

• • •

# మేరీమాత

సద్ధర్ముడైన జోసఫ్ మహాశయునకు
అర్ధాంగియైన కన్యాలలామ
దివ్యదర్శనులైన దేవదూతల శుభా
శీర్వాదములు గ్రహించిన సవిత్రి
భువనరక్షకుడైన పుణ్యస్వరూపుని
కని పెంచినట్టి బంగారుతల్లి
లోకమ్ముకొరకు ఏకైక పుత్రుని సిల్వ
కర్పించినట్టి ధన్యాత్మురాలు

మాతలకునెల్ల మాత ధర్మప్రపూత
సార సౌజన్య సముపేత మేరిమాత
నిండుగుండెల జాలి కన్నీటిజాలు
బడుగుజీవుల కలుషముల్ కడుగుగాక !

# చెల్లాయి లేఖ

చిన్నన్నా ! క్షేమంగా ఉన్నావా !
చేతిలో మరతుపాకీ పట్టుకొని
శిరస్సుపై ఉక్కుటోపీ పెట్టుకొని
క్షణక్షణం నిరీక్షిస్తున్నావా !
జన్మభూమిని రక్షిస్తున్నావా !
చిన్నన్నా ! క్షేమంగా ఉన్నావా !

పంటచేలు పాడుచేసే
గుంటనక్కల పళ్ళు రాలుస్తూ
గొర్రెపిల్లల కోసం గుటకలు మింగే
టక్కరి తోడేళ్ళ డొక్కలు చీలుస్తూ
బద్ధకంలేకుండా - నిద్దురపోకుండా
భారతదేశం సరిహద్దులు కాస్తున్నావా

నాన్న అమ్మా నిన్ను తలచుకొని
కన్నీరు పెట్టని రోజు లేదు
బుజ్జి తమ్ముడు నీ ఫోటోకు
పూలదండ వెయ్యని రోజు లేదు

ఉదయశ్రీ

చిట్టితల్లి బొమ్మలో ఉన్న నిన్ను
చేయెత్తి పిలవని రోజు లేదు

కొత్తగా మనం కొన్న గోవుతల్లికి
కోడెదూడ పుట్టింది
బుజ్జాయి మెడలో చిట్టితల్లి
గజ్జెలు కట్టింది
గజ్జెలబుజ్జాయి బజారంతా
గల్లుగల్లుమని గంతులెయ్యటం మొదలెట్టింది

పెరటిలోని గున్నమామిడి
పిందెలు వేస్తున్నది
వీథిలో ఉన్న సురపొన్న
పులకించి పూలు పూస్తున్నది
గుమ్మడితీగ గొడ్లపాక పైకెక్కి
నీకోసం నిత్యమూ ఎదురు చూస్తున్నది

మనవూ రిప్పుడు మారిపోయింది బాగా
వెలవెలపోవటంలేదు వెనుకటిలాగా
అయిదారు నెలల్లోనే అంతా వింత అనిపిస్తున్నది
అదేదో నవచైతన్యం అందరిలోనూ కనిపిస్తున్నది.

ఉదయశ్రీ

చెరువుగట్టు ఎప్పటికంటే ఎత్తుచేశారు
దొంకంతా మెరకపోసి కంకరరోడ్డు వేశారు
బస్సీనుంచి సిటీబస్సులు వస్తున్నాయి వూళ్లోకి
శ్రద్ధగా చదువుచెప్పే మేష్టర్లొచ్చారు మన బళ్లోకి

లాంతర్లూ చిమ్నీలూ మాయమయ్యాయి
లైట్లు ఇంటింటా వెలిశాయి
వెలుగులు వెదజల్లుతూ మన వూరు
కళకళలాడుతున్నది ప్రతిరేయి

గుడికి వెల్ల వేస్తున్నారు
బడి తలుపులు రెండుపూటలా తీస్తున్నారు
బూజు దులిపి లైబ్రరీలో
పుస్తకాలన్నీ సరిచేస్తున్నారు

గుడిలోపలి పోలేరమ్మ
వడపప్పు పానకం తెమ్మంటున్నది
కోళ్లూ పొట్టేళ్లూ మానేసి
కొబ్బరికాయలు కొనిరమ్మంటున్నది

అన్నయ్యా! మన వూరికి
హాస్పటల్ కూడా వచ్చింది

57)

తనవెంట ప్రసూతికేంద్రాన్ని తెచ్చింది
అప్పట్లో వైద్యసహాయం లేకనేగదా
అటువంటి పరహాలతల్లిని వదిలెను
పోగొట్టుకున్నాము
ఆ మహాతల్లి ప్రేమచిహ్నంగా
చిట్టితల్లిని మాత్రం నిలబెట్టుకున్నాము

అసమర్థుని అహంకారంలాగా
అదేపనిగా పెరిగిన ధరలు
సిగ్గుతో తలవంచుకొని
తగ్గుముఖం పట్టాయి
భగవంతునివలె కంటికి కన్పించని పంచదార
ప్రార్థన చేయకుండానే దర్శనమిస్తున్నది

హస్తలుసొమ్ము దిగమింగిన మాస్టర్ "మూర్తి"కి
ఊస్టింగ్ ఆర్డర్ పంపించారు
లంచాలు మేసి లైసెన్సులు పంచిపెట్టినందుకు
గంగిరెద్దు లింగయ్యను గద్దె దింపించారు

నూనెలో కల్తీ కలిపిన పానకాలుకు
నూరు రూపాయల జరిమానా పడింది

తప్పుడు లెక్కలు వ్రాస్తూ
ఎప్పుడూ తలుపులు తెరవని
అప్పలసామి చౌకదుకాణంలో
ఆరుబస్తాల బొంబాయిరవ్వ పట్టుబడింది

ఇరవైవేల కట్నం అందుకొని
ఇనప్పెట్టె ఇవ్వనందుకని
వాణి మెడలో తాళి కట్టనని
భీష్మించుక్కూచున్న పెండ్లికొడుకు మణి
పోలీసులకు ఫోను చేశారని విని
పుస్తె బిగించాడు నోరు మూసుకొని

పాకీస్తాన్ యుద్ధంలో -
ఓ కాలు మోకాలుదాకా పోగొట్టుకొన్న వీరన్న
కొయ్యకాలుమీద నడుస్తూనే
కోరమీసాలు మెలేస్తున్నాడు
తన వీరగాథలు వినిపిస్తున్నాడు
జనాన్ని నిలేస్తున్నాడు

ఊరిలోని యువకులందరూ కలిసి
యువజనసంఘంగా ముందుకు వచ్చారు

ఉదయశ్రీ

మన గ్రామంలోని ఆడవాళ్ళంతా
మహిళామండలి పెట్టారు
కుట్టూ అద్దకం బుట్టలల్లటం లాంటి
కుటీరపరిశ్రమలు చేపట్టారు

రైతులు నూతన వ్యవసాయ రీతుల్లో
బంగారు పంటలు పండిస్తున్నారు
పాతర్లూ గాదెలూ నింపిస్తున్నారు
పెద్దలకు రాత్రిపాఠశాలలూ
పిన్నలకు బాలానందకేంద్రాలూ వెలిశాయి
ఊళ్ళో పార్టీలన్నీ కలిశాయి.

తాతయ్య నాన్న పెళ్ళికి చేసిన
పాతబాకీ వడ్డీలకు వడ్డీలు కట్టి
రెండువందలు - పన్నెండు వందలు చేసిపెట్టి
బలవంతంగా పట్టుపట్టి
మన ఇల్లు తాకట్టు పెట్టించుకొన్న షావుకారి సెట్టి
నల్లధనం దాచిపెట్టాడని
జైల్లో తోశారు!
మన బాకీ పూర్తిగా రద్దు చేశారు!

కిట్టిగాడిచేత రాత్రింబవళ్లు
పట్టించుకునేవాడుగా పొట్టకరణం పళ్లు
పెట్టివాడికే పట్టివిడ్డమని
ఐదువందలు ఇప్పించింది
ప్రభుత్వం అపరాధం కింద।
కిట్టుడు కిళ్లీకొట్టు పెట్టాడు మన రావిచెట్టు కింద।

పక్కింటి బంగారమ్మ మొగుడికి
ప్రభుత్వం ఒక సైకిల్‌రిక్షా ఇచ్చింది
ఆనందంగా బతుకుతున్నారు వాళ్ళిప్పుడు
ఓనర్లపీడా వదిలిపోయింది

హైస్కూలు వార్షికోత్సవాల్లో
ఐదు ప్రైజులు సంపాదించిన బుజ్జిగాడు
పదోతరగతి పరీక్ష వ్రాసి
ఫస్టుక్లాసులో ప్యాసయినాడు

ఇదివరకు ఏదోలా వున్నా
ఇప్పుడు బాగానే వుంది మన పని
ఓట్లేసొద్దు అన్నాడు నాన్న
"ఇదంతా అమ్మ చలవే"నని

ప్రతినెలా నీవు పంపే మనియార్డరు
పదో తారీఖు దాటకుండా అందుతున్నది
ఇబ్బంది లేకుండా ఇంటిఖర్చుకు సరిపోతున్నది

నా లేఖ ఈసారి కొంచెం పెద్దదయిం దనుకుంటా
కాలేజీ ప్రై మయింది - మరి ఉంటా !
ఇదీ ఇప్పటి మన వూరి కథ
ఇట్లు నీ ముద్దుల చెల్లి - సుధ.

* * *

# స్వర్ణ సంక్రాంతి

దినకరుడు మకరరాశిని ప్రవేశింపగా
అరుదెంచె ఉత్తరాయణ పుణ్యకాలంబు;
కనులపండువుగ పూచినవి గుమ్మడిపూలు
ఆదిత్య "బంగారు అర్ఘ్యపాత్రము" లట్లు.

పైడిపంటలతోడ ప్రభవించె భూమాత
పాడిపంటలతోడ భాసిల్లె గోమాత;
అత్తవారింట అర్ధాంగి వలపులపంట
విందులతోడ ఆనందించె జామాత.

ఆడపిల్లలు పతులతోడ ఇంటికి రాగ
తిలకించి, పులకించు తెలుగుతల్లులరీతి -
బంతిపువ్వులతోడ పసుపుకుంకుమలతో
ద్వారబంధాలు బంగారుకాంతులు చిందె.

ఉదయశ్రీ

క్రొదెసూపలు పాలు గుడిచి గంతులు వేయ
పాడియావులు పొంగి పరవశించు విధాన -
రంగారు సరిక్రొత్త రంగవల్లికలతో
ఇళ్లు వాకిళ్లు ముంగిళ్లు కళకళలాడె.

పరికిణీ పాదాలపైన చిందులు త్రొక్క
అక్క వేసిన ముగ్గు త్రొక్కకుండగ నడిచి,
హరిదాసు తలమీది అక్షయపాత్రలో
దోసెడు బియ్యమ్ము పోసె ముద్దులచెల్లి.

అభ్యంజనస్నానమై, క్రొమ్ముడిని విరుల్,
కాళ్ళ పారాణి, వాల్గనుల కాటుక మెరయ
చీర పేటంచు కుచ్చెళ్ళు తళతళలీన
అమ్మాయి అమ్మ పాదమ్ములకు మ్రొక్కినది.

దీవించె తల్లి "వచ్చే వత్సరమ్మునకు
గుమ్మడిపండంటి కొడుకు నెత్తు" మటంచు;
సిగ్గుచెందెడి ప్రేయసిని కేల దువ్వుచును
అత్తతో అల్లుడిటు లన్నాడు నవ్వుచును -

"కొడుకుపై ప్రేమచే చెడిపోయె కురురాజు"
"కొడుకుపై మమతచే కుమిలిపోయెను కైక"
"కొడుకులు చాల దుందుడుకు లైనారు" - "అ
వ్వాయి వలదండి అమ్మాయి కావలెనండి."

అలరె సంక్రాంతి ముగ్గుల నడుమ గొబ్బెమలు
కవితలో అక్కడక్కడ యతిప్రాసలటు;
ఔచిత్య మెరుగని - అందాలు తెలియని -
దున్నపోతులు కొన్ని - త్రొక్కె గొబ్బిళ్ళన్ని

ముక్కుత్రాళ్ళు పొడిచి, కొమ్ములకు రంగులు పులిమి,
బింబొంతలు పైన వేసి, తల లూపించి,
గంగిరెద్దుల దొరలు కడు అమాయికులైన
"డూడు బసవన్న"లను ఆడించుచున్నారు.

కాళ్ళకు కత్తులం గట్టి. దాడా పెట్టి,
రెక్కలు దువ్వ, కైపెక్కి ఆవేశపడి -
కోళ్లు తమలో తాము కొట్లాడుకొనుచుండ
వేడ్కతో నాయకుల్ వీక్షించుచున్నారు.

ఉదయశ్రీ

గొబ్బిపిడుకలు కొట్టుకొనె మొండిగోడలకు
పాలు పొంగించుకోవలెనంచు ఇల్లాలు;
గోడ పిడుకలె ఒలుచుకొని కొట్టుకొన్నాడు
ఓట్ల మైకమ్ములో ఉభయపక్షమువారు.

ఎండనక వాననక ఏడాది కష్టపడి
పండించుకొన్న క్రొంబసిడి ధాన్యపురాశి
పంటకళ్ళమునుండి ఇంట చేరినదన్న
సంతృప్తి మెరసె కర్షకుల కన్గొనలందు

బంతిపువ్వులు, మిరపపండ్లు, బంగరుతల్లి
వసుధా వధూమణికి పసుపు కుంకుమ లయ్యె;
జమిలి దుప్పట్లతో చలికంఠములు కట్టి
భోగిమంటల చుట్టు మూగసాగిరి ప్రజలు.

తులసెమ్మముందు ముగ్గులు పెట్టి గిన్నెలో
గంగిగోవుల పాలు పొంగించె నిల్లాలు;
కనుల కద్దుకొని సంక్రాంతి పరమాన్నములు
చిక్కుడాకుల భుజించిరి బాలబాలికలు.

బావగారిని చెవుల పట్టి ఆడించు చె
ల్లిని పిల్చి బుగ్గ గిల్లినది మెల్లగ అక్క;
గుడిసెపై జారిన క్రొంగ్రొత్త సొరపిందె
పాసెమ్ముకోసమై కోసి తెచ్చెను రైతు.

పులి ప్రక్క మేక, ఏన్గుల మధ్య కుందేలు,
పూరిల్లు - మేడ, మోటారు - ఎద్దుల బండి,
రాజు - బంటును, సామరస్యంబు సమకూర్చ
కనులవిందయ్యె "సంక్రాంతి" బొమ్మలకొలువు.

"మా యింట అక్క బొమ్మలకొలువు పెట్టినది
బాబిగాడికి భోగిపండ్లు పోసెద" మంచు
గోరంటప్రేళ్ళ కుంకుమబరిణె పట్టుకొని
"పేరంట" మని చిట్టి ఊరంత పిలిచినది.

"చిట్టితల్లీ !" యంచు శ్రీవారు పిలువగా
చిట్టి తల్లియు వచ్చె చిట్టితల్లియు వచ్చె;
తత్పురుషము కర్మధారయన్ గని నవ్వె
నవ్వులో స్వర్ణసంక్రాంతి పక్కున నవ్వె.

# నవవధువు

జడనిండ మల్లెమొగ్గలు
నొడినిండ జివుళ్ళు దాల్చి యొయ్యారముతో
నడతెంచు నవవధూ! మా
గడపల నడుగిడుము నిత్యకల్యాణముగన్.

అరవిచ్చిన విరజాజుల
చిఱునవ్వుల కలికి సిగ్గు సింగారమ్ముల్
సరిక్రొత్త చీర మడతల
మరుగున జెరలాడ రాగమయి! రాగదవే!!

కమ్మని పరీమళమ్ములు
గమ్మన కలకంఠ కంఠ కల కాకలితో
క్రొమ్మావి కొమ్మవలె నో
యమ్మాయీ! కదలు మస్మదంగణమందున్,

మమతామయివై సృష్టికి
సమరస భావమ్ము నేర్పు సౌజన్యముతో
రమణీయ రాగ రంజిత
సుమనోరథ మెక్కి రమ్ము శోభనమూర్తీ!

పచ్చని యాకులలో గో
ర్వెచ్చని విరిదేనియలు స్రవింపగ విచ్చీ
విచ్చని పుష్పాంజలితో
విచ్చేయుము మా వసంత వీథులలోనన్.

రసమయ రాజ్యశ్రీ వై
వసంత కమనీయ కల్పవన వాటికలఁ
బ్రసరింపుము మా బ్రతుకులు
ప్రసన్నమధురమ్ము లగుచు ఫలియింపంగన్.

అందములగు కందమ్ముల
నందనవనములను దాటి నవరస భావ
స్పందము లందించెడి మధు
మందాకిని! సాగిరమ్ము మా ముంగిటికిన్.

అభినవ నాట్యశ్రీ వై
త్రిభువనకల్యాణభారతీ! రావమ్మా!
శుభకృన్మధుమాస నవ
ప్రభాతములు నీ పదాల పారాణు లిడన్.

# ఆషాఢస్య ప్రథమదివసే

కాళిదాసు కంఠంలో
కందళించిన మేఘమా !
కవికులగురువు గంటంలో
కరిగి నీరైన కరుణమయూఖమా !
కన్నీళ్ల గుండెలతో నీవు
ఎన్నాళ్లకు మళ్ళీ దర్శనమిచ్చావు !!

అక్షరరమ్యమైన ఆషాఢ ప్రథమ దివసాన
దాక్షిణ్యమూర్తివై సాక్షాత్కరించి
యక్షుని సందేశాన్ని యక్షపత్ని కందించి
"రామగిరి"ని "ప్రేమగిరి"గా మార్చిన
జీమూతదేవా ! మహానుభావా !
క్షేమంగా ఉన్నావా !!
అన్నట్లు బాగుందా నీ ప్రియభామిని !!
తళుకు బెళుకుల సౌదామిని !!

జనకుని గారాలు కూతురు
స్నానాలు చేసిన దొరువులతో
చల్లని నీడలు వెదజల్లే
చక్కని చిక్కని పురపొన్న తరువులతో
ఎంతబాగుంటుందో మరి -
శ్రీరాముని చరణాలు సోకిన ఆ "రామగిరి"!!

చల్లనివాడవు! సెగలు వెదజల్లనివాడవు!
కల్లా కపటా లెరుగని తటిల్లత చెలికాడవు!
భువనప్రసిద్ధి గడించిన
పుష్కలావర్తక వంశంలో పుట్టినవాడవు!
కష్టాలలో ఉన్న దంపతులను
కాపాడటానికి కంకణం కట్టిన మొనగాడవు!
మండే గుండెలను చల్లపరిచే నీ తొలకరింపులు
ప్రేయసీ ప్రియులకు తీయని పలుకరింపులు

ఘోరమైన కుబేరుని కోపానికి గురియై
ఘోరాతిఘోరమైన శాపానికి బలియై
తరుణీ విరహంతో పరితపించే యక్షుడు
కరుణామయ జీవితం గడిపే జాగరజాదుణాక్షుడు
నిరంతర ప్రేయసీధ్యాన నిష్ఠాగరిష్ఠుడు
కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠుడు

ఉదయశ్రీ

నిన్ను గాంచి కన్నులనిండా నీరు నించి
కుటజకుసుమాంజలి సమర్పించి అర్థించాడా!
కుబేరపురిలోని కోమలాంగికి తన
కుశలవార్త కొనిపొమ్మని ప్రార్థించాడా!

విపన్నుడైన యక్షుని విన్నపం విన్నావు
అపార కృపా ప్రపూర్ణుడవై "తథాస్తు" అన్నావు
"రామగిరి"నుంచి "అలకాపురి" దాకా
మార్గం తెలుసుకున్నావు
శిరమున హరివిల్లు ధరించిన నీవు
శిఖిపింఛమౌళి కన్నయ్యలాగున్నావు

ఆ రామగిరినుంచి అలకాపురి చేరిందాకా
దారిపొడుగునా ఎన్ని నదులు! ఎన్ని పర్వతాలు!
ఎన్ని పట్టణాలు! ఎన్ని పల్లెలు! ఎన్ని చక్కని ప్రదేశాలు!
ఎన్నెన్ని తియ్యని పన్నివేశాలు!!

ముద్దుల ముఖాలమీద పడే
ముంగురులు పైపైకి త్రోసుకుంటూ
ఆసతో నీకేసి చూస్తున్న
ప్రోషితభర్తృకలూ

తొలకరి చినుకులకు పులకరిస్తూ
ఆప్యాయంగా అదేపనిగా
చూపులతో నీ రూపాన్ని త్రాగుతున్న
కాపుకన్యకలూ కన్పించారా ।
"అయ్యో పాపం" అన్పించారా ।

పెరటితోటల్లో గంతులు వేస్తూ
అరటి పిలకలు కొరికే హరిణశాబకాలూ
హలాలతో అప్పుడే దున్నిన
పొలాల కమ్మని పరిమళాలూ
పురులు విప్పి పరవశించి ఆడే మయూరాలూ
కమలనాళాల పాథేయంతో
కైలాసందాకా తోడువచ్చే కలహంస బారులూ
నవ్వులతో పువ్వులమ్మే పుష్పలావికల పలుకుతీరులూ
అవలోకించావుగా హాయిగా
అవి నీకు ఆనందం కలిగించాయిగా ।

పండిన మామిడిపండ్లతో నిండిన
శిఖరాగ్రాన నల్లని నీవు కొలువుండిన
ఆమ్రకూట పర్వతం
వసుంధరాదేవి వక్షోజవైభవాన్ని
వహించిందట ।

ఉదయశ్రీ

నిన్ను తిలకించి పులకించిన నీచైర్గిరి
నీకు ఆతిథ్యం నిర్వహించిందట!

జంబూ నికుంజాలలో చల్లగా సాగే రేవానది వంపులూ
అంబుకణగ్రహణచతుర చాతకగణాల కవ్వింపులూ
ససంభ్రమాలింగన ముగ్ధ సిద్ధదంపతుల మురిపింపులూ
సద్యోవికసదుద్యాన యూధికా వీథికల గుబాళింపులూ
శ్రీవిశాల "విశాల" సిరిసంపదల సొంపులూ
ఇంపు పుట్టించాయిగా!

ఉజ్జ్వల కాంతిపుంజమై
ఉర్వికి దిగి వచ్చిన స్వర్గఖండం వంటి
ఉజ్జయినీ నగరాన్ని దర్శించావుగా!
శిప్రానదీ శీతల వాతపోతాలను స్పర్శించావుగా!
ముచ్చనైన అచ్చటి ముద్దుగుమ్మల
పారాణిముద్రలతో రాణించే
ధర్మహర్మ్యాలను పరామర్శించావుగా!

మహాకాళనాథుని మందిరం దర్శించి
స్వామివారి సాయంకాలసేవలో పాల్గొని
ధీర గంభీర ఘనగర్జనంతో
"నగారా" మ్రోగించావా!

మృత్యుంజయ మహాదేవుని
నృత్యారంభ సంరంభంలో
సంధ్యారాగరంజితుడవై ప్రేలి
స్వామిభుజాగ్రాలపై ప్రాలి
సృజించావా గజచర్మాంబరశోభను !
భజించావా త్రిజగత్ప్రభువును !

కాళరాత్రి కటికచీకటిలో
ప్రియులకోసం పయనం సాగించుతూ
దిక్కుతెలియక చిక్కుపడిన
అక్కడి అభిసారికలకు
"తళుక్కు తళుక్కు"న మెరుస్తూ
దారి చూపించావుగా !
అమాంతం ఉరమలేదుగదా ? పాపం వారు
అసలే బెదురుగుండెలవారు

దేవగిరి క్షేత్రంలో స్కందదేవునిపై
పూవులవర్షం కురిపించావుగా !
స్వామివాహనమైన ఆ మయూరాన్ని నాట్యంచేయించి
మైమరపించావుగా !
జగన్మాతను మురిపించావుగా !

మంచుకొండ మనోహరదృశ్యాలు కన్నావా!
కొంచెంసేపు చల్లగా అలుపుతీర్చుకున్నావా!

నదీజలాలు కడుపునిండా త్రాగి త్రాగి సాగుతూ
నడుమ నడుమ గిరిశిఖరాలపై ఆగుతూ
బ్రహ్మావర్తం - సరస్వతి - కురుక్షేత్రం - కనఖల
అన్నీ అధిగమించి దాహం తీర్చుకోటానికి
గంగానదిలోనికి నీవు వంగినప్పుడు
గంగాయమునా సంగమం కన్పించిందిటగా!
హిమగిరిశృంగంమీది నీ పొంకం
ఈశ్వరుని వృషభం కొమ్ము కంటిన పంకం అన్పించిందిటగా।

రాశీభూతమైన సదాశివుని అట్టహాసం
చూశావా మహాకైలాసం!

ఉరగకంకణం పరిహరించిన
పరమశివుని కరం పట్టుకొని జగజ్జనని
వెండికొండపై విహరించే సమయాన
భవాని పాదపల్లవాలకు పాషాణఖండాలు
ఒత్తుకోనట్లుగా
మెత్తని మెట్లుగా
నీ మేను అమర్చావేమో!
అమ్మ చరణస్పర్శలకు చెమర్చావేమో!

ఉదయశ్రీ

అక్కడికి అల్లంతదూరంలో
ప్రియుని ఒడిలో ప్రియురాలిలా
అలకాపట్టణం అందాలు చిందించిందా!
మందాకినీ శీతలమందమారుతాలకు
నీ నెమ్మేను స్పందించిందా!

ఎల్లవేళలా అక్కడి తరులు పూస్తుంటాయిట।
ఎల్లవేళలా అక్కడి సరోవరాలు కమలనేత్రాలతో చూస్తుంటాయిట।
ఎల్లవేళలా అక్కడి నెమిళ్లు పురివిప్పి నాట్యం చేస్తుంటాయిట।
ఎల్లవేళలా అక్కడి సంధ్యలు వెన్నెలలు కాస్తుంటాయిట।
బాహ్యోద్యానంలోని పరమేశ్వరుని శిరశ్చంద్రచంద్రికలు
పట్టణప్రాసాదాలకు ఎల్లవేళలా వెల్లవేస్తుంటాయిట।।

పారిజాత పాదపాలక్రింద
బంగారుఇసుక కుప్పలు చేసి
ఆడపిల్లలు మణికలాక ఆట
ఆడుకుంటున్నారా!
ఓవాలున ప్రియుడు
చీర లాగివేసినప్పుడు.

సిగ్గుతో దిగ్గునలేచి - చేసాచి -
గుప్పెడు గందపొడి అందిపుచ్చుకొని
గుప్పున మణిదీపం ఆర్పటానికి
విఫలప్రయత్నం చేసిన
వ్రీడావతి క్రీడావతి అయిందా!

కుబేరుని ప్రాసాదానికి కొంచెం ఉత్తరంగా ఉన్న
సురపతి ధనుశ్చారుతోరణమైన
యక్షుని భవనం గుర్తించావా!
అందుకోటానికి వీలైన పూలగుత్తులతో
క్రిందికి వంగిన అందాల బాలమందారం
మందిరంముందు
కందోయికి విందు చేసిందా।
సింహద్వారానికి అటూ ఇటూ
చిత్రించిన శంఖచక్రాలు గమనించావా।

ఇంటి ప్రక్కనే దిగుడుబావి
బావి ప్రక్కనే క్రీడాశైలం
శైలాగ్రాన గాలికి కదలే కనకకదళీవనం
వనంచెంత మాధవీమంటపం

దాని చెంత చిగురాకు ప్రేళ్ళతో రమ్మని పిలిచే
రక్తాశోక కేసర వృక్షాలూ - స్ఫటిక ఫలకం - నెమిలీ
అన్నీ చెప్పినట్లే ఉన్నాయిగా!
అవి నీ హృదయాన్ని లోగొన్నాయిగా!

యక్షుడు చెప్పినట్లు గవాక్షంలోనుంచి
వీక్షించావుగా కొంచెం వంగి.
అగుపించిందా ఆ తన్వంగి!
ఆయన అర్ధాంగి ప్రియవియోగకృశాంగి
కుందరదన - అరవిందవదన
ఏకవేణీధర - పక్వబింబాధర
సృష్టికర్త సరిక్రొత్త సృష్టి
దృష్టికి సుధావృష్టి
చెక్కిట చెయి చేర్చి
శిశిరపద్మినిలా కూర్చున్న విరహిణి
యక్షగృహిణి

ఆమె ఏమిచేస్తున్నది!
శూన్యంలోకి చూస్తున్నదా!
కష్టాలు కడతేర్చుమని
ఇష్టదైవాన్ని ఆరాధిస్తున్నదా!

ఉదయశ్రీ

తన ప్రియుని చిత్రం గీస్తున్నదా!
స్వర్ణపంజరంలోని శారికను ప్రశ్నిస్తున్నదా!

కన్నీళ్ళతో తడిసిన తంత్రుల్ని తుడిచి -
వేడి వేడి నిట్టూర్పులు విడిచి -
బలవంతంగా విపంచిని పలికిస్తున్నదా!
గడువుకోసం నిరీక్షిస్తూ
గడపమీద ఉంచిన పువ్వులను గణిస్తున్నదా!
ఏకాంతంలో ఆ చిన్నది
ఏమి చేస్తున్నది?

యక్షుని విరహసందేశం యక్షపత్నికి వినిపించావు
సాక్షాత్తూ ఆంజనేయుడవే అనిపించావు
వెచ్చని నిట్టూర్పులు అరికట్టి
పచ్చని కాపురం నిలబెట్టావు
ప్రాణదాతవు! ప్రణయదూతవు!
కన్నీళ్ళగుండెలతో నీవు
ఎన్నాళ్ళకు మళ్ళీ కన్పించావు!!

ఏది ఏమైనా ప్రియావియోగం దుస్సహం నేస్తం!
ఎన్నడూ విడువకుసుమా నీ ప్రియురాలి అరుణహస్తం!!

# భువన బాంధవుడు

శాంతమనోజ్ఞమై అరుణసారథికంబయి యేకచక్రవి
క్రాంతము సప్తసప్తి రుచిరంబగు స్యందనమెక్కి స్వర్ణసం
క్రాంతులతో సహస్రకరకాంతులతో భువనత్రయిఁ బ్రభా
వంతమొనర్చు సూర్యభగవానుడు మాకు శుభంబు లిచ్చుతన్.

• • •

# "వందే వాల్మీకి కోకిలమ్"

క్రౌంచవధూ వ్యథా విధురకంఠ విముక్త విషాద గీతికా
సంచలితాత్ముడౌ ప్రథమసత్కవిభావము పొంగి వెల్లువై
ముంచుకొనెన్ రసజ్ఞజగమున్ రఘురామ కథా సుధారసా
భ్యంచితమై ప్రపంచ "మహహా" యని మెచ్చిన యాదికావ్యమై.

క్రౌంచి యొక్కటి ఆర్తితో గళము విప్ప
ఓ కవీ! నీదు శోకమే శ్లోకమయ్యె;
కోట్లకొలది దీనుల జాలి గొంతుకలకు
కరగ దింతేనియును నేటి కవుల గుండె.

వేదవేద్యుడు పరమాత్మ విశ్వమయుడు
దశరథాత్మజుడై ధరాస్థలి జనింప
వెలసె వేదంబు వాల్మీకివలన రస ప
రాయణముగ సాక్షాత్తు రామాయణముగ.

రాముడా - కాదు; శౌర్యస్థైర్య గాంభీర్య
రమణీయ సుగుణాభిరాము డతడు ।
సీతయా - కాదు; రాశీభూత సౌశీల్య
పూత త్రిలోకైకమాత యామె ।
భరతుడా - కాదు; సౌభ్రాత్ర సౌజన్య సం
భరితుడౌ ఆదర్శచరితు డతడు ।
గుహుండటే - కాదు; రఘుస్వామి కార్యని
ర్వహణ నేర్చిన మహామహు డతండు ।
హనుమయా - కాదు; రామపాదాబ్జరస త
రంగ భృంగాయమానాంతరంగు డతడు ।
అదియు రామాయణంబటే - ఆదికవి యు
పాయనం బిచ్చు ప్రేమరసాయనంబు ।।

తీయని పదాల "రామ రామా" యటంచు
తీయతీయగ రాగాలు తీయుచున్న
కమ్మకైతల క్రొమ్మావి కొమ్మమీది
ఆదికవి కోకిలస్వామి కంజలింతు.

• • •

# అమరశిల్పి

అనురాగములు చిందు కనుదమ్ము లొకచోట
చెక్కిళ్ళ మిసమిస లొక్కచోట
రంగారు కుచ్చెళ్ళ సింగార మొకచోట
నొక్కుల తలపాగ లొక్కచోట
అరవిచ్చు విరజాజి చిరునవ్వు లొకచోట
చక్కని వాల్చూపు లొక్కచోట
అపురూపములు జవ్వనపు సొంపు లొకచోట
చిక్కని మెరవంపు లొక్కచోట

చెక్కినా వాంధ్రశిల్పి ! నీ చేయి సోక
స్తూప మిది శిల్పదేవతారూపమయ్యె
బాబు ! నీ ఉలి తాకిన పాలరాయి
యంగుళమ్మంగుళము జగన్మంగళమ్ము !

# ర స మ యి

కలువలు పూచినట్లు। చిరుగాలులు చల్లగ వీచినట్లు। తీ
వలు తల లూచినట్లు। పసిపాపలు చేతులు సాచినట్లు। క్రొ
వ్వలపులు లేచినట్లు। చెలువల్ చెలువమ్ముగ చూచినట్లుగా
పలుకుట పూర్వపుణ్యపరిపాకముగాదె తలంచి చూడగన్.

తెలతెలవారులీల! తొలిదిక్కున బాలమయూఖ మాలికల్
కలకలలాడులీల! కమలమ్ములజంట సరోవరమ్ములో
కిలకిల నవ్వులీల! గిలిగింతలతో సెలయేటి కాలువల్
జలజల పారులీల! కృతిసల్పుట భాగ్యము యోగ్య మెంతయున్!

"ఛందోబద్ధకవిత్వ" మట్లు బిగువుం జందోయి కందోయికిన్
విందుల్ సేయ, "స్వతంత్రగీతిక" వలెన్ వెమ్మోముపై ముంగురుల్
చిందుల్ త్రొక్క, "కథానికా" విధమునన్ చిర్నవ్వు చెక్కిళ్ళలో
స్పందింపన్ కనుముందు నిల్చు రసనిష్యందంబ! నీ వెవ్వరే?

# "నమోవాకం ప్రశాస్మహే"

ఆచార్య భరతులు

లీలాతాండవలోల ధూర్జటి జటాళిందోర్మిమాలాచల
ద్బాలేందూజ్జ్వల నాట్యశాస్త్రరచనా పారంగతప్రజ్ఞు; స
ర్వాలంకారిక మార్గదర్శకు; నమందానంద మందాకినీ
శైలేంద్రున్; రసరాజ్యధుర్యు భరతాచార్యున్ ప్రశంసించెదన్.

సరసోదాత్తము, భారతీయము, కళాసామ్రాజ్య, ముచ్చైర్గుణా
కర, మౌచిత్యనిదాన. మార్షము, నలంకారాఢ్యమున్, దేవతా
పరిషచ్చాక్షుషయజ్ఞ, ముల్లసిత సప్తత్రింశదధ్యాయమౌ
పరమామ్నాయము "నాట్యశాస్త్ర" మలరున్ ప్రత్యక్షర ధ్యేయమై.

ఆనందవర్ధనులు

అనిదంపూర్వ మహామనీష రససిద్ధాంత ప్రసిద్ధంబుగా
ధ్వనిసిద్ధాంతము దిద్దితీర్చి కవితాతత్త్వజ్ఞు లెల్లన్ జయ
ధ్వను లీయన్ వెలుగొందు కందళితకావ్యానందు ఆనందవ
ర్ధను ప్రార్థింతు స్వనామధన్యు బుధమూర్ధన్యున్ జగన్మాన్యునిన్.

అభినవగుప్త పాదులు

శ్రీ కాశ్మీరము పొంగి పొంగి పులకించెన్ నీదు పాదాబ్జముల్
సోకన్; కుంకుమపూల తోటలు శిరస్సుల్ వంచె నీముందు; నీ
లోకాలోకన "లోచనం" బది సమాలోకించె కావ్యాత్మ: ని
న్నాకాంక్షించె రసాత్మ; నిన్ వలచె నాట్యంబున్ మహాశైవమున్।

ధన్యం, బుజ్జ్వల సర్వదార్శనిక మూర్ధన్యంబు, మాన్యం, బసా
మాన్యంబైన మహస్వికం "బభినవం"బై "నాట్యసర్వస్వమై"
ధ్వన్యాలోకము కన్ను విప్పుదుట గుప్తంబై తగన్ సాహితీ
కన్యాలోకము నేలుకొన్నది కళా కల్యాణ కాశ్మీరమై.

జగన్నాథ పండితరాయలు :-

గుండెలు జారి పండితులు కూలబడన్, మది మెచ్చి పాదుషాల్
దండముపెట్ట లాక్షణికతల్ వెలయించి, యఖండపాండితిన్
గండరగండడై తెలుగుగడ్డకు ఖ్యాతిగడించిపెట్టె మా
పండితరాజు; సౌమనస భారతి నోచిన నోము లెట్టివో!

అసమాన ప్రతిభా ప్రదీప్తి "రమణీయార్థంబు నిండారు శ
బ్దసముల్లాసమె కావ్య" మంచు ధ్వనివాదమ్మున్ ప్రపంచించి, మా
నస మానందమయమ్ముగా రసజగన్నాథాఖ్య గైకొన్న మా
"రసగంగాధరభట్టు" ప్రౌఢకవిసమ్రాట్టున్ ప్రశంసించెదన్।

# కవిసార్వభౌముండం

ఎవరయ్యా, ఎవ రీ మహామహులు ? బ్రాహ్మీమూర్తు? లీ గద్దెపై
కవితాశ్రీ కరకంకణ క్వణనముల్ కంఠాన మార్మ్రోగగా
శ్రవణానందముగా బృహస్పతులతో శాస్త్రార్థముల్ సల్పుచున్
దివిషన్నాథుని వామపార్శ్వమున సందీపించుచున్నా రహో ॥

చెవులన్ బంగరు కుండలాలు; నొసటన్ శ్రీగంధ కాశ్మీరబిం
దువు; మేనన్ ఘనసార సంకుమద కస్తూరీ నవామోదముల్;
శివతేజస్వి విశాలఫాలము: రసశ్రీ లొల్కు కందోయి; ఔ
నవు శ్రీనాథుడవా ! భళీ కమలనాభామాత్య మన్మండవా !

దేవాచార్యుల గుండె దిగ్గురనగా దీవ్యద్విమానంబుపై
నీ వా స్వర్గపురంబు చేరితివా లేనే లేదా; రంభోర్వశీ
శ్రీవక్షోజయుగంబు పొంగి పులకించెన్ । వేశవాటంబులో
"పూవుందూపులజోదు ప్రచ్చుకొనియెన్ బంద్రేక్షుకోదండమున్।"

ఆశాజ్యోతివి తెల్గుగుండియల కయ్యారే ! అయఃపిండమా
కాశీఖండమునందు నీ కవిత బంగారాలు పండించెలే ।
ఆశాంత ద్విపదంత కుంతముల కుద్యద్దీప్తి నిండించెలే ।
రాశీభూత మదాంధ ధూర్త కవి దుర్గర్వంబు ఖండించెలే ।

కనులన్ కాటుక దిద్ది, వాల్జడ విరుల్ క్రై సేసి, సౌందర్యవా
హినియౌ మోహినియై సముజ్జ్వల కళాహేలాసమాలోలయై
మనసారన్ విబుధవ్రజంబును సుధామాధుర్యధుర్యం బొన
ర్చిన శ్రీనాథు ననల్పశిల్పవిజయశ్రీ శ్రీలు వర్షించతన్ ॥

* * *

# ఆంధ్ర భోజుడు

న్యాయము పట్టుకొమ్మ, కరుణానిధి, ఆంధ్రచరిత్ర నూతనా
ధ్యాయము, వీరవిక్రమనిధానము, కావ్యసరస్వతీ చిర
స్థాయి, శుభప్రదాయి, నృపసంతతికిన్ బయిచేయి యైన మా
"రాయలవారి వంటి నృపరత్నము లేదుగదా ధరాస్థలిన్ !"

న్యాయము వంటి మిత్రమును, నందకుమారుని వంటి దైవమున్,
ప్రేయసి వంటి బంధువును, పెద్దన వంటి కవీంద్రుడున్, మహో
పాయపయోధి తిమ్మరుసు వంటి యమాత్యుడు, ధర్మమూర్తి మా
"రాయల వంటి రాజు కనరాడు గదా ధరణీతలంబునన్."

"ఒక్కగజమ్ము నేలుటకు నుక్కిరిబిక్కిరియై శిరోజముల్
చిక్కబడంగ పర్వులిడె శ్రీహరి నా" దను నప్రతిష్ఠ న
ల్దిక్కుల కెక్క అక్కడవ తీర్పగ విష్ణువు కృష్ణరాయలై
చక్కగ కొల్వులో నిలిపి సాకెను ఎన్మిది దిగ్గజమ్ములన్ ॥

# కవితా వైజయంతి

దోసెడు పారిజాతములతో హృదయేశ్వరి మెల్లమెల్లగా
డాసిన భంగి, మేలిమి కడాని వరాల కరాలు వచ్చి క
న్మూసిన భంగి, కన్నె నగుమోము పయిన్ నునుసిగ్గుమొగ్గ కై
సేసిన భంగి, అందములు చిందెడి నందనవాటి వెన్నెలల్
కాసిన భంగి, జానపదకాంతలు రాట్నము మీద దారముల్
తీసిన భంగి, క్రొవ్వలపు లేఖ శకుంతల తామరాకుపై
వ్రాసిన భంగి, పెండ్లి తలబ్రాల్ జవరాలు రవంత నిక్కి పై
బోసిన భంగి, గుండె వడబోసిన భంగి, కళావిపంచికల్
మ్రోసిన భంగి, పొంగు వలపుల్ తలపుల్ సొలపుల్ ప్రసన్నతల్
భాసురతల్ మనోజ్ఞతలు ప్రౌఢిమముల్ రసభావముల్ గడున్
భాసిల తెల్గుకైత నవభంగుల సంగతమై, యొకింతయున్
దోసములేని శబ్దములతో. నటనం బొనరించు పాద వి
న్యాసముతో, సమంచిత గుణంబులతో, సహజమ్ములౌ యతి
ప్రాసలతో, మనోజ్ఞమగు పాకముతో, మృదుశయ్యతో, అనా
యాస సమాసయుక్తి కలశాంబుధి తీర పురోనిషణ్ణదే
వాసుర మండలాంతర విహార వికస్వర విశ్వమోహినీ

హాసవిలాస విభ్రమకరాంచల చంచల హేమకుంభ సం
భాసి సుధాఝరీ మధురిమమ్ములు గ్రమ్ముకొనన్ వలెన్; శర
న్న్యాస శుచిప్రసన్న యమునాతట సైకత సాంద్రచంద్రికా
రాస కలా కలాప మధుర వ్రజ యౌవత మధ్య మాధవ
శ్రీసుషమా ప్రపూర్ణ తులసీదళ సౌరభ సారసంపదల్
రాసులు రాసులై పొరలి రావలె; పొంపిరి పోవలెన్ నవో
ల్లాస వసంత రాగ రస లాలిత బాలరసాల పల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూకల కాకలీధ్వనుల్ ।।

• • •

# బ్రాహ్మీ మూర్తి

నవసారస్వత పట్టభద్రులు! రసానందప్రియంభావుకుల్!
కవిసమ్రాట్టులు! పద్యభూషణులు! సాక్షాత్కల్పవృక్షస్వయం
భువులౌ మీకు కళాప్రపూర్ణుల కివే ముక్కోటి పుష్పాంజలుల్
భవదీయంబగు మూర్తి వెల్గు జగతిన్ బ్రాహ్మీమయస్ఫూర్తితోన్.

ఆయన కాయనే సరి; అనన్వయ మాయన: వేయి సత్యనా
రాయణ; సర్వథా రసపరాయణ మాయన ప్రజ్ఞ; విజ్ఞు "లా
హా" యన భావి భావుకరసాయనమౌ గతి సంతరించె "రా
మాయణ కల్పవృక్ష" సుమహాకృతి కావ్యకళాబహూకృతిన్.

శ్రీవిశ్వనాథుని సిగలోని శశిరేఖ
    చిన్నారి వెన్నెలల్ చిందె నేడు
ఫణిపలస్వామి శేషుని వేయిపడగల
    మణిపరంపర జిగేల్ మనియె నేడు

ఉదయశ్రీ

కలశవార్నిధి చెలియలికట్ట వేల్పుతో
య్యాలుల నర్తనశాల యయ్యె నేడు
వాల్మీకి నన్నయ వదనమ్ము దెస తిల
కించి నవ్వుచు పులకించె నేడు
కరము వాగర్థములు పరస్పరము పరవ
శించి రసజగత్తును స్పృశించినవి నేడు
కల్పవృక్షంబు దివినుండి కదలి వచ్చి
మెచ్చి మేలిఫలమ్ము లందిచ్చె నేడు.

ఈనాడు దుర్గాభవాని కోవెలగంట
దిగ్దిగంతాల ప్రతిధ్వనించె
ఈనాడు మా కృష్ణవేణీతరంగాలు
నవరసమ్ముల తోడ నాట్యమాడె
ఈనాడు మా తెల్గురాణి కల్కితురాయి
క్రొత్తరీతుల తళుకొత్తసాగె
ఈనాడు మా వాడలోని వృక్షము లెల్ల
కల్పవృక్షమ్ములై కళలు చిందె

ఇన్నినాళ్ళకు ఆంధ్రసాహిత్యలక్ష్మి
కంఠము నలంకరించె నుత్కంఠతోడ
జ్ఞానపీఠ సంస్థాన సమ్మానమైన
శతసహస్రవరాల వజ్రాలమాల ॥

# సర్వేపల్లి

తన దర్శనము పురాతన నూత్న తత్త్వద
    ర్శనముల కొాక నిదర్శనము గాగ,
తన పాలనమ్ము స్వతంత్రభారత వికా
    సమ్మున కుపలాలనమ్ము గాగ,
తన వాణి దిగ్దిగంతర దీప్త విశ్వక
    ల్యాణమ్మునకు మేలుబాణి గాగ,
తన కీర్తి దిగ్వధూజనవేణికల విర
    బూచిన విరజాజి పూలు గాగ,

ప్రభలు వెదజల్లు విజ్ఞానభాస్కరుండు
ప్రాచ్య పాశ్చాత్య వేదాంతపండితుండు
భరత జనయిత్రి శీర్షమ్ముపై చిరత్న
రత్నమై వెల్గు "భారతరత్న" మతడు !!

సాధుస్వాంతుడు, సౌమ్యదర్శనుడు, శశ్వద్విశ్వసంస్తుత్యవా
ఙ్మాధుర్యుండు, మహామనీషి, యుగధర్మజ్ఞాత, విజ్ఞానవి
ద్యాధౌరేయుడు, సర్వదార్శనిక మూర్ధన్యుండు, ధన్యుండు మా
రాధాకృష్ణ మహాశయుం డప్పుడె స్వర్గద్వారముం జేరెనా !

అతడు "ద్వితీయ రాష్ట్రపతి" యయ్యు జగంబున అద్వితీయమౌ
ప్రతిభకు పేరుగన్న మన భారతరత్నము ! తత్వశాస్త్ర పం
డితులకు పండితుండు ! మహనీయ తపస్వి ! అశేషధీసమం
చితుడు ! విశేష వాగ్విభవశేషుడు ! నేటికి కీర్తిశేషుడా !!

# ఘంటసాల

చలనచిత్రశ్రీ విశాల ఫాలమ్ముపై
తళతళ మెరయు గంధర్వతార
ఆపాతమధురమౌ అబ్జసంభవు రాణి
స్తన్యమ్ము గ్రోలిన చంటిబిడ్డ
సంగీత సాహిత్య సంబంధ మెఱిగిన
సరసార్థ వైఖరీ స్వాదుమూర్తి
యువకంఠముల నవనవకళల్ పలికించి
యొరవళ్లు దిద్దిన గురువుగారు

తమిళ కర్ణాట కేర ళాంధ్రముల యందు
వేలకొలది గీతమ్ముల నాలపించి
ఖ్యాతిగన్నాడు చాల "సంగీతలక్ష్మి
కంఠ కల్హారమాల!" మా ఘంటసాల!

దయశ్రీ

ఆ భావభంగిలో అందాల బాలలై
నవరసంబులు వచ్చి నాట్యమాడు
ఆ రసస్ఫూర్తిలో అనురాగమాలలై
రాగాలు పూలతోరణము గట్టు
ఆ రాగలహరిలో ఆనందడోలలై
సప్తస్వరాలు సాక్షాత్కరించు
ఆ గళస్వరములో అనుబంధలీలలై
పులకరించిన కళల్ పలుకరించు

అతడు ప్రసన్న మధుర భావార్ద్రమూర్తి
పరస సంగీత సామ్రాజ్య చక్రవర్తి
లలిత గాంధర్వదేవత కొలువుదీరు
కలికి ముత్యాలశాల ! మా ఘంటసాల !

అద్వైతమూర్తి సాంధ్యశ్రీ కపోలాల
కోటిస్వర్గాలను కొల్లగొట్టి
పాలబుగ్గల పూలబాల గుండెలలోని
జాలి నిట్టూర్పులో తేలిపోయి
కన్నబిడ్డను గంగ కర్పించు కుంతికు
మారి గోర్వెచ్చ కన్నీరు తుడిచి
"రాధనురా ! కావరా !" యని కాళింది
తీరాన నడురేయి తిరిగి తిరిగి

"ఏది ఏది మరొక్కమా రూదు" మంచు
ముగ్ధ మురళీధరుని వ్రేళ్లు ముద్దులాడి
ఘంటసాల సంగీత గంగాస్రవంతి
సంచరించు రసజ్ఞ నేత్రాంచలముల !!

సంగీత సాహిత్య శృంగార మాధురీ
గంగా తరంగాలు పొంగి పొరలిన లీల
చల్లచల్లని పాలవెల్లిలో జావిల్లి
మల్లె మొగ్గలు మెలమెల్ల జల్లిన లీల
మందార కుం దారవింద మాకంద మ
రందనిష్యందాలు చిందులాడిన లీల
సోగకన్నుల రాణి రాగరంజిత పాణి
మ్రోగించు వీణపై మూగు తీగెల లీల
నీ కంఠరవములో నిండియున్నది హాయి
నీ రాగలహరిలో నిలచె చక్కని స్థాయి
నీ పాట క్రొవ్వలపు నివ్వటిలు పూదోట
నీ వాణి వన్నెచిన్నెల పంచకళ్యాణి.

నీ రజతోత్సవప్రభలు నించునులే "విరజాజి వందలై"
భారతమాత పేరురముపై సుకుమారపరీమళమ్ములన్;
నీ రమణీయగీతులు ధ్వనించునులే సకల ప్రపంచ సం
చారపథమ్ములన్ రసికసంతతికిన్ "మధురానుభూతులై !!"

• • •

# రసతరంగాలు

''మునికిన్ కోపమె భూషణంబగు ప్రజామోదంబు సంధిల్లగన్''

మునికిన్ శాంతము భూషణంబగు; సుధాపూరంబు వర్షించు సో
మునికిన్ కౌముది భూషణంబగు; జగమ్మున్ కాచి రక్షించు రా
మునికిన్ ధర్మమె భూషణంబగు; దురాత్ముండౌ బకుం గూల్చు భీ
"మునికిన్ కోపమె భూషణంబగు ప్రజామోదంబు సంధిల్లగన్."

''మందర మెత్తుచుండె కనుమా రఘురాణ్మణి సుందరీమణీ!''

ఎందుల కింత సిగ్గు! తల యెత్తుము! శ్యామల కోమలాంగు డీ
సుందర సుస్మితాననుడు సోదరు చేతికి విల్లొసంగి క
న్విందుగ ముందు కేగె! శివువిల్లు గనెన్! పులకించిపోవ మే
"మందర; మెత్తుచుండె కనుమా రఘురాణ్మణి; సుందరీమణీ!"

''నారికి నారియైన పరనారులు పక్కుమటంచు నవ్వరే!''

పౌరుషవంతుడైన శిశుపాలుని గాదని వట్టి జారుడున్
చోరుడు నైన కృష్ణునకు సోదరి నిత్తురె! బొగ్గుతోడ బం
గారము గూర్చుటల్ తగదుగా! మన రుక్మిణి ఆ కురూపి హా
"నారికి నారియైన పరనారులు పక్కుమటంచు నవ్వరే!"

''లలనా రమ్మని లాగె సత్య పయిచేలంబూని శ్రీకృష్ణునిన్''
అల వైదర్భికి పారిజాతకుసుమం బందించి నా కా సువా
ర్తల నందింపగ వచ్చి ద్వారము కవన్ రారాదగా నేటికిన్ ;
కలనైనన్ నిను విశ్వసించెదనె దొంగా ! నమ్ముటల్ నీదు రీ
"లలనా ! రమ్మని లాగె సత్య పయిచేలం బూని శ్రీకృష్ణునిన్."

''జారుల జాచి వందనము సల్పిరి భక్తులు ముక్తికాంక్షతో''
కోరిక దీర మ్రొక్కుకొని కొండపయిన్ శివరాత్రినాడు జా
గారము చేసి దీపముల కాంతులలో నవవారిపూర గో
క్షీరమధుద్రవాల నభిషేక మొనర్చెడి స్వామివారి పూ
"జారుల జూచి వందనము సల్పిరి భక్తులు ముక్తికాంక్షతో."

''అమవసనాటి వెన్నెల లహా ! మది నెంత జనించు వేడుకల్.''
అమవస యైననేమి భవదాననచంద్రుడు గల్గ; నేడు నీ
సుమధుర సుస్మితద్యుతులు సుందరి వెన్నెలలీనె; నా మన
స్తిమిరము విచ్చిపోవ సుదతీ ! యొక చక్కని నవ్వు నవ్వుమీ
"యమవసనాటి వెన్నెల లహా మదినెంచ జనించు వేడుకల్."

''నీవును నీవునున్ మఱియు నీవును నీవును నీవు నీవునున్''
"నీవు గజాస్య చంక దిగనీయవు ; న న్నన లెత్తుకోవు ; నీ
కా వెనకయ్య ముద్దుకొడు కయ్యెనులే !" యని యేడ్చు షణ్ముఖున్
దేవి భవాని కౌగిట గదించి ముఖంబులు ముద్దుగొం చనెన్
"నీవును నీవునున్ మఱియు నీవును నీవును నీవు నీవునున్."

ఉపయస్త్రీ

''ప్రాణేశా''యని గౌరి పిల్చె తనయున్ బాలిండ్లు పొంగారగన్.''

"రాణీ!" "స్వామి!" "గణేశుడేడి?" యడె ద్వారంబందు మీ క్రొన్నెలన్
వేణిం బెట్టి, ఫణిన్ సకజ్జలగళోర్విన్ జుట్టి, మీ శూలమున్
పాణిం బట్టి, జగాల బాలశివుడై పాలించెడిం జూడు డో
"ప్రాణేశా!" యని; గౌరి పిల్చె తనయున్ బాలిండ్లు పొంగారగన్."

''వెలదియురమ్మునందు వటవృక్షము మొల్చె మహాద్భుతంబుగన్.''

నిలునిలు కోయబోకు ధరణీసుర! రక్కసియాకు లవ్వి! గో
కులమున జంపె మున్ను హరి క్రూరనిశాచరియైన పూతనన్;
పొలతి కళేబరంబు నిట పూడిచిపెట్టిరి; మట్టియైన య
"వ్వెలది యురమ్మునందు వటవృక్షము మొల్చె మహాద్భుతంబుగన్."

వెలది యశోద పాల్గుడుచు వెన్నుని శ్రీవటపత్రశాయిగా
దలచి తలంచి మైమఱచి తన్మయతన్ గలగాంచె, సర్వది
క్కుల వటపత్రముల్ పరచుకొన్నవి; కొమ్మకు కోటి కృష్ణులై
"వెలది యురమ్మునందు వటవృక్షము మొల్చె మహాద్భుతంబుగన్."

''లంగాలోపల దాచుకొందు విది యేలా చేల! నీ ఫాలమున్?''

"భృంగంబుల్ కమలమ్ముపై మసరె." "చుంబించెన్ శశిన్ మేఘముల్
శృంగారోన్నతి మేల్ బళీ!" యనుచు నేన్ చిర్నవ్వుతో పల్క; త
న్వంగి! మేలి ముసుంగు సర్దుకొని నీ హస్తాలలో మెల్ల మె
"ల్లంగా లోపల దాచుకొందు విదియేలా చేల! నీ ఫాలమున్."

"ఒకరా! యిద్దర! ముగ్గురా! నలుగురా! యున్నార లెందెందరో!"

అకటా! రుక్మిణి కిచ్చినారు కుసుమం; బా వార్త నా కిచ్చినా
రిక చాలున్ దయసేయు మచ్చటికె స్వామీ! మీకు లోటేమి; భ
ల్లుకముల్ కోతులు కొండముచ్చులు భవల్లోలాక్షు లీ వీటిలో
"నొకరా యిద్దర ముగ్గురా నలుగురా యున్నార లెందెందరో."

అకటా! భారత మెట్లు బాగుపడునయ్యా! ధూర్తదుశ్శాసనుల్
శకునుల్ సైంధవులున్ శిఖండులు జరాసంధుల్ మదోన్మత్త కీ
చక కిమ్మీరులు స్వార్థబుద్ధులు దురాశాబద్ధు లద్ధంబుగా
"నొకరా ఇద్దర ముగ్గురా నలుగురా యున్నార లెందెందరో."

"ఊర్వశి! రమ్ము నీకిదె బహూకృతిగొమ్ము! కపాలకుండలా!"

శర్వ! గిరీశ! సాంబ! శివ! శంకర! రుద్ర! భవా! హరా! వృషా
ధూర్వహ! ధూర్జటీ! తలలు తొమ్మిది కోసితి; పూజ చేసితిన్;
శర్వ! ఇదొక్కటే మిగిలె; స్వాములకుం దయ రావటంచు ని
"ర్వా! శిరమ్ము నీ కిదె బహూకృతి కొమ్ము! కపాలకుండలా!"

"భామయు భామయుంగలియ బాలుడు పుట్టెను సత్యభామకున్."

శ్రీమతి లేఖ లంపినది; చేయను కార్యము మాను; తా నట
గ్రామణియైన యల్లుఁ డొకరాతిరి యాతురి చెల్మికత్తెయై
మామగృహంబు చేరి తన మానిని గూడెను; ఆ యసత్యపుం
"భామయు భామయుం గలియ బాలుడు పుట్టెను సత్యభామకున్."

''రవి కాననిచో కవి కాంచునేకదా !''

రవి వికసింపజేయును సరస్సులలోని సరోరుహంబులన్;
కవి వికసింపజేయు రసికవ్రజ చిత్తసరోరుహంబులన్;
అవి వసివాడిపోవు, నివి యన్ననొ నిత్యవినూతనమ్ములౌ,
కవి రవికన్న గొప్ప; "రవి కాననిచో కవి గాంచునేకదా !"

పట్టణ మేగె నొక్కకవి పండుగకున్; కవిభార్య స్నానమై
కట్టెను పట్టుచీర; రవికన్ ధరియించుచు నుండ తల్పులన్
నెట్టె కవీంద్రు; డా రవికనే కవి కన్నుల గప్పె కాంత; బొ
నట్టుల మోమునందు "రవి కాననిచో కవి కాంచునేకదా !"

''మదగజయానకున్ రవికమాత్రము చాలును చీరయేటికిన్ !''

పదములు జారి నే మయసభన్ బడి - బట్టలు ముద్దయైన నా
డిది నెఱజాణ-నన్గని "హిహీ" యనె: విప్పుము చీర, పుంశ్చలిన్
వదలకు దుస్ససేన ! మగవారల నేపుర జుట్టుకొన్న యీ
"మదగజయానకున్ రవిక మాత్రము చాలును చీర యేటికిన్ ?"

''కారాగారమునన్ ధ్వనించె నవురా ! గంధర్వసంగీతముల్ !''

క్షీరాబ్ధిన్ శయనించు స్వామి శయనించెన్ దేవకీపుత్రుడై
కారాగారములో నటంచు త్రిదశుల్ గంధర్వులున్ కిన్నరుల్
చేరన్ వచ్చి, ప్రదక్షిణించి, నతులై శ్రీకృష్ణు గీర్తింపగా
"కారాగారమునన్ ధ్వనించె నవురా ! గంధర్వసంగీతముల్ ."

"లంజే కొన్నది నాదు మానసము లీలాలోలహేలాకృతిన్."

పుంజీభూత మహామహోజ్జ్వల జగత్పూర్ణ ప్రతాపోదయా!
మంజీరకృత దిగ్దిగంతర మదోన్మత్తారి బాహుద్వయా!
సంజాగన్నయ! త్వద్యశోమృత సరస్సంజాత కంజాత మా
"లం జేకొన్నది నాదు మానసము లీలాలోలహేలాకృతిన్."

సంజాగద్భుజశౌర్య! నీ వొసగు చంచచ్చీనిచీనాంబరా
లం జేకొన్నది నా యురమ్ము! బహుమాల్యప్రస్ఫురత్ భూషణా
లం జేకొన్నది నా కరమ్ము! సరసాలంకార సాహిత్య బా
"లం జేకొన్నది నాదు మానసము లీలాలోల హేలాకృతిన్."

"అమ్మా! రమ్మని పిల్చె భార్యను మగం డయ్యర్ధరాత్రంబునన్."

లెమ్మా! బంగారుబొమ్మ! నవ్వినవి మల్లెల్ వాల్జెడన్; వీడె మం
దిమ్మా! నిద్దురబోయి రెల్లరును; సిగ్గింకేల? నా ప్రేమ రా
గమ్మా! ముద్దులగుమ్మ! మన్మథుని సింగారంపు మేల్ పూల వి
"ల్లమ్మా! రమ్మని పిల్చె భార్యను మగం డయ్యర్ధరాత్రంబునన్."

పొమ్మన్నా వటు మంత్రసాని కొఱకై: పోబోవ నే బోదు రా
రమ్మన్నా విటు; వచ్చి ఇచ్చట వసారాలోన బజ్జుంటివా!
అమ్మాయిం గని పావుగంటయినదే అమ్మాయి; ఓ నిద్ర పె
ద్దమ్మా! రమ్మని పిల్చె భార్యను మగం డయ్యర్ధరాత్రంబునన్.

కొమ్మా ! ఆవుకు మేతవేయుటకు నే కొట్టమ్ములో తేగగా
గుమ్మమ్మందున తేలు కుట్టినది ! నాకున్: భగ్గునన్ మండె పా
దమ్మంతా ! భరియింపజాల నిక బాధన్; లెమ్మ ! "అబ్బబ్బ !" అ
"మ్మమ్మా !" రమ్మనిపిల్చె భార్యను మగం డయ్యర్ధరాత్రంబునన్ "

అమ్మో ! ఎంతటి మాట ! రాముని అరణ్యంబంపుటా ! నాదు ప్రా
ణమ్ముల్ నిల్పునె వాని వీడి ? అనుమానంబేల ! కై కొమ్ము ఖ
డ్గమ్మున్ ! కోయుము నాదు కంఠ మిదిగో ! గయ్యాళి రాకాసి కై
"కమ్మా! రమ్మని పిల్చె భార్యను మగం డయ్యర్ధరాత్రంబునన్."

''లంగానెత్తి కురంగనేత్ర గనియెన్ లాంగూలశృంగారమున్.''

"సింగంబాతడు హస్తిపీవు: వల దాశ్రీరాముపై బోయినన్
భంగం బందెద"వంచు మొత్తుకొన, నా పల్కుల్ చెవిన్ దూర్ప కీ
భంగిన్ గూలితి"వంచు తార రఘురాడ్బాణంబుచే వాలి కా
"లంగా నెత్తి కురంగనేత్ర కనియెఁ లాంగూలశృంగారముఁ."

''రావణ కుంభకర్ణులకు రాముడు పుట్టె గుణాభిరాముడై !''

చేవ నొసంగ జాతికిని, జీవ మొసంగగ బండబాతికిఁ,
సేవ నొసంగ కోతికిని, శిక్ష నొసంగగ చుప్పనాతికిఁ,
దేవ మునీంద్ర శాపమును దీరిచి ముక్తిపదం బొసంగగా
"రావణ కుంభకర్ణులకు; రాముడు పుట్టె గుణాభిరాముడై."

# మ్రోగిన గంటలు

"అనగనగా ఒక దేశం
దేశంలో ఒక నగరం
నగరి ప్రక్క నది ఒక్కటి
నది ప్రక్కన గిరి ఒక్కటి

కొండమీద గుడి ఉందట।
గుడి ముందర గోపురమట।
ఆ గోపురమున గంటలు
మ్రోగునంట ఏమొకు తామె.

ప్రతియేటా ఒక్కనాడు
పవిత్ర శివరాత్రినాడు
కంటికి కనిపించని ఆ
గంటలు గణగణ మ్రోగును.

ప్రజల సత్ప్రవర్తనమును
భగవంతుడు గని మెచ్చును
కరుణామయు హృదయమ్మది
గంటలలో వినవచ్చును.

ఏనాఁ డే శిల్పి ఎట్టు
లేర్పరచెనొ ఆ గంటలు!
గుడిలోపలి స్వామి కృపను
నుడివెడు బంగరు పంటలు.

ఎప్పటిదో ఈ వాడుక
ఇప్పుడు లే దా వేడుక;
గుడిగంటలు మ్రోగ విపుడు
కోర్కెలు కొనసాగ విపుడు.

దేవుని మనుజులు మరచిరి
దేవుడు మనుజులను మరచె
జనుల భావములు మారెను
స్వార్థపరత మితిమీరెను.

మనిషి మనిషి మధ్య దళ్లు !
మనసులలో పీకు ముళ్లు !
మలినమైన చెసుమెవళ్లు !
మనిషికి మనిషన్న కుళ్లు !

ప్రజల భావములు మారెను
పరవంచన మితిమీరెను
చైతన్యము చల్లారెను
సమత మమత అణగారెను.

శివరాత్రి పర్వమున
శివుని దర్శింపంగ
తరలివచ్చిరి జనులు
తండోపతండంగ.

సాహుకార్లు జమీందార్లు
జయ జయ నాదములతోడ
సంచులు సంచులు తెచ్చిరి
స్వామికి లంచము లిచ్చిరి
కోర్కెలు కొనసాగలేదు
గుడిగంటలు మ్రోగలేదు.

కోటీశ్వరు లెంతమందొ
గుడికి ప్రదక్షిణము చేసి
దోసెడు వరహాలు రాశి
పోసినారు స్వామిముందు
కోర్కెలు కొనసాగలేదు
గుడిగంటలు మ్రోగలేదు.

మంత్రులు ఉపమంత్రులు
సామంతులు మహామహంతులు
గంపలతో నర్పించిరి
కెంపులు వజ్రాలు మణులు
కోర్కెలు కొనసాగలేదు
గుడిగంటలు మ్రోగలేదు.

ముక్తకంఠములతో నిజ
భక్తులు ప్రార్థన చేసిరి
ఎగిరిరి దాకా లూదిరి
నగారాలు మ్రోగించిరి
శివుని గుండె కరగలేదు
గుడిగంటలు మ్రోగలేదు.

ఆదేశపు రాజుగారు
అదిగో విచ్చేసినారు !
స్వర్ణకిరీటము స్వామికి
సమర్పణము చేసినారు
మృడుని మనసు కరగలేదు
గుడిగంటలు మ్రోగలేదు.

సఖీసహస్రములు గొలువ
మహారాణి అరుదెంచెను
పచ్చల హారమును దీసి
భగవానునిముం దుంచెను
శివుని మనసు కరగలేదు
"శివగంటలు" మ్రోగలేదు.

రాజు రాణితో నగరుకు
రథముమీద పయనమైరి
భటులు జనుల నొత్తిగించి
ప్రభువు కేర్పరిచిరి దారి.

ఆ జన సమ్మర్దములో
అంధ భిక్షు వర్షీయసి
కాలు జారి "అమ్మో" యని
నేలమీద పడిపోయెను.

చేతిలోని గిన్నె ప్రక్క-
గోతిలోన పడిపోయెను
నొసటిమీద గాయమాయె
ముసలిది స్పృహతప్పిపోయె.

పెద్దమనుషు లెవ్వరు ఆ
వృద్ధురాలి దెస చూడరు
దేవుని దర్శించుటకై
కోవెలలో కేగినారు.

ఇద్దరు "బాలలు" శివు ద
ర్శింప వచ్చినట్టివారు
రివ్వున జని క్రిందబడిన
అవ్వను పైకెత్తినారు.

కాయమునకు ధూళి దులిపి
గాయమునకు కట్టుగట్టి
మాటరాని ముసలి అవ్వ
నోట నీరు పోసినారు.

శివుని నివేదనకై తె
చ్చిన తీయని అరటిపండ్లు
తొక్కతీసి ఒక్కటొకటి
చక్కగ తినిపించినారు.

''ఎవరి బిడ్డలమ్మా ! బంగారు తల్లులార మీరు !
నాకు సేవ చేసినారు! నా ప్రాణము నిలిపినారు"
అనిన అవ్వ కన్నుల ప్రేమాశ్రులు ప్రవహింపసాగె
గంటలు గోపురములోన "గణ గణ గణ" మనుచు మ్రోగె !!

వినిపించెను ఘంటల ధ్వనిలో దేవుని కంఠధ్వని
"కరుణ గలుగు మానసమే పరమశివుని మందిర"మని

వినిపించెను గంటల ధ్వనిలో దేవుని కంఠధ్వని
"బాలబాలికలె భావిప్రపంచాని కేలిక"లని

వినిపించెను ఘంటాధ్వనిలో దేవుని కంఠధ్వని
"బాలబాలికలె జగతికి ప్రగతిదీప మాలిక"లని

ఘంటాధ్వనిలో దేవుని కంఠధ్వని వినిపించెను
"బాలబాలికలె జాతికి ప్రాణమిచ్చు మూలిక"లని

ఘంటాధ్వనిలో దేవుని కంఠధ్వని వినిపించెను
"బాలబాలికలె సమతకు బంగారపు డోలిక"లని.

# ప్యారిస్ పతివ్రత

భరతభూమియందు పర్యటించిన అగ్ర
గామియైన గొప్ప స్వామి యొకడు
విశ్వసంస్కృతులను వీక్షించు కాంక్షతో
తిరుగసాగె దేశదేశములను.

పరమరమ్యమైన ప్యారిసునగరాన
అతడు గాంచె నొక మహాద్భుతంబు
"మగువయొకతె మగని సమాధికి
విసనకఱ్ఱతోడ విసరుచుండె."

సంచిలోన నున్న మంచిగందపు పొడి
మగువ చల్లె పతి సమాధి చుట్టు
చెలి సమాధి మీద చేతిరుమాలతో
మెత్త మెత్తగాను ఒత్తుచుండె.

నిండు జవ్వనమ్ము నివ్వటిల్లు వయస్సు
కలికి పావురాయి కన్నుదోయి
చంద్రమామవంటి అందాలభామను
చూచి అచట స్వామి చోద్యమందె.

స్వామి ఆమె మోము సప్రశ్నముగ జూచి
పాణి యుగము మోడ్చి పలికె నిట్లు
"భరతసాధ్వికంటె పైచేయి నీ చేయి
ఓ పతివ్రతా! నమోస్తు నీకు."

"బ్రతికినంతవరకు పతిని సేవించు మా
భారతీయమహిళ పరమభక్తి
చచ్చి 'గోరి' నడుమ శయనించు మగనికి
సేవ చేయుచున్న దేవి వీవు."

"గోరిక్రింద భర్తగారు నిద్రింపగా
విసనకఱ్ఱతోడ విసరినావు
ఎంత గౌరవంబు! ఎంత శ్రద్ధాసక్తి!
ఇంత భక్తి మాకు వింత గొల్పె."

అంచు తన్ను ప్రస్తుతించు స్వామిని గాంచి
స్నేహ మొలుక బలికె మోహనాంగి
"గౌరవమ్ము కాదు; కౌతూహలము కాదు;
భక్తి కాదు; ప్రణయరక్తి కాదు"

మరణశయ్యమీది మగడు రమ్మని నన్ను
చేతిలోన చేయి చేర్చి పలికె
"ఏను పోయినంత ఇంకొక్క మగవాని
నీవు పెండ్లియాట నిశ్చయంబు.

అయిన చెలియ! ఒక అభ్యర్థనము నాది
తీర్చి తీరవలయు దీని నీవు
పడతి! నా సమాధి తడి యారువరకైన
ఆగు మీవు పెండ్లియాడకుండ"

అంచు కనుల నీరు నించు భర్తకు "సరే
లే" యటంచు మాట యిచ్చినాను;
అతడు చచ్చిపోయె; నాత్మీయు లిట పూడ్చి
పెట్టినారు; గోరి కట్టినారు!

ఈ సమాధి కట్ట ఏపాళ్ల కలిపిరో
ఎట్టి అడుసు పోసి యేడ్చినారొ!
పాడు వేలుదాల్పు! పదిజాములకుగూడ
ఈ సమాధి ఆరదేమి? స్వామి!

ప్రియుడు ఫోను చేసె; ప్రేమలగ్నము దాటె;
వేచి వేచి కనులు వాచిపోయె;
మగని కొసగినట్టి మాట పట్టింపుకై
విసనకర్ర తెచ్చి విసరుచుంటి"

అంచు చేతిగుడ్డ అంచుతో చెక్కిళ్ళు
తుడుచుకొనుచు బెంగపడుచు పడుచు
ఆత్మ విభుని గాథ - అందుకై తన బాధ -
వెల్లడించె యోగి వల్లభునకు.

"బాగు బాగు! ఎంత బంగారుతల్లివే!
మెచ్చుకొంటి నీదు సచ్చరిత్ర!
వందనము"లటంచు మందస్మితమ్ముతో
సాగిపోయినారు స్వామివారు!!

# గోమాత

నందీశ్వరుల వంటి నందనులం గాంచి
రైతురాజుల కిచ్చు రత్నగర్భ
తల్లి తర్వాతను తల్లియై పాలిచ్చి
బిడ్డల పోషించు ప్రేమమూర్తి
తన గోమయమ్ము చేతనె యిండ్లు వాకిండ్లు
పావనమ్మొనరించు భవ్యచరిత
బ్రతికి చచ్చియుగూడ ప్రభువు పాదమ్ములు
విడనాడి యెరుగని వెఱ్ఱితల్లి

ధర్మదేవత నిష్కామకర్మశీల
కామధేనువు గూండాల ఖడ్గములకు
కంఠ మర్పింపకుండ రక్షణ మొనర్ప
కట్టుకొనుడు దీక్షాపూర్ణకంకణములు ॥

# ఆనందవల్లి

''అన్నం అమృతస్వరూపం" అన్నవి శ్రుతులు
''అన్నం పరమాత్మస్వరూపం" అని వాకొన్నవి స్మృతులు
''అన్నం పరబ్రహ్మస్వరూపం'' అన్నారు పండితులు
''అన్నం లేకపోతే'' ఆగిపోతాయి ప్రపంచ పరిస్థితులు.

''అన్నం న నింద్యాత్ తద్ వ్రతం"
''అన్నం న పరిచక్షీత తద్ వ్రతం''
''అన్నం బహుకుర్వీత తద్ వ్రతం''
అన్నది తైత్తరీయం
దండిగా పంటలు పండించటం ప్రజల ధ్యేయం.

''అతిథిదేవో భవ'' ''అభ్యాగతః స్వయం విష్ణుః'' అన్నది వేదం
''అన్నదానానిదే అన్ని దానాలలో అగ్రస్థానం" అన్నది నిర్వివాదం
''అన్నదాతా సుఖీ భవ" అని పెద్దల ఆశీర్వాదం
లోకానికి అన్నంపెట్టే రైతులోకానికి నా సాధువాదం.

# స్నిగ్ధ మధురహాస

వ్యాసు నెరుగడంట వాల్మీకి నెరుగడు
కాళిదాసుపేరు జ్ఞప్తి లేదు
అట్టి బుజ్జిగాడు అసలైన కవి నేడు
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

చదువురానివేళ "చంకరుం"డన్నాడు
చదువుకొనెడివేళ ''సంకరు''డనె
చదువు ముదిరిపోయి ''షంకరుం'' డనెనయా
స్నిగ్ధమధురహాస। శ్రీనివాస।

హృదయమందు కవిత ఉదయింపగావలె
హృదయములను చొచ్చి కదపవలయు
హృదయహీను కవిత హృదయంగమము కాదు
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

దంతపుష్టి లేని తాతయ్యగారికి
చెరుకుగడ లటన్న చెడ్డమంట
ఛంద మెరుగదేని శత్రువౌ పద్యంబు
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

''మనుజు డేమిగొప్ప మాకంటె : కొమ్ములు
తోక పెచ్చుగలవు మా'' కటంచు
దున్నపోతు మనిషితో ''సవాల్'' చేసెను
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

పశువు తినును కనును పడినిద్రపోవును
బండిలాగు దున్ను బరువుమోయు
మనుజపశువు మొదటిపనులు మూడే చేయు
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

పాకిపిల్ల చేతి బక్కెట్టు కని బాబు
మొగము త్రిప్పి ముక్కు మూసుకొనియె
బాబు బానకడుపు పకపక మని నవ్వె
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

ఎడమ భుజముమీద పడవలె నని కోరి
బల్లి నొకడు కదపె పుల్లతోడ
సిగ్గులేని బల్లి శిరసుపై పడెనయా
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

"కాగితమ్ము లిచట కరపించువారు శి
క్షింపబడుదు" రని లిఖించి పెద్ద
కాగితమ్ము గోడ కంటించె దొరగారు
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

గ్రుడ్డివాని గోచి కొంగు గట్టిగ పట్టి
బుద్ధివా డొకండు పోదొడంగె
గ్రుడ్డి బుద్ధి కలిసి గుంటలో పడిరయా
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

వారి వీరి కడ్డువచ్చు సోమరిపోతు
త్రోవ కడ్డువచ్చు దున్నపోతు
వదరుబోతు మంచి వక్త కడ్డము వచ్చు
స్నిగ్ధమధురహాస! శ్రీనివాస!

తొడలు విరిగి పడిన దుర్యోధనుని తల
తన్నబోయి భీము డన్నయైన
ధర్మరాజు శిరసు తన్నె మైకమ్ములో
స్నిగ్ధమధురహాస ! శ్రీనివాస !

క్రొత్త మంత్రిగారు క్రొత్తగా ఎగురవే
సిన పతాక త్రాడు చిక్కుపడగ
సగము పైకి పోయి సత్యాగ్రహము చేసె
స్నిగ్ధమధురహాస ! శ్రీనివాస !

గద్దె నెక్కినపుడె కనులు నెత్తికి నెక్కె
కొద్దినాళ్ళలోనె గద్దె దిగెను
గద్దె దిగెనుగాని కన్నులు దిగలేదు
స్నిగ్ధమధురహాస ! శ్రీనివాస !

"చిట్టితల్లి" యంచు శ్రీవారు పిలిచిరి
పిల్ల వచ్చె పిల్లతల్లి వచ్చె
తత్పురుషము కర్మధారయన్ గని నవ్వె
స్నిగ్ధమధురహాస ! శ్రీనివాస !

# కృతజ్ఞతలు

[రామయామాత్యులు]

డంబ మెఱుగని ఒక నిరాడంబరుండు
కష్టపడి నేల పండించు కర్షకుండు
ధర్మమార్గమ్ము తప్పని కర్మయోగి
సత్యగుణశాలి రామయామాత్యమౌళి.

కోప మొకింత లేదు, తనకున్ గలదానికె తృప్తి, లేక చే
జాపినరోజు లే దొరుల సన్నిధిలో, పదిమందిలో పటా
టోపము చూపబోడు, టకటొంకు లెఱుంగని ధర్మరాజు, సం
ప్రాపితసద్యశుండు పెదరామయ తోడి నియోగిమండలిన్.

నాకున్ మిత్రుడు నీకు పుత్త్రుడు, రసానందైకలోలుండు, మీ
శ్రీకృష్ణుం డతిమాత్ర బాల్య మధుర స్నేహార్ద్ర భావమ్ముతో
నా కావ్యమ్మున కొక్క రూపిడె – రసజ్ఞ స్విన్న నేత్రాలలో
ఆకల్పాంతము నిల్చు నీ యశము హామా ! రామయగ్రామణీ !

[మా అన్నగారు]

అన్నవు నీవు; చిన్నతనమందు నను౦ గొనిపోయి ప్రేమతో
నన్నము పెట్టి దేశికుల యంతికమందు ప్రసన్న శబ్ద సం
పన్నునిగా నొనర్చిన అపార కృపాబ్ధి! మదీయ మానసో
త్పన్నము లీ రసార్ద్రకవితాకమలాంజలులన్ గ్రహింపుమా!

[శ్రీ ఏకా]

కీర్తికి పట్టుకొమ్మ - ధృతికిన్ బ్రతిబింబ - మదృష్టలక్ష్మికిన్
నర్తనశాల - సౌమ్యతకు నందనవాటి - ప్రతిష్ఠకుం బరి
ష్కర్త - కళాసరస్వతికి కాంచన కాంచి - మహాసదస్సులన్
వర్తిలు సొక్కమూర్తి రసవత్కవితాంగణ చక్రవర్తియై.

పూచిన నందివర్ధనము పువ్వుల చక్కదనంబు వాక్కులం
దాచిన వక్త - భోగమును త్యాగము చూచు విహారి - గుండియల్
దోచు యశస్వి - మానసము లోతు తెలుంగు మహామనీషి - రే
ల్పాచుననే రసజ్ఞ పరిషత్పరమేశ్వర భద్రపీఠిపై!

కొందరు కర్మవీరుఁ డనుకొందురు; కొందరు ధర్మవీరుఁ డౌ
నందురు; జ్ఞానవీరుఁ డని యందురులే మఱికొంద; రెంద రే
చందములం దలంచిన ప్రసన్న లస న్నవ భావ భావుకుం
డందర కన్నిరూపు లగు నాతఁడు భూతల కల్పవృక్షమై.

[శ్రీ గురప్ప]

రాణా ప్రతాప శౌర్యస్ఫూర్తిఁ గీర్తించు
కవిరాజశేఖరు గంటమునకు
ధ్వనులీన శివభారతమున గంటలుగొట్టు
అల మహాకవి గడియారమునకు
శతవధాన కవిత్వ సౌభాగ్యమూర్తులై
పొల్చు సరస్వతీ పుత్త్రికులకు
సరస సాహిత్య సంసత్తుల మ్రోగు
భారతీ మంజుమంజీరములకు
స్థానమై, సంపదకు సన్నిధానమై, ప్ర
ధానమై సాహితికి పెన్నిధాన మయ్యెః
రపమండలలక్ష్మి వక్షస్థ్సలాన
ముద్దులొలుకు కాసులపేరు! ప్రొద్దుటూరు!

ప్రొద్దుటూరు గనంగ నేప్రొద్దు "ప్రొద్దు
పొడిచినట్లుండు" నవనవాభ్యుదయ మగుచు;
చెలువు మీఱెడి సరసుల చెల్మి, హసిత
లసిత వికసిత ముఖకమలముల కల్మి.

అందు జూటూరి వంశ పయఃపయోధి
నిందుబింబంబు వలె జన్మ మందినాఁడు;
అమృతహృదయుండు శ్రీ.గురప్పగారు
ధనమునకు త్యాగమునకు పెట్టినది పేరు.

వర్తించె నెవ్వాని వాకిట శ్రీదేవి
కాలియందెలు ఘల్లు ఘల్లు మనఁగ
నర్తించె నెవ్వాని నాల్కపై శ్రీకృష్ణ
దివ్యనామంబు రాత్రింబవళ్లు
కీర్తించె నెవ్వాని కర్తవ్య దీక్షా వి
శేషంబు లోక మశేషగతుల
గుర్తించె నెవ్వాని కోటి, యాచకకోటి
యిష్టమృష్టాన్న సంతుష్టి నంది
అతఁడు నుతియింపనగు గురవయ్య శ్రేష్ఠి
సంచిత సుధీ సముచిత సాధుగోష్ఠి;
జననమందిరి "రమణయ్య" "శంకరయ్య"
"సుబ్బయ" యు "కృష్ణమూర్తి" యన్ సుతు లతనికి.

శరధుల భంగి, వేదముల సామ్యమునన్, గుణరమ్యులైన దా
శరథుల మాడ్కి, మేలి పురుషార్థము లట్టుల, స్వామి వేంకటే
శ్వరుని కరారవిందముల చందమునన్, గడు చెల్వు మీటి న
ల్వురు గురవప్పనందనులు వొల్తురు "తండ్రికి తగ్గ బిడ్డలై."

మిత్రులు కవులకు, సరసిజ
మిత్రులు గర్వాంధ ఘన తమిస్రతతికి, సౌ
మిత్రులు సేవారతి, శుభ
గాత్రులు జూటూరి గురప్ప గాదిలిపుత్త్రుల్.

అందరిలోన పెద్ద రమణయ్య నిజానుజ యుక్తుఁడై సిరుల్
చిందఁగ నింటిపెత్తనము చేయుచు; వెచ్చెలియా కవీంద్రుతో
డెందములోని కోర్కె ప్రకటించెను - "మత్కృతి నాన్నగారి కా
నందముతో బహూకృతి నొసప్పఁగ; తండ్రి ఋణంబు దీర్పఁగన్!"

శ్రీ సుబ్బన్న శతావధాని మధురస్నేహార్ద్రి సౌభాగ్య ల
క్ష్మీ సంఫుల్ల ముఖారవిందుఁ "డుదయశ్రీ" నీయఁగా తీయఁగా
వ్రాసెన్ లేఖ, "తథాస్తు" నల్దెసల సంవాసించుతన్ మీ యశో
రాసుల్; తామరతంపరై విజయ పారంపర్యముల్ మించుతన్;

ఇది శ్రీకృష్ణజయంతి; లోకముల రక్షింపగ లక్ష్మీశ్వరుం
డుదయం బందిన పుణ్యపర్వము; సదస్యుల్ సారసాహిత్య సౌ
హృద సంపన్నులు; గౌరవించినది నన్నీ ప్రొద్దు మీ ప్రొద్దుటూ;
"రుదయశ్రీ" హృదయాంజలుల్ గొనుఁడురండో శ్రీగురప్పాత్మజుల్!

నందనులై; జిత వికసిత
నందనులై; సహృదయాభినందనులై; యా
నందము గూర్పుఁడు తండ్రికి
ఛందోమయ నవ్య కావ్య సంధానమునన్.

* * *

# అమరభారతి

ఏ వాణి వేదశాస్త్రేతిహాసమహాబ్ధి
మందారవల్లియై కందళించె
ఏ వాణి వాల్మీకి హిమగిరీంద్రమునుండి
గంగాస్రవంతియై పొంగి పొరలె
ఏ వాణి వ్యాసమునీశాన గళ ఘనా
ఘన వర్షధారయై ఘనత కెక్కె
ఏ వాణి కాళిదాసేందుబింబమునుండి
నిండాడు పండువెన్నెలలు గురిసె

అ య్యమరవాణి హంసవాహనుని రాణి
విశ్వకళ్యాణి వీణాప్రవీణపాణి
తియ్యనగు తెల్గువాణితో వియ్యమంది
నాదు వాక్కుల నటనం బొనర్చుగాక।

# కల్యాణశారద

సదానందరూపాం చిదానందదీపాం
శరచ్చంద్రవర్ణాం రసశ్రీప్రపూర్ణామ్ ।
ఉదాత్తాం సువృత్తాం కృపాయత్తచిత్తాం
ప్రసన్నాస్యబింబాం భజే శారదాంబామ్ ॥

*

శతానందజాయాం సతాం శ్లాఘనీయాం
త్రిలోకైకపూజ్యాం సుధీప్రాజ్యరాజ్యామ్ ।
సవిత్రీం సుగాత్రీం జయశ్రీ ప్రదాత్రీం
ప్రపన్నావలంబాం భజే శారదాంబామ్ ॥

*

గృహీతాక్షమాలాం త్రిలోకైకమూలాం
స్ఫురన్మందహాసాం సుధాసింధువాసామ్ ।
ఉదారాం సుహారాం నవోల్లాసపూరాం
ప్రసాదావిలంబాం భజే శారదాంబామ్ ।

*